

ది. 28-11-98 న మెహెరాజాద్ మండలిహాల్లో బాబా గద్దె దివ్యసన్నిధిలో ఈ అపూర్వ దర్శనం 6 వ భాగం తెలుగు అనువాద గ్రంథాన్ని సో॥ బాలనాటుగారు ఆవిష్కరించినప్పటి సర్వశ్రీ చింతసాయిబాబా, ఎ.ఎస్. జగన్నాథ్, జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు, బాలనాటు, తాయారమ్మ, అక్కయ్య వి.ఎస్. శ్యామలరావుగారలు చిత్రంలో వున్నారు.

# దైవీమానవుడు - మెహెర్ బాబా

# అపూర్వ దర్శనం

## సంపుటం - 6

మార్చి 1954 - ఏప్రియల్ 1955

రచన : శ్రీ బాలనాటు



అనువాదం :

శ్రీ డి.వి.డి.కె. చంద్రమౌళీశ్వరరావు (మెహెర్ చంద్ర)

ప్రచురణ :

అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా కేంద్రం

విజయవాడ

తెలుగు ప్రచురణ : 1998

## శ్రీ బాలనాటు ఇతర రచనలు :

దివ్య ప్రబోధకునితో ముచ్చట్లు
దివ్య ప్రబోధకునితో మరిన్ని ముచ్చట్లు
దైవీమానవుడు మెహెర్ బాబా, అపూర్వ దర్శనమ్
1వ భాగము (1943 - 1948)
2వ భాగము (1949 జనవరి - 1952 జనవరి)
3వ భాగము (1952 ఫిబ్రవరి - 1953 ఫిబ్రవరి)
4వ భాగము (1953 ఫిబ్రవరి - డిశంబరు)
5వ భాగము (1954 జనవరి 1 - మార్చి 6)

## శ్రీ బాలనాటు సంకలనం చేసిన గ్రంథాలు :

అవతార్ మెహెర్ బాబా జీవిత సంగ్రహం
1927 నుండి 1978 ఫిబ్రవరి వరకు
మననిత్య సహచరుడు
కృపారసధారలు
ఆయన చల్లగా చూచినప్పుడు

షెరియార్ ఫౌండేషన్, 3005 హైవే 17 బైపాస్ నార్త్, మిర్టిల్ బీచ్
సౌత్ కెరోలినా 29577 వారి సౌజన్యంతో
అవతార్ మెహెర్ బాబా ట్రస్టు అహ్మద్ నగరు వారి అనుమతితో

టైప్ సెట్టింగ్ :
**శ్రీ సాయిరామ్ డి.టి.పి.**
విజయవాడ, ఫోన్ : 0866 - 425824



అనుగ్రహశాలియైన
దైవీమానవుడు
మెహెర్ బాబా యొక్క
ప్రేమాన్వితమైన
దివ్య పాద సన్నిధికి

# కృతజ్ఞతలు

దైవీ మానవుడు మెహెర్ బాబా అపూర్వ దర్శనం 6వ భాగం అనే ఈ పుస్తకం ద్వారా తన దివ్య జీవితపు పదునాలుగు నెలలకు సంబంధించి కొద్ది భాగంలో పాలుపంచుకొనే అవకాశాన్ని అనుగ్రహించినందుకు నేను అవతార్ మెహెర్ బాబాకు ఎంతో ఋణపడివున్నానని భావిస్తున్నాను.

అవతార్ మెహెర్‌బాబా పర్పెక్చువల్ పబ్లిక్ చారిటబుల్ ట్రస్టువారికి సర్వస్వామ్యములు కలిగిన కొంత ప్రచురిత సమాచారాన్ని ఉపయోగించుటకు అనుమతించిన ట్రస్టు వారికి నేను ఎంతో కృతజ్ఞుడను. మెహెర్ స్పిరిట్యువల్ సెంటరు, మిర్టిల్‌బీచ్, సౌత్ కరోలినా వారికి, షెరియార్ ప్రెస్, మిర్టిల్ బీచ్ సౌత్ కరోలినా వారికీ, గ్లో ఇన్‌టర్నేషనల్ పత్రికా సంపాదకుడు నౌషర్‌వాన్ అన్‌జర్‌న్యాయర్కు వారికి, మేహెర్‌హౌస్ పబ్లికేషన్సు సిడ్నీ ఎన్.ఎస్.డబ్ల్యు. ఆస్ట్రేలియా వారికి, మెహెర్‌బాబా ఫౌండేషన్, ఊంబే, క్వీన్స్‌లాండ్, ఆస్ట్రేలియా వారికి మరియు సూఫిజం రీ ఓరియంటెడ్, వాల్నట్ క్రీక్, కాలిఫోర్నియా వారు "ఒక గురువు ఎలా పనిచేస్తాడు" అనే తమగ్రంథంనుండి కొన్ని ప్రకరణములను తీసుకొనుటకు అనుమతించినందుకు, నేను కృతజ్ఞతాభివందనములర్పిస్తున్నాను.

తన డైరీలోని వివరములందించినందుకు శ్రీ కిషన్ సింగ్‌కు, డార్విన్‌షా మరియు కొందరు పాశ్చాత్యులు మెహేరాబాదులో వున్నప్పుడు వ్రాసుకున్న వృత్తాంతములందించినందుకు వారికి, తన పద్యములందించిన శ్రీమతి జోసెఫైన్ రోజ్‌కి మరియు కొంత అతిముఖ్య సమాచారాన్ని అందించిన భారతీయ బాబా ప్రేమికులకు నా ప్రత్యేక కృతజ్ఞతలు.

పాఠకులకు యీ 'ఆరవ' భాగాన్ని అందించుటలో అమూల్యమైన తమ కాలాన్ని వెచ్చించి, దాదాపు నాలుగు సంవత్సరాల పాటు తమ శక్తియుక్తుల్ని ధారపోసి నాతో సహకరించిన ఎందరో బాబా ప్రేమికులకు, అందునా పాశ్చాత్యులకు నా కృతజ్ఞతలు నా భావాల్ని మాటలలో తగు రీతిని వ్యక్తపరచటం అత్యంత కష్టతరమైన విషయం. ఈ

ప్రియమిత్రులంతా రావటం, పోవటం అంతా బాబా ఇచ్ఛ ప్రకారమే ఎలా జరిగిందో వూహిస్తే ఆశ్చర్యం వేస్తుంది. నా శరీరము, మనసు ఆరోగ్యంగా వుండి, యీ భాగాన్ని వ్రాయుట కొనసాగించాలని నేను ఎప్పుడు భావిస్తే అప్పుడు, తగు సమయాల్లో వీరు వచ్చి నాతో కలిసి పని చేశారు. ఎవరికి వారు సమర్పించిన అమూల్య సమాచారము ఒక ప్రత్యేకత కలిగి, విషయాలు సుసంపన్నం చేశాయి. వ్రాత ప్రతిని ప్రథమ పుటనుండి చిట్టచివరి వరకూ తయారుచేయడంలో అనేక ఘట్టాలలో వారందించిన సహకారాన్ని నేను ఘనంగా శ్లాఘిస్తున్నాను. ప్రతివారూ, ఇష్టపూర్వకంగా, నిస్వార్థంతో మరియు బాబా ప్రేమలో స్నేహపూరిత ఉత్సాహంతో పనిచేసినప్పటికీ నాతో సహకరించిన బృందపు కొందరి పేర్లను నేను ప్రత్యేకంగా పేర్కొనదలచాను. వారు క్లీవ్ మరియు ఢాప్నేక్లీవ్, జెఫ్ ఓల్వెర్టన్, మార్క్ కెల్లర్, వార్డ్ పార్క్స్, థామ్‌పార్షన్, డెబ్బీ నోర్డీన్, వెండిక్రాట్, లారెల్ మాగ్రినీ మరియు కెంద్రాక్రాస్సెన్. ఇక్కడ నేను పేర్కొనని మరెందరికో పేరుపేరునా నా హృదయపూర్వక కృతజ్ఞతలు అర్పిస్తున్నాను.

శ్రీ జేర్రీ మరియు షిర్లా ఎడ్వర్డులు తమ కంప్యూటరు 'మసింతోష్' ని అందుబాటులో వుంచి, మొత్తం వ్రాత ప్రతినిటైపు చేసి ప్రింటు చేసినందుకు ప్రత్యేక ధన్యవాదములర్పిస్తున్నాను. వ్రాసినదానిని ఎడిట్ చేయుటకు యీ కంప్యూటరు ఎంతో ఉపయోగపడింది. చివరగా, నన్ను యీ గ్రంథ భాగాన్ని వ్రాయుటలో ఆసాంతం ఆదుకుంటూ, వెన్నంటి నిలిచిన మెహెరాజాద్ మండలికి మరియు బాబా ప్రేమికులతో నిండిపోయిన మెహెరాజాద్ వాతవరణానికి కృతజ్ఞతలర్పిస్తున్నాను.

పురాణ పురుషుడు మెహెర్ బాబాకు మరోసారి నా హృదయపూర్వక నమస్కృతులర్పిస్తున్నాను. ఆ దివ్య సనాతనుని అవధులు లేని అపార ప్రేమ, ప్రజాహృదయాలలో మరింత మేల్కొలుపు గావించుగాక! మరియు బాబా యొక్క పవిత్ర నామమే నా జీవితపు ఊపిరియగు గాక !

**ఫిబ్రవరి 25, 1992**
**మెహెరాజాద్.** **బాలనాటు**

# తొలిపలుకు

అది డిసెంబరు 1952. ఒక దర్శన కార్యక్రమ సందర్భంగా అవతార్ మెహెర్ బాబా ఢిల్లీలో ఉన్నారు. తన ప్రేమికులు ఒకరి ఇంట్లో తన శిష్యులతో పరివేష్టించి వుండగా ఒకనాటి ఉదయం ఎంతో మృదువుగా ఎవరో పాడటాన్ని ఆయన విన్నారు. ప్రక్క గదిలో వూడుస్తూ ఒక పల్లెటూరి పిల్లవాడు పాట పాడుతున్నాడు. ఆ పిల్లవాణ్ణి మెహెర్ బాబా పిలిపించి, ఆ ఉర్దూ పాటలోని ఆఖరి రెండు చరణాలను మళ్లీ పాడమన్నారు.

ఆ పిల్లవాడు సంతోషంగా పాడితే బాబా చాలా ఆనందించారు. ఆయన తన బొటనవేలిని, చూపుడు వేలుతో కలిపి గుండ్రంగా చూపుతూ ఆ పాటకు తాను నిజంగా ముగ్ధుడైనట్లు సంకేతాన్ని వ్యక్తపరిచారు. ఆయన ఎంతో ప్రేమతో ఆ పిల్లవాడిని ఆశీర్వదించి, ఇంటి పని చూచుకోమని చెప్పి పంపారు. ఆ పంక్తుల యొక్క భావాన్ని గురించి ఆయనతో ఉన్న వారెవరికీ అప్పుడు బాబా వివరించలేదు.

అయితే ఆ ఉర్దూ ద్విపద యొక్క సరళమైన పదాలకు ఎంతో గంభీరమైన అర్థం వున్నది. నేను యీ పంక్తులను, ప్రత్యేకించి అవతార్ మెహెర్ బాబా జీవిత ఘట్టాల్ని ఇతరులతో వ్యక్తిగతంగా సంభాషణల ద్వారా పంచుకొనేటప్పుడు గానీ, అపూర్వ దర్శనం వ్రాసేటప్పుడు గానీ తప్పకుండా గుర్తు చేసుకుంటాను. ఆ ద్విపదను స్వేచ్ఛానువాదం చేసినప్పుడు ఇలా వుంటుంది. "హే ప్రియతమ ప్రభూ! యీ ప్రజలు, సరళమైన, స్పష్టమైన మన బాంధవ్యాన్ని అర్థం చేసుకోలేకపోవటం చూస్తే నాకు తరచూ ఆశ్చర్యం వేస్తుంది.

దీనిని తెలుసుకొనలేక నీయందు నాకున్న ప్రేనును వారు శ్లాఘిస్తారు. నిజానికి, అది కేవలం, జేగీయమానంగా ప్రకాశించే నీ ప్రేమ యొక్క మసకబారిన ఒక ప్రతిబింబము మాత్రమే. మకిలి పట్టిన నా హృదయ పుటద్దంలో ప్రతిఫలించిన నీ కృప యొక్క ఒక బహుమానం".

అదే మాదిరి, యీ అపూర్వ దర్శనంలో ఏ మాటలైనా సరే, పాఠకుల హృదయాలకు హత్తుకుంటే, అది వారి హృదయాల్లో అవతార్ మెహెర్‌బాబా యొక్క షరతులు లేని ప్రేమ యొక్క చిరు అంశ

ప్రతిఫలించినట్లవుతుంది. ఆయనను స్తుతించెదరుగాక !

నాకు మాత్రం ఇతరులతో మెహేర్ బాబా జీవితపు నిస్వార్థ దివ్యప్రేమను గురించి చెపుతూ పాలుపంచుకోవడం ఎన్నటికి వాడిపోని ఆనందాన్నిచ్చే ఒక అంశం అయింది. కనుక, ప్రజల చెవుల్లో మెహేర్ బాబా అవతార తత్త్వాన్ని గురించి దండోరా వేయాలన్న ఉద్దేశ్యం నాకు లేదు.

యుగయుగాలుగా భగవంతుడు దివ్య సనాతనుడుగా ఒక మానవ రూపాన్ని ధరించి, ఆ యుగావతారుడిగా పనిచేయడం ప్రారంభించినప్పుడు ఆయన తన సర్వవ్యాపకత్వపు ఎరుకలో ప్రతి ఆత్మ యొక్క హృదయాన్నీ మౌనంగా స్పృ శించి, వారి తితీక్ష యొక్క పరిమాణాన్ని బట్టి తన ప్రేమకు మనం అర్హులమయ్యేలా మేల్కొలుపుటకు తయారుగా వుంటాడు.

అందువల్ల దైవీ మానవుడు మెహేర్ బాబా యొక్క అపూర్వ దర్శనాన్ని వ్రాయుటలో నా ఉద్దేశ్యం ఆయన ప్రేమ కరుణలతో పాటు అందరికోసం ఆయన అనుభవించిన "మథనం" గురించిన ఘనతను ఈ అవతార జీవిత ఘట్టం గురించి ఆయన యీపుడమిపై జరిపిన మంత్రాంగంలో జరిగిన కొన్ని ఘట్టాల గురించి నేను స్వయంగా చూచినవీ మరియు ఇతరులు చెప్పగా విన్నవాటిని మాటల్లో వ్యక్తపరిచేందుకు ప్రయత్నించాను. ఆయన సమక్షంలో నా ఆత్మను ముంచివేయగలగడానికి నాకు ఇది ఒక మార్గము. నేను యిందులో ఎంతవరకూ విజయం సాధించానో మాత్రం నన్ను అడగకండి !

గత కొద్ది సంవత్సరాల నుండి నా ఆరోగ్యం సరిగా లేదు. ఒకప్పుడు నాకున్న జ్ఞాపక శక్తి ఇప్పుడు లేదు. మెహెరాబాదులో ఉత్తమమైన వైద్యసేవలందుకున్నాను. అయితే నాలో మిగిలి వున్న ఏకైక శక్తి బాబాను మరువకుండా జ్ఞాపకము పెట్టుకోవటం ఒక్కటే ! కేవలం ఆయన కృప ఆ జటిలమైన సమయంలో నన్ను ముందుకు లాగింది. నిత్య జీవితంలో సంభవించే అన్ని సంఘటనలలోనూ మృదువైన ఆయన స్పర్శానుభూతి, అవతారుని సముఖపు కొత్త పరిమాణాన్ని తెరిచింది.

ఏమైనప్పటికీ, అపూర్వ దర్శనం ఆరవ భాగము, నాకు ఒక గొప్ప సవాలును సమర్పించింది. ఇది పూర్తి అవుతుందో లేదో అని

సంశయిస్తున్న సమయంలో వ్రాయటం జరిగింది. అయితే ఇప్పుడు యీ సంపుటాన్ని వ్రాయటం పూర్తయింది. ఇది ఒక నమ్మలేని చిత్రమైన మధురానుభూతి. ఒక కల నిజమైంది. ఈ మధ్యకాలంలో నా స్నేహితులు దీన్ని పూర్తిచేయడానికి కావల్సిన బాబా ప్రేమికుల నుంచి సంబంధిత సమాచారం సకాలంలో అందించడం చూస్తే బాబా మార్గదర్శకత్వం స్పష్టంగా వ్యక్తమవుతుంది. నాకున్న అభిలాషకు అనుగుణ్యంగా నన్ను ఉత్సాహపరుస్తూ ఎన్నో సంఘటనలు జరిగాయి. అవన్నీ కేవలం పేరు కోసం నన్ను రచయితగా చేసి, తన ఇచ్ఛ ప్రకారమే బాబా స్వయంగా తనపనిని తానే చేసుకున్నారన్న నమ్మకం నాలో బలపడింది.

ఈ సంపుటి గురించి చెప్పాలంటే, మెహెర్‌బాబా జీవితపు యీకాలములో జరిగిన సంఘటనల్ని గుదిగూర్చే ప్రయత్నం చేస్తుంటే ఆ మధుర క్షణాలు వాటి ప్రేమ నురుయు ప్రకాశంతో మరల ఎన్నడైనా నాకు లభిస్తాయా అని అనుమానించాను. ఒకవేళ దొరికినా, వాటని నేను కనీసం మసకగానైనా మాటల్లో తిరిగి పొందగలనా అని సందేహించాను. అయితే ఒక మహత్తు జరిగింది. ఒక్కొక్కప్పుడు అటువంటి క్షణాలు అనుకోకుండా వచ్చి కొద్దిసేపు నాతో వుండిపోయేవి. బాబా సముఖపు పరిమళము నరనరాన నిండిపోయి అప్పుడే తయారైనంత తాజాగా వుండేది. అయితే, ఇలా సంలీనమవటం ఒకరకంగా వ్రాయటానికి మరింత కష్టమనిపించింది. అవతారుని పరిమళం, ఉపన్యాసము ద్వారా సంతృప్తిగా వివరించటం అసాధ్యమని నాకు గుర్తు చేసింది. వ్రాయటం ద్వారా మాత్రమే ప్రయత్నించమని జ్ఞాపకం చేసింది. అయితే బాబాను ప్రేమాస్పదంగా గుర్తుంచుకోవటంలో, దేవతలు సైతం అడుగిడుటకు భయపడే చోటుకు పరుగు పెట్టేందుకే నేను నిశ్చయించాను. మరి యీ సాహసంలో నాకు సహాయపడేందుకు ఎందరో సహృదయులు, ముందుకు వచ్చి చేయూతనిచ్చారు. నా యీ కృషికి ఫలితంగా యీ సంపుటి మెహెర్ బాబా సందేశాలు, ఆయన జీవితంలో జరిగిన కొన్ని సంఘటనలతో పాటు, నాఎదుట ఆయన ఇతరులతో సంభాషించిన సంక్షిప్త ముచ్చట్లు చోటుచేసుకున్నాయి. ఈ సంపుటిలో నేను మెహెర్ బాబా జీవితాన్ని 1954 మార్చి నుండి ఏప్రిల్ 1955 వరకు పొందుపరచాను. ఈ పద్నాలుగు నెలల కాలంలో

ఆయన సకోరి, పండరిపూర్‌లు సందర్శించినపుడు సైతం నేను బాబాతో వుండే అదృష్టం దొరికింది. సెప్టెంబరులో జరిగిన "అంతిమ ప్రకటన సమావేశం" సమయంలో రెండువారాలపాటు నేను మెహెరాబాద్‌లో వున్నాను. తర్వాత ఏప్రిల్ 1955 లో 'సతారా'లో జరిగిన ఒక సమావేశంలో కూడా నేను వున్నాను.

ఈ సందర్శనలు, సమావేశాల గురించి నేను వ్రాసుకున్న సంక్షిప్త నోట్సుతో పాటు బాబా అనుచరులతో నాకున్న సంబంధం రీత్యా నాకు తోచిన అభిప్రాయాల్ని పరిగణనలోనికి తీసుకున్నాను. కిషన్‌సింగ్ వ్రాసిన డైరీలోని విషయాల్ని ఇతరులు వ్రాసిన వాటితో సరిపోల్చిన తరువాత దానిని కూడా యీ సందర్భంలో ఉపయోగించుకున్నాను. "మెహెర్‌బాబాతో మరువలేని మూడు వారాలు" అనే గ్రంథం నాకు బ్రహ్మాండంగా సహాయపడింది. ఏమైనప్పటికీ ఈ సంపుటంలోని బాబా వాక్కులన్నీ మాటకు మాటగా ఆయన పలికినవి కావనీ, కొన్ని ప్రత్యేక సందేశాలు అక్షర ఫలకంపై చెప్పగా ఆయన అనుమతి పొందినవని నేను మీకు స్పష్టం చేయదలచాను. అయితే నేను సాధ్యమైనంత వరకు భావం చెడకుండా వాటి అర్థాన్ని అత్యంత సన్నిహితంగా వుండేట్లు ప్రయత్నించాను. అయినా, అన్ని సమయాల్లోనాఅవగాహనే పూర్తిగా సరైనదని నేనెలా అనగలను ? బాబా జీవిత ఘట్టాల్ని ఒక సులువైన మార్గంలో మీ ముందుంచేందుకు నేనీ సంపుటంలో సాహసించాను. అప్పుడప్పుడూ యీ సంఘటనల్లో కొన్ని అక్కడక్కడ నా వ్యక్తిగత వ్యాఖ్యానాలతో కొనసాగాయి. నేను సూచించదలచింది ఇంతకంటే మరేదీ లేదు. ఎవరికివారే నిజాయితీగా తమ స్వేచ్ఛా దృక్పథంతో దీని ముగింపుకు నిర్ణేతలు. దివ్యసనాతనుడు, అనంతుడైన మెహెర్‌బాబా ఎటువంటివారి వివరణలకు, అనుభూతులకు ఎల్లవేళలా అతీతుడై వుంటాడు.

అవతారుని జీవితం ఆకాశం వంటిది. దానిని మనం చూడగలం, కదిలించగలంకానీ దాని ప్రమాణాన్ని నిర్ణయించలేము. అది తనలోనే ప్రతివారికి, ప్రతిదానికి ఒకచోటంటూ కలిగివుంది. అయినప్పటికీ "ఆకాశం" - "ఆవలస్థితి" ఎప్పటికీ దురవగాహ్యమైనదే. అవతార్ మెహెర్ బాబా తన అపారకరుణా సాగరంలో, ప్రేమిక హృదయం నుంచి తన వద్దకు ఏమి వచ్చినా ఆయన ప్రేమతో అంగీకరిస్తారు.

ఒకసారి ఆయన ఇలా తెలియచేశారు. "నన్ను ఎవరు ఎలా తీసుకుంటే, నేను అదే అవుతాను". మరో సందర్భంలో ఆయన ఒక సందేశం ఇస్తూ "నేను మానవరూపంలో ఉన్న భగవంతుడను. నన్ను అవగాహన చేసుకొనుటకు ప్రయత్నించకుడు. నాలోతు కొలువ శక్యం కానిది. కేవలం నన్ను ప్రేమించండి. "అవతారుడిని ప్రేమించేందుకు అనంతమైన మార్గాలున్నాయి. ఆయన్ని చేరేందుకు అనువైన మార్గాన్ని కనుగొనుటలో ఆయనే ప్రతివారికీ సహాయపడతారు.

పాఠకులతో అవతార లీలను పాలుపంచుకొనే స్వతంత్ర్యాన్ని నాకు కల్పించినందుకు నేను మెహెర్ బాబాకు ఎంతగానో ఋణపడివున్నానని తలుస్తాను. ప్రియతమ అవతార్ మెహెర్‌బాబాపై అదికాధికంగా ఆధారపడి ఆయన్ని సంతోషపెట్టకలుగునట్లు అంతర్గతంగానూ, బాహ్యంగానూ కూడా ఆయనే దారి చూపించెదరుగాక - నాకోసం ఇది ఆయన ఎంచుకున్న మార్గం. నేను ఒక సాధారణమైన, సహజమైన నిష్కపట జీవితాన్ని ఆయన యందు పూర్తి నమ్మకం ఉంచి గడపాలని ఆకాంక్షిస్తూ, అవతార్ మెహెర్ బాబా యొక్క ప్రేమకు సంబంధించిన మహిమాస్తోత్రాలు, కథలూ వింటూ, ఆయన యొక్క శాశ్వతము, అత్యంత ఉల్లాసము అయిన మౌనంలో నేను సంలీనమైపోయే వరకూ అధికాధికంగా పాలుపంచుకొనెదను గాక !

25 ఫిబ్రవరి 1992
మెహెరాబాదు.

**బాలనాటు**



# విజ్ఞాపన

ప్రియ సోదరులు, అవతార్ మెహెర్ బాబా మండలి సభ్యులు శ్రీ బాలనాటు గారు "దైవీ మానవుడు, మెహెర్ బాబా అపూర్వ దర్శనం" అనే శీర్షికతో సంకలన పరచిన అయిదు భాగాల్ని ఇప్పటి వరకూ ఆంధ్రా సెంటరు ఆధ్వర్యంలో ఆంధ్రీకరించి ఆంధ్ర పాఠకలోకానికి అందించటం జరిగింది. ఇటీవల ఈ "అపూర్వదర్శనం' ' పరంపరలో భాగంగా 1954 మార్చి నుండి ఏప్రియల్ 1955 వరకూ మెహెర్ బాబా జీవితంలో చోటు చేసుకున్న ఉత్సాహపూరిత కార్యక్రమ సరళిని తనదైన అద్భుతశైలిలో సో॥ బాలనాటు గారు ఆరవ భాగం పేరిట సంకలన పరచగా, అది అమెరికాలో షెరియార్ ఫౌండేషను వారిచే ప్రచురించబడింది. సో॥ బాలనాటు గారి సూచనపై ఈ 6వ భాగపు తెలుగు అనువాదాన్ని చేసే భాగ్యం నాకు ఆంధ్రాసెంటరు ద్వారా లభించినందుకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములర్పించు కుంటున్నాను.

బాబా సాహిత్యంలో మణి పూసలన దగిన కొన్ని ఉద్గ్రంథాల్ని అనువదించే భాగ్యం గతంలో నాకు కలిగినా, ఈ 6వ భాగము మాత్రం సో॥ బాలనాటు గారి పరమాద్భుత సంకలనంగా అనిపించింది. ఆయన రచనాశైలి వర్ణనాతీతం. మెహెర్ బాబా జీవితంలో గడిపిన అనేక ఘట్టాల్ని పరిశీలిస్తే 1954వ సంవత్సరానికి అత్యంత ప్రాముఖ్యత ఉన్నది. యుగావతారుని దివ్య సనాతనత్వాన్ని మానవాళి అవగతం చేసుకొనుటకు అనువుగా అతి ముఖ్యమైన ఎన్నో ప్రకటనలను తన దివ్యాధికారముతో ప్రకటిస్తున్నట్లు, బాబా స్వయంగా వెల్లడించారు. బాబా తన శరీరత్యాగం చేయబోతున్నట్లు ప్రకటించి తన ప్రేమికులందరిని విస్మయపరుస్తూ దుఃఖా క్రాంతుల్ని చేసినా, తానెన్నడూ మరణించనని, తాను పురాణ పురుషుడనని గుర్తుంచుకోమంటూ మరో సందేశంలో వారిని అనునయించిన వైనాన్ని చక్కని ఉపమానాలతో సో॥ బాలనాటుగారు హృద్యమంగా వివరించారు.

ముఖ్యంగా ఈ భాగమంతా మెహెర్ బాబాగా అవతరించిన ప్రియతమ దైవం నెరపిన మంత్రాగాన్ని వ్యక్తిగత అనుభవాలతో కూడిన సంఘటనల ద్వారా కథలుగా వివరించుట వల్ల పాఠకుల మనోఫలకంపై ప్రియతమ బాబా యొక్క అవతార విశిష్టత శాశ్వతంగా పెనవేసుకొని చివరివరకు బాబా కొంగును జారవిడువక పట్టుకొనుటకు దోహద పడతాయనుట నిస్సందేహం. ఈ గ్రంథం ద్వారా మెహెర్ అవతార విశిష్టతను ప్రతివారు సులభంగా అవగతం చేసుకోగలుగుతారని ఆశిస్తూ అందరికీ జై బాబా !

**నూజివీడు** **జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు**

**7-10-98** **(మెహెర్ చంద్ర)**

# తొలిపలుకు

అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా సెంటరు తరపున ఎనలేని మెహెర్ సాహిత్యాన్ని ఇప్పటి వరకూ, ప్రేమ సాగరుడు, అపూర్వ దర్శనం, పురాణ పురుషుడు, అది అలాగా, ప్రవచనములు, తదితర గ్రంథాలను తెలుగులో ప్రకటించి పాఠకులకు అందించుట జరిగింది. కొంత కాలం క్రితం ఈ ప్రచురణా పరంపరలోనే మరో గ్రంథాన్ని ప్రచురించాలని నిర్ణయించటం, దానికి స్పందిస్తూ కొందరు ఒక్కొక్కరు రూ. 100/-లు చొప్పున అడ్వాన్సు చేయటం కూడా జరిగింది. అయితే అనివార్యకారణాల వల్ల కొంత ఆలశ్యంగా యీ నిర్ణయం కార్యరూపం దాల్చి ప్రియ సోదరులు బాలనాటుగారు వ్రాసిన అపూర్వ దర్శనం 6వ భాగాన్ని ఆంధ్రీకరించి ప్రచురించేట్లు ఆంధ్రా సెంటరు కార్యవర్గం తీర్మానించింది.

సో॥ బాలనాటు గారితో చర్చించి యీ ఆరవ భాగాన్ని తెలుగులో ప్రచురించుటకు నిర్ణయించి దాని అనువాద బాధ్యతను సో॥ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు గారికి వప్పగించాలనుకున్నప్పుడు, బాలనాటు గారు చాలా సంతోషించటమే కాక అప్పటికప్పుడు మూల ప్రతిని ఇచ్చి అనువాదం చేయుటకు ఎంతగానో ప్రోత్సహించారు. బాబా సాన్నిహిత్యంలో అశేష అనుభవాల్ని జీర్ణించుకున్న బాలనాటు గారు మాట్లాడే బాషలో, వ్రాసేశైలిలో అణువణువునా అవతారుడి ఔన్నత్యం కొట్టవచ్చినట్లు వ్యక్తమవుతుంది.

ఇంతకు ముందు సో॥ బాలనాటు గారు వ్రాసిన "అపూర్వ దర్శనం" అయిదు భాగాలు ఒక ఎత్తైతే యీ ఆరవ భాగము మాత్రము వాటికి భిన్నంగా ప్రాముఖ్యతను సంతరించుకున్నది. సాక్షాత్తు భగవంతుడు అవతారుడిగా మానవుల మధ్య మానవుడై అవతరించి మెహెర్ బాబాగా నిర్వహించిన పాత్ర యొక్క మూల విశిష్టతను తన ప్రేమికుల జీవిత ఘట్టాల్లో జరిగిన అనుభవాలతో జోడించి కథలుగా చెప్పిన తీరు, సో॥ బాలనాటుగారి రచనా శైలికి అద్దం పట్టడమేకాకా, పాఠకుల హృదయాల్లో ప్రియతమ బాబా శాశ్వతంగా స్థిర నివాసము ఉండేట్లు చేస్తాయి. ఇటువంటి గంభీరమైన సన్నివేశాల వర్ణనను ఆంగ్ల భాషనుండి తెలుగులోకి మూలానికి అనుగుణ్యంగా అనువాదం చేసిన సో॥ చంద్రమౌళీశ్వరరావు గారికి ఆంధ్రా సెంటరు తరపున ధన్యవాదములర్పిస్తూ మరిన్ని మెహెర్ సాహిత్య గ్రంధాలు అందించే శక్తిని ఆయనకు బాబా ప్రసాదించాలని కోరుకుంటున్నాం. అవతార్ మెహెర్ బాబాకి జై !

నెల్లూరు
7-10-98

**చింతా సాయిబాబా**
అధ్యక్షులు
అవతార్ మెహెర్ బాబా, ఆంధ్రా సెంటర్

# పరిచయము

మెహెర్‌బాబా మండలి సభ్యులు, ప్రియ సోదరులు బాలనాటు గారు తెలుగు వారందరికి చిరపరిచితులే. ఆయన ప్రియతమ బాబాపై "దైవీ మానవుడు మెహెర్ బాబా అపూర్వ దర్శనం" అనే శీర్షికతో ఆరు భాగాలు ఇప్పటి వరకూ వ్రాసి ప్రచురించారు. అందులో మొదటి అయిదు భాగాల్ని అవతార్ మెహెర్ బాబా ఆంధ్రా సెంటరు తరపున తెలుగులో అనువాదం చేయించి ఇంతకు ముందే ప్రచురించుట జరిగింది. ఇటీవల విడుదలైన ఆరవభాగాన్ని కూడా తెలుగులో అనువదించి, ప్రచురించే అవకాశాన్ని ఆంధ్ర సెంటరుకు సో॥ బాలనాటు గారు అనుమతి నిచ్చారు. గతంలో రూ. 100/-ల చొప్పున మేము సేకరించిన పైకంతో దీనిని ప్రచురించేట్లు ఆంధ్రా సెంటరు కార్యవర్గం చేసిన తీర్మానం ప్రకారం శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వర రావు గారిచే తర్జుమా చేయించి ప్రకటించ కలుగుతున్నందుకు నా కెంతో ఆనందంగా ఉన్నది.

సో॥ చంద్ర మౌళీశ్వరరావు గారు అందరికీ సుపరిచితులే. ఆయన ఎన్నో మెహెర్ సాహిత్య గ్రంథాల్ని సంకలన పరచి, ప్రచురించారు. ఆయన రచనలన్నీ విశేష ఆదరణ పొందాయి. ముఖ్యంగా సో॥ బాలనాటు గారి యీ ఆరవభాగం అపూర్వ దర్శనం అతి ముఖ్యమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యాన్ని కలిగి వున్నందున అందలి వివరాలన్నీ ఎంతో గంభీర్యాన్ని కలిగి ఉన్నాయి. 1954వ సంవత్సర కాలమంతా బాబా అధిక కాలాన్ని దర్శనార్థులను కలియుటకు, దర్శన ఆలింగన భాగ్యాన్ని తన ప్రేమికులకు కల్పించుటకు వినియోగించారు. అదే సమయంలో తన దివ్యాధికారముతో తన అవతార విశిష్టతను బహిర్గత పరచుటకు తనదైన మార్గంలో ఎన్నెన్నో అనుభవాల ద్వారా అవగాహన కలిగించారు. గొలుసు కట్టుగా కొనసాగిన యీ అనుభవాలన్నిటినీ సో॥ బాలనాటుగారు వరుసక్రమంలో క్రమపరిచి, తనదైన శైలిలో గ్రంథస్తం చేశారు. నేను 1954వ సంవత్సరము సెప్టెంబరు 29, 30 తేదీలలో జరిగిన ప్రత్యేక సమావేశములో బాబా అనుమతితో పాల్గొనే అదృష్టము నాకు లభించినది. ఆనాడు ప్రత్యక్ష సాక్షిగా జరిగిన వివరములన్నీ స్పష్టముగా కళ్లముందు కనిపించేటట్లు సో॥ బాలనాటుగారు ఈ గ్రంథములో పొందుపరిచినందుకు నా ధన్యవాదములు అర్పించుచున్నాను. ప్రియతమ బాబాను మూర్తీవించిన అవతారుడిగా గుర్తించి చిట్ట చివరి వరకూ ఆయన కొంగును జారవిడవకుండా పట్టుకొని ఉండుటకీ భాగంలోని అనుభవాలన్నీ దోహద పడతాయని ఆశిస్తూ, సో॥ చంద్రమౌళీశ్వరరావు గారు మరింత మెహెర్ సాహిత్యాన్ని ఆంధ్రా పాఠక లోకానికందించే శక్తి సామర్థ్యాలను బాబా ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

అవతార్ మెహెర్ బాబాకి జై !

విజయవాడ
7-10-98

**ఎ.వి. రాఘవులు**
కార్యదర్శి, ఆంధ్రా సెంటరు

# విషయసూచిక

# మెహెర్‌బాబా జీవితంతో సాగిపోవుట

## 1954 - 13వ భాగము

### గాఢ సుషుప్తిలో జాగ్రదవస్థ

"సృష్టి అనే కల నుండి ప్రతివారిని మేల్కొలిపి ఆయనలో జీవించేటట్లు చేసి ఆయన అనంత ఆనందాన్ని అనుభవింపచేయటం భగవంతుని దివ్య ప్రణాళికలోనే వున్నది." - మెహెర్‌బాబా

1950లో ఒకానొక సందర్భంలో, తన వదనం దివ్య తేజస్సుతో వెలిగిపోతూ అవతార్ మెహెర్ బాబా, కొందరు అనుచరులు, సందర్శకులున్న చిన్న బృందంతో ముచ్చటిస్తూ ఒక కుర్చీలో కూర్చొని వున్నారు. సొగసైన సౌంజ్ఞల ద్వారా, వారి నిత్య జీవితాలలో జరిగిన చిన్న సంఘటనల గురించి బాబా అడుగుతున్నారు. పైకి స్వల్ప విషయాలుగా కనిపించినా బాబా వాటి యందు ఎంతో జాగ్రత్తతో, శ్రద్ధతో తీసుకోవటం వల్ల ఆయన తన ప్రేమికులకు ప్రియాతి ప్రియమైన వాడై, వారి హృదయాలకు హత్తుకుపోయారు. ఈ బృందంతో జరుపుతున్న సంభాషణ మధ్యలో హఠాత్తుగా, ఆ సందర్శకులలో ఒకరు, మెహెర్ బాబా దగ్గరకు ఇటీవలే వచ్చిన వ్యక్తి, యీ జీవితము యొక్క గమ్యము ఏమిటో విశదపరచమని ఆయన్ని కోరాడు.

ఆకస్మికంగా అసలు విషయం మధ్యలో మారినందువల్ల, ఏమాత్రం ఆశ్చర్యపడకుండా బాబా చిరునవ్వు నవ్వి గుంభనంగా "సుషుప్తిలో జాగ్రదవస్థ' ' అని బదులిచ్చారు. అలా చెప్పి, ఆయన ఎంతో సరసంగా తన "కుటుంబ సంభాషణ"ను మళ్ళీ ప్రారంభించారు. బాబా యొక్క యీ సంక్షిప్తమైన జవాబు అసంబద్ధంగా కనిపించినా, ఎటువంటి సత్యాన్వేషకుడికైనా, అది ఎంతో అంతర్దృష్టితో కూడిన దివ్యమైన భావం కలిగివున్నది. మొదట్లో ఆయన వ్యాఖ్య అసంబద్ధంగా కనిపించవచ్చును. కానీ, ఎవరైనా దాని లోతులను కొలిచే

ప్రయత్నం చేసినప్పుడు, అందులోని బ్రహ్మాండమైన భావార్థం విశదమవుతుంది. ఈ విషయంపై మెహెర్‌బాబా "కలగనుట మరియు కలలో చూచుట" అనే ఒక సందేశంలో ఎంతో వివరంగా స్పష్టపరచారు.

"జాగ్రదవస్థ స్థితి" అని పిలిచే నీ నిత్య జీవితం దానికి సంబంధించిన, సాంగత్యాలూ, అనుభవాలూ అన్నీ కేవలం నువ్వు చూచే కల మాత్రమే. మరి నీ కలలో అందరు వ్యక్తుల్నీ, అన్ని వస్తువుల్నీ కలకంటున్నావు. ఆ కలలో నీవు అనుభవించేందుకు వాటిని సృష్టిస్తున్నావు. నిద్రపోతున్నపుడు నీవు కాంచే కల, కలలో కలిగే మరో కల అన్నమాట.

మీరు సుషుప్తిలో చూచే కల నుండి జాగ్రదవస్థలో చూచే కలలోనికి మేల్కొన్నప్పుడు నిద్రపోతూ చూచిన కల కేవలం కలే అని మీరు తెలుసుకుంటారు. మీరు మేలుకొని చూచే స్వప్నం నుంచి మేలుకొన్నప్పుడు యీ రెండురకాల కలలకు యింతమంది మనుష్యులు, వస్తువులు, అక్కడ ఉన్న పరిస్థితులు అన్నింటికీ మీరే ప్రధాన సృష్టికర్తని తెలుసుకోగలుగుతారు. అనగా అవన్నీ కేవలం మీలోనే వున్నాయని, మరి అవి మీరే తప్ప వేరెవరో కాదని మీరు కన్న మీ స్వప్నానుభవాలే తప్ప వేరేవీ కావని, మీరు మాత్రమే యథార్థ ఉనికిని కలిగి ఉన్నారని తెలుసుకుంటారు !

అయితే కలను కనేవారు ఎవరు ? నిజమైన ఉనికిని కలిగియున్నది ఎవరు ? సత్యములో ఉన్నది అనంత చైతన్య మహాసాగరుడైన భగవంతుడు. ఆయన తన దైవేచ్ఛ ప్రకారం భ్రాంతిమయ బుద్భుద ఆత్మలుగా అనంతమైన సంఖ్యల్లో విడిపోయినట్లు కనిపిస్తాడు. భగవంతుడీ విధంగా బుద్భుద ఆత్మగా వ్యక్తిగత రూపంతో తాదాత్మ్యం చెంది, తానా రూపమే అని భావిస్తాడు. తనదైన అనంత చైతన్యం యీ చర్యవల్ల పరిమితమై ఆయన యొక్క ఎరుకను పరిమితం చేస్తుంది.

ప్రతి బుద్భుద ఆత్మను దైవత్వపు ఎరుకలేని నిద్రావస్థ నుండి దైవసాక్షాత్కారమనే దివ్యత్వపు చైతన్యస్థితి యొక్క పూర్తి జాగృతస్థితికి మేల్కొల్పుట

దైవలీల. ఆ స్థితిలో బుద్ధుధ ఆత్మ తానంతకు ముందు ఎప్పుడూ కూడా చైతన్యపు మహాసాగరమే తప్ప వేరేదీ కాదని. యీ సుదీర్ఘ ప్రయాణంలో ఎదురైన ప్రయాసలు, సుషుప్తి నుంచి జాగ్రదవస్థ స్థితికి చేరి మేల్కొనుటలో ఎదురైన కష్టదాట్లు, మలుపులే అన్న నిజం కూడా స్వప్నమే తప్ప వేరేవీ కావని గ్రహిస్తుంది. ఈ స్వప్నం, సృష్టియొక్క స్వప్నమే ! తనను తాను తెలుసుకొనుటకు దైవం ఆడే అనంత క్రీడకు అది ఆటస్థలం.

మరి యీ మేల్కొలిపే క్రీడలో దైవ సంకల్పము యొక్క ఒక ప్రత్యేక పునఃసృష్టి నియమితకాలం పాటు వుంటుంది. దానినే సృష్టి యొక్క "పెద్దపొర్లు" 'గా భావిస్తారు. అవతారుడు, ఆ ప్రథమ ఆత్మ, తనకు తానే భగవంతుడిగా ఎరుకతో అనుభూతి పొందినప్పుడు యీ పుడమిపై ఒక మానవ రూపాన్ని ధరిస్తాడు. ఆయన అలా వచ్చిన ప్రతిసారీ క్రీడ యొక్క వేగం పుంజుకుంటుంది. ఈ సృష్టిలోని సర్వమును, ఒక్కొక్కరికి సరిపోయే విధంగా అద్భుత మార్గంలో తమ నిద్రావస్థ నుంచి మృదువుగా తట్టిలేపుతాడు.

ఈ యుగంలో 1954 ఫిబ్రవరిలో ముందు హమీర్‌పూర్ జిల్లాలోను, ఆ తర్వాత, ఆంధ్రా దర్శన ప్రయాణాల్లోను, మెహేర్‌బాబా, ఈ అవతరణలో మొదటిసారిగా ఈ యుగానికి తాను అవతారుడను అని బహిరంగంగా ప్రకటించుట మొదలుపెట్టారు. ఒకసారి ఆయన ఇలా వివరించారు.

ప్రతిదాని యొక్క ప్రతి ఒక్క జీవితము, నాకు ఒక తెరచిన పుస్తకం వంటిది. అది నాకు, నా అంతట నేనే చూచి ఆనందించే ఒక చలనచిత్రం వంటిది. ఎన్నడూ మారని, ఎప్పటికీ అంతము కాని, ఈ చలనచిత్రము అనే విశ్వానికి నేనే ఏకైక నిర్మాతను. ఇందులో మీరు మేలుకొని కలగంటున్న స్థితిలో నిజమైన మేలుకొనే స్థితికి చేర్చి మేలుకొలుపుటకు నేనే మీరుగా అవుతాను. ఇందుకు నా కృప అవసరం. నా కృప దిగివచ్చినపుడు, అది మిమ్మల్ని నన్నుగా చేయును.

శాశ్వతుడైన ఏకైకుడు అవతారుడు. సృష్టి యొక్క నిద్రలో సైతం ఆయన

అంతర్గర్భితంగా నిద్రలేకుండా మేలుకొనే వుంటాడు. ఆయన క్రమంగా ప్రతివారిని తాను భగవంతుడని తెలుసుకొనగలిగే నిజమైన సహజ స్వభావ సిద్ధ స్థితిని మేల్కొలుపుట కొనసాగించును. ఆయన యొక్క నియమితకాలపు అవతరణ మరియు ఆయన కార్యక్రమం మాయకు, సత్యానికి మధ్య వున్న అగాధంలో మధ్యగా వున్న వారధిగా ఉండేందుకు సహాయపడుటలో వుపయోగపడును. మాయలో అవతారుని దైవత్వపు మానవ జీవితం, అది స్వల్పకాలమే అయినా, మానవాళి కోసం ఆయన సజీవ సముఖము ప్రతిఫలించుట కొనసాగుతుంది. ఈ విషయంపై అవతార్ మెహెర్‌బాబా ఒకసారి ఇలా వివరణ ఇచ్చారు.

"అవతారుడిగా మాయలో జీవించే భగవంతుని జీవితం .... మాయాపూరితమైనది కాదు. కాగా సృష్టిలో జీవ నిర్జీవాలుగా జీవించే భగవంతుని జీవితం, యథార్థము మరియుమాయ, రెండూ అగును. మాయాపూరిత జీవితం అంటే ఆత్మ మాయవల్ల ఆవరించబడి, మాయలో మాయతో గడిపే జీవితం. అది జీవితమే అయినప్పటికీ, (సృష్టిలో ఆత్మ పొందే అనుభవము) అది మాయాపూరిత జీవితం. అయితే భగవంతుని జీవితం, మాయలో జీవించినా, అది మాయాపూరితం కాదు. ఎందువల్లననగా, మాయాపూరిత జీవితం గడిపినప్పటికీ, భగవంతుడు తన స్వీయ సత్యాన్ని ఎరుకతో కలిగివుంటాడు.

స్త్రీ, పురుషులు ప్రతివారు భగవంతుని చేరే మార్గాన్ని తెలుసుకొనుటకు ఉద్దేశించబడివున్నారు. నా విషయంలో ఈ క్రింద ఉదహరించిన రెండు మెహెర్‌బాబా సందేశాలు నన్ను నా నిద్రమత్తు నుంచి తరచు మేల్కొలిపి, ఆయన్ని చేరేందుకు చేసే ప్రయాణంలో నాకు దారి చూపిస్తుంటాయి. మొదటిది : "సమస్యలన్నీ నెరవేరుటకు, నీవు నన్ను హృదయపూర్వకంగా జ్ఞాపకం వుంచుకొని, సంతోషంగా వుండు." రెండవది : "నన్ను ప్రేమించుట నీ పని. తక్కినదంతా నాపని." ఆయన్ని జ్ఞాపకం వుంచుకొనుట ద్వారా ఆయన్ని ప్రేమించే నా పనిని 'సే ప్రయత్నంలో, నామనస్సు తరచూ, మెహెర్‌బాబా యొక్క దైవీమానవ

మరియు మానవ దైవజీవితపు సంఘటనలపైనే తిరిగేది. మరినేనీయనకు ధన్యవాదములు చెప్పేందుకు అనువుగా, వాటన్నింటినీ "అపూర్వ దర్శనం" సంపుటాల ద్వారా వ్యక్తపరుస్తూ అందరితో పాలుపంచుకుంటున్నాను. ఇలా చేయుట వల్ల నేను బాబాతో గడిపిన వేళలు నాకు ఊరట కలిగిస్తాయి.

ఈ ఉపోద్ఘాతం యీ పుడమిపై అవతారుని అవతరణ యొక్క ప్రాముఖ్యతను తేటతెల్లం చేయుటకు ఉపకరిస్తుందో లేదా భావగర్భితమైన భ్రమలో చిక్కుకుపోతుందో నాకు తెలియదు. ఇక్కడ నాకు ఒక కథ జ్ఞాపకం వస్తోంది. బాబా రహస్యపు వెండి జలతారు, సత్యాన్ని కప్పివుంచిన వేదాంత మబ్బుల్ని చెదరగొడ్తుంది. ఆ కథ ! ఒకసారి ఒక ప్రసిద్ధ ప్రొఫెసర్ బాబాతో కొన్ని తత్వ సబంధమైన విషయాలను చర్చించిన తరువాత వేదాంతం అంటే ఏమిటి? అని అడిగాడు. బాబా కళ్లు మెరిసాయి. పొడవాటి తన సున్నితమైన వ్రేళ్లను అక్షరఫలకంపై సొగసుగా కదిలిస్తూ కేవలం ఒకే ఒక వాక్యాన్ని అందించారు బాబా. "సరళమైన విషయాల్ని కష్టతరం చేసేది" అన్నది ఆ వాక్యం. ఆ మరుక్షణంలోనే గంభీరమైన ముఖంతో ఉన్న ఆ ప్రొఫెసరు యీ వాక్యంతో నవ్వు ముఖం పెట్టాడు.

కనుక, వితర్కించుకొనే సమయం మించిపోయింది. అందువల్ల వెంటనే మన దివ్య ప్రబోధకుడు, అందరిని తమ సుషుప్తి అవస్థ నుంచి లేపి, తమ హృదయాల్లో ప్రేమను మేల్కొలిపే మెహెర్ బాబా జీవితంతో సూటిగా మొదలుపెడదాం. ఫ్రాన్సిస్ బ్రాబజాన్ వ్రాసినట్లు :-

'ఆయన స్వప్న దుస్తుల్లో వున్న ఏకైకుడు.

మనల్ని దిగంబరులుగా చేసేందుకు దుస్తులు ధరింపచేసిన సర్వోత్కృష్ట' సత్యము. మానవులంతా అన్వేషించే, బహుకొద్ది మందే కనుగొను ఏకైకుడు మనస్సుకు ఆవల ఉండే సామ్రాజ్యంలో ఆయన ఉంటాడు.

# ప్రేమ : పూర్తి లొంగుబాటుకు ఒక బహుమానము

మార్చి 6, 1954 ఉదయాన్నే విశాఖపట్టణం - పూనా ప్యాసింజరురైలు పూనే రైల్వేస్టేషనులో ఆగటంతో, ఆ విధంగా అది నిత్య నిరంతరమైనదైనప్పటికీ మెహెర్ బాబా యొక్క దివ్యమైన ఆంధ్రా దర్శన యాత్రను పరిసమాప్తి చేసింది. నిద్రతో జోగే ప్రయాణీకుల్ని కీచుమన్న రైలు ఇంజన్ కూత మేల్కొలిపింది. ఆ రైలుకు అది ఆగిపోయే స్టేషను అయినందున, ప్రయాణీకులంతా తమ తమ పెట్టెలతో హడావిడిగా దిగిపోయారు. వెళ్లిపోతున్న ప్రయాణీకులతో కలసి బాబా తన తలకు ఒక అంగవస్త్రాన్ని చుట్టుకొని గబగబా నడుచుకుంటూ స్టేషను బయట వున్న ప్రవేశద్వారం చేరుకున్నారు. ఆయన కొరకు బాబా సెక్రటరీ ఆదీ. కె. ఇరాని కారు ముందుగా నిర్ణయించిన ఏర్పాటు ప్రకారం అహ్మదునగరు నుంచి తీసుకు వచ్చాడు. ఆదీ బాబాను ఆ కారులో ఎక్కించుకొని పూనాలోని బింద్రాహౌసుకు తీసుకువెళ్లాడు. అక్కడ బాబా ఆదేశం ప్రకారం, అనేక మంది జస్సావాలా కుటుంబ సభ్యులు కాపురం వుంటున్నారు.

కాళ్లూ చేతులు కడుక్కొని తేలిగ్గా ఉదయ ఫలహారం చేసి, బాబా పురుష మండలితో పాటు, ఎరుచ్, కుమార్‌లతో కలసి మహాబలేశ్వర్ బయలు దేరారు. మహాబలేశ్వర్‌లోని ఆగాఖాన్ బంగళా ఫ్లారెన్సు హాలుకు (అది ఆ రోజుల్లో ఆయన నివాస స్థలం) చేరగానే, బాబా ఆదీతో తన రాబోయే సకోరి సందర్శన గురించి, అహ్మదునగరులో ఇవ్వనున్న ప్రజాదర్శనం గురించి చర్చించారు.

ఆంధ్రాయాత్రకు చాలా నెలల క్రితం, సకోరి ఆశ్రమంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. అక్కడ తన సందర్శన కొరకు మార్చి 20వ తేదీని బాబా నిర్ణయించారు. ఇప్పుడు బాబా, ఆ మర్నాడు మార్చి 21న అహ్మదునగరులో ప్రజాదర్శన కార్యక్రమం నిర్వహించుట సాధ్యపడుతుందేమో చూడమని కోరారు. దాదాపు రెండు దశాబ్దాలుగా బాబా యొక్క స్థానిక అనుచరులు, అహ్మదు నగరు జిల్లా వాసుల కోసము అటువంటి దర్శన కార్యక్రమాన్ని నిర్వహించమని అభ్యర్థిస్తున్నారు.

ఆంధ్రాయాత్ర శ్రమతో కూడుకొని జరిగినప్పటికీ, తన తదుపరి ప్రజా దర్శనం ఆరంభం కాబోయే ముందు, బాబా ఏ మాత్రం విశ్రాంతిని తీసుకోలేదు. బాబా తన ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని ఉధృతపరచాలనే కోరుకుంటున్నట్లు కనిపించింది. అందువల్ల ఆయన ఆదీతో రాబోయే మూడు నెలల వరకూ ఆయన అనుచరులు ఎవరూ తనకు జాబులు వ్రాయవద్దని తెలుపుతూ ఒక సర్క్యులరు తయారు చేయమని చెప్పారు. ఉత్తరాల వల్ల తాను చెదరగొట్టబడ కుండా వుంటే తాను రానున్న నెలల్లో తన ఆంతరంగిక కార్యక్రమాలన్నీ స్వేచ్ఛగా తదేక ధ్యాసతో నిర్వహిస్తానని వివరించారు. ఆదీ బాబాతో సమావేశం అయిం తర్వాత భోజనం చేసి, 150 మైళ్ల దూరంలో వున్న అహ్మదునగరకు తన కారులో వెళ్లిపోయాడు.

అదే సమయంలో బాబాకు పోష్టుమాన్ ఒక దుర్వార్త తెలిపే టెలిగ్రాంను తెచ్చి యిచ్చాడు. ఆ తంతిని బాబాకు సన్నిహిత ప్రేమికుల్లో ఒకరైన హరజీవన్‌లాల్ అనే ఢిల్లీలో పేరున్న లాయరుగారి కుమార్తె పంపించింది. ఆయన కుమార్తె ఆ రోజుననే ఢిల్లీలో పెళ్లి చేసుకోవాల్సి వుంది. సరే, ఆ తంతిలో ఇలా వ్రాసివున్నది. "అమ్మ ఈ రోజు (మార్చి 6)న మరణించింది. నా వివాహము కూడా యీ రోజే జరుగవలసి వున్నది. వివాహము జరిపించవచ్చునేమో తెలుప గలరు" ఆ రోజు ఉదయం తెల్లవారగట్ల హరజీవన్ భార్య మరణించింది. అదే రోజు సాయంత్రం ఎంతో హుందాంగా ఆయన కూతురు పెళ్లి జరుగవలసి వున్నది. ఎటువంటి పరిస్థితి ! ఆ కుటుంబం బాబా మార్గ దర్శకత్వాన్ని అభ్యర్థిస్తూ ఎదురు చూడటంలో ఏమాత్రం ఆశ్చర్యం లేదు.

ఆ తంతి చదివిన తర్వాత సర్వజ్ఞుడైన బాబా ఆ వెనువెంటనే తన అక్షర ఫలకంపై విచారంతో కలవరపడుతున్న వధువుకు జవాబును చెప్పి వ్రాయించారు. బాబాతో వున్న వాళ్లకు ఆయన జవాబు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ తంతిలో ఇలా జవాబు ఇచ్చారు. "వివాహము తప్పని సరిగా జరిగి తీరాలి. నా ఆశీస్సులు - బాబా" దానిని వెంటనే ఒక ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాంలో పంపారు. ఒక గంటలోపుగా అది ఢిల్లీకి చేరింది. జీవితంలో అకస్మాత్తుగా ఎదురయ్యే ఆపత్సమయంలో ఎదురు చూడని ఎటువంటి ప్రత్యుత్తరం !

బాబా ఇచ్ఛకు సర్వార్పణ అయినందున, ఆ కుటుంబము అదే రోజున వివాహ క్రతువును యధావిధిగా జరిపారు. ఆ వివాహాన్ని వాయిదా వేయనందుకు ఆ కుటుంబాన్ని లోకులు ఎలా విమర్శించారో ఊహించుకోవలసిందే. కొందరైతే హరజీవన్‌ను ఎగతాళి చేశారు. ఇటువంటి విషయాలను కేవలం ప్రేమ మాత్రమే ఆనందంగా భరించకలుగుతుంది. ప్రేమికుడికి దివ్య ప్రియతమునికి మధ్య వున్న సంబంధాన్ని ఇతరులు అర్థం చేసుకోగలరని మీరు ఎలా నమ్మగలరు?

ప్రియతముడు, తాను ప్రత్యేకంగా ప్రేమించువారి నుండి కోరేది వారు యిటువంటి ఘోరమైన ప్రమాణాల ద్వారా ఆనందంగా వాటిని విధేయులై పాటించుటకు ఇష్టపడడాన్ని. యదార్థ ప్రేమ అంటే చిన్న పిల్లల ఆట కాదు. మెహెర్ బాబా ఒక సందేశంలో యిలా వివరించారు.

ప్రేమ ప్రేమికుని దహిస్తుంది.
భక్తి ప్రియతముడిని దహిస్తుంది.
ప్రేమ ప్రియతముని కొరకు సుఖాన్ని కోరుతుంది.
భక్తి ప్రియతముని నుండి ఆశీస్సులు కోరుతుంది.

హరజీవన్‌లాల్‌కు బాబాయందున్న ప్రేమ, తన ప్రియతముని సంతోషము కొరకు పూర్తిగా లొంగిపోవుట ద్వారా పొంగిపొర్లింది. అటువంటి ఆనందాన్ని జయించేందుకు, వ్యక్తిగత విషాదం, లోకుల అవమానంతో జతపరిచి వెలకడితే, అతడికి చెల్లించేందుకు అదేమంత గొప్ప ధర కాబోదు. కొన్నాళ్లకు హరజీవన్ గుండెలు పగిలే ఘోరమైన విచారకర జాబును బాబాకు వ్రాశాడు. అందులో తనకు సంబంధించిన విషయాలను వ్యక్తపరచాడు. బాబాకు అత్యంత ప్రేమతో సర్వార్పణ అయిన తన అర్థాంగికి సకాలంలో తగు వైద్య సహాయాన్ని అందించుటలో బహుశః తన విద్యుక్త ధర్మంలో తప్పటడుగు వేశానేమోనని వ్రాశాడు. అతను తరచూ, తన అశ్రద్ధ వల్లే, తన భార్య అకాల మరణం చెందిందని ఆలోచిస్తూ, పశ్చాత్తాపంతో బాధపడేవాడు. అదే ఉత్తరంలో అతను బాబాను క్షమాపణ కోరి, వాడవాడలా ప్రియతముని ప్రేమ సందేశాల వ్యాప్తికై తగు కార్యక్రమాలను ఏర్పాటు చేసే శక్తిని గుండె నిబ్బరాన్ని ప్రసాదించమని

బాబాను వేడుకున్నాడు. అవతారుడు మెహేర్‌బాబాగా మళ్లీ ఇపుడు మానవుల మధ్య మానవుడై వున్నాడని, ప్రజలతో చెప్పి పాలుపంచుకోవాలన్న ఆకాంక్షను వ్యక్తపరచాడు.

తనయందు హరజీవన్‌కున్న ప్రేమ, విధేయతలకు బాబా ముగ్ధులై, అతని లేఖకు జవాబుగా కిషన్‌సింగ్‌కు అనేక ముఖ్య విషయాలను చెప్పి వుత్తరం వ్రాయించారు. తన ఓదార్పు లేఖలో, మన గత జన్మలన్నీ తెలిసిన సర్వజ్ఞుడైన బాబా, తన దివ్యాధికారముతో హరజీవన్‌కు అభయమిస్తూ "అకాల మరణము ' ' అంటూ ఏదీ లేదన్నారు. బాబా దగ్గరకు చేరాలన్న దైవ నిర్ణయాన్ని ఎటువంటి మంచి వైద్య సహాయం కాని లేదా అశ్రద్ధ కాని ఏ మాత్రం తప్పించలేవు. ఆ రోజున హరజీవన్ భార్య బాబాను చేరాలన్నది విధి నిర్ణయం. కనుక హరజీవన్ బాధపడవలసిన అవసరం లేదు. అందుకు బదులుగా అతడు శాశ్వత జీవనాన్ని అనుభవించేందుకు ఆయన చెంతకు చేరినందున అతడు సంతోషించాలి. బాబా ఇచ్చిన వివరణతో హరజీవన్ హృదయానికి ఊరట కలిగి, తన మనస్సులో చెలరేగుతున్న అపరాధపు ఆలోచనలన్నీ తుడుచుకుపోయాయి.

ఈ కథ, తనకు సర్వార్పణ అయిన వారిపై, బాబా అతి సన్నిహితమైన వ్యక్తిగత జాగ్రత్తలు ఎలా తీసుకుంటారో వివరిస్తుంది. ప్రియతముని కథ తన ప్రేమికుల ప్రేమ కథ నుంచి విడదీయుటకు వీలు లేనందున, హరజీవన్ గురించి, ఆయన గతంలో బాబాను కలియుట గురించి, ఆయనతో వున్న సంబంధాన్ని ఇక్కడ కొన్ని మాటలు చెప్పుకొనుట ఉచితంగా వుంటుంది. హరజీవన్ మొదటిసారిగా 1940ల్లో మెహేర్‌బాబాను కలిశాడు. అదే సమయంలో మెహేర్‌బాబా దివ్యత్వాన్ని తెలుసుకొనే అదృష్టం కలిగింది. ఆయన్ని దైవసాక్షాత్కారం పొందిన గురువుగా అంగీకరించాడు. అతని హృదయం బాబా ప్రేమ వల్ల రగులుకున్నది, హరజీవన్ ఏళ్లతరబడి తన గురువు అనుమతించిన ప్రతిసారి తప్పకుండా వచ్చిన అవకాశాన్ని వుపయోగించుకొని గురు సన్నిధిలో హాజరయ్యేవాడు. అతను బాబాతో సమావేశము కావటం వల్ల, అతనిలో ప్రేమ జ్వాల, తేజోవంతంగా ప్రజ్వరిల్లేది.

ఈ కారణంవల్ల, బాబా కుటుంబంలోని అనేకమంది వలెనే ఇతను కూడా 1949 అక్టోబరులో ఆదీగారి కార్యాలయం నుంచి పంపిన యీ క్రింది సర్క్యులరు చూచి అదిరిపోయాడు -

పెంచి పోషించుకున్న ఆశలు, నానారకాల కార్యక్రమాలతో కూడిన పాత జీవితాన్ని బాబా ముగించి ఆయన సంపూర్ణ పరిత్యాగము మరియు పరిపూర్ణ నిస్సహాయతతో కూడిన నవజీవనమును అక్టోబరు 16, 1949 నుంచి ప్రారంభిస్తున్నారు. ఎవరూ కూడా బాబాను చూచే ప్రయత్నిం చేయరాదు. ఎవరూ కూడా బాబాతో సంభాషించేందుకు ప్రయత్నించరాదు. ఎటువంటి కారణమైనా సరే, అది ఏమైనా సరే !

చాలామంది బాబా అనుచరుల వలెనే హరజీవన్ కూడా హఠాత్తుగా చేసిన బాబా నిర్ణయం వల్ల కలతపడ్డాడు. ఆ సర్క్యులరు చివర బాబా ప్రేమికులకు, ఆయన ఇచ్ఛను అంగీకరించుట తప్ప వేరే గత్యంతరం లేదన్న సూచనను జోడించారు. కనీసం, ఆయనకు తమ జ్ఞాపకార్థం ప్రేమాస్పద ప్రణామాలర్పిస్తూ వీడ్కోలు పత్రం సమర్పించుకొనుటకు కూడా అనుమతించలేదు. దివ్యప్రేమ దానికదే ఒకచట్టం. అది, అవతారుని జీవితము ద్వారా స్పష్టమైనప్పుడు, కొన్ని సమయాల్లో, అది చెప్పుటకు వీలులేని విధంగా అపూర్వమైన రీతిలో వ్యక్తమవుతుంది.

బాబా "నిరాశామయ నిస్సహాయ జీవితాన్ని ఆరంభిస్తున్నారని, కాలినడకన ప్రయాణం చేస్తూ భిక్షుక వృత్తిలో తిరిపము ఎత్తుతారన్న ఆలోచన, ఆయన ప్రేమికుల హృదయాల్ని బాధపెట్టింది. నవజీవనం అక్టోబరు 16న మొదలైంది. 1949 ఆఖర్లో బాబా ఉత్తరప్రదేశ్‌లోని మెహెరాబాదులో వున్నారు. ఆ సంవత్సరం శీతాకాలం. చలి బాగా విదిలించి కొడుతోంది. నవజీవన సర్క్యులరు ద్వారా బాబా ఉత్తర భారతంలో వున్నారని తెలుసుకున్న హరజీవన్‌కు, బాబా సుఖం కోసం ఆయన యందు తనకున్న ప్రేమను పురస్కరించుకొని, బాబాకు ఆయన మిత్రులకు సరిపడ ఉన్ని బట్టలు, రగ్గులు, దుప్పట్లు, మిఠాయిలు పంపాలనిపించి అదే విషయాన్ని ఒకమధ్యవర్తి ద్వారా బాబాకు విన్నవించుకున్నాడు. విషయం

విన్న బాబా యీకానుకలను భిక్షగా అనుమతించారు. వాటివల్లనవజీవన మిత్రులకు ఎంతో ఊరట కలిగింది. పాపం వారు అప్పటివరకు విపరీతమైన చలివల్ల తీక్షణమైన బాధలు పడ్డారు. అయితే అదే సమయంలో ఆయనతనతో కాని,తన నవజీవన మిత్రులతో కాని, ఎటువంటి సంబంధము లేదా సంభాషణ పెట్టుకోరాదని తన కుటుంబం వారందరినీ హెచ్చరించారు. ఈ ఆదేశాల్ని హరజీవన్ సంతోషంగా అంగీకరించి, అత్యవసరమైన యీ వస్తువులన్నిటినీ పెద్ద మొత్తంలో తన నౌకరులలో ఒకతని ద్వారా పంపాడు.

నవజీవనం ఎలా మొదలైనదో అదే విధంగా హఠాత్తుగానే పరిసమాప్తమైంది. ప్రతి చోటా వున్న తన ప్రేమికుల ఆనందానికి అవధులు లేకుండా పోయి అందరినీ ఆశ్చర్యపరచింది. 1952 ఫిబ్రవరి మొదట్లో, బాబా తొలి "జీవిత సర్క్యులరు"ను జారీ చేశారు. బాబా మరోసారి మెహేరాబాదు వచ్చి స్థిరనివాసం వుంటారని, తన శిష్యులతో, భక్తులతో మరియు అనుచరులతో తన సంబంధాన్ని మళ్లీ కొనసాగిస్తారన్న సంతోషవార్తను ఆ సర్క్యులరులో తెలిపారు. అయితే వాళ్లు బాబాను చూచేందుకు ఇంకా అనుమతించబడలేదు. 1952 ఏప్రియల్‌లో మొదలై ఆగష్టులో పూర్తయ్యే తన పాశ్చాత్య పర్యటన నుంచి తిరిగివచ్చేవరకు అనుమతిని ఇవ్వలేదు. హరజీవన్ ఎంతో ఆతురతతో బాబాను కలిసే తొలి అవకాశం కొరకు ఎదురుచూస్తున్నాడు.

1952 నవంబరులో హరజీవన్‌కు, తాను తొలిసారిగా పర్యటిస్తున్న హమీర్‌పూర్, ఆంధ్రా పర్యటనలలో తను కూడా వచ్చేందుకు అనుమతించినప్పుడు అతడి ఆనందానికి అవధులు లేకుండాపోయాయి. 1954లో బాబా రెండవ పర్యాయం హమీర్‌పూర్ సందర్శించిన సమయంలో హరజీవన్ బాబా ప్రేమలో పూర్తిగా తడిసి ముద్దయిపోయాడు. ఫిబ్రవరి 20న ప్రారంభమయ్యే ఆంధ్రా ద్వితీయ పర్యటనలో కూడా బాబాతో వుండాలన్న గట్టి కోరికతో తపించిపోయాడు. అయితే అతని భార్య యొక్క అనారోగ్యము వల్ల మరియు జరుగబోయే తన కుమార్తె వివాహము వల్ల, అతడు ద్వితీయ ఆంధ్రా దర్శన పర్యటనలో బాబాను అనుసరించలేకపోయాడు. కానీ, అప్పుడు హరజీవన్ భార్య మార్చి 6న హఠాత్తుగా మరణించింది. అదే రోజున వారి కుమార్తె వివాహం జరుగవలసివున్నది.

హరజీవన్ అతిఘోరమైన విషాదంలో మునిగిపోయాడు. పాపం అతడు ఒక సంసారే కాని సాధువు కాడు కదా! అకస్మాత్తుగా మరణించిన తన అర్ధాంగి జ్ఞాపకాలు అతని హృదయాన్ని తూట్లు పొడిచి, అతడ్ని సంతోషపెట్టే వాటన్నిటిపైనా ఒక నీడను కమ్మేట్లుచేశాయి. తన భార్యను పోగొట్టుకున్న అతి దీనమైన దుఃఖానికి తోడు అంతకంటే ఘోరమైన మరో విషాదంలో హరజీవన్ మునిగిపోయాడు. బాబా యొక్క ద్వితీయ ఆంధ్రాటూరులో పాల్గొనే అవకాశాన్ని కోల్పోయినందుకు దుఃఖిస్తూ పశ్చాత్తాపపడి కళ్లనీళ్లు కార్చాడు. బహుశః ప్రియతమ బాబాతో పాటు ద్వితీయ ఆంధ్రా పర్యటనలో తానూ పాల్గొని వుంటే, బాబాయే ఆమె ఆరోగ్యం గురించి తగు జాగ్రత్త తీసుకొని వుండేవారని కూడా ఆలోచించాడు.

ప్రేమికుని జీవితం, గందరగోళము మరియు ప్రశాంతత, బాధ మరియు సంతోషముల గమనములతో నేయబడుతుంది. అది తరచుగా, ఘోరమైన అగ్ని పరీక్షలకు లోబడి, గురవుతూ వుంటుంది. చివరకు హరజీవన్ బాబా నుంచి వచ్చిన ఉత్తరం వల్ల శాంతపడ్డాడు. దానిలో బాబా తన ఇచ్ఛ సర్వశ్రేష్టమైనదనీ ఆయనకు ఏది మంచిదో తెలుసునని అతనికి వివరించారు. బాబా ఉత్తరం ద్వారా హరజీవన్, బాధపడటమనేది పరిమితులకు కట్టుబడి వున్న వ్యక్తిని భగవంతుని అపరిమితానందంలోనికి నెడుతుందని తెలుసుకోగలిగాడు. సంతోష సమయాలు సైతం, ఒక్కొక్కప్పుడు సమయాన్ని బట్టి దాదాపు భరించలేని వేదనకు గురి కావటం లేదా ! అయితే ప్రతి దుఃఖము దానితో పాటు దైవమునుంచి ప్రత్యేక అంతరంగిక సందేశాన్ని మోసుకొస్తుందన్నది యదార్థం.

బాబా ఆంధ్రలో వుండగా అందించిన సందేశాలలో ఒకదానిలో అవతారుని జీవితం ఒక దివ్య కొవ్వొత్తి లాంటిది - తన మానవరూపం మండే మంట (షామా) వంటిదని వ్యక్త పరిచారు. అవతారుని ప్రేమికులు దీపపు పురుగులు - చిమటలు (పరవానాలు) వంటివారు. అవతారుని ఉనికిలో సంలీనం కావాలన్న వారి తితీక్షలో, వారు ఆ మంట చుట్టూ ఎగురుతున్నప్పుడు వారి రెక్కలు కాలి మసైపోయినా వారు లెక్కచేయరు. మార్చి 6న హరజీవన్ బాబా ఇచ్ఛకు కట్టుబడి వుండుట, ఆ తదుపరి సంభవించిన హృదయావేదన, ఈ రెండు సంఘటనలూ హృదయాన్ని కరిగించే ఉదాహరణలుగా సర్వాన్ని దహించే అవతారుని ప్రేమను, అందుకు ప్రేమికుడి ప్రతిస్పందనను సమర్థిస్తాయి.

## ఆంధ్రా నుండి తిరిగివచ్చి సకోరి వెళ్లుట



అత్యద్భుతమైన చలించిపోయే ఆంధ్రా పర్యటనలో బాబాతో అనుసరించేందుకు నన్నూ అనుమతించినందుకునేనెంతో అదృష్టవంతుడను. ఆయన ఆశీస్సులందు కున్న ధన్యుడను. మార్చి 6న ప్రొద్దుటే నేను మా స్వంత ఊరు కుర్ద్వాడిలో రైలు దిగాను. బాబా తక్కిన మండలివారు పూనే కు వెళ్లిపోయారు. నేను ఆ రోజే స్కూలుకు వెళ్లి నా విధులను మళ్లీ మొదలుపెట్టాను.

ఆనాటి నా మొదటి తరగతులలో విద్యార్థులు నేను చెప్పే పాఠాలు వల్ల ఏమైనా నేర్చుకున్నారో లేదో నాకు ఆశ్చర్యమే ! ఆంధ్రా పర్యటన నాపై బాగా అల్లుకుపోయినందున నేను ఇంకా మంత్రముగ్ధుడినై దాసుడిగానే వున్నాను. భౌతికంగా నేను కుర్ద్వాడి తిరిగివచ్చినా, నాహృదయం ఇంకా ఏదో ఒక అద్భుత రాజ్యంలో ఎగురుతూనేవుంది. బాబాయొక్క సొంపైన కదలికలు, చురుకైన సముఖము యొక్క జ్ఞాపకాలతోఇంకా నేను పొద్దుపుచ్చుతున్నాను. ఆయనతో కూడా వుండి గడిపిన అమూల్యమైన మధుర క్షణాలు నాఅంతరంగంలో ఇంకా పునర్జీవమై మెదులుతున్నాయి. కానీ నా మనస్సు మాత్రం యాంత్రికంగా తన పని తాను చేసుకుపోతోంది.

ఆ మర్నాడు మార్చి 7, ఆదివారంనాడు నేను ఎంతో కష్టంగా నా గదినుంచి బయటకు వచ్చాను. అప్పటివరకూ ఎక్కువ సమయమంతా పక్కలో పడుకొని అద్భుతమైన రెండు వారాల ఆంధ్రా పర్యటన యొక్క ఉల్లాసభరితమైన అనుభవాల్ని జ్ఞాపకం చేసుకుంటూ గడిపాను. పచ్చని వరిపొలాలు, తలలాడిస్తూ కనిపించే పొడవాటి తాటిచెట్లు వున్న అందమైన ఆంధ్రలో బాబా దివ్యమంగళ రూపాన్ని చూచిన ఆనందంతో వుక్కిరిబిక్కిరై తళతళ మెరిసే ముఖాల్ని చూస్తూ నేనింకా బాబాతో తిరుగుతున్నట్లే వూహించుకుంటున్నాను. తన చిన్మయ చేష్టలు, చిరునవ్వులు చిందిస్తూ సరళంగా ప్రసరించే కనుచూపులు, భుజాలపై నిమురుతూ తట్టే ఆప్యాయత ద్వారా తన ముద్దు బిడ్డలకు బాబా ఏమి

సందేశాలిచ్చారో చెప్పేందుకు మాటలు చాలటం లేదు. అక్షర ఫలకంపైన, తన చేతి సౌంజ్ఞల ద్వారా బాబా ప్రజలకు సూచించిన సందేశాలు, కచ్చితంగా జీవితము యొక్క తేటతెల్లమైన, దేదీప్యమానమైన ప్రాధమిక సత్యాలు. ఆంధ్రలో బాబా అందించిన యీ క్రింది మాటలు ఆయన సందేశాల సారాంశాన్ని పట్టుకొనుటకు సహాయపడతాయి.

"భగవంతుడు మాత్రమే సత్యము. భగవంతుడు తప్ప మరేదీ లేదు. ప్రతివారూ దైవమే. ప్రతివస్తువూ భగవంతుడు. మానవులలో యీ సత్యాన్ని మేల్కొలుపుటకు అనంతుడైన భగవంతుడు, కాలక్రమంలో ఒక మానవ రూపాన్ని ధరించి, అవతారుడిగా తెలియబడును. భగవంతుడే మానవుడిగా మారిన అవతారుడిని హృదయపూర్వకంగా ప్రేమించుట, శాశ్వతమైన భగవంతునితో సమైక్యమగుట అనే జీవిత గమ్యాన్ని గుర్తించేందుకు ఒక అత్యంత సహజ మార్గము.

యావత్తు ఆంధ్ర పర్యటన, వందలాది మంది తనకు భక్తులైన ప్రేమికులతో పాటు వేలాదిమందికి ఒక పెద్ద పండుగకు అందించే ప్రేమ విందైంది. నేను ఇంటికి చేరాక, బాబా స్వయంగా యిచ్చిన ఆదేశాల మేర భావూకల్చూరి వ్రాసిన వుత్తరం నాకు చేరింది. అది చిన్నదే అయినా, ఆ వుత్తరంలో, బాబా ప్రేమ మరియు ఆయన సమన్వయపు జల్లులు ప్రస్ఫుటంగా కనిపించాయి. దానితో పాటు ఆయన అందించిన "ఉనికి జీవనము, జీవితము దాని ఛాయ" అన్న సందేశము నకలును జతపర్చి పంపారు. ఆంధ్రప్రదేశ్‌లోని రాజమండ్రిలో మార్చి 2వ తేదీన జరిగిన కార్యకర్తల సమావేశంలో తెల్లవారుఝామున యీ సందేశమును పూర్తిగా చదివించారు. ఇప్పుడు బాబా నన్నీ సందేశాన్ని ఇంగ్లీషు నుంచి మరాఠీ భాషలోనికి తర్జుమా చేయమని అడిగారు. నేను బాగా చదువుకున్న పండితుడ్ని కానందున, ఇది అంత తేలికైన పని కాదనుకున్నాను. నిజానికి, శీర్షిక పేరును (టైటిల్) తర్జుమా చేయటమే కష్టమనిపించింది. మరి మూలము అంతా నిండివున్న అతిసూక్ష్మమైన ఆధ్యాత్మిక విషయాల్ని వివరించటం ఎంత కష్టమో చెప్పలేను. ఈ నాటికీ, నేను ఉపయోగించిన పదాలు, ఆ సందేశాన్ని తర్జుమా చెయ్యటానికి నేను అవలంభించిన విధానము గురించి ఆలోచిస్తే అది నేనే చేశానన్న నమ్మకం నాకు లేదు.

ఏమైనప్పటికీ, ఆ సందేశంలో, నా హృదయానికి బాగా హత్తుకుపోయిన

భాగం చాలావరకు అత్యద్భుతమైన చివరి భాగమేనని చెప్పాలి. అందులో నాలుగు రకాల యోగముల గురించి బాబా సూచించారు. కర్మయోగం, ధ్యానయోగం, రాజయోగం, భక్తియోగం - ఈ నాలుగు దైవాన్ని చేరే మార్గంలో దిక్సూచిలుగా వుపయోగపడతాయి. ఆ తర్వాత ఆయన ఆత్మ సమర్పణ యోగమనే అయిదవ రకాన్ని పరిచయం చేశారు. ఆ సందేశపు చివర్లో బాబా ఇలా చెప్పారు. "నీవు గనుక నిరంతరం బ్రతకాలని కాంక్షిస్తే, అప్పుడు నాకు సర్వార్పణ అయి, నిన్ను మోసపుచ్చే నీ ఆత్మ యొక్క మరణాన్ని కోరుకో. అన్ని యోగాలలో వున్న ఏకైక సారమే యీ యోగము". బహుశః యీ అయిదవ యోగము గురించిన ప్రకటన, నాకోసరం వ్యక్తిగతంగా దాని తర్జుమా బాధ్యతను వప్పగించుట ద్వారా నాకు అందించారేమోననిపించింది.

నాకు రాసిన వుత్తరంలో ప్రియతమ బాబా ఆ కరపత్రాన్ని అచ్చువేయించి, పంచిపెట్టే ఏర్పాటు చేయమని అడిగారు. ఈ పని చేయుటకు అవసరమైన పైకం చేకూరినా యీ కార్యక్రమాన్ని నిర్వహించటం నాకు సాధ్యమయ్యే విషయం కాదు. బాబా యింకా ఏం రాయించారంటే నేనాయనను ఎటువంటి ఆర్థిక సహాయాన్ని అర్థించరాదని, ఆఖరికి కలలో కూడా అలాంటి ఆలోచనకు చోటివ్వకూడదని వ్రాయించారు. బాబా హాస్యము యొక్క యీ తునక, నా హృదయాన్ని పరవశింపచేసింది. ఆయనతో నాకున్న అన్యోన్యత యొక్క తంతులు పైకి లాగుతున్నట్లనిపించింది. ఆ ఉత్తరం ఆఖర్లో బాబా తన ప్రేమను నాకు అందించారు. విషయాలన్నీ వాటంతటవే సహజంగా జరిగిపోతాయని, అంతా మంచే జరుగుతుందనుటకది ఒక సంకేతం. ఈ పనికి ఉపక్రమించుట నాకు ఇంకా కష్టమే అనిపించింది. అయితే నేను ఆరంభించేసరికి, మళ్లీ నన్నీ నేలపైకి తెచ్చేందుకు బాబా ప్రేమ సహాయపడిందని నేను తెలుసుకున్నాను. అది నన్ను ఆంధ్రా జ్ఞాపకాల నుంచి కుదిపివేసి, పాఠశాలలో నా విద్యుక్త ధర్మాల్లో నిమగ్నమయ్యేట్లు సహాయపడింది.

ఈలోగా రాబోయే బాబా దర్శన కార్యక్రమాల యేర్పాట్లు వడివడిగా జరిగిపోతున్నాయి. మహాబలేశ్వర్ నుంచి ఆదీ అహ్మదు నగరుకు తిరిగివచ్చాక, ఒక మండలి సభ్యుడుమరియునగర మాజీ మేయరైన సరోష్ ఇరానీతో మార్చి 20న బాబా సకోరి వెళ్లి తిరిగి రాగానే మార్చి 21న అహ్మదునగర్‌లో ప్రజాదర్శనం ఏర్పాటు చేసే సావకాశం గురించి చర్చించాడు. ప్రముఖులైన స్థానిక

పెద్దలనేకమందిని కలిసి, యీ శిష్యులిరువురూ మార్చి 10న మళ్లీ మహాబలేశ్వర్ తిరిగి వెళ్లారు. బాబా అహ్మదునగర్‌లో ఇవ్వతలపెట్టిన ప్రజాదర్శనము యొక్క సాధ్యాసాధ్యముల గురించి బాబాకు విన్నవించారు. అటువంటి కార్యక్రమ నిర్వహణ యీ సమయంలో వీలుపడుటపై ఆదీ, సరోష్‌ల మధ్య, తదితరనివాస మండలి మధ్య స్వేచ్ఛగా, నిష్కపటంగా జరుగుతున్న చర్చను బాబా ప్రశాంతంగా విన్నారు. ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసేందుకు బాబా తరచూ ఇటువంటి చర్చలే కావాలని వాంఛించేవారు. చివరలో బాబా యుక్తిగా అహ్మదునగరులో జరగాల్సిన దర్శన కార్యక్రమాన్ని మే నెల వరకు నిలిపివేసేందుకు నిశ్చయించారు.

ఈ సమావేశానంతరం, బాబా స్వయంగా చెప్పి, వ్రాయించిన ఒక సర్క్యులరును ఆదీ చేత చదివించారు. అసలు మూలప్రతి బాబాచే ఆమోదించబడి, మార్చి 15న విడుదల చేయబడింది. అన్ని జీవిత సర్క్యులర్లలో అతిచిన్నది ఇదే. అందలి విషయం :-

"ఈరోజు నుంచి 1954 మే నెలాఖరు వరకూ, ఎవరూ కూడా ఎటువంటి విషయంపైనా తనకు జాబులు వ్రాయకూడదని బాబా కోరుతున్నారు".

ఈ సమాచారాన్ని భారతదేశంలోని అన్ని బాబా సెంటర్లకు, బాబాకు సన్నిహితులైన భక్తులు మరియు అనుచరులందరకీ తక్షణం పోస్టు చేయమని ఆదీని ఆదేశించారు.

ఆదీ చివరిసారిగా బాబా దర్శనం చేసుకొని, తిరిగి వచ్చాక మార్చి 20న ఉపాశినీ మహరాజ్‌ను బాబా సందర్శించవలసిన సంక్షిప్త దర్శనం గురించిన విషయాలను ఖాయపరచేందుకు సకోరి బయలుదేరాడు. ఈ ఏర్పాట్లకు హాజరవుతూనే ఆదీ తన కార్యక్రమాన్ని ధృవీకరిస్తూ బాబాకు తంతి పంపాడు. ఆదీ నాకు కూడా ఒక టెలిగ్రాం పంపుతూ సకోరి దర్శనానికి బాబాతో పాటు నేనూ సకోరి వెళ్లుటకు అనుమతించబడినట్లు తెలియపరచాడు. నాకు బాబా కారు వెంట వెళ్లే వ్యానులో ఒక సీటును రిజర్వు చేసినట్లు కూడా వ్రాశాడు.

తనతో సకోరి వెళ్లేందుకు బాబా దయతో నన్ను అనుమతించి నందుకు నా దృష్టిలో ఒక ప్రత్యేక ప్రాధాన్యత కనిపించింది. నాచిన్నప్పుడు, ఒక మరాఠీ మాసపత్రికలో ఉపాశినీ మహరాజుకు పూర్తి వ్యతిరేకంగా వ్రాసిన వ్యాసాలను చదివాను. యథార్థ ఆధ్యాత్మికతలో నాకున్న అజ్ఞానం వల్ల, లేప్రాయపు

స్వాభిమాన ఉత్సాహంలో, నేను మహరాజును సంఘంలో ఓ కపురుగుగా భావించి, ఆయన్ని గురించి కొన్ని దూషించే వ్యాఖ్యలను చేశాను.

మెహెర్‌బాబా ప్రేమ పరిధిలోనికి వచ్చిన తర్వాత మహరాజ్ ఆయన గురువుల్లో ఒకరని తెలుసుకొని కొంచెం అదిరిపడ్డాను. నేను సకోరి సందర్శించేందుకు ఎదురు తెన్నులు చూచేరోజు వస్తుందని కలలో కూడా అనుకోలేదు. ఏమైనప్పటికీ, అన్నిటినీ మన్నించే బాబా సముఖంలో మహరాజు ఆశ్రమాన్ని సందర్శించేందుకు నన్ను అనుమతించటం వల్ల సద్గురువైన ఉపాశిని యడల నాకున్న దుష్ట భావాలను తుడిచివేసేందుకు సహాయపడింది. అలా మార్చి 19న అత్యంత ఉత్సాహంతో బాబాతో కలిసి సకోరి సందర్శనకు వెళ్లేందుకు, కుర్ద్వాడి నుండి అహ్మద్‌నగరు బయలుదేరాను.

## సకోరి : మహరాజ్ : గుల్మాయి, జోంపడి మరియు పింజ్రా

మెహెర్‌బాబా సకోరి సందర్శన ఘట్టాలను చెప్పబోయేముందు సకోరిలో వున్న కొన్ని ముఖ్యమైన ప్రదేశాల గురించిన వివరాలను చెపితే సమంజసంగా ఉంటుందనుకుంటాను. 1954 మార్చి 20న అక్కడ సమావేశమవ్వబోయేటప్పుడు బాబాతో వస్తున్న లేదా మాటల సందర్భంగా ఆనాడు హాజరు కాబోయేవారిని గురించి ఆయనే ప్రస్తావించిన కొందరు ప్రముఖుల గురించి చెపితే బాగుంటుంది. అహ్మదునగరు జిల్లాలో రహతాకు దగ్గరలో వున్న చిన్న పల్లెటూరు సకోరి. రెండేళ్లకు పైగా తిరిగి తిరిగి ఉపాశినీ మహరాజ్ చివరకు సకోరిలో 1918లో స్థిరపడ్డారు. ఇదే ఆయనకు ముఖ్య కార్యస్థానమైంది తర్వాత సంవత్సరాలల తన శిష్యులు, మహరాజు నివశించిన అసలు పర్ణశాల (జోంపడి) చుట్టూ అనేక భవంతులు నిర్మించారు. ఈ విశాల భవన సముదాయం వున్న ప్రదేశం "ఉపాశినీ నగర్" అని పేరుగాంచింది. పిమ్మట సకోరిలో "కన్యాకుమారిస్థాన్" అనే ఒక సంస్థ స్థాపించబడింది. కన్య అంటే పరిశుద్ధమైన పడుచు. కొందరు కన్యలు సకోరిలో వుండిపోయేందుకు ఇష్టపడి వచ్చి, మహరాజ్ నేతృత్వంలో జీవితాన్ని గడిపారు. వారిలో ప్రముఖురాలు గోదావరిమాయి. 1924లో ఆమె 9 ఏళ్లపిల్లగా వున్నప్పుడు మహరాజు దర్శనం కొరకు తొలిసారిగా వచ్చింది. మొట్టమొదటిసారి ఆమెను చూడగానే మహరాజు "రా! తొందరగా రా, నేను నీ



3.

కొరకే ఎదురు చూస్తున్నాను" అని చేరపిలిచారు. మహరాజ్ చెప్పిన భవిష్యవాణి ప్రకారమే, గోదావరిమాయి కొంతకాలానికి ఆ ఆశ్రమానికి అధిపతి అయింది.

మహరాజు అనుచరుల్లో అత్యధికులు హిందువులు. మరి ఆయన మాటలన్నీ మరాఠీలో వుండేవి. మరాఠీ మహారాష్ట్రంలో అందరూ మాట్లాడే ప్రాంతీయభాష. అయితే ఆయనకు ఆకర్షితులైన కొన్ని జోరాష్ట్రియన్ (పార్శీ) కుటుంబాలవారూ వున్నారు. వారంతా ఆయన్ని హృదయపూర్వకంగా తమ గురువుగా అంగీకరించారు. గుస్తాద్‌జీ, మెహెరా, బాబాకు సన్నిహితులైన మరి కొందరు శిష్యులు, 1920ల్లో అనేక సందర్భాలలో ఉపాశినీ మహరాజుతో గడిపారు. అయినప్పటికీ ఇప్పుడు మనం చెప్పుకుంటున్న కథకు ముఖ్యురాలు గుల్మాయి. మెహెర్‌బాబా కార్యదర్శి అయిన ఆదీకి తల్లి ఆమె. నిజానికి ప్రస్తుత సకోరి దర్శనానికి బాబాను అనుసరించిన స్త్రీ మూర్తి గుల్మాయి ఒక్కతె మాత్రమే. సకోరి ఆశ్రమంతోటి మహరాజు తోటి ఆమెకు ఎంతో కాలంగా వున్న సంబంధాన్ని బట్టి తనతో రమ్మనమని ప్రత్యేకంగా అడిగినట్లు కనిపించింది.

ఆమె చిన్నతనం నుంచి గుల్మాయికి ఆధ్యాత్మిక విషయాలపై ఆసక్తి వుండేది. 1921కి ముందే ఆమె ఉపాశినీ మహరాజును దర్శించింది. అప్పుడే ఆమె మేర్వాన్‌ను కూడా ప్రథమ పర్యాయం చూచింది. (బాబాను అప్పట్లో మేర్వాన్ అని పిలిచేవారు). మహరాజ్ నందు మేర్వానుకున్న స్వచ్ఛమైన భక్తి ఆమె మనసులో నాటుకున్నది. సకోరిలో దేవుడి పేర అతడు నిర్వహిస్తున్న పేదల అన్నదానం కూడా ఆమెపై చెరగని ముద్ర వేసింది. మేర్వాన్ తనకు అత్యంత ఆప్తుడుగా తలచింది. అయితే ఆ సమయంలో గుల్మాయి మహరాజు నందు ఏకాగ్రతతో కూడిన భక్తిని కలిగియున్నది.

నిజానికి గుల్మాయి మహరాజుకు అంతటి భక్తురాలెలా అయిందంటే, అహ్మదునగరంలోని తన యింట్లో, ఆయన పటం ముందు ధ్యానం చేస్తుండగా ఆమె తరచూ తనను తాను కోల్పోయి సమాధివంటి స్థితిలోకి వెళ్లిపోయేది. ఆమె భర్త కైఖుస్రూపార్శీ కులపెద్దల హెచ్చరికలకు తలాడించి, ఒక హిందూ గురువు నందు ఆమెకున్న ప్రేమకు కళవరపడ్డాడు. తన భర్త వాంఛలను గౌరవించేందుకు గుల్మాయి తన గదినుంచి మహరాజు చిత్రపటాన్ని తీసివేసేందుకు అంగీకరించింది. అటువంటి సమయంలో ఆమె ఇద్దరు కొడుకులు రుస్తుమ్ మరియు ఆదీలు పూనాలో మెహెర్‌బాబాను కలిశారు. వారిరువురూ ఆయనకు ఎంత

ఆకర్షితులయ్యారంటే, మనఃపూర్వకంగా వారు తమ ఐహిక బంధాల్ని వదిలేసి, ఆయనకు తమ జీవితాల్ని సమర్పించుకున్నారు. ఇప్పుడు మెహెర్‌బాబా అనిపిలుస్తున్న మేర్వాన్ అహ్మద్‌నగర్‌లో రుస్తుమ్‌ను, ఆదీని కలియుట మొదలుపెట్టాడు. ఆ విధంగా గుల్మాయి అతి తరచుగా బాబాను కలవటం మొదలైంది. కాలక్రమంలో యీ సందర్శనలు ఆమెలో పెనుగులాటను పుట్టించింది. దానివల్ల ఆమె మహరాజు ఆజ్ఞలు పాటించాలా లేక మెహెర్ బాబా ఆజ్ఞలు పాటించాలా అని తేల్చుకోలేకపోయింది. అసలు తన భక్తిని యిరువురిలో ఎవరివైపు మొగ్గు చూపాలా ? అన్న సంశయంలో పడింది.

కాలక్రమంలో మహరాజ్, మెహెర్‌బాబా ఇద్దరూ, గుల్మాయికి అంతర్గతంగానూ, బాహ్యంగాను కూడాతమదైన అసమాన మార్గంలో యీ విరుద్ధ పోరాటాన్ని పరిష్కరించుటకు సహాయపడ్డారు. 1920ల్లో ఒక రోజున బాబా ఆకస్మికంగా గుల్మాయికి, తన మండలివారికి, ఆమె తన ఆధ్యాత్మిక మాతృమూర్తి" అని వెల్లడించారు. సహజంగానే గుల్మాయికి మెహెర్ బాబా యందున్న అనితరప్రేమ ఆయనతో వున్నగాఢమైన సంబంధపు ఆంతరంగ భావనలు, యీ ప్రేమ పూర్వక వ్యాఖ్య వల్ల మరింత బలపడినాయి. అదే సమయంలో బాబా ఎల్లప్పుడూ మహరాజ్ అంటే ప్రగాఢమైన గౌరవం, ప్రేమలను చూపించుట కొనసాగించేసరికి, గుల్మాయికి వున్న సంశయం కొంతవరకు తగ్గింది.

1930లో జరిగిన ఒక సంఘటన వల్ల అది మరింత తగ్గిపోయింది. ఆ రోజుల్లో గుల్మాయిగారింటిని కుస్రూ క్వార్టర్లు అని పిలిచేవారు. (ఇప్పుడు దాన్ని అవతార్ మెహెర్ బాబా ట్రష్టు ప్రాంగణంగా ప్రసిద్ధమైంది) అప్పుడు మహరాజ్ తనంతట తాను గుల్మాయి ఇంటిని సందర్శించారు. ఆయన వచ్చినప్పుడు వుండేందుకు కేటాయించిన తన గదికి నేరుగా వెళ్లారు. తన కార్యదర్శిని నగరంలో పని చూచుకురమ్మని పంపారు. ఒక గోనేసంచిపై కొంతసేపు కూర్చొన్నారు. పిమ్మట ఆదీ, గుల్మాయిలు ఆ గదిలోకి వచ్చినప్పుడు బాబా ఫొటోకు నమస్కరిస్తూ నిలబడివున్న మహరాజును చూచి వారు ఆశ్చర్యచకితులయ్యారు. ఆయన మనోహరమైన బాబా కళ్లల్లో తన కళ్లు సూటిగా పెట్టి తీక్షణంగా చూస్తూ కనిపించారు. వీరి వైపు తిరిగి మహరాజ్, "ఈ ఫొటో అంటే నాకు చాలా ఇష్టం. నాకు మేర్వాన్ అన్నా ఇష్టము. ఆయన అసమానమైన వ్యక్తి. నేనాయన ముందు ప్రణమిల్లెదను. దయచేసి నా నమస్కృతులను ఆయనకు అందించండి" అనిచెప్పారు.

మహరాజ్ ఇంకా కొనసాగిస్తూ "నాకు ఒక పళ్లెమును, ఒక దీపారాధన కుండీని తెచ్చివ్వండి. ఈనాడు నేను మేర్వానుకు హారతి ఇవ్వాలని కోరుతున్నాను' ' అని అన్నారు. గుల్మాయి పళ్లెంలో దీపం వుంచితేగా, మహరాజ్ వెలుగుతున్న దీపాన్ని బాబా ఫోటో ముందు వూపి తిప్పుతూ సంస్కృత మంత్రాలను పఠించసాగాడు. గురువు యొక్క ఇటువంటి చేతలు, తాను మహరాజుకు ఏ విధంగానూ ద్రోహం చేయుట లేదన్న భావాన్ని బలపర్చి, హృదయపూర్వకంగా బాబాను ప్రేమిస్తూ సేవ చేయుటకు దోహదపడ్డాయి. నిజానికి సరిగ్గా ఇదే సమయంలో గుల్మాయి మెహెర్‌బాబా యుగావతారుడని నిజంగా విశ్వశించింది. యాదృచ్ఛికంగా మహరాజు సందర్శించిన తేదీ ఫిబ్రవరి 16. జోరాష్ట్రియన్ కాలెండరు ప్రకారం ఆ రోజు మెహెర్‌బాబా యొక్క 43వ జన్మదినం.

ఈ విధంగా గుల్మాయికి బాబా బృందమందలి అనేకమంది ఇతరుల వలెనే సకోరి ఆశ్రమంతో దాని నిర్మాణముతో, దానికి సంబంధించిన ప్రముఖ వ్యక్తులతో సన్నిహిత పరిచయం ఏర్పడింది. సకోరిలో చాలా ప్రదేశాలు, భవనాలు ముఖ్యంగా పంజరము (పింజ్రా) మరియు పర్ణశాల (జోంపడి) లు ఒక ముఖ్యమైన ఆధ్యాత్మిక చరిత్రతో నిండివున్నాయి. ఆ చరిత్ర కేవలం మహరాజుకు సంబంధించినదే కాక బాబాకు సంబంధించినది కూడా. వాటి చరిత్ర గురించి నేను కొంత వివరించదలచాను.

1911 అక్టోబరు 11 నుంచి మొదలుపెట్టి, ఉపాసినీ మహరాజ్‌ను షిరిడీలో వుండమని సాయిబాబా ఆదేశించాడు. సాయిబాబా యొక్క సూటియైన ఆదేశముల క్రింద మహరాజ్ ఖండోబా దేవాలయంలో మూడేళ్లపాటు గడిపాడు. సాయిబాబా వుండేచ్చోటుకు ఇది అరమైలు దూరంలో వున్నది. 1914లో మహరాజ్ షిరిడీని వదిలిపెట్టి, కొన్నాళ్లు నాగపూర్‌లో మరికొన్నాళ్లు ఖర్గపూర్‌లో గడిపి ఈశాన్య భారతమంతా పయనించారు.

1918లో తన భక్తులు కొందరు కోరిన మీదట మహరాజ్ సకోరిలో స్థిరనివాసము వుండేందుకు నిశ్చయించారు. అది షిరిడీకి 4 మైళ్ల దూరంలో వున్న ఒక కుగ్రామం. తన శాశ్వత నివాసానికి ఆయన ఎంచుకున్న ప్రదేశం, ఊరు బయట వున్న స్మశాన భూమి. ఆయన ఉండేందుకు మట్టిగోడలతో ఒక పర్ణశాలను (జోంపడి) నిర్మించారు. అక్టోబరు 15వ తేదీన సాయిబాబా పరమపదించారు. ఆయన గౌరవార్థం ఈ పర్ణశాలకు ఎదురుగా ఒకచిన్న గుడిని కట్టి, పూజించేందుకు అనువుగా సాయిబాబా ఫొటోను అందులో పెట్టారు.

1920 ఆఖరి భాగంలో యీ దేవాలయం ప్రచండమైన గాలి తాకిడికి కూలిపోతే మళ్లీ కట్టారు. అదే సమయంలో సకోరీ సందర్శించే భక్తులరద్దీ రోజు రోజుకు పెరుగుట వల్ల వారందరికీ వసతి సౌకర్యాలు ఏర్పాటు చేయుటకు కొన్ని గదులు, ఒక ధర్మశాల కట్టవలసిన అవసరం తప్పనిసరైంది. ఈ నూతన కట్టడపు పనులకు మహరాజ్ అనుమతించారు. అయితే ఆ నిర్మాణ పనులలో జరిగే గడిబిడి సందడులకు దూరంగా వుండేట్లు, ఆయన తన కొరకు పొలాలలో ఎకాఎకిని చురుకుగా ఒక జోంపడిని తయారు చేయించాడు.

మహరాజ్ ఎంచుకొని కోరుకున్న ఆ స్థలం ఒక పురాతన స్మశాన వాటిక. అదంతా నాగజెముడు, రక్కిస పొదలతోనిండివున్నది. అక్కడకు వెళ్ళేందుకు బహుకొద్దిమందే సాహసించేవారు. ఎందుకంటే ఆ ప్రదేశమంతా ముళ్ళు, పాములతో నిండివుండేది. ఈ కొత్త జోంపడిలోనికి ఎవరూ వచ్చేందుకు మహరాజు ఇష్టపడేవారు కాదు. అసలు తన దగ్గరకు ఎవరినీ అనుమతించేవారు కాదు. ఎవరైనా ధైర్యం చేసి ఆయన చెంతకువస్తే రాళ్ళతో విసిరికొట్టి తరిమివేసేవారు. పగలు ఏ సమయంలోనైనా సరే, ఆయన తన భక్తుల్ని చూడదలిస్తే ఆయనంతట ఆయనే తన పాత పర్ణశాలకు వెళ్ళేవారు.

కొత్త పర్ణశాలకు మారటం,మహరాజ్ యొక్క ఆకస్మిక ఏకాంతవాస ఇచ్ఛ, ఇవన్నీ నిరంకుశంగానో లేదా చపలచిత్తంగానో కనపడవచ్చును. కానీ, ఆ తర్వాత జరిగిన సంఘటనలను బట్టి, అదంతా మహరాజ్ ఒక విశిష్టమైన ప్రత్యేక కార్యక్రమం ప్రారంభించేందుకు దైవ నిర్ణయమని నిరూపితమైంది. అయిదుగురు సద్గురువులు కలిసి మేర్వానుపై కప్పిన ముసుగును పూర్తిగా తొలగించవలసిన పాత్ర మహరాజ్‌ది అయింది. అనంత చైతన్యం రూపు ధరించిన మానవ రూపమే మేర్వాను, మరి మహరాజ్‌పై ఆయన్ని అవతారుడిగా పనిచేసేట్లు చేయవలసిన బాధ్యత పడింది. మహరాజ్ వుండేచోటు నిర్మాణపు పనుల వల్ల వచ్చే అరుపులు కేకలకు అసలు జోంపడి వద్ద గల్లంతుగా వుంటుందని కొత్తచోటుకు మారాలన్నది ఒక నెపంగా పైకి కనిపిస్తుంది. కానీ అంతర్గతంగా నిజమైన కారణమేమంటే మహరాజ్ పూర్తి ఏకాంతం కావాలని వాంఛించారు. త్వరలోనే మేర్వాన్ తన తెరను పూర్తిగా తొలగించుకొనుటకు రాబోతున్నాడని ఆయనకు ముందే తెలుసు. మేర్వాన్‌ని యుగావతారుడిగా ప్రతిష్ఠించుట మహరాజ్ వంతు అయింది.

1915 నుంచి మేర్వాన్ పరిమిత కాలంలో మహరాజ్ వద్దకు వస్తూనే

వున్నాడు. అయితే సాధారణంగా ఆయన సందర్శనలు స్వల్ప కాలమే వుండేవి. 1921 జూలైలో మేర్వాన్ తనతో ఏమీ తీసుకురాకుండా సకోరికి వచ్చి దాదాపు ఆరునెలలపాటు అక్కడే వుండిపోయాడు. పగటిపూట అంతా దత్త దేవాలయం దగ్గర్లో వున్న గదిలోనే గడిపేవాడు. అయితే రాత్రిపూట మహరాజ్‌తో పాటు కొత్త జోంపడిలో ఏకాంతంగా గడిపేవాడు.

ఇక్కడే ఆధ్యాత్మిక చరిత్రలో అత్యంత ముఖ్యమైన సంఘటన జరిగింది. మేర్వాన్ యొక్క అంతిమ తెర తొలగింపు జరిగి, పురాణ పురుషుడిగా ఆయన స్థాయిలో ఆయన్ని ప్రతిష్టించడం ఎరుకతో జరిగింది. ఆశ్రమవాసులు, శిష్యులు మరియు మహరాజ్ భక్తులు ఎవరికీ ఆ ఏకాంతవాస జోంపడిలో నిజంగా ఏం జరుగుతున్నదో ఏమీ తెలియదు.

మహరాజ్ దగ్గరకు బాబా రాత్రిళ్ళు వెళ్ళేటప్పుడు, జోంపడి లోపలగాని, దాని చుట్టుపట్ల కాని వుండేందుకు ఎవరినీ అనుమతించేవారు కాదు. అయితే సాధారణంగా తెల్లవారుఝామున 2.00 గంటల సమయంలో బాబా మహరాజ్ వద్ద శలవు తీసుకొని దగ్గర్లో తన కోసం ప్రత్యేకంగా తయారుచేసిన గదికి వెళ్ళేవాడు. ఆయన అక్కడ నిద్రపోయేవారు కాదు. యశ్వంతరావుని లోపలికి రానిచ్చేవారు. అతడు బాబా కాళ్ళు పిసుకుతూ ఆయన అవసరాలను ఆ రోజుల్లో తీర్చేందుకు హాజరవుతూ వుండేవాడు. ఈ సుదీర్ఘ సకోరివాసములో ప్రకృతి చట్టాన్ని అలక్ష్యం చేసి బాబా భోజనం చేయటం పూర్తిగా మానివేశారు. అయినప్పటికీ, రాత్రనక, పగలనక, ఏదో సమయంలో ఆయన తరచుగా తమలపాకుల కిళ్ళీ అడిగేవారు. యశ్వంతరావు ఎంతో ప్రేమతో ఆయన కోసం కిళ్లీ కట్టిచ్చేవాడు. మహారాష్ట్రలో నవంబరు, డిసెంబరు నెలలు విపరీతంగా చలిగా వుండే నెలలు. బాబా తనతో పాటు కొద్దిపాటి నూలు బట్టలు మాత్రమే తెచ్చుకున్నారు. బాబా సంరక్షణకు కావాల్సిన అవసరాలను మళ్ళీ మళ్ళీ చూచుకుంటూ, యశ్వంతరావు బాబాకు కమ్లీ అని పిలిచే ముతక దుప్పటితో వెచ్చదనం కలిగించే కోటును కుట్టి ఇచ్చాడు. మెహెరాబాద్ మ్యూజియంలో ఇది యిప్పటికీ భద్రపరచబడి ఉన్నది. ఇలాంటి ఎన్నో రకాలుగా యశ్వంతరావు అవతారుడి అవతరణ జరిగిన మొదటినుంచీ ఏదో ఒక రకంగా భక్తితో ఆయనకు సేవ చేసుకునే అదృష్టం పొందిన ధన్యజీవి. మహరాజ్ ఇచ్ఛకు అనుగుణ్యంగా విధేయతతో యశ్వంతరావు ఇలా ప్రేమపూరిత సేవ చేసుకున్నాడు. 1920 తొలిరోజుల్లో మహరాజ్ అతనితో "మేర్వాన్ సాక్షాత్తు పరబ్రహ్మ, ఆయన నిన్నేమి చేయమన్నా ఆచరించు" అని చెప్పారు.

1921 డిసెంబరులో ఒకనాటి రాత్రి. సకోరిలో మేర్వాన్ గడిపిన సుదీర్ఘ కాలపు ఆఖర్లో కొత్త జోంపడిలో ఆయన మహరాజ్‌లు కలిసి వున్నప్పుడు మహరాజ్ మేర్వాన్‌కు చేతులు జోడించి నమస్కరిస్తూ, "మేర్వాన్ ! నీవు అవతారుడవు. నీవు ఆదిశక్తివి" అని చెప్పారు. అవతారుడు లేక పురాణ పురుషుడిగా మేర్వాన్ యొక్క ఆధ్యాత్మిక స్థాయిని గురించి యథేచ్ఛగా ప్రకటన చేయుట గమనిస్తే మేర్వాన్ యొక్క అనంత చైతన్యంపై కప్పిన ముసుగును తొలగించే పనిని మహరాజ్ పూర్తి చేసినట్లు కనిపిస్తుంది. ఈ క్షణం తరువాత నుంచి, మేర్వాన్ అవతారుడిగా ఎరుకతో పనిచేయటం ఆరంభించాడు. కొద్దిరోజులు గడిచాక, 1921 డిసెంబరు మధ్య భాగంలో మేర్వాన్ సకోరి వదిలి పూనా వెళ్ళారు.

దాదాపు అదే సమయంలో మహరాజ్ తన శిష్యులకు మరియు భక్తులకు, కొత్త జోంపడి కట్టిన స్మశాన ప్రాంతంలో పీడిస్తున్న దుష్టశక్తులన్నీ ఇప్పుడు విముక్తి పొందాయని ప్రకటించారు. ఏమి దివ్య సంబంధ సాకు మరియు కలహాల మారిహాశ్యం ! మహరాజ్ ఇప్పుడు అందరు ఆశ్రమవాసుల్ని, యాత్రీకులను ఆయన్ని స్వేచ్ఛగా కలియుటకు అనుమతినిచ్చి వాళ్ళను ఆనందపరుస్తున్నారు.

అయితే 1921 డిసెంబరు 25న వారంతా మహరాజ్ దర్శనానికి వచ్చినప్పుడు ఆయన వెదురు బొంగులతో దారి ఏదీ లేకుండా ఒక బోనులా తయారుచేయించుకొని తనకు తాను బంధించుకొని లోపల వుండిపోవటం చూచి భయపడిపోయారు. మహరాజ్ దీన్ని తనకు విధేయుడైన శిష్యుడు, పనితనం గల వడ్రంగి సహాయంతో కల్పించకలిగారు. ఆ శిష్యుడ్ని రహస్యంగా అడిగి అందుకవసరమైన సరంజామానంతటినీ తెప్పించి తయారుచేయించి, భక్తులెవరూ చూడకుండా మహరాజ్ ఆ పంజరంలో ప్రవేశించి తన చుట్టూ వెదురు కర్రలకు మేకులు కొట్టి మూసివేయించారు. ఆ పంజరం యిప్పటికీ సకోరిలో దాని మూలస్థానంలో కాపాడబడుతోంది. ఆ పంజరం ఎత్తు అయిదు అడుగులు. పొడవు ఆరు అడుగులు. వెడల్పుఅయిదు అడుగులు. మూడు వైపులా వెదురు బొంగులతో మూసివేశారు. నాలుగో వైపున గోడ వున్నది. పైన కూడా మూసివేశారు.

ఆశ్రమవాసులు భక్తులు. మహరాజ్‌ను ఆ స్థితిలో చూచి, ఆయన కదలికలు పూర్తిగా బంధించబడినందున దుఃఖించసాగారు. ఆయన లేచి నిలారుగా నిలబడే వీలు కూడా లేదు. కాలకృత్యాలు తీర్చుకొనుటకు ఆయన

బయటకు వచ్చే సావకాశం లేదు. అయినా స్వయంగా కల్పించుకున్న యీ చెర, ఆధ్యాత్మిక ప్రాముఖ్యతతో నిండివున్నది. కొద్దిరోజులు గడిచాక మహరాజ్ ఎంతో ప్రశాంతంగా చిరునవ్వుతో విషయాన్ని యిలా వివరించారు.

"ఇదంతా దైవ కటాక్షం. మీ అందరికోసం నేనిలా యీ పంజరంలో నిర్బంధించుకోవలసి వచ్చింది. భగవంతుని కోర్టులో నేను నా భక్తులందరి కొరకు జామీనుగా నిలబడదలచాను. నా యీ నిర్బంధం మిమ్ములను అతి గొప్ప జైలు అయిన మాయ బంధాల నుంచి విడుదల చేస్తుంది. ఈ పంజరాన్ని తలుచుకొని ఎవరైతే తుది శ్వాస విడుస్తారో వారు ఏ మాత్రం అనుమానం లేకుండా శాశ్వతానందస్థితిని పొందుతారు."

మహరాజ్ ఇలా స్వయంకల్పిత బంధిఖానాలో అసౌకర్యాలతో కూడిన బాధలను అనుభవిస్తూ రెండు సంవత్సరాలపైగా గడిపారు. చివరకు, 1924 జనవరి 31న ఆయన అదే వడ్రంగిని పిలిపించి ఆ పంజరంలో ఒక దారిని తెరిపించారు. అప్పటినుంచి ఆయన తన యిష్టం వచ్చినప్పుడు లోనికి బయటకు రావటం చేశారు.

మహరాజ్ 1942 డిసెంబరు 24న శరీర త్యాగం చేశారు. ఇది కొత్త జోంపడీ ప్రాంగణంలో సంభవించింది. ఇందులో మహరాజ్, మేర్వాన్‌తో చాలా రాత్రులు ఒంటరిగా గడిపి, ఆయన్ని అవతారుడిగా తెర తొలగింపు చేశారు. ఆ మరుసటి రోజు డిసెంబరు 25న మహరాజ్ విగత శరీరాన్ని పంజరానికి (పింజర) అనుకొని తూర్పు వైపుగా ఒక గోతిని తీసి అందులో సమాధి చేశారు. యాదృచ్ఛికంగా సరిగ్గా 20 ఏళ్ళ క్రితం ఇదే రోజు మహరాజ్ తనకు తాను ఆ పంజరంలో బంధించుకున్న రోజు అయింది. ఆ తర్వాత యీ గోతిని మూసివేసి, నాలుగు వైపులా ఆవరణ ఏర్పాటుచేసి సమాధి కట్టారు.

ఉపాశినీ మహరాజ్ ఆదేశాల ప్రకారం గోదావరి మాయి మరియు కన్యలు, ఆశ్రమ కార్యకలాపాలకు నిర్వహించుటను కొనసాగించారు. మూడు వారాలు గడిచాక, 1942 జనవరి 13 తేదీన ఆ పంజరం (పింజర) లో మహరాజ్ నిలువెత్తు విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. కొన్నాళ్ళకు ఒక పెద్ద సభా మండపాన్ని యీ పంజరం సమాధులను కలుపుతూ నిర్మించారు. ఈ స్థలం ఉపాశినీ నగరంలో ఆశ్రమ జీవితానికి అతికీలకమైన కేంద్రంగా మారింది. ఈ సభా మండపంలోనే 1954 మార్చి 20న సకోరి సందర్శన సమయంలో గోదావరి మాయిని బాబా తన ప్రక్కన కూర్చోపెట్టుకొని, సమావేశమైన వారందరికి తన సహవాస్‌నిచ్చారు.

# సకోరిలో బాబా జ్ఞాపకాలు

1954 మార్చి 19వ తేదీ సాయంత్రానికి బాబా మెహెరాబాద్ చేరుకున్నారు. మర్నాడు ఉదయం, సరోష్ బాబాను, కాకా, ఎరుచ్, నారిమన్ మరియు మెహెర్జీలతో పాటు మెహెరాబాద్ నుండి బయలుదేరి సకోరికి కారులో తీసుకువెళ్ళారు. ఆదీ విడిగా తన చెవర్లెట్ కారులో వాళ్ళమ్మ గుల్మాయిని తీసుకొనివెళ్ళాడు. తక్కిన మండలివారిని బాబా అనుమతించిన తదితరులను, నన్నూ కలిపి మరో రెండు వ్యానుల్లో తీసుకువెళ్ళారు.

19వ తేదీ శనివారం పౌర్ణమిరోజు అయింది. మేము అహ్మదునగర్ వదలిపోయే ముందు ఇంకా తెల్లవారనందున పూర్ణచంద్రుడు నెమ్మదిగా కుంగిపోతుండగా తూర్పున సూర్యుడు మెల్లగా వెలుగుతో ఉదయిస్తున్నాడు. చల్లని ప్రాతఃకాల చిరుగాలుల్లో మాకీ ప్రయాణం ఎంతో రమ్యంగా జరిగింది. సామాన్య పౌరులకు సైతం ఇదొక విశిష్ట దినము. నిజంగా అది వేడుకతో చేసుకొనే ఒక పండుగ దినము. అంతక్రితం రాత్రి స్థానికులంతా తమ తమ గ్రామాల్లో హోలీ పండుగ చేసుకుంటూ పెద్ద పెద్ద భోగిమంటలు వెలిగించారు. ఇది ఒక హిందువుల పండుగ. శీతాకాలం సమాప్తమై వసంత ఋతువు వచ్చిన గుర్తుగా యీ పండుగను చేసుకుంటారు.

బాబా కారు కంటే ముందే మా రెండు వ్యానులు సకోరికి సుమారు ఒక మైలు దూరంలో వున్న రహాతా అనే చిన్న బస్తీ చేరుకున్నాయి. బాబాకు స్వాగతం చెప్పేందుకు స్థానికులంతా అప్పటికే అక్కడకు చేరుకున్నందున మేము మా వ్యానులు [illegible] కలిశాము. ఆయన రాగానే ముద్దులొలికే చిరునవ్వులతో [illegible]సత్కారాలను అందుకున్నారు. [illegible] వాహనాలన్నీ [illegible] రహదారి నుంచి [illegible] సకోరి[illegible] బయలుదేరాయి. ప్రతివారు ఉపా[illegible]రులోకి ప్రవేశించగానే ఆశ్రమ ప్రాంగణానికి [illegible] [illegible]తరావు కట్టుకున్న ఇంటి ముందు బాబా [illegible] మహరాజ్ శిష్యుడైన ఇతను మూడు దశాబ్దాల క్రితం బాబాకు ఎంతో విధేయతతో [illegible] [illegible] [illegible] బాబాను పుష్పమాలాంకృతుల్ని చేసి, కొబ్బరికాయలు [illegible]ప్రవేశ మహోత్సవ కార్యక్రమం ప్రారంభమైంది. కొబ్బరి ముక్క, పటిక బెల్లం కలిపి బాబా ప్రసాదంగా అందరికీ పంచిపెట్టారు. దీనితో సకోరీ సందర్శన మధుర స్మృతులు తియ్యగా

మొదలయ్యాయి. బాబా యొక్క నులివెచ్చని కరుణాపూరిత సహవాసము ఆయన యొక్క మౌనాన్వితమైన దివ్య సముఖము నుంచి మహాతేజస్సుతో పరవళ్ళు తొక్కింది. బాబాను అనుసరిస్తున్నవారంతా ఆయనతో నడుస్తూ మంచి ఉత్సాహంగా వున్నారు.

ఉపాశినీ కన్యాకుమారి ఆశ్రమానికి బాబా రాగానే ఆశ్రమ మాతృమూర్తి గోదావరిమాయి, జిజీ, వాఘ్ తదితర మహరాజ్ వృద్ధ శిష్యురాళ్ళతో కలిసి బాబాకు ఆదరణపూర్వక స్వాగతాంజలి సమర్పించారు. బ్యాండు వాయిద్యాలు మార్మోగాయి. తుపాకులు పేల్చారు. అంతా కలసి బాబాను చక్కగా అలంకరించిన ఉచితాసనము దగ్గరకు తోడ్కొని వెళ్ళి సుఖాశీనుల్ని చేసి, మహరాజ్ శిష్యులంతా బాబాకు పుష్పహారాలు సమర్పించారు. పిమ్మట అంతా సాష్టాంగ దండ ప్రణామాలర్పించి బాబా దర్శనం చేసుకున్నారు. ఆ ఆశ్రమమంతటికి గోదావరిమాయి అధిపతి అయినప్పటికీ ఆమె కూడా ఏ మాత్రం సంశయించకుండా మహరాజ్‌కు చేసిన మాదిరి బాబాకు సాష్టాంగ అభివందనం చేసింది. బాబా చాలా సంతోషించారు. మెచ్చుకున్నట్లు ఆయన ముఖం వెలిగిపోయింది. కళ్ళు తళతళ మెరిశాయి.

ఆ తర్వాత బాబా యధేచ్ఛగా జోంపడిలోను, వేర్వేరు దేవాలయాల్లోను, గోదావరిమాయి, కన్యలు, కొందరు మండలి సభ్యులతో కలిసి లోపలా బయటా తిరుగాడారు. ఈ పర్యటనలో బాబా ముఖంపై చిత్రవిచిత్ర భావాలు పుంఖానుపుంఖాలుగా విరజిమ్మాయి. బహుశః సకోరి అంతా గత సంవత్సరాల్లో సన్నిహిత పరిచయం వున్న ప్రదేశాలైనందున గత స్మృతులు నెమరుకు వచ్చాయేమో!

టీ తీసుకున్న తర్వాత బాబా అందరినీ మహరాజ్ సమాధి దగ్గరకు తీసుకువెళ్లారు. అది ఆయన విగ్రహం నెలకొల్పిన పంజరం దగ్గర్లోనే వున్నది. బాబా నేలపై కూర్చున్నారు. గోదావరిమాయి, గుల్మాయిలు ఆయనకు కుడివైపుగా కూర్చున్నారు. ఈ సందర్భంగా చదివేందుకు, ఆయన ఒక సందేశాన్ని అంతకుముందే చెప్పి వ్రాయించారు. అయితే ఇప్పుడు ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా, కనపడి దానికి బదులు అక్కడ సమావేశమైనవారందరికి ముఖ్యంగా కన్యలకు, తనకు ప్రీతికరమైన కొన్ని సకోరి జ్ఞాపకాలను తెలియజేయాలనుకున్నారు. అక్కడ సుమారుగా 200 మంది హాజరై వున్నారు. కొందరు కూర్చోగా, వారి చుట్టూ మిగతావారు నిలబడి వున్నారు.

ఏ దర్శన కార్యక్రమం లేదా సహవాస్ కార్యక్రమంలోనైనా బాబా సమక్షంలో గడిపే మధుర క్షణాలు , హృదయాల్ని కదిలించి, మనస్సంతా ఆయనపైనే లగ్నం కావటం వల్ల జరిగేది వ్రాసుకోవటం కుదరక నేను కలవరపడేవాడిని. ఐనప్పటికీ అటువంటి సమయాల్లో బాబా అప్పుడప్పుడూ తాను అతి అరుదుగా చెప్పే గంభీరమైన ఆధ్యాత్మిక విషయాల్ని మళ్ళీ మళ్ళీ చెపుతారని నాకు బాగా తెలుసు. కనుక ఈసారి జరిగే అద్భుత క్షణాల మధుర స్మృతులను సజీవంగా వుంచేందుకు నోట్సు వ్రాయాలని నేను కృషి చేశాను. ఈ నోట్సులోని మాటలు, పంక్తులు అన్నీ బాబా అక్షర ఫలకంపై ఇచ్చే సంకేతం ఆయన హావభావాలతో చేసే సౌంజ్ఞల్ని ఏకాగ్రతతో చదువుతూ గబగబా టూకీగా వ్రాయటానికి మూలమయ్యాయి.

బాబా యథేచ్ఛగా చేసిన ప్రసంగ పాఠాన్ని నేను నోట్సుగా తయారుచేసినా దాన్ని సరిదిద్దటం నాకు చాలా కష్టమైంది. ఎందుకంటే, బాబా తన ప్రసంగంలో మధ్య మధ్య మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు, మూడు భాషల్ని మార్చి మార్చి ఉపయోగించేవారు. నేను హడావిడిగా వంకర టింకరగా వ్రాసుకున్న విషయాల ద్వారా బాబా కచ్చితంగా చెప్పిన విషయాన్ని సంగ్రహంగా క్రోడీకరించి గుర్తుకు తెచ్చుకొని సరిచూచు కొనుట నాకు అంత సులభం కాలేదు. పంక్తి, పంక్తి క్షుణ్ణంగా చదివి బాబా సౌంజ్ఞలను గుర్తు చేసుకుంటూ ఆలోచనా ప్రవాహపు ఉరవడిలో వాటిని పునర్నిర్మాణం చేయాల్సి వచ్చింది. నాకు గుర్తున్నంతవరకు, ఈ క్రింద పొందుపరచిన బాబా జ్ఞాపకాలు, బాబా అందించిన అసలు పదాలకు చేరువగా వుంటాయి. కాని, అవి మాటకు మాటగా వున్నట్లు తీసుకోరాదు. అక్కడ హాజరైనవారంతా సుఖాసీనులైన తర్వాత బాబా కొద్ది క్షణాలపాటు తన ప్రేమ పూరిత ధృక్కులను సభికులపై మందస్మిత వదనంతో రవ్వంత నిలిపారు. ఆ పిమ్మట చిరునవ్వుతో ఇలా ప్రసంగాన్ని మొదలుపెట్టారు.

"నేను యిప్పుడు మీకు చెప్పబోతున్నదానికి ఉపాసినీ మహరాజ్ సాక్షిగా వున్నారు. కన్యలతో మహరాజ్ నిర్వహించిన ప్రత్యేక ఘట్టం గురించి చెప్పబోయే ముందు నా తొలి జీవిత భాగం గురించి వివరించదలచాను. ముందుగా నేను, అనంతమైన నిజాయితీ భగవంతుని స్థితుల్లో ఒకటని మీరంతా తెలుసుకోవాలని కోరుతున్నాను. ఏ మాత్రం కపటం వున్నా అది మిమ్మల్ని ఆయనకి దూరంగా వుంచుతుంది.

ఇప్పుడు అసలు విషయానికి వద్దాం. 1914 జనవరిలో బాబాజాన్ నా

నుదుటిపై ముద్దు పెట్టుకున్నది. అదే క్షణంలో నేను నా అనంత దివ్య సనాతన స్థితిని అనుభవించాను. మాటలకు అతీతంగా ఈ దివ్యానుభూతి నాలో శాశ్వతంగా వుండిపోయింది. అది ఎటువంటి అనుభవమో మీకు అర్థమయ్యేట్లు చెపుతాను. ముందు నేను అనంత ఆకాశంలో ప్రవేశించాను. అక్కడ ఏమీ లేదు. ఎవరూ లేరు. ఆదిమ ద్రవ్యం (ఆకాశము) లేదు. స్థూల, సూక్ష్మ, మానసిక ప్రపంచాల ఉనికి ఆగిపోయి, కనీసం మాయగానైనా లేకుండా అంతరించాయి. ఆ తర్వాత ఆత్మసాక్షాత్కారపు అనంతానందం అనుభవమైంది.

అయితే తొమ్మిది నెలలు గడిచాక, నేను వర్ణించనలవి కాని ఆధ్యాత్మిక వేదనను అనుభవించాను. నన్ను మళ్ళీ సాధారణ మానవ చైతన్యానికి దిగి రమ్మని నాలో ఏదో ప్రేరేపించింది. దీనితో నా తల నుదుటిని, గోడమీద రాళ్ళమీద బాదుకోసాగాను. నా నుదుటి నుంచి రక్తం స్రవిస్తుంటే నాచేతి రుమాలును నా తలచుట్టూ కట్టుకొనేవాడ్ని, చివరగా యీ ప్రేరణ నన్ను షిరిడీకి చేర్చింది. నేను సాయిబాబా ముందు రోడ్డుపై మట్టిలో సాష్టాంగపడినప్పుడు ఆయన "పర్వర్దిగార్" అన్న ఉచ్ఛ స్వరంతో బిగ్గరగా అరిచారు. ("పర్వర్దిగార్" అంటే సర్వపోషకుడు, సర్వరక్షకుడైన భగవంతుడు అని అర్థం) సాయిబాబాతో జరిగిన యీ స్పర్శ నన్ను ఖండోబా దేవాలయం వద్దకు తీసుకుపోయింది. అది చాలా అపరిశుభ్రంగా ఉంది. అక్కడే మహరాజ్, దిగంబరిగా అస్థిపంజరంలా శుష్కించిపోయి కూర్చొని వున్నారు.

అప్పుడు జరిగిన అసంబద్ధ విపరీతాన్ని చూడండి. అక్కడ ఎటు చూచినా నేను తప్ప మరెవ్వరూ నాకు కన్పించలేదు. నేను మహరాజును సమీపించేసరికి ఆయన నా వైపు గురిచూచి ఒక రాయి విసిరికొట్టారు. అది నా నుదుటిని తాకి, నెత్తురు వచ్చింది. (బాబా ముఖంపై ఆ దెబ్బకు శాశ్వత గుర్తుగా ఒక మచ్చ ఏర్పడింది) సరిగ్గా ఆ చోటులోనే నన్ను బాబాజాన్ ముద్దుపెట్టుకున్నది. ఈ దెబ్బ ధ్యానము యొక్క మొదటి దెబ్బ. నా అనంత సనాతన స్థితి నుండి క్రిందికి దిగి వచ్చేందుకు యీ దెబ్బ పనిచేసింది. మహరాజ్‌తో జరిపిన అనేక సమావేశాల అనంతరము, ఏడేళ్ళు గడిచాక, నేను దైవీ మానవుడిగా పూర్తి సామాన్య మానవ చైతన్యం కలిగిన మానవుడిగా స్థిరపడ్డాను. పిమ్మట నా అనంతదైవత్వం, సాధారణ మానవత్వం రెండూ ఏకకాలంలో నాలో పొందికగా ఒనగూడాయి. (ఇది 1921లో జరిగింది).

బాబా చెప్పేదంతా ఏకాగ్రచిత్తంతో వింటున్న కన్యల వైపు చూచేసరికి ఆయన కళ్లు వెలిగిపోయాయి. బాబా ఇంకా ఇలా కొనసాగించారు -

"ఇప్పుడు నేను చెప్పబోయేదంతా జాగ్రత్తగా వినాలని కోరుతున్నాను. నేను దివ్య సనాతనుడిగా నా పాత్రను నేను పోషించేందుకై నన్ను స్థిరంగా వుంచుటలో మహరాజ్ ఎనలేని సహాయాన్నందించారు. ఈ యుగపు అవతార కార్యక్రమాన్ని నిర్వహించే పనిని ఆయనే నాకు ఒప్పగించారు. దైవేచ్ఛ ప్రకారం నిర్ణయించబడిన ఆధ్యాత్మిక కార్యక్రమంలో తనకు తాను ఆ తర్వాత మునిగిపోయారు. ఏమైనప్పటికీ యీ మార్పుతో ఆయన బాహ్యంగా ఏదో ఒక కొత్త తరహాలో కన్యలతో పని మొదలుపెట్టారు. అందువల్ల మహరాజ్ యొక్క ఆధ్యాత్మిక మాత దుర్గమాయికి కోపం వచ్చింది".

1930లో సకోరి ఆశ్రమంలో చెలరేగిన ఘట్టం గురించి బాబా చెపుతున్నారు. ఈ విషయం 1954 సకోరి దర్శనంలో పాల్గొన్న వారిలో అప్పట్లో అక్కడ వున్నవారందరికీ తెలిసిన విషయము. అయితే కొద్దిమంది పాఠకులకు యీ పాత కలత గురించిన పరిచయం వుండే వుంటుంది. బాబా ఇప్పుడా మచ్చలను, తన అనంత ప్రేమ ద్వారా అవగాహన కలిగించే ఉపశమన చికిత్సతో తుడిచివేస్తున్నారు. ఈ సందర్భంలో కొద్దిగా ఉపోద్ఘాత వివరణ ఇస్తే ఎక్కువ సహాయపడుతుందనుకుంటాను. బాబా ఎప్పుడూ దుర్గామాయి అని సంబోధించే దుర్గాబాయి ఒక వితంతువు (బాయి అంటే గౌరవాత్మక పదము. మాయి అంటే అమ్మ) రఘునాథ్ అనే తన చిన్న కొడుకుతో ఆమె మొదట్లో షిరిడీలో వుండిపోయేందుకు వచ్చింది. తన జీవితమంతా సాయిబాబా సన్నిధిలో గడపాలన్నది ఆమె ధ్యేయం. కొన్నాళ్ళకు సాయిబాబా 1911-1914 సంవత్సరాల మధ్య ఖండోబా దేవాలయంలో వుంటున్న ఉపాసినీ మంచి చెడులను చూచే బాధ్యతను ఈమెకు వప్పగించారు.

మహరాజ్ సకోరిలో స్థిరపడినప్పుడు, ఆయన్ని సేవించుకోవడానికి ఆయనతో పాటు దుర్గాబాయి కూడా వెళ్ళింది. ఈ విధంగా మొదటి నుంచి దుర్గాబాయి మహరాజ్ ఆశ్రమానికి అధికారం లేని మేనేజర్‌గా తయారయింది. కొన్నాళ్ళయ్యాక మహరాజ్ దర్శనానికి వచ్చిన మేర్వాన్‌కు కూడా దుర్గాబాయి సపర్యలు చేసేది. ఒక పర్యాయం మహరాజ్ ఆమెతో "మేర్వన్ ఏదో ఒక రోజున యీ జగత్తంతటినీ కుదిపివేయును" అని అన్నారు. అది విన్న దుర్గాబాయి చాలా సంతోషించింది. అప్పట్నించి ఆమె మేర్వాన్‌ను ఇంకా ఎక్కువగా ప్రేమిస్తూ

సేవించసాగింది. మహరాజ్ మేర్వాన్ యొక్క యదార్థ స్థితిని దుర్గాబాయి, యశ్వంతరావు వంటి కొద్దిమంది తన అనుచరులకు మాత్రమే బహిర్గతపరచినప్పటికీ చాలాసార్లు బాబాను మహాదేవుడిగా వ్యక్తం చేయటంతో మహరాజ్ హిందూ శిష్యుల్లో కొందరికి నచ్చలేదు. మతపరమైన స్వతసిద్ధ విలువలను నమ్ముకున్నవారైనందున మతమౌఢ్యంతో వారు పరమ కఠినులుగా మారారు. దురభిమానంతో వారు కల్పించే అకారణ వైరాన్ని రూపుమాపటం కష్టతరమైంది.

1924 జనవరి 31న మహరాజ్ తన పంజరం నుండి బయటకు వచ్చినప్పుడు ఆయన తన కార్యక్రమంలో ఒక కొత్త ఘట్టాన్ని ప్రారంభించదలచినట్లు చెప్పారు. కొద్ది నెలలు గడిచాక, ఓ తొమ్మిదేళ్ళ అమ్మాయి ఆయన దర్శనానికి వచ్చింది. ఆ పిల్ల పేరు గోదావరి. అలా ఆ బాలిక తరచుగా మహరాజ్ దర్శనానికి వచ్చేది. ఆయన కూడా ఆ పిల్ల మీద ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేవారు. ఒక సందర్భంలో "ఇక్కడ నీవు చూస్తున్నదంతా బాగా జ్ఞాపకము వుంచుకో ప్రస్తుతానికి దుర్గాబాయి ఆశ్రమ వ్యవహారాలను సందర్శకుల అవసరాలను చూస్తున్నది. ఆ తర్వాత ఇదంతా నీవే నిర్వహించాలి ! అని ఆ బాలికతో చెప్పారు. అప్పటికి 13 ఏళ్ళ నుంచి దుర్గాబాయి మహరాజ్‌తో వుంటూ ఆయన ఆధ్యాత్మిక పరిపూర్ణత్వంపై నమ్మకం కలిగి వున్నా అనుమానంతో శంకించసాగింది.

అప్పుడు మహరాజ్ ఎక్కువకాలము గోదావరి, తదితర యువకన్య పడుచులతో గడపసాగారు. వారంతా మహరాజ్ నేతృత్వంలో తమ జీవితాలను భగవంతునికి అర్పించుకొనేందుకు తమ తల్లిదండ్రుల అనుమతితో వచ్చినవారే. మహరాజ్ కన్యలుగా పిలిచే పసివాళ్ళంతా, మహరాజ్ కొత్తగా చేపట్టిన కార్యక్రమానికి ప్రధాన భూమికలయ్యారు. మహరాజ్ వారి చేత వేదాంత పరమైన ఆచార కాండను యధావిధిగా చేయించారు. పవిత్రమైన సంస్కృత మంత్రాల్ని పఠించటం వార్కికి నేర్పారు. కన్యాకుమారి ఆ స్థానాన్ని స్థాపించారు. ఈ అన్ని వైదికపరమైన ఆగమ కర్మలకు గోదావరి ముఖ్య భాగస్వామిగా వుండేది. మహరాజ్ యీ కార్యక్రమం ద్వారా భగవంతుని ఆడరూపంపై కేంద్రీకరించినట్లు కనిపిస్తుంది. అప్పుడప్పుడు ఆయన స్త్రీ మూర్తిలా చీరె కట్టుకొనేవారు కూడా.

కన్యల యందు మహరాజ్ చూపుతున్న శ్రద్ధా, వెచ్చిస్తున్న అధిక కాలము, దుర్గాబాయిలో ఈర్ష్యకు మరింత ఆజ్యం పోసింది. అదే సమయంలో ఆయన

అనుచరుల్లోని కొందరు ఆచారవంతులు పవిత్ర వైదిక క్రతువులను మంత్రోచ్ఛారణ చేస్తూ స్త్రీలు నిర్వహించుట సమంజసం కాదని తలచినందున వారు విబేదించారు. అలా మహరాజ్‌ని వ్యతిరేకిస్తూ ఒక అసమ్మతివర్గం తయారైంది. దుర్గాబాయికున్న అసూయ, ఆమె సహజ అమాయకత్వము, తన విషయాలను ఇతరులకు దాపరికం లేకుండా చెప్పే అలవాటు. వీటన్నిటినీ యీ అసమ్మతివర్గం ఆసరాగా తీసుకొని గోదావరికి వ్యతిరేకంగా దుర్గాబాయి మారేట్లు చేసింది. ఆశ్రమాధిపతిగా తన ఆధిపత్యాన్నంతా ఉపయోగించి గోదావరి జీవితాన్ని కష్టతరం చేయటం మొదలుపెట్టింది.

భక్తుల మధ్య నెలకొన్న యీ పగ కొన్నేళ్ళపాటు అనగా 1933లో దుర్గాబాయి కుటుంబం సకోరి వదిలి షోలాపూర్ వెళ్ళేవరకు కొనసాగింది. మహరాజ్‌కు, కన్యలకు మధ్య వున్న సంబంధం గురించి ఆమెకున్న దురవగాహనను ఆసరాగా తీసుకుని, కొందరు సనాతనులైన హిందూ పండితులు, మహరాజ్‌ని ఆయన ఆధ్యాత్మిక స్థాయి నుంచి తొలగించి వేసేందుకు దుష్ప్రచారం చేశారు. ఉపాసినీ మహరాజ్ దగ్గర సుదీర్ఘ కాలం వుండి ఆశ్రమ కార్యకలాపాల్లో ప్రధాన భూమికను నిర్వహించిన దుర్గాబాయికి ఆయనపై ఏర్పడిన అసంతృప్తి, వారికి ఆయనపై నిందమోపి, అపవాదును ప్రచారం చేసేందుకు నిర్దిష్టమైన సమాధానంగా ఉపయోగపడింది. వారీ సమాచారాన్ని వ్యాసాల రూపంలో అనేక మరాఠీ పత్రికల్లో ప్రచురించారు.

చాలా సంవత్సరాలు గడిచాక, దుర్గాబాయి తన తప్పును తెలుసుకున్నది. గాఢంగా పశ్చాత్తాపపడింది. అప్పటికే ఆమె దార్ఢ్యత కోల్పోయి, చిక్కి శల్యమైపోయింది. మహరాజ్ ఆమెను ప్రేమతో క్షమించటమే కాక ఆమె ఆరోగ్యం కుదుటపడేందుకు తగు వైద్య సేవలను కల్పించి, 1939 మే 6న ఆమె మరణించేవరకూ ఆమె భుక్తి కోసం నెలసరి భత్యాన్ని ఏర్పాటు చేశారు. తన భక్తుల యెడల ఒక సద్గురువు చూపే ప్రేమ బేషరతుగా వుంటుంది. మరి వారి మానసిక సంస్కారాల్ని తుడిచి వేసే విధానం తరుచూ చాలా నిగూఢంగా వుంటాయి. అనేక సంవత్సరాల పాటు ఆమె మహరాజ్‌ను వ్యతిరేకించినా, దుర్గాబాయి ఆయనకు అత్యంత సన్నిహిత శిష్యుల్లో ఒకరుగా మిగిలిపోయింది. నిజానికి మెహెర్ బాబా ఒకసారి తన తొలి శిష్యులతో ఆమె యదార్థంగా మహరాజ్ "ఆధ్యాత్మిక తల్లి" అని ధృవీకరించారు.

సరే అసలు సంగతికి వద్దాం, 1954 సకోరి దర్శనంలో బాబా దుర్గాబాయి ఈర్ష్యను గురించి వివరిస్తూ, ఆ తదుపరి సంవత్సరాలలో మహరాజు మంత్రాంగంలో జరిగిన ముఖ్యమైన వివాదం గురించి ప్రస్తావించారు. ఇదంతా కూడా తన అనుచరుల సంస్కారాల్ని తుడిచివేసి, వారిని దైవానికి సన్నిహితం చేయుటకు మహరాజ్ చేస్తున్న ఆధ్యాత్మిక కార్యక్రమంలో ఒక భాగం.

ఇప్పుడు ఆశ్రమంలో జరిగిన ఆ తొలి వివాదం గురించి జ్ఞాపకం చేసుకుంటూ బాబా వివరించసాగారు.

మహరాజ్ ఇదంతా కావాలని ఉద్దేశ్యపూర్వకంగానే చేశారు. ఆయన ద్విపాత్రాభినయం చేశారు. సరిగ్గా అదే సమయంలో ఆయన నా గురించి ప్రజలకు చెపుతూ "నేను మేర్వాన్‌కు ఏమీ ఇవ్వలేదు" అని చెప్పుట మొదలుపెట్టారు. ఆయన అలా చెప్పటం సరైనదే. నిజానికి నాకు ఇచ్చేందుకు అసలు ఆయన దగ్గర ఏమున్నది ? అవతారుడిగా నా దివ్య సనాతనత్వ స్థితిని నేను తెలుసుకోగలిగేటట్లు మాత్రమే ఆయన చేశారు. నా శిష్యులు కొందరు ఆయనను దర్శించినప్పుడు ఆయన నాకు వ్యతిరేకంగా చెప్పేవారు. అటువంటి అన్ని సంభాషణలలో మహరాజ్ పరిపూర్ణ స్థాయి పాత్రను పోషించారు. ఆయన "మూర్తీభవించిన పరిపూర్ణత్వము".

కొన్ని సంవత్సరాలు గడిచిన పిమ్మట (1930 తొలి రోజుల్లో) నేను మెహెరాబాదులో ఉన్నప్పుడు దుర్గాబాయి కుమారుడు రఘునాథ్ నా దగ్గరకు వచ్చాడు. తాను వ్యక్తిగతమైన విషయాన్ని నాకు చెప్పదలచినందున నా గదిలో నన్ను వంటరిగా కలుసుకోదలచాడు. అప్పుడతడు నాతో చెపుతూ "మా అమ్మ ప్రత్యేకంగా మిమ్ములను చూడమని పంపింది. అది మహరాజ్ ఇప్పుడు గడుపుతున్న జీవితం మరియు ఆయన కార్యకలాపాల గురించి" కామోద్రేకంతో అతి వ్యామోహంలో పడిపోయినట్లు మా అమ్మ అనుకుంటోంది. తాను కన్యలు అని పిలిచే యువతులందరినీ ఆయన మోహించినట్లు కనపడుతున్నది. అందువలన మీరు ఒకసారి సకోరి వచ్చి మహరాజ్‌ను కలవమని మా అమ్మ కోరుతోంది అని చెప్పాడు.

చివరికి రఘునాథ్‌కు నేను స్పష్టంగా చెప్పాను "నువ్వు నీ తల్లి కూడా పూర్తిగా తప్పు చేశారు. మీరు మహరాజ్ యొక్క దివ్యత్వ స్థితిని గురించి ఆయన చేసే ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని గురించి ఇసుమంతైనా అర్థం చేసుకోలేదు.

కనీసం ఆయన యొక్క అనంత అగాధత్వాన్ని కొలవలేదు. నేను సకోరి రావలసిన అవసరం లేదు. ఆయన బాహ్య నడవడిక ఏదైనప్పటికీ, మహరాజ్ కార్యక్రమాలతో ఆమెకున్న సంబంధాలను కాని ఆయన యందు ఆమెకున్న విశ్వాసాన్ని కానీ వదులుకోవద్దని దుర్గాబాయితో చెప్పు".

ఈ సందర్భంగా ఆయన తన వ్యాఖ్యలను ముగిస్తూ బాబా ఆశ్చర్యకరమైన మరియు భావగర్భితమైన ఒక అతిముఖ్య విషయాన్ని యీ విధంగా వెల్లడించారు.

"మహరాజు యొక్క బాహ్య జీవితం గురించి ఆయన శరీరత్యాగం చేసేవరకు నాకు సర్వం తెలుసునని రూఢిగా విశ్వసించండి. ఆయన నాలో వున్నట్లే నేనాయనలో వున్నందున అది నాకు తెలుసు. నేను స్త్రీతో ఏమి చేయాలో దానిని (భగవంతుని స్త్రీ లింగరూపం) మహరాజ్ నా కోసం చేశారు. మరి పాశ్చాత్య ప్రపంచంతో ఆయన ఏమి చేయవలసియున్నదో దానిని నేను ఆయన కోసం చేశాను.

ఇలా బాబా చెపుతుంటే అంతా విస్తుపోయి చూస్తున్నారు. ఇరువురు గురువులు కనపడకుండా నిర్వహించిన కార్యక్రమాల రహస్యాలను మొదటిసారిగా ఆనాడు సకోరిలో బయటపెడుతుంటే అంతా నిశ్శబ్దంగా ఆశ్చర్యంలో మునిగిపోయారు. ఒకవేళ బాబా ఇంతకుమునుపు ఈ నిజాలను తన సన్నిహిత మండలికి ఎప్పుడైనా చెప్పారో లేదో నాకు తెలియదు. వ్యక్తిగతంగా నాకు మాత్రం బాబా అందించిన కడపటి వివరణలోని భావం ఏ మాత్రం అర్థం కాలేదు. దీని అర్థాన్ని తెలుసుకొనుటకై దాని ప్రమాణాన్ని కొలిచే ప్రయత్నాన్ని నేనెన్నడూ చేయలేదు. అయితే ఆనాటి సకోరి సమావేశానికి హాజరైన నా మిత్రుడైన బాబా ప్రేమికుడ్ని సంప్రదించి, దీనిని నేనిక్కడ గ్రంథస్తం చేశాను.

అవతారునితో ఆయనకున్న సంబంధంలో బాబా చెప్పినట్లు మహరాజ్ పోషించిన ద్వంద్వ పాత్ర అనేక సంవత్సరాలు కొనసాగింది. ఈ కాలంలో గుల్మాయి ఈ ఇరువురు గురువుల మధ్య ఒక కొక్కెంగా పనిచేసింది.

సకోరి ఆశ్రమం గురించిన తొలి చరిత్ర గురించి జ్ఞాపకం చేసుకోవడం పూర్తయ్యాక బాబా ఇప్పుడు మహరాజ్ మరణానికి ముందు మహరాజ్‌తో తాను జరిపిన ఆఖరి సమావేశం గురించి మరలారు. ఆయన ఇలా కొనసాగించార్లు.

1941లో మహరాజ్ నాకు గుల్మాయి ద్వారా ఒక సందేశం పంపుతూ

"నేను త్వరలో నా శరీరాన్ని త్యజించబోతున్నాను. కనుక ఒకసారి వచ్చి నన్ను చూచి వెళ్ళమని మేర్వాన్‌తో చెప్పు" అని చెప్పారు.

అందుకు నేను "సకోరిలో అడుగుపెట్టబోను" అని బదులు పంపాను. అందువల్ల సకోరికి దగ్గర్లో ఉన్న పొలాల్లో వున్న ఒక పూరిపాకలో మా సమావేశం ఏర్పాటు చేశారు (ఈ సమావేశం 1941 అక్టోబరు 17న ఏర్పాటైంది).

దహెగాంలో జరిగే యీ సమావేశానికి వెళుతూ నా వెంట గుల్మాయిని కూడా తీసుకువెళ్లాను, ఆ పాకలోనికి వెళ్ళి నేను మహరాజ్‌ను చూడగానే నా శిరమును ఆయన పాదాలపై వుంచాను. ఆ సమయంలో, ఆ పాకలో వేరెవరూ లేరు. ఆయన నన్ను లేపి, ప్రేమతో ఆలింగనం చేసుకున్నారు. "మేర్వాన్ నీవు ఆదిశక్తివి. (ప్రథమ దివ్యశక్తి)" అని చెప్పి ఏడవసాగారు. ఆయన బుగ్గలపై కన్నీళ్ళు కాలువలై ప్రవహించసాగాయి. ఆ తర్వాత మేమిరువురం ఆ పాకలో కూర్చున్నాం. మహరాజ్ నావైపు చూస్తూ "నీ మౌనాన్ని విరమించు" అన్నారు. "ఇంకా సమయం రాలేదు" అని నేను సౌంజ్ఞలతో వివరించాను. నా మౌనాన్ని విరమించమని మొత్తం మీద ఆయన నన్ను మూడుసార్లు అడిగారు. నేను దీనిని విరమించనని ఆయనకు తెలిసి కూడా అలా అడిగారు. చివరలో "సకోరిని కనిపెట్టుకొని వుండు" అని చెప్పారు. పిమ్మట తన ప్రియతమ గోదావరి గురించిన విషయంలో నేను హామీ వుండేట్లు చేశారు. ఆనాడు నేను మహారాజ్‌కు ఇచ్చిన హామీని నెరవేర్చేందుకు ఇప్పుడు వచ్చిన నన్ను ఇక్కడ మీరంతా చూస్తున్నారు.

నేను మహరాజ్‌తో సమావేశమైన రెండు, మూడు నెలల తర్వాత డిసెంబరు 24న ఆయన శరీర త్యాగం చేశారు. గోదావరికి కన్యల బాధ్యత వప్పగించబడింది.

ఈ సమయంలో మరోసారి బాబా సంభాషణను మార్చారు. అది తరచూ జరిగే బాబా విధానం. గంభీరమైన చర్చానంతరం వాతావరణం తేలికపడేందుకు తనదైన స్వంత అసమాన రీతిలో ఇలా జరుగుతుంది. ఈ సందర్భంలో 1931 సెప్టెంబరులో ఆయన రాజపుతాన ఓడలో మొదటిసారిగా మహాత్మాగాంధీతో కలియుట గురించి ప్రస్తావిస్తూ సంభాషణను మార్చారు.

నేను కరాచి నుండి పాశ్చాత్య దేశాలకు ఓడపై బయలుదేరి వెళుతుండగా అదే ఓడలో గాంధీ కూడా ప్రయాణిస్తున్నారు. ఆయనంతట ఆయనే మూడుసార్లు

నా క్యాబిన్‌కి వచ్చి నన్ను కలిశారు. ఆయన ఆధ్యాత్మికత్వంతో పాటు అనేక విషయాలపై మాట్లాడారు. నా అక్షరఫలకాన్ని ఉపయోగించి నేను ఆయనకు చాలా విషయాల్ని వివరించగా చాన్జీ వాటిని నా బదులుగా చదివాడు. మా సంభాషణల్లో ఒకసారి గాంధీ నిజాయితీతో తన ఉద్దేశ్యాన్ని వ్యక్తపరుస్తూ "నేను ఒకపర్యాయం ఉపాసినీ మహరాజ్ దగ్గరకు వెళ్ళాను. ఆయన కాని, ఆయన విధానాలు కాని నాలో హత్తుకుపోలేదు" అన్నారు. ఐనప్పటికీ నేనాయనతో "నా గురించి మీలో ఏమి హత్తుకున్నదో అది ఆయనకు చెందినదే" అని చెప్పాను.

ఆ పిమ్మట మా సంభాషణలలో "బాబా, ఇప్పుడు వేధింపుల వత్తిడి అధికంగా వున్నది. మీ మౌనాన్ని విరమించి, ప్రపంచానికి యదార్థమైన ప్రేమ సందేశాన్నందించండి" అని గాంధీ నన్నుకోరారు. దీనిని విన్న నేను సౌంజ్ఞలు చేస్తూ, "త్వరలోనే" అన్నాను. ఇప్పటికి 22 ఏళ్లు గడిచిపోయాయి ! అది నా విధానము. అయితే ఇప్పుడు "త్వరలోనే" నేను నా మౌనాన్ని విరమించాల్సి వున్నది.

నేనీ రోజున మహరాజ్ గురించి ఏమి చెప్పినా, అదంతా పంచసద్గురువులైన సాయిబాబా, ఉపాశినీ మహరాజ్, బాబాజాన్, తాజుద్దీన్ బాబా, నారాయణ మహరాజ్‌లు సాక్షీభూతులుగా చూస్తున్నారు. నేను పురాణ పురుషుడిగా ఏదైవున్నానో, నేను ఏదై వుంటినో, నేను ఏ దైవుందునో, అది ఎల్లప్పుడూ ఆ యుగంలో వుండే పంచసద్గురువులు వల్లనే జరుగుతుంది. నేను పురాణ పురుషుడను.

మీరు చేసే ప్రతి పనిలో నిజాయితీగా వుండండి. నా యందు మీకు వున్న ప్రేమలో నిజాయితీగా వుండండి. నిజాయితీ మిమ్ములను దైవాన్ని ప్రేమించునట్లు చేసి, మీకు సహాయపడుతుంది. కనుక దానివల్ల మీకు మీరు ఆయనలో పోగొట్టుకొబడి, నన్ను మీ ఆత్మగా కనుగొందురు.

కొద్దిసేపు అగి బాబా గోదావరిమాయి వైపు చూచారు. ప్రత్యేకంగా కన్యలు కూర్చున్న వైపు చూచిన తర్వాత ఆయన చేతివేళ్ళు అక్షర ఫలకంపై కదలసాగాయి. ఆయన ఇలా తన ప్రసంగాన్ని కొనసాగించారు.

భగవంతుడు, కర్మకాండలకు, క్రతువులకు అతీతుడైనప్పటికీ మహరాజ్ మిమ్ములను ఏమి చేయమని ఆదేశించినప్పటికీ, దానిని విశ్వాసంతో చేయండి.

నూరు శాతం నిజాయితీతో చేయండి. కర్మకాండల కోసం కాక, మహరాజ్ ఆదేశించినందువల్ల, మీ సద్గురువు యీ పనిని మీకు వప్పగించినందున వాటిని ఆచరించాలన్న అవగాహనను మీరు అర్థం చేసుకోవాలని నేను కోరుతున్నాను. మీ పూజను యీ రకంగా చేయమని ఆయన మిమ్ములను ఆదేశించారు. ఆయన చెప్పినట్లు చేసి విధేయులుకండి.

ఏమైనప్పటికీ దేవుని కోసమైనా, ఈ కర్మకాండలను, వట్టిపోయిన మనస్సుతో యాంత్రికంగా ఆచరించకండి. లేకపోతే అవి మిమ్ములను విముక్తులను చేసే బదులు మీకు బంధనాన్ని కల్పిస్తాయి. మీరు చేసేదంతా, దానియందు మీరు హృదయపూర్వకమైన విశ్వాసం వుంచి చేసెదరుగాక, అప్పుడు మహరాజ్ కృపతో ఏదో ఒక రోజున భగవంతుడు తప్ప తక్కినదంతా మిధ్య అని మీరు తెలుసు కుంటారు. భగవంతుడు సత్యము. మరి మీరీ అనుభూతిని పొందేంతవరకు యీ సర్వమూ కేవలం బూటకం.

లక్షలాది మంది వచ్చి మీ పాదాలపై వారి శిరములు వుంచితే మాత్రం ఏమి వుపయోగం మీ మెడలో పూలదండలు వేసి, మిమ్మల్ని సద్గురువు అని పిలిచినప్పటికీ, మీకా అనుభూతి ("నేను భగవంతుడు" అన్న స్థితి) లేనప్పుడు అదంతా నిష్ప్రయోజనం. అలా కాకుండా సకల ప్రపంచం మీకు వ్యతిరేకంగా ఎదురు తిరిగినా మీరా అనుభవాన్ని పొందితే అప్పుడు మీరు దేనినీ పట్టించుకోరు. దానిని చేస్తున్నవారు మీరే కనుక, ఏమాత్రం తొణకకుండా వుండిపోతారు.

ఈ వేళ నేను సకోరిలో వుండటం నాకెంతో సంతోషంగా వున్నది అంటూ బాబా తన అక్షర ఫలకాన్ని ప్రక్కన పెట్టి, ఆ సమావేశంలో తాను చెప్పదలచుకున్న వైనాన్ని ఇప్పుడు వినిపించినట్లు ఒక సౌంజ్ఞ చేశారు.

కర్మకాండలు గురించి బాబా చేసిన ప్రస్తావనలో, నేను సేకరించినదేమంటే, ఆక్రతువు యొక్క బాహ్య భాగంతో బంధం పెంచుకొనే బదులు ఎవరైనా సరే తమదైనందిన జీవితంలో భగవంతుని సముఖమునకు హృదయపూర్వకముగా కట్టుబడివుంటే అది నిజమైన ముక్తికి మార్గాన్ని సుగమం చేస్తుంది. ఒక క్రతువు కాని, కర్మకాండ కాని, కేవలం ఒక సూచన, ఒక గుర్తు. అంతేకాని, అది ఒక అంత్యము కాబోదు. అది శుష్కించిపోవచ్చు లేదా నిస్త్రాణ చెందవచ్చు. మరో రకంగా సజీవమై తాజాగా వుండవచ్చు. యింకో విధంగా అది నిర్వహించే శక్తి మీద ఆధారపడవచ్చును. భగవంతుని సముఖానికి గమ్యం అత్యంత చేరువలో

వుంటుంది. మీరు బాహ్యంగా ఏమి చేస్తున్నా మీలోనే వున్న భగవంతునికి మీరు సన్నిహితమవుతారు.

ఆనాటి ఉదయం అవతార్ మెహెర్ బాబా మహరాజ్ యొక్క ద్విపాత్రాభినయం యొక్క ప్రాముఖ్యత గురించి ఎంతో నేర్పుగా వివరించారు. బాబా యొక్క స్పష్టమైన, యావత్ వృత్తాంతపు వివరణ ఎంతో ప్రేమతో వ్యక్తపరచుటతో మహరాజ్ గురించిన అనుమానాలున్న ఆయనఅనుచరుల హృదయాల్లో కమ్ముకున్న సందేహ మేఘాలన్నీ చెదరగొట్టబడినవి. ఈ సమావేశంలో పాల్గొన్నవారందరిలో ప్రేమ మరియు అన్యోన్యతలు పెల్లుబికే ఒక కొత్త భావనతో నిండిపోయింది. నిజానికి దీనికడమ భాగంగా కొద్దినెలలు గడిచాక, గోదావరిమాయి, కొందరు కన్యలతో సెప్టెంబరు 12న బాబా అహ్మద్‌నగర్‌లో ఇస్తున్న ప్రజాదర్శనలో పాల్గొనుటకు వచ్చింది. అది జరిగిన ఒక వారానికి, బాబా కొందరు, పాశ్చాత్య ప్రేమికులను వెంటబెట్టుకొని మళ్ళీ సకోరిని సందర్శించారు. మహరాజ్ అనుయాయులకు మెహెర్‌బాబాకు మధ్య ఒక కొత్త సద్భావన ఉదయించింది.

తన ప్రవచాన్ని ముగించే ముందు, బాబా ముఖంలో దివ్యమైన చిరునవ్వు తాండవించింది. ఆయన అందం విశేషంగా వెలుగొంది ముగ్ధమనోహరంగా కనిపించింది. ఆయన నిజంగా ఆనందపడినట్లు కనిపించారు. నిజంగా యీ ఉదయపు సమావేశం ఘడియ ఘడియకు ఒక వింత జరిగినట్లు మరువలేని దానిగా నేను భావిస్తాను.

## దైవ ప్రసంగం

అప్పటికే భోజనం వేళ అవటం వల్ల, అంతా లేచి సభా మండపం నుండి బయటకు వెళ్ళారు. బాబాతో పాటు అహ్మద్‌నగర్ నుంచి వచ్చినవారు భోజనశాలకు వెళ్ళారు. ఆ హాలు అంతా భారతీయ సాంప్రదాయం ప్రకారం ఆవు పేడతో అలికి చక్కగా ముగ్గులు పెట్టారు. అక్కడ మేమంతా నేలమీదే భోజనానికి కూర్చున్నాం. రుచికరమైన మృష్టాన్న భోజనాన్ని విస్తళ్ళల్లో సందర్శకులందరికీ వడ్డించారు. ఇంతలో బాబా, గోదావరిమాయితో ఆశ్రమం

చుట్టూ తిరిగివచ్చారు. చివరికి ఆశ్రమవాసుల కోరికపై ఆయన కోసం తయారుచేసిన వంటకాలను రుచి చూసేందుకు అంగీకరించారు.

మధ్యాహ్నం 12-30 గంటలు అయ్యేసరికి, బాబా మళ్ళీ ఆ పెద్ద సభా మండపంలోనికి వచ్చారు. దర్శన వేళల్లో మహరాజ్ కూర్చొనే ప్రదేశంలోనే ఉన్న స్తంభం దగ్గర బాబా కూర్చొనుటకు వీలుగా ఒక పరుపు వేసి, వుతికిన దుప్పటి, కొన్ని దిళ్ళు అమర్చారు. మహరాజ్ యెడల గౌరవంతో బాబా ఆ పరుపుపై కూర్చోకుండా దాని పక్కగా నేలమీద కూర్చున్నారు. కొద్దిసేపట్లోనే ఆశ్రమవాసులు, సందర్శకులు సభామండపం చేరుకున్నారు. అహ్మదునగర్ నుంచి వచ్చిన తన ప్రేమికుల్లో ఒకరైన రుస్తుంకాకా (హాతిదారు) ను కొన్ని భజన కీర్తనలు, మరాఠీ పాటలు (అభంగాలు) పాడమన్నారు. మళ్ళీ వాతావరణమంతా దైవప్రేమతో బరువెక్కిపోయింది. పాటకు పాటకు నడమ వచ్చే ఖాళీ సమయాల్లో బాబా యాదృచ్ఛికంగా తన అందమైన సౌంజ్ఞలు, అక్షర ఫలకంపై వున్న అక్షరాలను కూర్చి మాయతో సంబంధం వున్న సత్యము యొక్క లక్షణాన్ని గురించి వివరించారు. సరళమైన ఆయన వివరణలు శ్రోతల మనోఫలకంపై ప్రగాఢమైన స్థిరముద్రవేశాయి. అలా బాబా వివరించిన విషయాల్లో నేను ఈ క్రింది పేర్కొన్న కొన్నిటిని సేకరించకలిగాను.

భగవంతుని ఆవల స్థితిలో ఆదిమ ఇచ్ఛ "నేను ఎవరిని?" అని నన్ను అడిగేటట్లు చేసింది. దాని నుండి ఈ సకల సృష్టి పుట్టుకొచ్చింది. మరి ఇప్పుడు నేను యీ సకల సృష్టి యొక్క భారాన్ని మోయవలసివచ్చింది.

సత్యము లేక భగవంతునితో సమైక్యమైన అనుభూతిని పొందినవారు మళ్ళీ సాధారణ మానవ చైతన్య స్థాయికి దిగివచ్చి ఏకకాలంలో చైతన్య భూమికలు అన్నిటిలోనూ తానే వున్నట్లు అనుభవిస్తారు. ప్రస్తుతం నేను మీ ముందు కూర్చున్నట్లు చూస్తున్నారు. కానీ నేను ఇదే సమయంలో విభిన్నస్థాయిల్లో అన్ని చైతన్య భూమికల్లో అందరితో వున్నాను. ఉన్నత భూమికల్లో ఉన్నవారు తమ స్థాయిల్లో నన్నుచూడకలుగుతారు.

అయినప్పటికీ, మీరు చూస్తున్నది, వింటున్నది, స్పృశిస్తున్నది, రుచి చూస్తున్నది, వాసన చూస్తున్నది సమస్తం మాయలోని మాయ. ఈ మాయకు మీ మీద గట్టి పట్టు వున్నది. మీరెంత కృషి చేసి కష్టపడినా దాని పట్టునుంచి తప్పించికోలేరు. నిజానికి మీలోని ప్రతి-వారి యందా సత్-చిత్-ఆనందములు

(శక్తి -జ్ఞానము- ఆనందము ) వున్నాయి. అయితే ప్రతివారూ తాము నిస్సహాయులమని అసంతృప్తి చెందుతున్నారు. ఈ అజ్ఞానాన్ని తుడిచేయటం ఎలా?

ఈ ఆకృతిని అనుసరించుటకు ప్రయత్నించండి. ఒక వేళ నేను మీకు కలలో కనిపించి " ఓ నాప్రియా: నీవు చూస్తున్నది, వింటున్నది అంతా ఒక కల మాత్రమే" అని చెప్పాననుకోండి. అయితే మీరున్న కలస్థితిలో నేను చెప్పిన దానిని నమ్మరు. ఇప్పుడు సైతం నాముందు కూర్చొని కూడా మీరు ఇంకా కలనుకంటున్నారు. ఈ జాగృత కల స్థితిలో మీరు జపత పాదులతో సహా ఏం చేసినా అవి మిమ్ములను బంధిస్తాయి.

అప్పుడు మీరీ మాయ నుంచి ఎలా బయటపడ కలుగుతారు? దానికి ఒక నివారణోపాయము వున్నది. సాక్షాత్తు సత్యమే అయిన నాకు మీరు సర్వార్పణకావటమే. అదే దానికి విరుగుడు, మీరు ఏమి అలోచించినా, ఏమి చేసినా, అది చేస్తున్నది మీరు కాదని తలచండి. మీలో వున్న బాబాయే మీ ద్వారా దాన్ని చేస్తున్నారు అనుకోండి. అలా తలపోస్తూ మీరు అతి సహజంగా అత్యంత సహజంగా ఉండాలి నటించవద్దు. కాని దానిని అయినట్లు ఎవరూ నటించకూడదు. సహజంగా వుండండి. నిజాయితీగా వుండండి అని నేను మీకు చెప్పినప్పుడు నేనూ నిజాయితీగా వుండాలి. కనుక అనంత నిజాయతీతో " నేను మానవ రూపంలో వున్న భగవంతుడను" అని నేను మీతో చెపుతున్నాను.

భగవంతుని చేరే ఆధ్యాత్మిక ప్రయాణం అంతిమ ఫానాలో సమాప్తమవు తుంది. " సంపూర్ణ మనోశక్తి" జరిగే స్థితి ఇది. పిమ్మట బాకా బిల్లా అనుసరిస్తుంది. ఇది పరిపూర్ణులైన వారు "నేను భగవంతుడను" అని అనుభవించే స్థితి.

మిమ్మల్ని మీరు మానవమాత్రులుగానే విశ్వసిస్తున్నారు. అంతేకాని, ఒక జంతువుగా ఎన్నటికీ అనుకోరు. అదే విధంగా ఒకరు భగవంతునితో కలిసిపోయి ఆయనతో సంలీనమైనప్పుడు, "అధమ ఆత్మ" పూర్తిగా తుడుచుకుపోతుంది. ఈ స్థితిలో వారు భగవంతుడై పోతారు. "నేను భగవంతుడను " అని అటువంటి వారు ప్రకటించుట సహజం. ఇక్కడ "నేను" అనేది అధమ ఆత్మకు సంబంధించినదికాదు. అది ఉన్నత ఆత్మకు చెందినది.

ఈ క్షణంలో, నా మండలివారొకరు వందలాది సూర్యుల్ని చంద్రుల్ని

చూస్తాడు. అతను వాటిని నాలో చూచును. అయినప్పటికీ ఎన్నివేల అనుభవాలు కలిగినా అవన్నీ, భగవదైక్యపు అంతిమ అనుభూతికి కనుచూపు మేరలో వుండవు. ఇక్కడ సత్యమును సత్యముగా అనుభవించుట జరుగుతుంది. సత్యము నిష్కపటమైనది. అనంతమైన నిష్కపటం. అయితే ఇది అపారమైన కష్టతరమైనదిగా చేస్తుంది. అధమ ఆత్మగా మీరే మీ నిజ ఆత్మకు అడ్డుతెర అవుతున్నారు. అందువల్ల యీ చెడ్డచిక్కు నుంచి, ఈ చిత్తడి నేల నుంచి బయటపడే మార్గం ఏమిటి? నాకు సర్వార్పణై, నన్ను ప్రేమించుటయే అత్యంత సరళమైన సహజమార్గం. నేను ఏకైక సత్యమును.

ఈ గంభీరమైన వివరాలన్నిటినీ బాబా, తన అద్భుతమైన సౌంజ్ఞల ద్వారా, ధారాళంగా విశదీకరించారు. అంత స్వల్ప వ్యవధిలో మొత్తం దైవ సంబంధ విషయాన్నంతటినీ ఇంత సునాయాసంగా ఎలా చెప్పగలిగారా అని విస్తుపోయాను. ఆధ్యాత్మిక ప్రయాణము యొక్క మొదటివాడు (ఆల్ఫా) ఆది అంతముల మధ్య వుండువాడు (ఓమేగా) అయిన సత్యము లేక భగవంతునికి సంబంధించిన సకల సృష్టి యొక్క ఆది అంతముల గురించి చక్కగా వివరించారు. బాబా చెప్పిన విషయాల్లో కొన్నిటిని పునఃసంధానము చేయప్రయత్నిస్తే బాబాముఖంపై వ్యక్తమైన దర్జా నా మాటల పొందికలో కనిపించలేదు. ఆయన యొక్క ప్రతి కదలికలో దివ్యత్వం వెలిగిపోయేది. దానిని చూడకలిగిన భాగ్యం నాకు కలిగినందుకు నేను ఎంతో ధన్యుడ్నీ, నాకది మాటల్లో చెప్పలేని దీవెన. ఇది నిజంగా ఒక అమూల్యమైన పవిత్రసమయం.

బాబా ప్రసాదాన్ని పంచటంతో ఆనాటి కార్యక్రమం సమాప్తమైంది. బాబా దగ్గరకు వస్తున్న వారికి పండో స్వీటో ఆయన అందిస్తున్న సుందర దృశ్యం ముగ్ధ మనోహరంగా ఉంది. ఆయన చేతుల మీదగా ఇచ్చిన ప్రసాదం, అగోచరమైన ఆయన ప్రేమలో తడిసి పునీతమైన దివ్యకృప యొక్క కనిపించే బహుమానమన్నమాట. ప్రతివారికి అందిన ప్రసాదానికి ఒక ప్రత్యేక ఆధ్యాత్మిక ప్రాముఖ్యత వున్నది. మధ్య మధ్య పాతకాలం వాళ్ళెవరైనా తారసపడినప్పుడు వారి మధ్య చూపులు వేగంగా కలుసుకుంటాయి. సంక్షిప్తంగా అలా చూపులు మార్చుకున్నప్పుడు వారు ఆయనకెంత ప్రియమైన వారో, వారి జీవితాలు ఆయనకు ఎంత నిశితంగా తెలుసునో ఆ చూపులతోనే వ్యక్తపరిచేవారు.

బాబా ప్రసాదంపంచి పెడుతుండగా, గోదావరి మాయి ఆయన పక్కనే

కూర్చున్నది. ఆఖరి నారింజపండు ఆమెకు ప్రసాదంగా ఇచ్చారు. బాబాయందు ఆమెకున్న గౌరవంతో తలవంచి వినయంగా ప్రసాదానికి చేయిచాచగా, ఆయన తన చేతిని ఆమె శిరముపై ఆశీర్వదిస్తున్నట్లు వుంచారు. పిమ్మట బాబా బయలుదేరుటకు లేచి నిలబడ్డారు. ఆయన యొక్క దీవెనల దృష్టి సమావేశమైన సభికులందరిపైన ప్రసరించింది. సాయంత్రం 4-30లకు బాబా సకోరి నుంచి బయలుదేరారు.

బాబా తిరిగి వెళుతూ దారిలో రోడ్డు ప్రక్కన కారు ఆపారు. ఆయన దిగి వచ్చి ఒక చెట్టు క్రింద నిలబడ్డారు. సహజంగానే మేమంతా ఆయన చుట్టూ చేరాము. బాబా చెప్పసాగారు.

ఈ వేళ నేను నిజంగా సంతోషపడ్డాను. గోదావరి పరిశుద్ధ హృదయం ఉన్నస్త్రీ. చాలా మనోజ్ఞమైనది. మీరు భోజనం చేస్తునప్పుడు ఆమె నన్ను లోనికి తీసుకువెళ్ళి మహరాజ్ వాడిన ఉయ్యాల బల్లపై కూర్చోమని కోరింది. ఆమె ఇతర కన్యలను పిలిచి, కొన్ని భక్తిగీతాలను పాడమన్నది. "నీకు మహరాజ్ ఆదేశించినట్లుగా, నీ పాత్రను ఏ రకమైన అనుమానాలు లేకుండా పోషించు" అని నేనామెకు చెప్పాను.

ఆ తర్వాత నేనామెను పక్కకు తీసుకువెళ్ళి, నేను నిన్నేమైనా చేయమంటే చేస్తావా? అని అడిగాను.ఆమె నిష్కపటంతో నిజాయితీగా " ఈ ఆశ్రమ వాతావరణంలో నేను చేయ కలిగిందైతే చేస్తాను" అన్నది . "అది స్వల్పమైనదే కాని, సులభమైనది మాత్రం కాదు. దానిని నీవు చేయాలి" అన్నాను. అందుకు ఆమె అంగీకరించింది.

కానీ బాబా ఆ ఆదేశము ఏమిటో దాని స్వభావమేమిటో బయట పెట్టలేదు. కాని ఆమె విధేయతకు సంతోషపడ్డారు. ఇంకా ఆయన ఇలా చెప్పసాగారు.

గోదావరి మాయి మహరాజుతో గడిపిన అన్ని సంవత్సరాలు, ఎటువంటి గొప్ప త్యాగంచేసిందో, ఎన్ని బాధలు అనుభవించవలసి వచ్చిందో మీకేమీ తెలియదు. ఆమె నిజంగా ఒక నిరాక్షేపణీయమైన వ్యక్తి.

బాబా ముఖంలో సంతృప్తిపడిన చూపు కనిపించింది. ఆయన కారు మళ్ళీ అహమ్మద్‌నగర్ బయలుదేరింది.

## ఇరువురు సద్గురువులు : బాబాజాన్, మహరాజ్

ఆంధ్రాలో జరిగిన నిరంతర దర్శన కార్యక్రమాలకు కొద్దిరోజులముందు, తన రాబోయే సకోరి దర్శనం కొరకు బాబా ఒక ప్రత్యేక సందేశాన్ని చెప్పి వ్రాయించారు. అయినప్పటికీ మార్చి 20న సకోరి చేరగానే, దీనికి బదులుగా, ఉపాసినీ నగర్ ఆశ్రమంలో సమావేశమైన వారికి, తన జీవితం గురించి, మహరాజ్‌తో తనకున్న సంబంధం గురించిన అతి ముఖ్య విషయాల్ని విశదపరచాలను కున్నారు. సకోరి దర్శనం కోసం వ్రాయించి దానిని బయట పెట్టకుండా వదిలివేసిన ఆ సందేశపాఠాన్ని యీ క్రింద పొందుపరుస్తున్నాను.

భగవంతుని ఆవల స్థితిలో లింగసంబంధ స్థానం లేదు. అక్కడ వుండేది ఏకైకుడు ఒక్కడే ఆయన యొక్క అగోచరమైన ఉనికి వ్యాపించి ఉంటుంది. జగత్తు అని పిలువబడే అద్భుత మాయావరణ భూమండలంలోనే లింగభేదం స్థిరంగా వుంటుంది.

బాబాజాన్ నా యొక్క సనాతన అనంత స్థితిని నేను ఒక్క క్షణం కంటే తక్కువ సమయంలో తెలుసుకోగలిగేట్లు చేసిన సద్గురువు రూపు ధరించిన ఒక ముస్లిం. మళ్ళీ నా సాధారణచైతన్యానికి నన్ను తీసుకువచ్చిన ఉపాసినీ మహరాజ్ మానవ రూపం ధరించిన ఒక హిందువు. అనాదిగా ప్రసిద్ధి చెందిన వంశంలో పుట్టిన బాబాజాన్ చిన్నతనంలో చాలా అందమైన పిల్లగా వున్నప్పుడే యీ ప్రపంచాన్ని పరిత్యజించింది. ఆమె వివాహానికి కొద్దిరోజుల ముందు, భగవంతుని యందు ఆమెకు వున్న అమిత ప్రేమ, భగవంతునితో ఏకం కావాలన్న ఆకాంక్షతో ఆమె సన్యసించి యిల్లు వదలిపెట్టింది.

మిలో ప్రతివారు స్త్రీగాని, పురుషుడుగాని, జాతి, కులం,మతం వివక్షతలు లేకుండా, ఈ దైవత్వాన్ని పొందుటకు సమాన హక్కు కలిగివున్నారు. భగవంతుడ్ని ప్రేమించుట ద్వారానే మానవుడు దైవంగా మారుటకు సాధ్యపడుతుంది. బాహ్య సన్యాసం ఎంత మాత్రం అవసరం లేదు. స్త్రీ పురుషులందరూ, నిత్యజీవితంలో తమ నిజ ధర్మాలన్నీ ఆచరిస్తూనే, దివ్య పితృత్వాన్ని, దివ్య మాతృత్వాన్నీ భగవంతుని యందు నిష్కపటమైన ప్రేమ కలిగివుండుట ద్వారా పొందవచ్చును.

దేవుని యందు మీ ప్రేమను వ్యక్తపరచుటకు తప్పనిసరిగా మీరు ప్రేమ, నిష్కపటము, స్వార్థ త్యాగముతో కూడిన జీవితాన్ని గడపాలి. కేవలం హారతి పఠించి, పూజలు చేసి, పుష్పాలు, పళ్ళు, మిఠాయిలు సమర్పించుట, సాష్టాంగపడుట వంటివి ఆచరించినంత మాత్రం చేత భగవంతుని ప్రేమించవలసిన రీతిలో ప్రేమించినట్లు ఎన్నటికీ కాబోదు.

అదే విధంగా భక్తులకు దర్శనాలు యివ్వటం, చుట్టూ గుమికూడిన సమూహములుండటం, జన బాహుళ్యానికి సందేశాలందించటం, మహత్తులనే వాటిని చేయటం వంటివి, నిర్వహించే వారు మీ మధ్య వున్నప్పుడు వారిని దైవతుల్యులుగా అంగీకరించి గొప్ప మహనీయతను ఆపాదించవచ్చును. అయితే నేను నా దివ్య నిష్కాపట్యంతో చెపుతున్నాను - ఇది ఏదీ నిజమైన దివ్యత్వమునకు అవసరమైన సంకేతం కాదు.

భగవంతుడు ఆశ చూపితే మోసపోయేందుకు లేడు. కానీ, ఆయన ప్రేమించబడుటకు వున్నాడు. భగవంతుడు బోధించుటకు లేడు, కానీ జీవించుటకు వున్నాడు ఎవరైతే ప్రేమ, నిష్కపటము, స్వార్థ త్యాగపు జీవితాన్ని గడుపుతారో అట్టివారే నన్ను దివ్య సనాతనునిగా తెలుసుకోగలుగుతారు.

నేను అనాదిగా, ఎరుకతో నిరంతరం, మీ అందరితో ఒకటిగా, మీ అందరిలో ఒకడిగా వున్నానని నా దివ్యాధికారంతో చెపుతున్నాను. జీవము లేదా నిర్జీవమైన ఏ దేవునికి గాని, ముని, గురువు, పురోగమించిన ఆత్మ లేదా యోగికి కానీ ఎటువంటి పూజ చేసినా, వందనములర్పించినా తుదకు అవన్నీ నా చెంతకే చేరతాయి. పరిశుద్ధమైన నిర్మలైన ప్రేమను మీరు ఎవరికి అర్పించినా మరియు సర్వమునకు అర్పించినా, నేను ప్రతివారిలోను ప్రతిదానిలోను మరియు సర్వమునకు అతీతముగా కూడా వున్నందున మీరు నన్నే ప్రేమిస్తున్నట్లు అవుతుంది.

మీరంతా ఒక విషయాన్ని తెలుసుకోవాలని నేను కోరుతున్నాను. మీరు ఏం చేసినా, అది మంచికాని, చెడుకాని, భగవంతుడు క్షమించని విషయం ఒకటున్నది. నిజానికి మీరు కాని దానిని అయినట్లు నటించుటను ఆయన క్షమించడు.

నా దివ్యాధికారంతో, మనమంతా ఒకటేనని నేను మళ్ళీ చెపుతున్నాను. భాగ్యవంతులు లేదా పేదవారు, విద్యావంతులు లేదా నిరక్షరాస్యులు, అగ్రకులస్థులు, లేదా తక్కువ కులస్థులుగా వుంటూ, అత్యున్నత ప్రియతముడైన భగవంతుని యందున్న మీ ప్రేమతో జోక్యం కల్పించుకోవలసిన అవసరం లేదు.

ఏదో ఒక రూపంలో, ఏదో ఒక విధంగా భగవంతుని ప్రేమిస్తే మీరు శాశ్వత విముక్తిని పొందగలరని మీరు అవగాహన చేసుకొనుటకు నా ఆశీస్సులందిస్తున్నాను.

బాబా కేవలం బాబాజాన్, మహరాజ్‌ల గురించి మాత్రమే ముందు తెలిపిన సందేశంలో ప్రస్తావించినప్పటికీ, బాబా పంచసద్గురువులందరినీ దర్శించారు. ఉపాసినీ మహరాజ్ యొక్క సద్గురువు సాయిబాబా యదార్థంగా ఆధ్యాత్మిక గురు పీఠానికి అధిపతి ఖుతుబ్-ఇ-ఇర్షద్. బాబా సందేశం స్పష్టంగా వున్నా, ఆయన సంబంధం మాత్రము ప్రాథమికంగా బాబాజాన్ మరియు మహరాజ్ తోటే వున్నది. మేర్వాన్‌గా మెహెర్‌బాబా యీ ఇరువురిని 1913-1921 సంవత్సరాల మధ్య అనేక పర్యాయాలు సందర్శించారు. వారితో ఆయనకున్న సంబంధం మరియు ఆ ఇరువురు పోషించిన విభిన్న పాత్రల గురించి, ఒక అవగాహన కలిగేందుకు బాబా ఒకప్పుడు తన తొలి శిష్యులకు ఈ సాదృశ్యాన్నందించారు. "బాబాజాన్ నాకు ఒక రూపాయి ఇచ్చింది. ఆ రూపాయి విలువను నేను తెలుసుకోగలిగేట్లు మహరాజ్ చేశారు" అని చెప్పారు.

బాబాజాన్, మహరాజ్‌లిరువురూ మేర్వాన్‌తో తమకు ఉన్న సంబంధంలో ఉపయోగించే పద్ధతులు అంతర్గతంగా వారు చేస్తున్న యదార్థత యొక్క అర్థము మరియు సంయోగము పచ్చి అబద్ధంగా పైకి కనిపిస్తాయి. వారి కార్యక్రమాలు బయటికి అవివేకముగా కనిపించవచ్చు. యదార్థానికి వారు మేర్వాన్ తెర తొలగించి పురాణ పురుషుడిగా ఆయన స్థాయికి చేర్చి మరల ఆయన్ని ఆ భగవదైక్యపు మహిమాన్విత అనుభవం నుంచి, సృష్టి యొక్క సంపూర్ణ ఎరుకకు తీసుకువచ్చేందుకు వారు అసాధారణమైన కార్య భారాన్ని నిర్వహించారు. నా దృష్టిలో బాబాజాన్ పెట్టుకున్న ముద్దు, నిజానికి మేర్వాన్ తన దివ్య సనాతన స్థితిలో మునిగి పోవుటకు ఒక కుదుపులా పనిచేసింది. కొనతేలిన

ఒక చిన్న గులకరాయి మహరాజ్‌చే విసరబడి మేర్వాన్ నుదుటిపై తగిలిన చోట రక్తం కారుట, ఒక దివ్య చుంబనం వంటిది. ఈ చుంబనము, అవతారుడిగా ఆయన తన శాశ్వత పాత్రను పోషించుటకు, సృష్టి యొక్క పూర్తి ఎరుకకు దిగి వచ్చేట్లు ఉద్రేకపరచింది. బాబాజాన్ స్త్రీ రూపాన్ని ధరించి వున్నా, తరచూ ఆమెచుట్టూ పురుష భిక్షకులు, దుష్టులు మరియు సాధారణ ప్రజలు ఎందరో గుమిగూడి వుండేవారు. బాబాజాన్ ఎప్పుడూ తనను ఒక పురుషుడిగానే నొక్కి చెప్పేది. ఎవరైనా ఆమెను అమ్మా అని పిలిస్తే వాళ్ల మీద విరుచుకుపడేది కాగా మహరాజ్ తాను పురుష రూపంలో వున్నా, పరిశుద్ధ హృదయం, భక్తి కల కన్యల బృందంతో అత్యంత సన్నిహితంగా దగ్గర వుండి పనిచేశారు. కొన్ని సమయాల్లో ఆడమనిషిలా చీరకట్టుకొని చేతులకు గాజులు తొడుక్కొనేవారు. ఒక సద్గురువు బాహ్యంగా ఏ రీతిలో అగుపించినా, ఆయన కాని, ఆమెకాని అంతరంగంలో ఎప్పుడూ లింగభేదానికి అతీతులు.

మార్చి 20న సకోరి దర్శనానికి తన వెంట వచ్చేందుకు బాబా నన్ను అనుమతించినందుకు నేనేంతో అదృష్టవంతుడినని భావిస్తున్నాను. మహరాజ్ తన జీవితంలో అధిక కాలం గడిపిన ఆ ప్రదేశాన్ని ప్రత్యక్షంగా చూడటం, తన స్వంత గురువు గురించి బాబా చెప్పిన ప్రేమ మాటలను వినటం వల్ల, నా మనస్సులో గాఢంగా నాటుకుపోయి ఒక తీపి గుర్తుగా హృదయానికి హత్తుకున్నాయి. తన శిష్యులకు అంతిమ ముక్తిని ఇచ్చేందుకు మహరాజ్ ఎన్నో బాధల్ని ఆపాదించుకొని, సమాజం నుంచి అవహేళనను సైతం స్వయంగా అనుభవించాడు. ఆయన యొక్క షరతులు లేని ప్రేమ యొక్క యీ ఉన్నతము, నిర్మలమైన స్వభావాలున్న ఆ మహనీయ సద్గురువుకు నా హృదయ పూర్వక ప్రణామములర్పించుకుంటున్నాను. ఆయనను గురించి అప్పటివరకూ నాలో ఏవైనా అపార్థాలుంటే అవన్నీ నేనాయన ఆశ్రమాన్ని సందర్శించుటతో తుడుచుకుపోయాయి.

సకోరి-అహ్మదునగరుల మధ్య కొద్దిసేపు ఆగిన తరువాత, మా కార్లన్నీ

అహ్మదునగరు వైపు దారి తీసి మార్చి 20న సాయంత్రానికి చేరుకున్నాం. అక్కడ నుంచి బాబా తిన్నగా పూనా వెళ్ళిపోయారు. జస్సావాలాగారి, బింద్రా హౌస్‌లో ఒక్కరోజు వున్నారు. ఆ మర్నాడు మార్చి 21 పార్శీ నూతన సంవత్సరమయింది. దాన్ని జంషెడ్-ఇ-నవరోజ్ అంటారు. జస్సావాలాలకు, వారింటికి బాబా వచ్చారంటేనే ఆనందం. అందులోను ప్రత్యేకంగా పండుగరోజున వచ్చినందున, రెట్టింపు అదృష్టం కలిగింది. బాబా కూడా మంచి ఉల్లాసంలో వున్నారు. అక్కడ ఏర్పాటు చేసిన ఖవ్వాలి కార్యక్రమంలో బాబా కొద్దిసేపు పాటలు విన్నారు. మర్నాడు, తన సన్నిహిత మండలితో బాబా తన తాత్కాలిక ముఖ్య కేంద్ర స్థానమైన మహాబలేశ్వర్‌కు వెళ్లిపోయారు.

స్కూలులో నా విధి నిర్వహణకు, నేను సకాలంలో కురుద్వాడి చేరుకున్నాను. అయితే ఎంతో వ్యత్యాసాన్ని అనుభవించాను. హృదయమేమో ఇంకా బాబాతో తిరుగుతున్నట్లే భావిస్తోంది. హృదయానికి మనస్సుకు మధ్య సమతూకం చేయటం సాధ్యంకావటం లేదు. ఆయన సహవాస్ నుంచి తిరిగి వెళ్లాక, బాబా ప్రేమికులకు సహజంగా జరిగే విషయమే. బాబా యొక్క దివ్యాకర్షణ వ్యక్తిత్వం మరియు ఆయన నడకలో రాజసం ఇంకా, నా మనోనేత్రం ముందు కదలాడుతున్నాయి. భౌతికంగా బాబా ముందు అనుభవించిన ప్రేమ, ఎంత తీవ్రమైన దంటే, కొన్ని రోజుల వరకూ, ఆయన సకోరి దర్శన జ్ఞాపకాలు నాలో తారాడుతూనే వున్నాయి.

అవతారుని చేరే మార్గంలో ప్రవేశించే అర్హత పొందే అదృష్టం కలిగితే, అట్టివారు దీనిని అమూల్యమైన మంచి అదృష్టపు చరుపుగా గుర్తించాలి. ముందుగాని, తరువాత గాని,యీ మార్గంలో ప్రయాణం చేసేవారికి అంతర్గతంగా దైవ సంబంధమైన మైకం పుడుతుంది. ఈ మత్తులో నుంచి ఒక తరహా పిచ్చితనం వచ్చి, అవతారుని జ్ఞాపకం యింకా యింకా పెరిగి పెరిగి హృదయమంతా నిండిపోతుంది. మళ్లీ తిరిగి వెనుకకు వెళ్లే ప్రసక్తి వుండదు. ఈ అదృష్ట మార్గంలో ఒకసారి కనుక ప్రవేశించటమంటూ జరిగితే బయటపడే మార్గమేదీ వుండదు. బాబా వల్ల మేల్కొలపబడిన ప్రేమ ఎన్నటికీ మరణించదు.

# బాబా మహాబలేశ్వర్ నుండి సితారాకు బయలుదేరుట

## 1954 - 14వ భాగం

### నేను ఒక ఋషివంటి వైజనాథ్‌ను కలుసుకొనుట

1954 ఏప్రియల్‌లో ఆయన సకోరి దర్శనం నుంచి తిరిగి వచ్చిన కొద్ది రోజులకు, ఆహ్లాదకరమైన ఈ కొండ చౌకీ నుంచి తన మండలి వారిని కొంతమందిని వెంటబెట్టుకొని దక్షిణ కర్ణాటక రాష్ట్రంలోని ధార్వార్‌కు మహారాష్ట్రలోని కొల్హాపూర్‌కు బయలుదేరారు. ఈ సుడిగాలి పర్యటనలో, బాబా పదకొండు మంది మస్తులను కలుసుకున్నారు కాని వారి పేర్లు ఎక్కడా రికార్డు చేయబడలేదు. బాబా తన పర్యటనను పూర్తి చేసుకొని, తిరిగి వచ్చినప్పుడు ఆయన ముఖం బాగా అలిసిపోయినట్లు కనిపించిందని ఆది.కె. ఇరాని చెప్పారు. అయినా ఆయన ముఖంపై, మస్తు కార్యక్రమం బ్రహ్మాండంగా జరిగిందన్న సంతృప్తి ప్రతిఫలించిందట. ఆ సంవత్సరంలో ఇది తొలి మస్తు పర్యటన.

ఇటువంటి పర్యటనలు, ఒక దశాబ్దానికి ముందు సర్వసాధారణము. అప్పట్లో బాబా ఎండనక, వాననక వణికించే చలిలో సైతం, మస్తులను అన్వేషిస్తూ తీవ్రంగా పర్యటించేవారు. కిటకిటలాడే రైళ్లల్లో, బస్సుల్లో, ఎడ్లబళ్లమీద, కార్లల్లో, దూర ప్రాంతాల్లో సైతం పర్యటించి ఈ దైవోన్మత్తుల కొరకు రోజుల తరబడి వెతికేవారు. అయితే 1950 ప్రాంతంలో మస్తులతో బాబా నిర్వహించినఘట్టం ఎక్కువగా పూర్తయింది. అప్పటినుంచి మస్తు పర్యటనలు తగ్గిపోయాయి. అయినా, బాబా వెంట వెళ్లేవారికి మాత్రం, యా పర్యటనలు మరుపురానివి.

మస్తుల దివ్యోన్మత్తత, చాలా శక్తివంతమైనది. వారు సాంఘిక జీవన స్థితిగతులకు ఉదాసీనంగా వుంటారు. పాచిపోయిన చద్ది అన్నం తిన్నా, మురికినీరు త్రాగినా వారి ఆరోగ్యం ఏ మాత్రం చెడిపోదు. భగవంతుని యందు ప్రేమలో మునిగిపోయి, వీరు తరచుగా, సామాన్యులకు దూరంగా, మురికిగా వున్న అనారోగ్యకర ప్రదేశాల్లో వుంటారు.

బాబా పేరు వినుటకు ముందు, ఇటువంటి అత్యున్నత ఆత్మల గురించి నేనెన్నడు వినియుండలేదు. అయితే 1948లో విలియం డాన్కిన్ వ్రాసిన బాటసారులు పుస్తకం చదివాను. స్వయంగా బాబా అందించిన వివరణల ఆధారంగా యీ పుస్తకంలో అపారమైన సమాచారాన్ని భిన్నరకాల మస్తుల గురించిన కథలను, వారున్న చైతన్యపు అంతర్భూమికల గురించిన వివరాలు తెలియపరచబడినయి. ఇండియాలో నివసిస్తున్న ఇటువంటి దైవోన్మత్తుల గురించి నాలో ఇంకా ఎక్కువగా తెలుసుకోవాలన్న ఆపేక్ష పెరిగి, వారిని కలుసుకోవాలన్న ఆకాంక్ష కలిగింది. ఆ సమయంలో బాబా తన అనుచరులెవరూ మస్తుల్ని కాని సాధువులను కాని కలుసుకొనుటను ఎందుకు నిరుత్సాహపరచారో నాకు అర్థం కాలేదు. అటువంటి పురోగమించిన ఆత్మల సమక్షంలో వుంటే వారి ఆధ్యాత్మికాభివృద్ధిని ఎలా అడ్డుకున్నట్లవుతుంది ?

తన శక్తి హృదయపూర్వకంగా ఒకే మార్గంలో ప్రవహిస్తేనే తప్ప, సత్యమును సాక్షాత్కరించుకోవాలన్న తపనకు అవసరమైన లోతును, గాంభీర్యతను పొందలేరని, ఆ తర్వాత నాలో క్రమంగా ఉదయించసాగింది. "సర్వము త్యజించి నన్ను అనుసరింపుము" అని జీసస్ చెప్పాడు. అదే భావంతో శ్రీకృష్ణుడు, భగవద్గీతలో తన అనుచరులను "అన్ని ఇతర మార్గాలను త్యజించి నాకు పూర్తిగా సర్వార్పణకండు. నేను మిమ్ములను మాయ బంధాల నుండి విముక్తుల్ని చేసెదను" అని ఆదేశించాడు.

ఇదే విధమైన ప్రకటనను నేను యుగావతారుడు మెహెర్‌బాబా నుండి ఏదో ఒకరోజున వినే అదృష్టం నాకు కలుగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. అయితే సరిగ్గా అలాగే జరిగింది. స్పష్టమైన మాటల్లో, బాబా తాను అవతారుడు అన్న సత్యాన్ని నాకు విశదపరచారు. దానిని ఏ విధంగానూ నాపై బలవంతంగా రుద్దలేదు. దీనిని గురించి మీకు మరింత వివరించబోయేముందు నేను మహాబలేశ్వర్‌లో మెహెర్‌బాబాను కలుసుకోబోయేముందు అత్యంత సహజంగా జరిగిన కొన్ని సంఘటనల గురించి మీకు వివరించదలచాను.

మార్చి 20న సకోరి మీటింగు నుంచి తిరిగివచ్చిన తర్వాత, బాబాతో గడిపిన అనుభవం నన్ను మరింతగా ఆయన అంతర్గత మార్గదర్శకత్వంపై ఆధారపడేట్లు చేసింది. ఇలా బలపడిన నా అంతర్గత బంధం, బాబా ఆదేశాల ప్రకారం "ఉనికి పదార్థము జీవితము నీడ" అనే బాబా సందేశాన్ని మరాఠీలో

అనువదించే పని పూర్తి చేసేందుకు సహాయపడింది. ఇది అంత సులువైన పని కాదు. 1954 ఏప్రియల్ ఆఖరివారంలో మొదలుపెట్టిన మా పాఠశాల ఆరువారాల వేసవి శలవులకై మూసివేయబడింది. ఏవైనా యాత్రలు చేయాలని కాని, చుట్టాలు, స్నేహితుల ఇళ్లకు వెళ్లిరావాలని కాని నాకు అనిపించలేదు. బాబా సాంగత్యంలో అనుభవించిన అరుదైన రుచి, నా జీవితంలో అన్ని ఇష్టాల్ని తుడిచి పారేసింది. ఈ సమయంలో బాబాను చూడటం లేదా ఆయనకు ఉత్తరాలు వ్రాయటానికి వీలు లేనందున అహ్మదునగరులో ఆదీ వుంటున్న బాబా ఆఫీసులో నా శలవుల్ని గడపాలని అనుకున్నాను.

నేను నా కోర్కెను ఆదీకి తెలియపరచగా ఆయన సమ్మతించి రమ్మనమంటూ ఆహ్వానించగా నేను మే 3న ఆయనతో ఖుస్రూ క్వార్టర్సులో వుండేందుకు కురుద్వాడి నుండి బయలుదేరాను (అవతార్ మెహెర్‌బాబా ట్రష్టు ఆఫీసు ప్రస్తుతం ఇక్కడే వున్నది). ఆ మర్నాడు ఆదీ "సంగమనేరు అనే పట్టణంలో ఒక బాబా సెంటరు ప్రారంభోత్సవం జరుగుతోంది. వెళ్లివస్తావా!" అని నన్ను అడిగాడు. బాబాకు అత్యంత సన్నిహిత సహచరుడైన వామన్ సబ్నిస్ అక్కడ ప్రజలందరికి ప్రతి గురువారం కార్యక్రమాలు ఏర్పాటు చేసి, బాబా జీవితాన్ని ఆయన కార్యక్రమాల్ని తెలియచేస్తూ పాలుపంచుకోవాలని అభిళాషించాడు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమంలో పాల్గొనుటకు నేను సంతోషంగా అంగీకరించాను. ఒకరోజు గడిచాక అహ్మదునగరుకు 60 మైళ్లదూరంలో వున్న సంగమనేరు పట్టణానికినేను బయలుదేరాను. అక్కడ హాజరైనవారు కొద్దిమందే అయినా, వారంతాఆధ్యాత్మికంగా ఉత్సాహమున్న వ్యక్తులు. నా ప్రసంగం విన్న తరువాత, వామన్ స్నేహితుడు గాడే అనే ఆయన తన గురువైన వైజనాధ్ మహరాజ్ దగ్గరకు పోదాం రమ్మన్నాడు.

మస్తులు, మునులు, గురువులు ఎవరిని దర్శించవద్దన్న బాబా ఆదేశాలు గుర్తుకు వచ్చి, నేను స్పష్టంగా, మర్యాదగా రానని చెప్పాను. గాడే వదలిపెట్టకుండా రమ్మనమనిబలవంత పెట్టినప్పుడు మర్నాడు మధ్యాహ్నం బస్సులో నేను అహ్మదునగరు వెళ్లిపోవాలి కనుక రాలేనని, మన్నించమని చెప్పాను. అయితే నన్ను ఆశ్చర్యపరుస్తూ మర్నాడు ప్రొద్దుటే తన కారులోగాడేవచ్చి "నా గురువు వైజనాధ మహరాజ్‌ను దర్శించివద్దాం రా! నీ బస్సు తప్పిపోదులే!"అన్నాడు. ఏదో ఒక సాకు చూపి తప్పించుకొనే వ్యవధి కూడా లేకపోవుటతో నేను వెళ్లేందుకు

అంగీకరించాను. గాడే ఆ పట్టణానికి కొద్దిమైళ్ల దూరంలో వున్న ఒక చిన్న దేవాలయానికి తీసుకువెళ్లాడు. అందులోనే ఆయన గురువు ఉన్నాడు. వైజనాథ్ మహరాజ్‌కు ప్రణామములర్పించాను. ఆయన చాలా సరళంగా, నిరహంకారిగా కనిపించారు. ఆయన నాతో ఏమీ చెప్పలేదు. నిజానికి, నాకు గుర్తున్నంతవరకు ఆనాడాయన మౌనం పాటించినట్లు జ్ఞాపకం. ఆయన అనుచరులు నన్ను ఆ ప్రాంగణం చుట్టూ తిప్పి, వైజనాథ్ మహరాజ్‌ను దత్తాత్రేయ అవతారంగా తామంతా పూజిస్తున్నట్లు చెప్పారు. "మా గురువు చాలాసార్లు సమాధి స్థితిలోకి వెళతారు. అప్పుడాయన కన్నుల వెంట అశ్రుధారలు స్రవించుట మేము తరచూ గమనిస్తాం. ఆ స్థితి నుంచి ఆయన బయటకు వచ్చినప్పుడు అద్భుతమైన ఆధ్యాత్మిక భావాలున్న చరణాలను వ్రాస్తారు. ఆయన వ్రాసిన ఆ శ్లోకాలున్న నోటుపుస్తకాలన్నీ బీరువాలో భద్రపరచబడి వున్నాయి" అని చెప్పాడు ఒక శిష్యుడు. మీకు ఇష్టమైతే వాటిని చదివి చూడవచ్చు అని అడిగాడు. వారంతా ఎంతో ప్రేమపూరిత అనుచరులుగా కనపడినప్పటికీ "ఈ రోజు కాదు" అని బదులిచ్చాను.

ఈ దర్శనం చేసినంతసేపూ ఈ స్థలాన్ని నాకు నేనుగా వచ్చి చూడకపోయినా, అది యిలా సంభవించిందికనుక వీలైనంత త్వరలో అక్కడ నుంచి బయటపడితే మంచిదన్న ఆలోచన నా మనస్సులో పొంచి వుంది. అసలు యీ వైజనాథ్ నిజమైనవాడా, మోసకారా అని తెలుసుకోవలసిన అవసరం నాకు లేదు. ఒక సందర్భంలో బాబా ఒక సందిగ్ధావస్థలో చిక్కుకున్న వ్యక్తితో "ఎగిరేందుకు నీవు ఒకసారి నీరెక్కలను విప్పగానే హంసలా నీవు తిన్నగా ఎగిరిపోవాలి. పిచ్చుకలా చెట్టు చెట్టుకూ ఆగుతూ ఎగురవద్దు. అలా అయితే మార్గమధ్యంలో చాలా విషయాలు నిన్ను తబ్బిబ్బు చేసి కలవరపెడతాయి" అని చెప్పారు. బాబాతో సంబంధం పెట్టుకున్న తర్వాత, నా మార్గం చాలా సరళమై చక్కగా తిన్ననిదైంది. నాకు నేను సంపూర్తిగా హృదయపూర్వకంగా ఆయనకు అర్పించుకున్నాను. అందువల్ల నా యెడల చూపిన మర్యాదకు నా అతిథులకు ధన్యవాదములు చెప్పి, అహ్మదునగరు వెళ్లే బస్సును పట్టుకొనేందుకు సంగమనేరు తిరిగివచ్చాను. ఆరోజు మే 8, సాయంత్రానికి నగరు చేరుకున్నాను. అనుకోకుండా సంగమనేరు వెళ్లివచ్చిన యీ ఘట్టం, బాబాతో మరుపురాని ముఖ్య ఘట్టంగా మిగిలిపోతుందన్న ఆలోచన నాకు రాలేదు.

## యథార్థమైన ఏకైకుడను నేను

నా సందర్శన గురించి, సంగమనేరులో మెహెర్ సెంటరు ప్రారంభంకావటం గురించి, ఆదీకి సవిస్తరంగా చెప్పాను. అక్కడ ప్రజల సుహృద్భావపు ప్రతిస్పందన గురించి విని ఆదీ చాలా సంతోషించాడు. అయితే ఆయన మరో స్వంత వార్తను చెప్పి నన్ను మరింత ఆశ్చర్యంలో ముంచాడు. "నేను నా చావీ కారులో రేపు ఉదయం బాబాను చూచేందుకు ఒంటరిగా మహా బలేశ్వరం వెళుతున్నాను. నీవు కూడా నాతో వస్తావా ?" అని అడిగాడు. గతంలో నేను బాబా దర్శనం చేసుకున్న అనంతరం ఇంత తొందరగా మళ్లీ ఆయన దర్శనం చేసుకొనే మహదవకాశం నాకు ఇంత సులభంగా దొరుకుతుందని నేను కలలో కూడా అనుకోలేదు, అసలు ఎన్నడూ ఆశించనూ లేదు. "ఇటువంటి అత్యద్భుత అవకాశాన్ని వదులుకుంటే నేను తప్పక ఒక మూర్ఖుడినే అవుతాను" అని బదులిచ్చాను. "అయితే వెంటనే తయారవు. మనం ప్రొద్దుటే చీకటితో బయలుదేరాలి" అన్నాడు ఆదీ. నేను వింటున్నది నిజమా, భ్రమా అని సంభ్రమాశ్చర్యాలతో మునిగిపోయాను.

బాబాను సందర్శించే యీ అవకాశం ఎలా వచ్చిందా అని ఆ సమయంలో నా ఊహలకు అందకపోయినా ఇప్పుడు అది యీ విధంగా జరిగివుంటుందని నాకు అనిపిస్తున్నది. తనకు ఉత్తరాలు వ్రాయటం ఆపివేయమని బాబా ఎప్పుడు సర్క్యులరు జారీ చేసినా, ఆదీకి వచ్చే ముఖ్యమైన ఉత్తరాల్లోని ప్రధానాంశాల్ని బాబా ఆదేశాలకై తన కార్యాలయం ద్వారా పంపుతూ ఉండేవాడు. నేను తనతో ఉండటం గురించి ఆదీ అప్పటికే బాబాకు తెలిపాడనుకుంటాను. అందువల్లే బాబా పని మీద నేను అహ్మదునగరు జిల్లాలోని సంగమ్నేరుతో పాటు ఇతర ప్రాంతాల్ని చూచి రావాలని ప్రతిపాదించారనుకుంటాను. ఇదంతా నా ఊహే. ఏమైనప్పటికీ దీన్ని గురించి నేను ఎన్నడూ ఆదీని అడుగలేదు. అనుకున్నట్లే మర్నాడు ప్రొద్దుటే 5 గంటలకు కార్లో నేను ఆదీతో బయలుదేరాను. పశ్చిమ కనుమల్లోని సముద్ర మట్టానికి షుమారు 4,500 అడుగులు ఎత్తున్న మహాబలేశ్వర్‌కు కారులో వెళ్లటం ఎంతో నయనానందకర ప్రయాణం. మా కారు పాము మెలికల్లా ఉన్న రోడ్డుపై వెళుతుంటే వీచే చల్లని గాలుల హాయిని

ఒక ప్రక్క అనుభవిస్తుంటే ఆదీ బాబాతో గడిపిన జీవితం గురించి చెబుతున్న విషయాలు మరో ప్రక్క నా హృదయానికి వెచ్చదనాన్నిస్తున్నాయి.

భోజన వేళకు ముందే మేము ఫ్లొరెన్సు హాలును చేరుకున్నాం. మహాబలేశ్వర్ కొండల్లోని అందమైన యీ ఎస్టేటుకు మళ్లీ వచ్చేసరికి, 16 అక్టోబరు 1950న నేనువచ్చిన తీపి జ్ఞాపకాలు నెమరుకు రాసాగాయి. అప్పట్లో బాబా ఇంకా నవజీవనంలో ఉన్నారు. నాలుగేళ్ల తర్వాత ఇప్పుడు, ఇక్కడే మళ్లీ మండలివారిని అభినందించే అదృష్టం కలగటం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. తన శలవు దినాల్లో అప్పుడప్పుడు బాబాతో ఉండేందుకు అనుమతించబడే డా॥ దేశ్‌ముఖ్ కూడా అక్కడున్నాడు.

ప్రతిరోజూ ఉదయం పూట తనున్న బంగళాను వదలి మండలి వుంటున్న క్వార్టర్లకు వెళ్లి సందర్శించి రావడం బాబాకు నిత్యం అలవాటు. మళ్లీ బాబాను చూచే అదృష్టం కలగటం వల్ల పొందిన ఆనందం గురించి మాటల్లో ఏమని వర్ణించను ! బాబా సమక్షంలో ఉన్న ప్రతిసారి, పొందే అనుభవం మాత్రం రకరకాలుగా ఉంటుంది. ఒక తోటను ఎన్నిసార్లు సందర్శిస్తే అది అన్ని రకరకాలుగా పరిమళిస్తూ కనిపిస్తుంది. అలాగే బాబా సమక్షపు ముగ్ధ మనోహర సౌందర్యము అంతమంటూ లేని అనేక అతి సూక్ష్మ తంత్రములతో నిండి ఉంటుంది.

బాబా మమ్మల్ని అభినందించిన పిదప, తన సీట్లో కూర్చొని, ఆనాటి వ్యవహారాల గురించి చర్చించటం మొదలుపెట్టారు. నేను ఆయనతో గడిపిన తొలి ఉదయపు సమావేశంలో నేను సంగమ్నేరు వెళ్లివచ్చిన విశేషాలు గురించి చెప్పమని బాబా అడిగారు. నేను చెప్పినదంతా బాబా ఎంతో శ్రద్ధగా మంచి ఉత్సాహంతో విన్నారు. చివర్లో "ఇంకా ఏమైనా చెప్పకుండా వదిలావా?" అని సౌంజ్ఞ చేశారు. "అర్థమైనదేదీ లేదు !" అని బదులిచ్చాను. ఆ మర్నాడు ఉత్తరాలు కొన్ని విన్నాక, ఆయన మరోసారి నా వైపు తిరిగి "నీ సంగమ్నేరు సందర్శనలో మరేవైనా విషయాలు జ్ఞాపకము ఉన్నాయా ?" అని సౌంజ్ఞలు చేశారు. "అవును బాబా!" అని బదులిచ్చాను. అంతగా ప్రాముఖ్యత లేని నా యీ సందర్శన గురించి బాబా ఎక్కువ మక్కువను చూపటం నాకు ఆశ్చర్యం

వేసి, ఆయనకు, వామన్ స్నేహితులు కొందరి పేర్లను, అదే సమావేశంలో హాజరవుతున్న గాడే పేరును చెప్పసాగాను. నేను ప్రవరానదిని సందర్శించుట గురించి ఆ నదిలోని నీటి తియ్యదనాన్ని గురించి వర్ణించి చెప్పాను. బాబాను ఆనందపరిచేందుకు నా అతిథి వామను యొక్క ఇంటి గురించి ఆ యింటిలోని ఒకే ఒక పెద్ద హాలు ఒక పడక గదిగా, ఒక వంట ఇల్లుగా అన్నీ అందులోనే ఉండేట్లు నిర్మించిన దాని నిర్మాణ విశేషం గురించి వర్ణించి చెప్పాను. నిజం చెప్పాలంటే, నేను కావాలనే వైజనాథ్‌ను నేను సందర్శించిన వైనాన్ని చెప్పకుండా దాస్తున్నాను. నేను మాట్లాడుతుంటే బాబా ముఖంలో చిరునవ్వు తాండవించింది. అంతేకాని తర్వాత ఏం జరిగిందో చెప్పమని బలవంతం చేయలేదు.

అయితే ఆ మర్నాడు, నా సంగమ్నేరు విహారయాత్ర గురించి బాబా మళ్లీ లేవనెత్తటంతో నాకు ఆశ్చర్యం వేసింది. "ఇంకా నీకేమి జ్ఞాపకం ఉన్నది?" అని సౌంజ్ఞ చేశారు. చెప్పాల్సిన వివరాలన్నీ అయిపోవటం వల్ల, ఇహ సంచిలో పిల్లని బయటపెట్టాల్సిన అవసరం నాపై వత్తిడినితెచ్చింది. "బాబా! నేను అనుకోకుండానే, తన అనుయాయులతో తానొక దత్తాత్రేయ అవతారుడిగా కీర్తించబడుతున్న ఒక మునిపుంగవుడిని సందర్శించాల్సిన వత్తిడి వచ్చింది". అంటూ ఉంటే బాబా ఎంతో ఉత్సాహాన్ని చూపుతూ, తన సర్వజ్ఞత్వపు అమాయకత్వంలో మరింత సమాచారం కొరకు ఎదురుచూస్తున్నట్లు కనిపించారు. 'అది ఎలా సంభవించింది?' అని సౌంజ్ఞ చేశారు.

జరిగిన కథంతా బాబాకు చెప్పాను. కొంతభాగం నన్ను నేను సమర్థించు కుంటూ, మరి కొంతభాగం చేసిన తప్పును ఒప్పుకుంటూ వివరించాను. అలా వివరిస్తూ నేను బాబా ముఖంవైపు చూచాను. అయితే నేను ఆయనలో ఎటువంటి అసంతృప్తిని కానీ, ఖండించటం కానీ గమనించలేదు. జరిగిన ఘట్టమంతా విన్నాక, "మెహెర్‌బాబా అవతారుడు అని వైజనాథ్‌తో చెప్పావా?" అనినన్ను అడిగారు. "లేదు" అని బదులిచ్చాను.

ఆ గదిలో కొందరు మండలివారు కూడా కూర్చొని ఉన్నారు. ఆదీ వైపు చూపుతూ "వైజనాథ్‌తో బాలనాటు, నా అవతార తత్వాన్ని గురించి చెప్పి వుండాల్సిందని నీవు అనుకోవటం లేదా ? నీవు నన్ను అవతారుడిగా తీసుకోవటం

లేదా ? అని అడిగారు. ఆదీ తన సహజ సిద్ధ ఉద్రేక స్వరంలో "బాబా! నీవు అవతారుడవు. మూర్తీభవించిన సర్వోన్నత పరిపూర్ణత్వానివి" అని బదులిచ్చాడు. బాబా నా వైపు క్రీగంట చూచారు. ఆయన భావమేమిటో నాకు అర్థమైంది. నేను మౌనంగా ఉండిపోయాను.

అంత ఆయన దేశ్‌ముఖ్ వైపు తిరిగి "నీవేమి అనుకున్నావు?" అని సౌంజ్ఞ చేశారు. కొద్ది క్షణాలు దేశ్‌ముఖ్ ఊపిరి పీల్చుకొని ఆ ప్రశ్న గురించి ఆలోచించసాగాడు. నాకు అనుకూలంగా అతడేదో చెపుతాడనుకున్నాను. "బాబా, ఒక రకంగా నీవు కేవలం అవతారుడివే కాదు. అవతారుడు అనే పదము వల్ల వ్యక్తమయ్యే ఎటువంటి ఆలోచనలకు నీవు అతీతుడవు. నీవు ఆవలివాడవు' ' అని చెప్పసాగాడు. బాబా నా వైపు మళ్లీ చూచారు. నేను కొంత కలవరపడగా ఒళ్లు ఝల్లుమన్నది. ఆయన కళ్లు దివ్యాధికారపు మెరుపుతో కూడిన శాంతమైన చల్లని చూపుల్తో వెలుగుతూ కనిపించాయి. ఆ సంభాషణను బాబా కొనసాగిస్తూ కాసేపు సౌంజ్ఞల్తో, మరికొంత సేపు అక్షర ఫలకాన్ని ఉపయోగించి వివరించసాగారు. "నీకుగా నీవు వైజనాథ్‌తో మెహెర్‌బాబా అవతారుడు అని చెప్పలేకపోతే "మెహెర్‌బాబా తాను అవతారుడినని చెపుతున్నారు" అని తేలికగా చెప్పి వుండవలసింది".

ఇది నన్ను నిజంగా మౌనంగా ఉండేట్లు చేసింది. మూగబోయిన ముఖంతో బాబావైపు గుడ్లప్పగించి చూడసాగాను. నేను తేరిపార చూడటం గమనించిన బాబా "ప్రస్తుతం, ప్రాక్పశ్చిమ దేశాల్లో షుమారు 70 మంది తామే అవతారులుగా చెప్పుకుంటున్నవారున్నారు. కానీ నేను చెపుతున్నాను. విను. బాల్‌నాటు నేను మాత్రమే నిజమైన ఏకకుడిని" అన్నారు. బాబా చూపులోని శక్తి, దయ ద్వారా ఆయన నాకు అందించిన ఈ ప్రేమాన్విత ప్రకటన బాబా చెపుతున్న సత్యము యొక్క విశ్వాసాన్ని నాలో ప్రగాఢంగా నాటుకునేట్లు చేసింది. ఈ మాటల్ని వింటూ ఆ పురాణ పురుషునికి వినమ్రుడనై చేతులు జోడించి ప్రణామములర్పిస్తూ, మృదువైన స్వరంతో "అవును బాబా" అనకలిగాను.

కొద్దిసేపు గడిచాక, మళ్లీ బాబా ఇలా చెప్పసాగారు. "ఇలా పిలువబడే యోగుల్లో రెండు రకాలున్నారు. కపటులు మరియు అమాయకులు. ఒక

కపటుడికి తానునటిస్తున్నానని తెలియును కాగా అమాయకుడు ఆధ్యాత్మికంగా తాను ఒక ప్రత్యేకత కలిగియున్నానని నిష్కపటంతో భావిస్తాడు". ఆ సమయంలో బాబా యీ విషయంపై మరెటువంటి ప్రస్తావన చేయలేదు. ఆయన మళ్లీ నా వైపు తిరిగి "నీవు వైజనాధ్‌తో జరిపిన సమావేశం గురించి నాకు అంతా చెప్పావు. మరి "నేను అవతారుడను"అని చేసిన ప్రకటనను నీవు విన్నావు. ఇప్పుడు నీవు మరోసారి సంగమనేరు వెళ్లి వైజనాధ్‌ను కలిసి అతనితో "మెహెర్ బాబా ఈ యుగావతారుడు అని చెప్పిరా!" అని ఆదేశించారు. ఈ ఆదేశంతో బాబా అనుకోకుండా నేను సంగమనేరు గతంలో వెళ్లి రావటానికి అణుగుణ్యంగా మరోసారి హఠాత్తుగా యీ ఏర్పాటు చేశారు. ఆశ్చర్యంతో మనస్సంతా నిండిన భక్తి ప్రపత్తులతో వణుకుతున్న గొంతుతో "సరే బాబా!" అన్నాను.

మహాబలేశ్వర్‌లో ఐదురోజులున్నాను. ప్రతిరోజు ఉదయం బాబా రాగానే ఆయన కార్యక్రమంతో సంబంధమున్న అనేక విషయాలు చర్చించబడేవి. ఈ చర్చల ద్వారా సెప్టెంబరు 12వ తేదీన మెహెర్‌బాబా అహమ్మదునగరు జిల్లాలో ప్రజాదర్శనము ఇచ్చేందుకు చివరకు అంగీకరించారని తెలుసుకున్నాను. ఈ దర్శనానికి వేదిక అహ్మదు నగరులోని స్టేషను రోడ్డుపై నున్న వాడియా పార్కుగా నిర్ణయమైంది. సరోష్ ఇరానీ అనే బాబా యొక్క సన్నిహిత శిష్యుడికి, ఈ కార్యక్రమ నిర్వహణా బాధ్యతను వప్పగించారు. ఈజరుగవలసిన కార్యక్రమానికి సన్నాహంగా డా॥ దేశ్‌ముఖ్‌ని అహ్మదునగరు జిల్లాలోని అనేక పట్టణాలు తిరిగి మెహెర్‌బాబా గురించి, ఆయన దైవీ పిలుపు గురించి ఉపన్యాసాలు చెప్పిరమ్మని ఆదేశించారు. డా॥ దేశ్‌ముఖ్ బాబా యొక్క రాబోయే ప్రజాదర్శనం గురించికూడా ప్రజలకు చెప్పాల్సి వుంది. ఈ ప్రసంగాలలో దేశ్‌ముఖ్‌తో అనుసరించుటకు నేను అనుమతించబడ్డాను.

మే 14న రెండు కార్లలో బాబా తన ఏడుగురు మండలి సభ్యులతో పాటు నేను డా॥ దేశ్‌ముఖ్ మరియు ఆదీజీలు ఆదీగారి చావీలో మహాబలేశ్వరు నుంచి బయలుదేరి, పంచగని సమీపంలోని అడవిలో వున్న భిలార్ అనే ఊళ్లో ఆగాము. ఆ వూరికి ఎడంగా విడిగా చుట్టూ చెట్ల గుబుర్లతో నిండి వున్న ఒక రాతికట్టడపు భవనాన్ని బాబా తన ప్రత్యేక కార్యక్రమ నిర్వహణకై ఎంపిక చేసుకున్నారు. ఆ

యింట్లో మసక చీకటిగా వుండి తెరచి ఉన్న విశాలమైన గదుల గుండా బాబా తన మండలితో వెళుతూ తన కన్నుల్లో ఒక మెరుపుతో "నేను ఏడు దయ్యాలతో కలిసి ఇక్కడ ఏడు రోజులపాటు ఉండి నా పనిని నిర్వహించదలచాను" అన్నారు. ఆయనతో గడుపుతూ ఆయన దగ్గరే ఉండే మండలికి చెప్పే సందర్భంలో ఇదో రకమైన హాస్య ధోరణి. తమ సామాన్లన్నీ దింపాక, అదీ, డా॥ దేశ్‌ముఖ్ మరియు నేను అహ్మదునగరు తిరిగి వెళ్లిపోయాము.

నగరానికి చేరగానే దర్శన కార్యక్రమం గురించి తాను బాబాతో జరిపిన సంభాషణనంతా సవివరంగా చెప్పాడు. సరోష్ విభిన్న పట్టణాల్లో డా॥ దేశ్‌ముఖ్ చేయవలసిన ప్రసంగాలకు అవసరమైన తేదీలను ఎంతో జాగ్రత్తగా నిర్ణయించాడు. తనకున్న ప్రముఖమైన సాంఘిక స్థాయినిబట్టి, సరోష్ పేరు పడిన పెద్దల నుంచి అనుకూలమైన సహకారాన్ని పొందాడు. అలా మే 17న డా॥ దేశ్‌ముఖ్, అహ్మద్ నగరులో తన తొలి ప్రసంగాన్ని చేశాడు. ఆనాడు యాదృచ్ఛకంగా వైశాఖ పౌర్ణమి కావటం, బుద్ధ దేవుని జన్మదినం కావటం కూడా జరిగింది. డా॥ దేశ్‌ముఖ్ ముందుగా శ్రోతలకు గౌతమబుద్ధుని జీవితము గురించి, మూలతత్వం గురించి పరిచయం చేశాడు. ఎంతో చాకచక్యంతో ప్రగాఢమైన విశ్వాసంతో మెహెర్‌బాబాగురించిరూఢిగా నమ్మేట్లు ఆయన విషయాన్ని మార్చి ఆ గౌతముడే మళ్లీ ఇప్పుడు మనమధ్య సజీవుడై నివశిస్తున్నాడని చెప్పాడు. ఒక అతి పవిత్రమైన పనిని చేపట్టే ఆరంభాన్ని బాబా అతడికి వప్పగించారు. డా॥ దేశ్‌ముఖ్ ప్రసంగించిన తర్వాత నేనూ మాట్లాడాను.

మే నెలాఖరులో సరోష్, నన్ను డా॥ దేశ్‌ముఖ్‌ను ఆదీని వెంటపెట్టుకొని జిల్లాలోని అనేక పట్టణాలకు తీసుకువెళ్లే ఏర్పాట్లు జరిగాయి. ప్రతిరోజూ ఉదయం అహ్మదు నగరు నుంచి బయలుదేరి వెళ్లి రాత్రికి మళ్లీ తిరిగి రావటం జరిగేది. ఈ సంచార యాత్ర గురించి నాకు ముందుగా తెలియనందున, మేము రాహూరి వెళ్లిరాగానే మే 21న మేము మళ్లీ సంగమనేరులో ఉండటం తటస్థించి నేను ఆశ్చర్యపోయాను. నాకు ఆ వూళ్లో అంతకుముందు ఆతిధ్యమిచ్చిన వామన్ సబ్నిస్ మరియు గాడేలు కలిసి బహిరంగ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అది ఆ వూరి హైస్కూలు భవనంలో ఏర్పాటైంది.

వైజనాథ్‌కు, ఆయన సందేశాన్ని నేను ఎప్పుడు అందించాలో నాకు బాబా ఎలాంటి ప్రత్యేక కాలపరిమితిని నిర్దేశించకపోయినప్పటికీ, నా యందు ఆయనకు ఉన్న ప్రేమ పూరిత దయవల్ల ఈ ఆదేశమిచ్చిన పదిరోజులకే ఇంత తొందరగా మళ్లీ ఆ పట్టణానికి నేను వచ్చే అవకాశాన్ని ఆయనే ఏర్పాటు చేశారని నేను భావించాను. నేను బాబాతో వైజనాథ్ గురించి చెప్పేటప్పుడు ఆదీ అక్కడే ఉన్నందున వామన్‌ని, గాడేని వెంటపెట్టుకొని వైజనాథ్ ఉంటున్న చోటుకు మనమంతా కలిసి వెళ్లవచ్చునేమోనని అడిగాను. వెంటనే ఆదీ, సరోష్‌తో గుజారాతీలో పరిస్థితిని వివరించగా, అతడు వెళ్లేందుకు ఆనందంతో అంగీకరించాడు.

గాడే వ్యవసాయ క్షేత్రానికి మేమంతా చేరినప్పుడు, వైజనాథ్ ఒక గదిలో కూర్చొని ఉండటాన్ని నేను గమనించాను. బహుశః అది వరండాలా ఉన్నదనుకుంటాను. ఆయన చుట్టూ అతి ప్రశాంతమైన వాతావరణం అలుముకొని ఉన్నది. నా శారీరక, మానశిక బలహీనతలు బాగా తెలిసిన బాబా తన హాస్యధోరణిలో ఇటువంటి ఖచ్చితమైన స్థితిని ఏర్పాటు చేశారనిపిస్తుంది. నేను వైజనాథ్ ఎదుట నిలబడ్డాను. నాకు అండగా ఒకవైపున బలిష్టుడు, పొడగరి ఐన సరోష్, మరో ప్రక్కన ధృడమైన మనస్సున్న ఆదీ ఉన్నారు. అందువల్ల ఎంతో ధీమాగా, విశ్వాసంతో వైజనాథ్‌తో నా సంభాషణను ప్రారంభించాను. “నేనిక్కడకు కొన్నాళ్ల క్రితం వచ్చాను. అయితే ఈనాడు నేను మీ కొరకు ఒక ప్రత్యేక సందేశంతో వచ్చాను. మెహెర్‌బాబా చెపుతున్నారు. తాను అవతారుడను అని. ఆయన అహ్మదునగరులో సెప్టెంబరు 12న ప్రజాదర్శనం ఇవ్వబోతున్నారు. మంగళకరమైన ఆయన దివ్య దర్శనానికై మిమ్ములను ఆహ్వానించుటకు వచ్చాను” అని చెప్పాను.

నేను చెప్పినదంతా వైజనాథ్ శ్రద్ధగా విని తలను ఆడించాడు. అక్కడ జాగు చేయుటకు మాకు తగు సమయం లేకపోయినప్పటికీ, నా దౌత్యము పూర్తయింది. అందువల్ల మేము తక్షణం సంగమనేరుకు బయలుదేరాము. నాకు గొప్ప ఉపశమనం కలిగింది. అంతా తిన్నగా జరిగిపోయింది. ఆ తర్వాత నాకు తెలిసింది, వామన్ సబ్నిస్ ద్వారా మరాఠీలో అనేక పద్యాలు వ్రాసి వైజనాథ్

బాబాకు పంపినట్లు తెలిసింది. ఈ పద్యాల్ని బాబాకు చదివి వినిపించగా ఆయన చాలా ఆనందించినట్లు కనిపించారు. అలాగే బాబా తన ప్రేమాశీస్సుల్ని వైజనాథ్‌కు అందించమని వామన్‌ని ఆదేశించారు. మునిలాంటి వ్యక్తుల్ని, మస్తులను కలుసుకొనుటలో బాబా విధానాలు కొలవశక్యం కానివి. అందువల్ల అవి వ్యాఖ్యానించుటకు గాని లేదా వివరించుటకు గాని అతీతమైనవి.

బాబా సమావేశాల కొరకు మరికొన్ని పట్టణాలను సందర్శించి, నేను కురుద్వాడి తిరిగివచ్చాను. అక్కడ నా కోసం నా ఉద్యోగం ఎదురుచూస్తోంది. ప్రియతమ బాబాకు నేను ఆయన ఆదేశాల్ని ప్రవాహంలోని నీరు నదివైపు ప్రవహించుటకు ఎంత సహజంగా ప్రవహిస్తుందో అంత సహజంగా పాటించుటకు ఆయనే నాకు సహాయపడ్డారని అనుకున్నాను. బాబా యొక్క సూటియైన క్రీగంటి చూపు నాతో నా హృదయంలో ఉండిపోయింది. నాకేమీ తెలియకుండానే నిద్రావస్థ నుండి నన్ను లేపి అవతారుడిగా ఆయన శాశ్వత ఉనికి యొక్క సత్యాన్ని తెలుసుకోగలిగేటట్లు మేల్కొలుపుగావించారు. అప్పుడప్పుడు నేను ఇంకా బాబా చూపుడు వేలు నావైపు చూపిస్తూ, "నేను యదార్థమైన ఏకైకుడను' ' అని సౌంజ్ఞలు చేస్తున్నట్లు అనుకుంటూ ఉంటాను.



## ఆదీకి వ్యక్తిగత శ్రద్ధాంజలి



మెహెర్‌బాబా సముఖంలో కలిగే ప్రేమ హృదయాంతరాళాల్లోకి చొచ్చుకుపోతుంది. ఆయన దైవత్వపు పరిమళము, ఆయనతో గడిపిన మధుర క్షణంలో పొందే ఆనందము మరియు మహిమా ప్రకాశములు ఎంతో ఉపశమనాన్నిస్తాయి. జూన్ ప్రారంభంలో నేను ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత, మహాబలేశ్వర్‌లో నేను గడిపిన ఆలోచనలు ఆయన యొక్క దేదీప్యమానమైన సముఖం వల్ల ప్రజ్వరింపచేసి, తాను "యదార్థమైన ఏకైకుడను" అన్న ఆయన యొక్క దైవాధికారయుత ప్రకటనతో అధికతరమై తరచుగా నన్ను సంభ్రమాశ్చర్యాల్లో ముంచి ఆనందపరవశుడ్ని చేసేవి.

బాబాతో గడిపిన నా అమూల్య క్షణాలకు తోడు మే నెల నేను ఆదీతో సంచరించే అనేక అద్భుత అవకాశాలు నాకు లభించాయి. బాబా గురించి, ఆయన జీవిత విశేషాల గురించి మేము అహ్మదునగరు జిల్లాలో అనేక ప్రదేశాలు తిరిగి ప్రసంగించటం జరిగింది. ఆదీతో గడిపిన యీ సన్నిహిత సంబంధం ఆయనకు దగ్గరగా ఉండి ఆయన జీవిత సరళి గురించి స్వయంగా చూచే అవకాశం నాకు లభించింది. నిజానికి, నేను ఆదీని కలిసిన మొదటి నుండి ఆయనంటే నాకు ఎనలేని వ్యక్తిగత గౌరవం ఉండేది. ఒక దశాబ్దానికి పైగా 1945 నుండి 1956 వరకు నేను ఆదీని తరచుగా కలిసేవాడ్ని. 54 మేలో జరిగిన యీ సందర్శన సుదీర్ఘమైనది. 1957 నుండి బాబా నన్ను నా వేసవి శలవుల్లో తనతో ఉండి పోయేందుకు అనుమతించారు. అందువల్ల యీ తదుపరి సంవత్సరాల్లో గతంలో మాదిరి ఎక్కువ సమయం ఆదీతో గడుపలేకపోయాను. అయినా ఆయన యందు ఇప్పటికీ నాకు ఉన్న చనువు, ఆత్మీయతల వల్ల యీ మరువలేని ప్రేమాస్పదుడైన బాబా శిష్యుడ్ని గురించే నా ఆలోచనలు ఎప్పుడూ పరుగులెడుతూ ఉంటాయి.

బాబాతో గడిపిన నా జీవితంలో జరిగిన ప్రతి తొలి విషయం, ప్రత్యక్షంగా ఆదీతో సంబంధించి జరిగేది. 1943లో బాబా నుండి నేను మొదటిసారిగా అందుకున్న తొలి ఉత్తరం, ఆదీ ద్వారానే అందిన పోష్టు కార్డు. అందులో బాబా తన ప్రేమను అందచేశారు. నేను మొట్టమొదటిసారిగా బాబాకు పూలదండ వేసి ప్రేమపూర్వకమైన తొలి ఆలింగన భాగ్యాన్ని పొందినప్పుడు అక్కడ ఉన్న ఏకైక వ్యక్తి ఆదీయే. 1946లో బాబా ఇంటిని కట్టడానికి ముందు నేను మెహెరాజాద్ మొదటిసారిగా వెళ్లినప్పుడు,నన్ను ఆదీ తన కారులోనే తీసుకువెళ్లాడు. మరి ఆదీయే తన లేఖలో ఇప్పుడు బాబాతో నా సంబంధం స్పష్టంగా పాదుకున్నదని, నా కుటుంబ పరిస్థితులు, ఉద్యోగ విషయాలు ఎప్పుడు అనుకూలిస్తే అప్పుడు నేరుగా బాబా దగ్గరకు వచ్చి ఆయనతో ఉండిపోయేందుకు అనుమతించినట్లు వ్రాశాడు.

ఆదీని కలిసే అవకాశం నాకు ఎప్పుడు దొరికినా ఆయన బాబాతో గడిపిన జీవిత విశేషాల్ని గురించి అడిగి తెలుసుకొనుటకే ఎక్కువగా సంభాషించేవాడ్ని. ఈ సంభాషణల వల్ల నేను ఆయనకు ఆధ్యాత్మికంగా ఎంతో ఋణపడి ఉన్నాను.

నిత్య జీవితంలో అవన్నీ వ్యక్తమయ్యేవే ఐనందున, అవన్నీ నాకు బాబా యొక్క దైవత్వం గురించిన ఒక కొత్త అవగాహనను కలిగించాయి. నేను అక్కడ గడిపిన సమయాల్లో చాలాసార్లు, భారతీయులు పాశ్చాత్యులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల్ని చదివేవాడ్ని. దీనివల్ల అనేక సందర్భాల్లో మరుగునపడిన బాబా సర్వజ్ఞ త్వాన్ని క్రమంగా అవగాహన చేసుకొనే అవకాశముఅస్పష్టంగా కల్పించబడింది.

బాబా తొలి శిష్యుల్లో ఒకడుగా ఆదీ 1920లో ఆయనతో చేరాడు. ఫ్రామ్‌రోజ్ దాదా చాంజీ 1944లో కాశ్మీర్, శ్రీ నగరులో మరణించిన తరువాత, ఆదీ తన జీవితాంతం బాబా కార్యదర్శిగా ఉండిపోయాడు. అహ్మదునగరులోని ఆదీ ఇల్లు - ఖుస్రూ క్వార్టర్సు - క్రమంగా మెహెర్‌బాబా కార్యాలయంగా తయారైంది. బాబా నుండి జరిగే అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు ఆదీ ద్వారానే జరిగేవి. ఈ విధంగా ఆదీ బాబా ప్రేమికులకు బాబా జీవితం గురించి తరచు ఉత్తరాలు వ్రాయటం ద్వారా సర్క్యులరులు పంపుట ద్వారా, పుస్తక ప్రచురణ ద్వారా ఆయన గురించి తెలుపుటలో ప్రముఖ పాత్ర వహించాడు. ఆయనకు గాని లేదా ఏకాంతంలో ఉన్న ప్రియతమ బాబాకు గాని వ్రాసే ఉత్తరాలకు తన విశ్వసనీయమైన, అతిసరసమైన, జ్ఞానవంతమైన సమాధానాలు ద్వారా, అనేకమంది బాబాకు సన్నిహితులగుటకు ఆదీ ఒక కొక్కెంగా ఉపయోగపడ్డాడు.

ఆదీ అభిజాత్యరుచులుకలవాడు. అతని వైఖరి దొర తనమును తలపించును. అతనికి మంచి భోజనమంటే ఇష్టము. సిగరెట్లు కాల్చటం సరదా (వీటిని రోజుకు అయిదు మాత్రమే త్రాగేట్లు బాబా పరిమితం చేశారు) కార్లను వేగంగా నడపటం మహాసరదా. అతడు దయార్ద్ర హృదయుడు, ప్రేమాన్వితుడు కూడా. ఆదీ మధుర గాయకుడు. బాబా ముందు స్వయంగా హార్మోనియం వాయిస్తూ గజల్సు పాడివినిపించేవాడు. నవజీవన సమయంలో, హృదయాల్ని కదిలించే అతిశక్తివంతమైన "నవజీవనపుపాట" ఆదీ పాడుతుంటే, తక్కిన మిత్రులు పల్లవిని అందుకొని అతనితో శృతి కలిపే వారు.

ఆదీ నిరాడంబరంగా ఉండే ఔదార్యవంతుడు. బలమైన ఇష్టా అయిష్టాలున్న వ్యక్తి. వీటిలో అనేకం అతడిని బాబాకు చేరువయ్యేట్లు చేయుట

వల్ల అతని హృదయాన్ని శక్తివంతం చేయుటయే కాక, బలమైన ఆలోచనా శక్తిని కూడా చేకూర్చాయి. ఆదీ విషయంలో ఇది ముమ్మాటికి నిజం. పరిస్థితులు ప్రేరేపించినప్పుడు, బాబా సేవలో అతను నిజమైన వీర కిశోరంగా మారుతాడు. 1950ల్లో బాబా పాశ్చాత్య పర్యటనలో ఉన్నప్పుడు, ఒక పాశ్చాత్యుడు "నీవు ఇన్నేళ్లుగా మెహెర్ బాబా దగ్గర ఉండి ఏమి నేర్చుకున్నావు ?" అని ఆదీని అడిగాడు. ఆదీ తన సిగరెట్టుపై ఒక దమ్ములాగి, అది తనకు ఎంతో ప్రకృతి సహజమన్న దృఢ విశ్వాసంతో ఇలా బదులిచ్చాడు. "అయ్యా, నేను రెండు విషయాలు నేర్చుకున్నాను. ఒకటి భగవంతుడు ఉన్నాడు. రెండు మెహెర్ బాబా దేవుడు". ఆ పెద్దమనిషి మరో ప్రశ్న వేయటానికి ధైర్యం చేయలేకపోయాడు.

ఖుస్రూ క్వార్టర్సులో అతడ్ని కలియుటకు నేను వెళ్లిన సంవత్సరాల్లో అప్పుడప్పుడు ఆదీ, బాబాతో తనకున్న అనుభవాల నిధి నుంచి అనేకానేక కథల్ని గుమ్మరించేవాడు. ఇందులో కొన్ని ఉపాఖ్యానాలు ఆనందభరితమైనవి ఐనా మరికొన్ని మాత్రం ఉపద్రవకరమైనవి. అయినప్పటికీ, నేను ఎప్పుడూ, బాబా యెడల ఆదీకి ఉన్న ప్రేమ యొక్క వెచ్చదనాన్ని నిప్పులు దగ్గర కూర్చొన్న వ్యక్తికి కలిగే వేడిమిలా ఎంతో స్పష్టంగా అనుభవించే వాడిని. మేమిద్దరం కలిసి కూర్చొని రాత్రి పొద్దుపోయేవరకు మాట్లాడు కుంటున్నప్పుడు అతని మాటల్లో బాబా అవతారుడు అన్న అచంచల విశ్వాసం ప్రస్ఫుటంగా ప్రకాశించేది. ఆదీకి ఉన్న బాబా దేవుడు అన్న దృఢ నిశ్చయాన్ని అనుమానించాల్సిన పని లేదు. ఆయన ఏకాగ్రత బాబా యందున్న పొంగి పొరిలే ప్రేమ నా హృదయాన్ని పరవశింప చేయటమే కాక, నా మనస్సుని అవి హెచ్చరించాయి కూడా. అయితే నేను నమ్మకము అనే భయంలో పూర్తిగా మునిగి, తెలివి తేటల అవగాహన స్థాయికి పూర్తి అతీతంగా పోయి, ఆయన యొక్క ప్రాధమిక ప్రతిబింబంగా మారాను.

నిజానికి ఆదీ వ్యక్తపరచే వాటిలో ఇష్టమైనది "బాబా యందు నమ్మకం ఉండుట మారువేషంలో దైవ సాక్షాత్కారం పొందుట కంటే గొప్పది" ఆదీ జీవితంలో బాబా యొక్క దైవత్వము ఎంత రూఢియైనదంటే, తమ ఇంటి ప్రక్కన ఉన్న ఒక మంచి వాని గురించి చాలా మంది ఆయన పనులు, గుణములు

గురించి విశేషంగా చెప్పుకున్నంత తేలిగ్గా, స్వేచ్ఛగా, సహజంగా, యాదృచ్ఛకంగా మాట్లాడేవాడు. ఒక్కొక్కప్పుడు, బాబా గురించి మాట్లాడు తున్నప్పుడు ఆదీ కన్నులు చెమ్మగిల్లేవి. మెరిసే కళ్లు కాసేపు మూసి, తర్వాత సంభాషణ కొనసాగించేవాడు. కారని ఆ కన్నీళ్లు అతి ముఖ్యమైన పెదవి విప్పని మౌన బాష్పాలై నాకు అతని మాటల కంటే ఎక్కువ తెలియ చేశాయి. ఖుస్రూ క్వార్టర్సులో రాత్రి పొద్దుపోయేవరకూ, గడిపిన అద్భుత గడియల్ని నేను ఇంకా మరువకుండా గుర్తుంచుకున్నాను.

1969లో బాబా భౌతిక కాయాన్ని పరిత్యజించిన తర్వాత, మెహెరాబాదుకు, మెహెరాజాదుకు పాశ్చాత్యుల యాత్రలు ప్రారంభమై, ఆదీ కార్యాలయం, సాయంకాలం చీకటి పడే వరకు జన సందోహంతో రద్దీగా ఉండేది. అక్కడ అందరికీ టీ కప్పులందించి, బాబాను అసలు చూడని ఎందరో కొత్త వారిలో సైతం ఆదీ ఉత్తేజాన్ని కలిగించే చతురతతో మాట్లాడి అసాధారణ వాతావరణాన్ని కల్పించేవాడు. బాబా జీవితంలోని అనేక కథల్ని చెప్పటమే కాక, ఆదీ శ్రోతల నుండి ప్రశ్నలు కోరేవాడు. ముఖ్యంగా బాబా కొరకే జీవిస్తున్నవారు తమ జీవితాల్లో ఎదుర్కొంటున్న అవరోధాల గురించిన ప్రశ్నలకు బదులిచ్చేవాడు. ఆదీ బాబాతో అంతర్గత జీవితము గడుపుట గురించి గాఢమైన ఆలోచననిచ్చాడు. ఇతరులకు అతడు ఇచ్చే జవాబులు, సుదీర్ఘంగా ప్రతిబింబించిన ఫలితంగా ఫలించిన ఫలం, యివన్నీ ఎంతో ఉత్తేజాన్నిస్తాయి. ఉదాహరణకు, మనస్సును హృదయాన్ని సమతూక పరుచుట గురించి బాబా చెప్పిన విషయం గురించి అడిగినప్పుడు ఒకసారి ఆదీ ఈ ఉపమానాన్ని చెప్పాడు.

"మనస్సు హృదయం కలిసి పనిచేయాలి. 'హృదయం లేకుండా ఉన్న మనస్సు, నీరు లేని నది వంటిది. నిర్జీవమై ఎండిపోయినది. మనస్సు లేని హృదయము కరకట్టలు లేని నదీ ప్రవావహం వంటిది. నీరు ఎక్కడా ప్రవహించకుండా అంతా నీటితో నిండి పొర్లిపోయినది."

మనస్సు హృదయం కలసి మెలిసి పని చేయుట రెండు వైపులా

కరకట్టలతో చూడముచ్చటగా ఆహ్లాదాన్నిస్తూ ప్రవహించే నది వంటిది. ఒకరి వ్యక్తిత్వపు ఈ రెండు స్థితుల్ని సమైక్య పరచవలసిన అవసరం గురించి ఎంత అద్భుత ఉపమానాన్ని వివరించాడు !

ఆదీ అవతారుడికి కేవలం ఒక గొప్ప ప్రేమికుడే కాదు, అతడు ఒక గొప్ప విద్యావేత్త కూడా. అతడు సూఫిజం గురించి, వేదాంతంలో కూడా చాలా ఎక్కువగా చదివాడు. నిత్యం బాబా ధ్యానం చేయటానికి కొంత కాలాన్ని కేటాయించేవాడు. అతని జీవితంలో అధిక భాగము జన్మ సిద్ధమైన దేహదారుడ్యం ఉన్న అదృష్టం కలిగినా, తన వార్ధక్యంలో అతడు శారీరక బాధల్ని అనుభవించాడు. అయినా వీటన్నిటినీ అతడు ఒక గొప్ప అనుగ్రహంగా స్వీకరించి చమత్కారంగా ఇలా వ్యాఖ్యానించాడు, 'బాబాతో హృదయంలో ముసలి వాడవటం అత్యంతాశ్చర్య కరంకాగా శారీరకంగా వృద్ధుడు కావటం, అత్యంత బాధాకరం'.

బాబా కొరకు, ఏకాగ్రత, మరియు అగ్నిమయమైన తన ప్రేమలో, ఆదీ ఆయన సేవకై అవిశ్రాంతంగా తుది శ్వాస విడిచే వరకు పనిచేశాడు. ఆంధ్ర ప్రదేశ్‌లోని గుంటూరు పట్టణంలో బాబా విగ్రహా విష్కరణ సభలో ప్రసంగించుటకు ఆహ్వానించగా వచ్చి, అకస్మాత్తుగా హృదయ స్పందన ఆగి మరణించాడు. అతని మరణ వార్తను భారతదేశంలోను, ప్రపంచ వ్యాప్తంగాను ఉన్న అశేష బాబా ప్రేమికులందరికీ తంతి ద్వారా బాబా సోదరి మణి ఇలా పంపించారు.

అవతార్ మెహెర్ బాబా ప్రియతమ కార్యదర్శి మరియు శిష్యుడైన ఆదీ సీనియరు హృదయ స్పందన ఆగి, 1980 మార్చి 4 ఉదయం ఆంధ్ర ప్రదేశ్‌లోని గుంటూరు నందు, తన ప్రియతమ మెహెర్ ప్రభువు సేవలో నిమగ్నమై మరణించాడు. జై బాబా ! - మణి

ఆదీ నిజంగా బాబా కొరకే జీవించి ఆయన్ని సేవిస్తూ తుది శ్వాస వదిలాడు. నాకు గుర్తున్న ఇటువంటి గొప్ప శిష్యుడు మరియు ప్రియతమ కార్యదర్శికి ఇది నా వినయ పూర్వకమైన వ్యక్తిగత శ్రద్ధాంజలి.

## కోహియార్ బాబా వద్దకు ఏభైఆరుమందిని తెచ్చుట

అసలు వృత్తాంతాన్ని మొదలు పెట్టుటకు వద్దాము. మే నెల 14న, బాబా మహాబలేశ్వర్ నుండి భిలార్ బయలు దేరారు. అక్కడ ఒక వారమంతా గడపాలనుకున్నారు. అయితే 4 రోజులు గడువగానే మే 18న బాబా మళ్లీ మహాబలేశ్వర్ తిరిగి వచ్చారు. మహాబలేశ్వర్‌లోని ఫ్లొరెన్సుహాల్ అద్దె గడువు మరో రెండు వారాల్లో ముగుస్తుంది. కనుక జూన్ మొదటి వారంలో బాబా సతారా వెళ్లాలని అనుకున్నారు. సాధారణంగా బాబా తాను ఎక్కువ కాలం ఉండాలనుకున్న నివాసములో మార్పుల్ని ఎప్పుడు చేసినా, తన ఆంతరంగిక ఆధ్యాత్మిక కార్యక్రమం సమాప్తము కావటం వల్ల తన దర్శన కార్యక్రమానికి అనుమతించటమో, లేదా తానున్న ప్రాంతంలో ఉండే కొందరు పేదలను స్వయంగా కలుసుకొని సహాయ మందించటమో చేసేవారు. అలా కలిసే సమయంలో, ఆయనే స్వయంగా వారి పాదాల్ని కడిగి ఆర్థికంగా లేదా వస్తురూపంలో ప్రసాద మందించటం జరిగేది ఈ సందర్భంగా అటు ముష్టివారుగాని లేదా మధ్య తరగతి వారు కాని ఏబది ఆరు మంది వ్యక్తులు కావాలని బాబా కోరారు. ఇందుకు అనువైన వ్యక్తుల్ని బాబా దగ్గరకు తీసుకువచ్చే పనిని మహాబలేశ్వర్‌లోనే కాపురం ఉంటూ కిరాణా దుకాణాన్ని నడుపుతున్న కోహియార్ సతారావాలా అనే ఒక బాబా అనుచరుడికి వప్పగించారు. ఈ పనికి కోహియార్‌నే బాబా ఎంచుకోవటం బాబా కుటుంబంలోని యీ ప్రియమైన ప్రేమికుని జీవితంలో జరిగిన సుదీర్ఘ నాటకంలో ఒక భాగము. బాబాతో కోహియార్‌కు ఉన్న సంబంధపు లక్షణాన్ని, అతనితో బాబా చేసిన కార్యక్రమ విధానాన్ని గురించి చెప్పేందుకు నేను చాలా సంవత్సరాలు వెనక్కిపోయి, కోహియార్ తన గురువుతో మొదటిసారి కలియుట గురించి చెప్పాల్సి ఉన్నది. నిజానికి, అతని తండ్రి ద్వారా యీ తొలి సమాగమము జరిగింది. కోహియార్ తండ్రి జోరాష్ట్రియన్ భక్తుడు. గంటల తరబడి ప్రార్థనలలో గడిపే అలవాటు ఉన్నవాడు. 1930ల్లో అతడు మెహెర్‌బాబా పేరు విన్నాడు. అతడు బాబా భక్తుడు కాకపోయినా, ఆయన్ని ఒక యోగిగా అమిత గౌరవం చూపేవాడు. అతనుగాని అతని కుటుంబ సభ్యులెవరూ బాబాను వ్యక్తిగతంగా చూడకుండానే మరో పదిహేనేళ్లు గడిచిపోయాయి.

చివరకు ఈ మంచి అదృష్టం, 1947 ఆగష్టులో వారికి లభించింది. సతారాకంటోన్మెంటు ఏరియాలోని ఒక భవనంలో బాబా దర్శనమిస్తున్నప్పుడు వారికీ అదృష్టం ప్రాప్తించింది. ఆ కార్యక్రమ వార్త సతారావాలా కుటుంబానికి అందగానే, వారు అవకాశాన్ని జారవిడుచుకోరాదని నిశ్చయించుకున్నారు. సాయం సమయంలో వారు ఊరుబయట వున్న తోటలోని ఇంటికి చేరేసరికి అక్కడ బాబా కూర్చున్న హాలంతా పెద్ద సంఖ్యలో సమావేశమైన జనంతో నిండిపోయింది.

గాయకులు భజనలు చేస్తూ బాబాను ఆనందపరుస్తుంటే దర్శనార్థులు ఆయనకు సాగిల పడేందుకు బారులు తీరి నిలబడ్డారు. మొదటి సారిగా కోహియార్ బాబాను చూచినప్పటినుండి, ఆయనకు దాసుడై పోయాడు. అతని కళ్లు ప్రకాశవంతమైన బాబా ముఖంపైనే లగ్నమయ్యాయి. చలనము లేకుండా నిలబడిపోయాడు. దూరం నుంచే బాబాను తేరిపార చూస్తూ ఆకర్షితుడయ్యాడు. అతనివంతు రాగానే అతడి ఆకాంక్షను చిరునవ్వుతో తీర్చారు. ఈనవ్వు అతని హృదయంలోనికి చొచ్చుకొనిపోయింది. ఏళ్లు గడిచే కొద్దీ కోహియార్‌లో బాబా అనుబంధంలో ఉన్న మధుర్యాన్ని మరోసారి తనివి తీరా ఆయన సమక్షంలో గడిపి అనుభవించాలన్న ఆకాంక్ష పెరిగింది.

కోహియార్ బాబాకు నమస్కరించిన తరువాత, కోహియార్ తండ్రిని బాబా తన దగ్గరకు పిలిపించారు. అతడు రాగానే, బాబా తన కుడిచేతిని ఎత్తి, తన బొటనవేలిని చూపుడు వేలిని కలుపుతూ "ఒక మంచి వ్యక్తి" అన్న సౌంజ్ఞను సూచించారు. ఒక కమలాన్ని ప్రసాదంగా బాబా అతనికి ఇచ్చారు. అప్పుడు తన అక్షర ఫలకాన్ని ఉపయోగించకుండానే, సౌంజ్ఞలపై ఆధారపడి, బాబా అతనికి సందేశమిచ్చారు. "నేను యదార్ధమైన ఏకైకుడను. నీ ప్రార్ధనలను ఆలకించే ఏకైకుడను నేనే. నేను నిన్ను చూచుటకు చాలా ఆనందిస్తున్నాను. నన్ను జ్ఞాపకం పెట్టుకో". ఈ విధంగా బాబా ఆ వృద్ధుని చిరకాల భక్తికి ప్రతిస్పందించారు. ఈ విధంగా సతారావాలాలు బాబా పరిధిలోకి లాగబడ్డారు. అలాగే కోహియార్ తన వంతుగా మెహెర్‌బాబాలో తన ప్రియతమ గురుదేవుని కనుగొన్నాడు. అయితే మరోసారి బాబా యొక్క భౌతిక సన్నిధానమును అనుభవించే అదృష్టం దొరకుటకు మరికొన్నేళ్లు గడిచాయి.

చివరకు 1954 ఫిబ్రవరి మొదట్లో, బాబా తన స్వగ్రామం మహాబలేశ్వర్‌లోనే ఉన్నారని తెలుసుకొని కోహియార్ ఆనంద పరవశుడయ్యాడు. ఫిబ్రవరి 12న (ఆ



6.

సంవత్సరం జోరాష్ట్రియన్ కాలెండరు ప్రకారం అది బాబా జన్మదినం) బాబా జన్మదినోత్సవాన్ని ఆయన స్త్రీ మండలి ఘనంగా జరుపుతున్నట్లు కూడా అతను విన్నాడు. ఇది ఇతరుల ప్రమేయం లేకుండా చేసే ఒక స్వంత ఉత్సవం. దాని గురించి ఇతరులెవరూ తెలుసుకోవాల్సిన పని లేదు. ఏదో విధంగా కోహియార్ దీని గురించి విన్నాడు. మండలి సభ్యుడైన విష్ణు ఈ సందర్భాన్ని పురస్కరించుకొని మిఠాయిలు తయారు చేసి పంపమని ఒక అతిథి గృహ యజమానికి పురమాయించగా అతని ద్వారా అసలు విషయాన్ని తెలుసుకున్నాడు. బయటవారెవరూ హాజరయ్యేందుకు అనుమతించక పోయినప్పటికీ తప్పకుండా తన హృదయాంతర్గత ప్రేమను వ్యక్త పరచుటకు ఏదో ఒక మార్గం ఉండి తీరుతుందని కోహియారు అనుకున్నాడు. ఈ అవకాశాన్ని పోగొట్టుకోకుండా ఒక అందమైన గులాబీల గుచ్ఛాన్ని బాబాకు పంపించాలని కోహియార్ నిర్ణయించాడు. అయితే బాబా ఏకాంతంలో ఉన్నారని తెలుసుకున్నందున, తన అనుచరులెవరూ ఆయన్ని చూడరాదని ఆదేశించినందువల్ల, కోహియార్ ఆపూల గుత్తిని ఒక తోటమాలికి ఇచ్చి అది పంపిన వారి పేరును వెల్లడి చేయవద్దని ఖచ్చితంగా ఆదేశించి పంపాడు. అయినప్పటికీ, విష్ణు ఆ పూల గుచ్ఛాన్ని తీసుకొని ఆ విషయాన్ని బాబాకు ఎరుక పరచాడు. దీనితో ఆయన అసలు ఆ గుచ్ఛాన్ని పంపినదెవరని ఆరా తీశారు. ఆ తోటమాలి, బజారులో ప్రధాన రహదారిపై దుకాణం నడుపుతున్న స్థానిక పార్శీ వ్యక్తి ఆ పూలను పంపినట్లు వెల్లడించాడు.

ఆనాటి సాయంత్రం, కోహియార్ తన దుకాణానికి వచ్చిన ఇద్దరు బాబా మండలి వారిని చూచాడు. ఎంతో అణకువగా ఎరుచ్ "బాబాకు పుష్పగుచ్ఛాన్ని పంపిన వ్యక్తి నీవేనా ?" అని అడిగాడు. తానేనని కోహియార్ ఒప్పుకోగా, ఎరుచ్ చెప్పసాగాడు "బాబా ఏకాంతంలో ఉన్నందున, అనామకంగా పంపిన నీ బహుమానాన్ని ఆయన మెచ్చుకోలేదు. ఆపూలతో నీపేరున్న కార్డును ఎందుకు ఉంచలేక పోయావు ? నిజానికి నీ మీద ఆయన చీదరించు కున్నారు. కనుక ఆయన అసంతృప్తిని నీకు తెలుపమని మమ్మల్ని పంపారు" అన్నాడు.

క్షమాపణ కోరుటకు కోహియార్ తారట్లాడుతూ, "అవును బాబా భగవంతుడు. అందువల్ల నా పేరు చిరునామా తెలిపే కార్డు వ్రాసి పంపాల్సిన అవసరం లేదు" అని బదులిచ్చాడు.

ఎరుచ్ కల్పించుకొని "ఆహా ! నీవు తెలివిగా ఉండాలని ప్రయత్నిస్తున్నావు. ఏమి, నీవు బాబా సర్వజ్ఞత్వాన్నే పరీక్షించాలను కుంటున్నావా ? నీవు అలాంటి

పనుల్నెప్పుడూ ఆయనతో చేయవద్దు. బాబాతో నీవు చేయు పనులలో నీవు ఎప్పుడూ, ఆచరణాత్మకంగా, నిష్కపటంగా ఉండాలి. ఆయన ఆదేశాలకు నీ విధేయత అతి క్రమించే విధంగా ఉద్రేకపడకు" అని హితబోధ చేశాడు.

కోహియార్ క్షమాపణ కోరగా ఎరుచ్ మెత్తబడి "ఏమైనప్పటికీ, ఇప్పుడు నీకు నీవు బాబాకు అర్పించుకున్నావు. ఆయన ఇంతకు ముందే క్షమించారని నీవు తెలుసుకోవాలని ఆయన కోరుతున్నారు. అయితే ఒక హెచ్చరిక. ఆయన రమ్మనమంటే తప్ప, ఆయన్ని కలిసేందుకు ఎన్నడూ ప్రయత్నించకు అలా అని నీవు ఇప్పుడే మాట ఇవ్వు" అన్నాడు. కోహియార్ హామీ ఇవ్వటంతో వారి సమావేశం అంతమైంది. అయితే కాలం గడిచిన కొద్దీ తన ప్రియతమ గురుదేవునితో సమాగమ ప్రాప్తి కొరకు కోహియార్‌లో తపన ఎక్కువైంది. తాను ఇచ్చిన హామీని నిలుపుకోవటం అసాధ్యమని చివరకు కోహియార్ భావించాడు.

ఆ సంవత్సరం ఏప్రియల్‌లో బాబా ఇంకా మహాబలేశ్వర్‌లోనే ఉన్నారని కోహియార్ తెలుసుకున్నాడు. ఇంకా ఆయన ఏదో ఒక ఫలానా మార్గంలోనే ప్రతిరోజూ ఉదయం మార్నింగు నడకకు వెళతారని కూడా తెలుసుకున్నాడు. ఏప్రియల్ 7న ఉదయం బాబాను కలుసు కోవాలన్న ఆకాంక్ష ఉధృతమై, కోహియార్ ఒక టాక్సీని అద్దెకు తీసుకొని ఆయన నడచి వెళ్ళే చోటుకు చేరాడు. అతని ఉద్దేశ్యంలో దూరాన్నుంచే ఒక క్షణమన్నా తన ప్రియతముని చూడవచ్చని తలచాడు. కొద్దిసేపట్లోనే ఫలించని యీ అన్వేషణలో అతడు అసంతుష్టుడై టాక్సీ డ్రైవరుతో "మెహెర్ బాబా తన వాహ్యాళిని ఈ రోజు ఎందుకు రద్దు చేసుకున్నారో ఆశ్చర్యంగా ఉన్నది" అన్నాడు. ఆ డ్రైవరు అతడ్ని వింతగా చూచి, "అదేమిటి, మీరాయన్ని చూడనేలేదా ? ఇప్పుడే కదా ఆయన్ని దాటి వచ్చాము" అన్నాడు.

కోహియార్ ఆ వెంటనే టాక్సీ నుంచి ఒక్క దూకుదూకి, రంజూతో పాటు కలసి నడుస్తున్న బాబా దగ్గరకు పరుగుపెట్టాడు. బాబా అతనికి ఇచ్చిన ఆదేశాల్ని మరచి అలా పరుగుపెట్టిన కోహియార్ రోడ్డుపైనే బాబా పాదాల ముందు సాష్టాంగ పడ్డాడు. అంతట తనకు తానే గుర్తుకు తెచ్చుకొని ఒక్క క్షణం ఆలశ్యం చేయకుండా ఒక్కమాట కూడా మాట్లాడుటకు చోటీయకుండా మరుక్షణమే తన కారు దగ్గరకు పరుగుపెట్టాడు. తప్పుచేసిన వాడిలా బిడియపడిన ముఖం పెట్టి. రంజూ బాబాతో ఆయనకు నమస్కరించి వెళ్లిన వ్యక్తి ఆనాడు పేరు లేకుండా పూల గుత్తిన పంపిన పార్శీ యువకుడైన

దుకాణాదారేనని చెప్పాడు. అందువల్ల బాబా మళ్లీ ఇరువురు శిష్యుల్ని, సహనము లేని యీ ప్రేమికుడ్ని కలియుటకు పంపారు. అయితే అతని తండ్రి ద్వారా కోహియార్ అదే రోజు ఉదయం వ్యాపార పనిమీద బొంబాయి వెళ్లాడని తెలుసుకున్నారు. అతడు తిరిగి ఇంటికి చేరే వరకు ప్రతిరోజూ ఎవరో ఒకరిని కోహియార్ వచ్చాడో లేదోనని వాకబు చేస్తూనే ఉన్నారు. ఇలా విడువకుండా వాకబు చేయుటను బాబా విధానాలు తెలియని వారికి చోద్యంగా కనిపించ వచ్చేమో కాని, యదార్థానికి ఒకరితో ఆయనకు ఉన్న సాన్నిహిత్యాన్ని వ్యక్త పరచుటలో ఇది ఒక విధానము.

చివరకు ఒక రోజున ఎరుచ్, పెండూలు కలసి వెళ్లి కోహియార్‌ని అతని దుకాణంలో కలిశారు. అతను బాబా ముందు సాష్టాంగ ప్రణామం చేయటం బాబా ఇచ్చిన ఆదేశాలను తిన్నగా ఉల్లంఘించినట్లే కనుక అతడు ఎరుచ్ చేత చివాట్లు గట్టిగానే తిన్నాడు. అయినప్పటికీ బాబా యొక్క దయాపూర్వక మన్నింపుతో ఈ దండన సమాప్తమైంది. కానీ ఇప్పుడు ఎరుచ్ కోహియార్‌కు తనకు చేతనయినంతలో బాబాకు విధేయుడై మునుముందు మాట తప్పుట జరుగకుండా, నిజాయితీగా ఉండాలని సలహా ఇచ్చాడు. మొత్తం మీద, ఎరుచ్, అతనితో "బాబా నీకు తన ప్రేమాశీస్సులందిస్తూ, ఆయన ఎప్పుడు కబురంపితే అప్పుడు తక్షణం తన వద్దకు రమ్మనమని చెప్పమన్నారు" అని వివరించాడు. ఈ విషయం వినగానే కోహియార్ అమితానంద పడ్డాడు. బాబాతో మరోసారి గడపాలన్న తన చిరకాల వాంఛ చివరకు నెరవేరపోతున్నందుకు సంతోషించాడు.

కోహియార్ బాబా పిలుపుకై అవిశ్రాంతంగా ఎదురు తెన్నులు చూస్తూ నెలకుపైగానే గడిపాడు. అప్పుడు మే 17న ఎరుచ్, పెండూలు తన దుకాణానికి వచ్చారు. వెనుకవైపు తాము ఉండే ఇంట్లోకి రమ్మని వారిని ఆహ్వానించాడు. అందుకు వారు రామని చెప్పి "మేమిక్కడకు ఒక ప్రత్యేక పనిమీద వచ్చాము. బాబాకు నీతో ఒకపని పడింది" అన్నారు.

కోహియార్ ఉద్రేకాన్ని ఆపుకోలేక "బాబా కోరికు నేను ఏమైనా చేస్తాను. ఏమిటా పని?" అని అడిగాడు. "బాబా పని నీవు అనుకుంటున్నంత సుసాధ్యమైంది కాదు" అని ఎరుచ్ హెచ్చరిస్తూ "అదేమిటో మేము నీకు చెప్పబోయేముందు, నీవు దానిని నెరవేరుస్తానని మాకు హామీ ఇవ్వాలి." అన్నాడు. కోహియార్ ముఖంలో అనిశ్చితమైన ఆరాటం ప్రస్ఫుటంగా ముద్ర వేసుకున్నది. అతను

బదులిస్తూ "నేను ఏ పని చేయాలని బాబా సంకల్పించారో దాన్ని నెరవేర్చగలననే విశ్వసిస్తున్నాను. కనుక దయచేసి నేను చేయాల్సిన పనేమిటో కొద్దిగా చెపుతారా? ఎటువంటి పనిని నాకు నిర్దేశించారు ?" అని అడిగాడు.

అందుకు ఎరుచ్ గంభీరంగా బదులిస్తూ "బాగా గుర్తుంచుకో, నీ అంగీకారాన్ని తెలుపుటలో ఆతురత చెందకు. బాబా పని అంటే పరిహాసము కాదు ? అది చాక్లెట్లు తినటం లాంటిది కాదు. బాగా ఆలోచించుకొని ధృఢ చిత్తంతో నిజాయితీగా ఉండు. మాకు మాట ఇవ్వబోయేముందు జాగ్రత్త సుమా!" అని హెచ్చరించాడు.

కోహియార్ దిగ్భ్రాంతి చెంది, దీనికి జవాబు చెప్పటం చాలా కష్టమని తెలుసుకున్నాడు. అతను తనలో తానిలా ఆలోచించుకున్నాడు "వీళ్ల ఎలాంటి వ్యక్తులు ? నేను ఆయన్ని కలుసుకోబోయేముందు ఎటువంటి విచిత్రమైన షరతును నేను నెరవేర్చాలని బాబా అడుగుతున్నారు ?"

ఎరుచ్, పెండూ లిరువురు, అతడి నుంచి అనుకూలమైన అంగీకారాన్ని పొందే వరకు, అతని ఇంట్లోకి వెళ్ళుటకు తిరస్కరించి, మరేమి మాట్లాడకుండా ఎదురు చూస్తూ ఉండిపోయారు. వాదించే ధోరణిలో కోహియర్ "నేను ఏ పని చేయాలో చెప్పకుండానే నా పూర్తి అంగీకారాన్ని మీకు ఎలా తెలుపగలను ?" అని ప్రశ్నించాడు. వివేకవంతమైన దృష్టిలో కోహియార్ ఆలోచన పూర్తిగా సరైనదే అయితే బాబా యొక్క దివ్య విధానాలు, చాలాసార్లు మానవ అవగాహనకు అతీతంగా ఉంటాయి.

ఎరుచ్, పెండూలు కూడా నిస్సహాయులయ్యారు. ఎందుకంటే వారు బాబా ఆదేశాల ప్రకారం కచ్చితంగా నడుచుకోవలసిన వారు. కోహియార్ ఇంకా ఒక కచ్చితమైన నిర్ణయానికి రానందున, ఎరుచ్ పెండూవైపు తిరగి "కోహియార్ ఎటూ తేల్చుకోలేదు. తాను బాబాకు పరిపూర్ణంగా విధేయుడు కాగలనో లేదో తెలుసుకోలేక పోతున్నాడు. మనం ఇక్కడ ఉండి కాలాన్ని ఎందుకు వృధా చేసుకోవాలి ? పోదాం పద !" అన్నాడు.

దాంతో కోహియార్‌ను హెచ్చరించినట్లయింది. ఆ వెంటనే అనుతాపంతో పశ్చాత్తాప పడి "బాబా ఆదేశాలను పాటించుటకు నేను అంగీకరిస్తున్నాను, అవి ఎటువంటివైనా సరే దయచేసి లోనికి రండి !" అని పిలిచాడు.

ఎటువంటి షరతులు లేకుండా అంగీకరించినందుకు సంతృప్తి చెందిన ఎరుచ్, పెండూలు కోహియార్ ఆహ్వానాన్ని మన్నించారు. అంతా కలసి

కూర్చున్న తరువాత, ఎరుచ్ బాబా సందేశాల్ని బయట పెట్టాడు. "జూన్ 3వ తేదీన ఫ్లోరెన్సు హాలు దగ్గరకు తనకోసం 56 మంది స్త్రీ పురుషుల్ని బాబా తీసుకు రమ్మన్నారు. వారంతా బిచ్చగాళ్లు కాకూడదు. కుంటి గ్రుడ్డి వారై ఉండ కూడదు. అయితే వారంతా కష్టపడి పనిచేస్తూ తమ కుటుంబ పోషణకు సంపాదించే వారైయుండాలి"

విషయం విన్న కోహియార్ తేలిక పడ్డాడు. మహాబలేశ్వర్‌లో చాలా కాలంగా ఉండటం వల్ల నగర పాలక సంస్థలో ఒకసారి ఎన్నికైనందున, ఆ ప్రాంతంలోని అలాంటి వారు కొందరు అతినికి తెలుసు. "సరే ! నా కదేమంత కష్టం కాదు" అన్నాడు.

కానీ ఎరుచ్ ముందు జాగ్రత్తగా "ఆగు ! నీవు ఈ పని చేయునప్పుడు, నీవు కొన్ని ప్రత్యేక ఆదేశాల్ని పాటించాలి. సరైన వ్యక్తుల్ని నీవు కనుగొన్నప్పుడు, వారితో పాటు నీవు కూడా ఆనాడు జూన్ 3న ఫ్లోరెన్సు హాలుకు రావాల్సి వుంటుంది. ఎవరో వారి పాదాల్ని కడిగి ఆర్థిక సహాయం చేయబోతున్నారని వారికి ముందుగా తెలియాలి. అయితె ఎటువంటి పరిస్థితుల్లో కూడా వారికి బాబా గురించి గాని, వారిని ఎక్కడకు తీసుకు వెళుతున్నావోనని గాని తెలుపకూడదు" అని వివరించాడు.

కోహియార్ వెనక్కి తగ్గాడు. ఆశ్చర్యంగా చూస్తూ "అదెలా ! వారంతా తప్పకుండా తమను ఎక్కడకు తీసుకువెళుతున్నానో, ఎవరిని చూడబోతున్నారో తెలుసుకోవాలను కుంటారు. ఇది అత్యంత సహజము కదా !" అని గట్టిగా వాదించాడు.

పెండూ నిష్కర్షగా బదులిచ్చాడు. "ఈ పని నెరవేర్చుటకు నీవు ఒప్పుకున్నావు. మేము బాబా ఆదేశాల్ని నీకు అందించాము. ఇప్పటి నుంచి ఈ విషయాన్ని ఎలా నిర్వహించాలో, బాబా ఆదేశాల్ని ఎలా నెరవేర్చాలో అదంతా నీ బాధ్యత. క్లుప్తంగా అసలు విషయమేమంటే ఎట్టి పరిస్థితుల్లోను, జూన్ 3వ తేదీ ఉదయం ఖచ్చితంగా 9-00 గంటలకు ఆ 56 మందితో తప్పకుండా ఫ్లోరెన్సు హాల్ దగ్గర ఉండాలి. అవసరమైతే బాబాకు చదివి వినిపించుటకు, ఆ 56 మంది గురించిన సమాచారాన్ని సేకరించి, వ్రాసుకొని నీ దగ్గర సిద్ధంగా ఉంచుకోవాలి" అని చెప్పి ఆ ఇరువురు మండలి సభ్యులు లేచి వెళ్లిపోయారు.

పూర్తిగా దిగ్భ్రాంతి చెందిన కోహియార్ వాళ్లు కనుమరుగయ్యే వరకూ చూస్తూ ఉండిపోయాడు. "బాబా అదేశాలకు మించిన కల్పిత మాయ మరేదీ

ఉండదు. ఇటువంటి అదేశాల్ని బాబా విధించిన షరతులన్నీ పాటించి నెరవేర్చుట ఎలా సంభవము ?" అని ఆలోచించాడు. అయితే అంతా చివరకు సక్రమంగానే జరిగిపోతుందని ధృవ పర్చుకున్నాడు.

ఇంటింటికి తిరిగి, అతడు వ్యక్తుల్ని కలవటంతో అనుకున్నది జరిగిపోతున్నట్లనిపించింది. జూన్ 2వ తేదీకి నమ్మశక్యం కాని రీతిలో నిర్ణయించిన గడువు నాటికి తనతో పాటు తీసుకు వెళ్లేందుకు 54 మంది వ్యక్తుల్ని, తాము ఎక్కడకు తీసుకు వెళ్లబోతున్నారో, ఎవరిని కలుసుకో బోతున్నారో తెలుపకుండానే సమకూర్చుకోగలిగాడు. అయినా జూన్ 3 ఉదయానికి బాబాకు కావలసిన 56 మందిలో ఇంకా ఇద్దరు తగ్గారు. అందువల్ల అతడు నౌకరు కుర్రవాడ్ని తనతో రమ్మని చెప్పి 55కు చేర్చాడు. బాజా బజంత్రీలతో ఊరేగింపుగా వెళ్లే బృందంలా ఈ నానా జాతుల బృందంతో ఇతను ఫ్లొరెన్సు హాలుకు వెళుతుండగా దారిలో మాసిన బట్టలతో నిలబడి ఉన్న ఒక వ్యక్తిని గమనించాడు. ఉన్న సమయం స్వల్పమైనందున కోహియార్, మామూలు విచారణ ఏదీ చేయకుండానే ఎటువంటి ఇబ్బంది లేకుండా అతడ్ని తమ బృందంతో పాటు రమ్మనమని, అతడికి కొంత ముఖ్యమైన సహాయం లభిస్తుందన్న ఎర చూపాడు. ఇలా ఉత్కంఠత తగ్గి, కొంత ఉపశమనం కలిగి మధురాను భూతితో నిర్ణయించిన గడువుకు ముందే బాబా ఉన్న చోటుకు ఆయన అడిగినట్లే 56 మందిని వెంటబెట్టుకొని చేరుకున్నాడు.

ఎరుచ్, పెండూ, బైదుల్‌లు అప్పటికే అక్కడ ఉన్నారు. ఒక చిన్న కొయ్యబల్ల, దాని పక్కన ఒక బక్కెట్టు, చెంబు సిద్ధంగా ఉంచబడ్డయి. బాబా వచ్చి తన సీటులో కూర్చొగానే, వారి వారి పేర్లను పిలువగానే ఒక్కొక్కరే వచ్చి ఆయన ఎదుట నిలబడ్డారు. బైదుల్ వాళ్లందరిని, కదిలి ప్రాదాల్నివెనక్కు లాగి భంగ పరచవద్దని హెచ్చరించిన తరువాత వారు ఆయన ముందున్న బల్లపై నిలబడగానే బాబా వారి పాదాలు కడిగి, ప్రసాదంగా పైకం ఉన్న పొట్లాన్ని అందించారు.

ఈ విధంగా 55వ వాడి వంతు వచ్చేవరకూ అంతా సవ్యంగానే జరిగింది. ఇప్పుడు కోహియార్ పనివాడు వచ్చేసరికి, అంతా తనకు తెలుసన్న చూపుతో "నన్ను సంతుష్టుడ్ని చేయుటలో నిన్ను నీవు సంతోష పెట్టుకొనుటకు కూడా ప్రయత్నించావన్నమాట" అని కోహియార్‌కు సౌంజ్ఞలు చేశారు. ఎందుకంటే, అతడు తన సేవకుడికి కూడా కొంత లబ్ధిని అభిళషించాడు. అయితే ఆఖరి వ్యక్తి బల్ల దగ్గరకు వచ్చేసరికి రోడ్డు ప్రక్కన కనిపించగా వెంట బెట్టుకు వచ్చిన ఆ

వ్యక్తిని చూచేసరికి, బాబా భావాలు మారిపోయాయి. "ఇది మంచి ఎంపిక కాదు. ఇతడు డబ్బు అప్పు ఇచ్చే వ్యక్తి" అని సౌంజ్ఞలు చేశారు. భవిష్యత్తులో తనకు వప్పగించిన పనిని నిర్వహించుట యందు బహు జాగ్రత్తగా ఉండాలని బాబా కోహియార్‌ని హెచ్చరించారు. కార్యక్రమం పూర్తికాగానే అంతా ఫ్లొరెన్సుహాలు నుండి బయటకు వెళ్లిపోయారు.

కోహియార్‌కు బాబా పని చేసే విధానాన్ని దగ్గర ఉండి సన్నిహితంగా గమనించటం యిదే తొలి అవకాశము. రాజసము, వినయముతో కూడిన ఆయన దివ్య సమక్షం వల్ల అతడు మిక్కిలి విచలితుడయ్యాడు. బాబా ముఖ కవళికలు, ఆయన కదలికలలోని రాజసం, గొప్పదనం అతనితో గాఢంగా హత్తుకుపోయాయి. ఈ కార్యక్రమంలో స్వయంగా పాల్గొని జరిగిందంతా చూడటం వల్ల బాబా తన యొక్క ప్రియతమ గురుదేవుడిగా అతడికి చేరువయ్యారు.

ఆ రోజున కోహియార్‌కు బాబాతో వ్యక్తిగత దర్శనం జరగలేదు. అయినా అతడు బాబా యొక్క ప్రేమను, కరుణను మౌనంగా అనుభవించాడు. అవి విడువకుండా అతడిపై వర్షించాయి. వెళ్లబోయే ముందు బాబా అతడితో తానా రోజునే చాలా కాలంపాటు ఉండేందుకు సతారా వెళుతున్నానని చెప్పారు. తను ఎప్పుడు అక్కడకు వచ్చినా అతడు మండలిని మాత్రం కలవ వచ్చని, బాబాను చూడరాదని కోహియారుకు అనుమతినిచ్చారు.

ఆ తరువాత అనుకోకుండా కోహియార్‌కు బాబా చెప్పినట్లు ఆ 56వ వ్యక్తి నిజంగా డబ్బు అప్పిచ్చే వ్యక్తేనని తెలిసింది. బాబా యొక్క ఈసర్వజ్ఞత్వపు మధురానుభూతి అతని నమ్మకాన్ని ధృడపర్చి, బాబా తప్పక తన హృదయాన్ని, మనస్సును కూడా ఎరిగే ఉంటారనుకున్నాడు. తనను సేవించుకొనే అవకాశము ఇవ్వటం ద్వారా కోహియార్‌ని బాబా దివ్యంగా ఆశీర్వదించారు.

అవతారుడు తన ప్రేమికులకు, ఆయన దివ్య కారణము నిమిత్తం పాల్గొనుటకు ఎన్నో అవకాశాల్ని అనుగ్రహిస్తారు. తన హాశ్యము మరియు కరుణలో, మన మాయనకు ఎక్కువగా కావలసి వచ్చామన్న ధోరణి కనిపించేట్లు ఆయనే పరిస్థితుల్ని కల్పిస్తారు. అయినా, యధార్థానికి, ఆయన పనిని ఆయనే చేసుకుంటారు. ఆ పనిలో మనము పాలు పంచుకొనే స్వేచ్ఛ మనకు వచ్చినప్పుడు, అందుకు ఆయనే మనల్ని ఎంపిక చేసుకుంటారు గానీ, ఆయన్ని మనము ఎంచుకోవటం లేదు. అంతా ఆయన కృప వల్లే. అయితే ఆ కృపకు పాత్రులమయ్యేందుకు మనము తితీక్షతో ఎదురు తెన్నులు చూడనక్కర్లేదా ?

# బాబా జూన్ నుంచి ఆగష్టు వరకు సితారాలో విడిది

## 1954 - 15వ భాగము

### నవీన మెహెర్ సాహిత్యం విడుదల

1940లో మస్తులని పిలువబడే దైవోన్మత్తుల్ని కలియుటకు బాబా వేలకోలది మైళ్ళు పయనించారు. ఆసమయములో ఈ పురోగమించిన ఆత్మలతో జరిపే తీవ్ర అంతరంగిక అధ్యాత్మిక కార్యక్రమంలో బాబా అరుదుగా ప్రజాదర్శనలిచ్చారు ఆయన చేసిన ప్రయాణాల్లో, ఆయన శిష్యులెవరు తన గుర్తింపును బహిర్గతపరచరాదని కచ్చితమైన ఆదేశాలిచ్చేవారు దారిలో అయనకు ఎదురయ్యే వ్యక్తులు బాబాని ఈయన ఎవరని అడిగితె,మండలి అయన్ని తమ పెద్దన్నయ్యగానో లేదా బొంబాయి నుంచి వచ్చిన వ్యాపారి (శేఠ్) గానో చెప్పేవారు.

బాబా యొక్క నవజీవన ప్రారంభంతో ఈ దశాబ్దం పరిసమాప్తమయింది. అదీ 1952 ఫిబ్రవరితో పూర్తయింది. అదే సంవత్సరంలో ఏప్రియల్ నెల నుండి ఆగష్టు వరకూ పశ్చిమ దేశాల్లో బాబా తన ప్రేమికులకు దర్శన మిచ్చారు. ఇండియాకు తిరిగి వచ్చాక బాబా తన తీక్షణమైన స్వేచ్ఛా జీవిత కాలములో ఉత్తర భారతంలోని హమీర్‌పూర్ జిల్లాను, దక్షిణ భారతంలోని ఆంధ్రదేశాన్ని సందర్శించారు. ఈ ప్రయాణాల్లో బాబా అనేక ఆధ్యాత్మిక విషయాలపై ఆయన కోరకు ఏర్పాటు చేసిన బహిరంగ ప్రజాదర్శన కార్యక్రమాల్లో వివరణాత్మక సందేశాలెన్నో ఇచ్చారు. ఒకరకంగా బాబా ఏకాంత వాసము నుండి తన పేరును బహిర్గత పరచుటకు, ఆయన సత్యప్రేమ సందేశాల్ని బహిరంగంగా ప్రజల మధ్య వ్యాప్తి చేయుటకు అనుతించారు. ఆయన కార్యక్రమము యొక్క బహిరంగ లక్షణం 50 దశకం ప్రథమ భాగంలో అంతకు ముందు జరిగిన దానికంటే ఎక్కువ ప్రశిద్ధి చెందినది.

తన ఆధ్యాత్మిక కార్యక్రమపు అవసరం రీత్య బాబా ఇప్పుడు తనకుతాను

అధిక సంఖ్యాకులకు అందుబాటులో ఉండసాగారు. 1954లో హమిర్‌పూర్‌లోను, ఆంధ్రలోను ఉన్న తన ప్రేమికులు, మానవరూపంలో ఉన్న తమ ప్రియతమ దైవాన్ని మరోసారి తమ జిల్లాల్లోని అనేక నగరాలు, పట్టణాలు గ్రామాలను సందర్శించవలసిందిగా అహ్వానించినప్పుడు, ఆయన వారి ప్రేమ పూరిత ఆహ్వానాన్ని అంగీకరించారు ఈ కార్యక్రమాల సమయంలోనే బాబా మొట్ట మొదటిసారిగా తాను యుగావతారుడనని బహిరంగంగా ప్రకటించారు.

తనను దర్శించిన వేలాది మంది మధ్య వందలాది స్త్రీ పురుషులెందరో తమ హృదయంలో బాబాయొక్క దైవత్వాన్ని ఇష్టపూర్వకంగా అమోదించి ఆయన చరిత్ర గురించి మరింత తెలుసుకోవాలని తాపత్రయపడ్డారు. హృదయాలు నిండాయి కానీ మనస్సు మాటల కోరకు వెంపర్లాడింది. ఆకరుణామయుడైన బాబా ఎప్పుడూ తన ప్రేమికుల అవసరాలను తప్పనిసరిగా అదుకోని తీరుస్తాడు. అందుకే ఈకాలములో బాబాకు అర్పితమైన పుస్తకాలు పత్రికలు వెలువడడం మొదలైంది.

1953జూలైలో అమెరికాలో, ఫిల్లిస్ ఫ్రేడరిక్ "అవతార్" అనే త్రైమాసిక పత్రికను ప్రచురించుట ప్రారంభించాడు అతదుపరి సంవత్సరం, బాబాకు సన్నిహితశిష్యుడు, ఆస్ట్రేలియావాసిఅయిన ఫ్రాన్సిస్ బ్రాబజాన్ వ్రాశిన "దేవుడితో ప్రయాణం" అనే తోలి గ్రంధం ప్రచురించబడింది. ఈ గ్రంధంలో ఫ్రాన్సిస్,1954లో బాబా తాను చేసిన ద్వితీయ అంధ్రాటూరుపై తన వ్యక్తిగత ఉద్ధేశ్యాన్ని పద్యాల్లో చక్కగా విశ్లేషించాడు "దైవీమానవుడు" పుస్తకంపై వ్రాసిన ఉపోధ్ఘాతంలో ఫ్రాన్సిస్ ఈ క్రింది ఘనమైన వాక్యాల్ని వ్రాశాడు.

మార్గాన్ని సుగమం చేసే అవ్యక్తి దైవీమానవుడు అంతేకాదు ఆయన అమార్గాన్నంతా దాదాపుతుడిచివేసి అపదార్థము యొక్క హృదయంలోనికి తిన్నగా వెళతాడు. మరియు అత్మసాక్షాత్కరాన్ని ప్రసాదిస్తాడు.

1954లో కూడా భారతీయ పత్రికలు మెహెర్‌పుకార్, వెలుగు, వంటివి ప్రచురిత మయ్యాయి. హిందీ, తెలుగులో ప్రచురితమైన యాపత్రికలు బాబా

సందేశాలతో పాటు అయన జీవితం పై వ్యాసాలు ప్రచురించేవి భారతదేశంలోని బిన్న ప్రాంతల్లో బాబా ప్రేమికులు చిన్న చిన్న బృందాలుగా ఏర్పడి వారాంతపు సమావేశాలుజరుపుట ప్రారంభించారు. కొంతమంది బాబా ప్రేమికులు ఉత్తేజితులై బాబాయొక్క దివ్యత్వాన్ని, అవతారతత్వాన్ని శ్లాఘిస్తూ భజన పాటలు కూర్చి సంకీర్తన చేయుట మొదలు పెట్టారు. కొత్తగా కూర్చుకున్న పాటల్ని ఒక్కరుగాను బృందంగాను పాడుతుంటే పరవశులయ్యే వారు తొలి భజన కీర్తినల పుస్తకం, మెహెర్ గీతావళి అనే పేరుతో కేశవ నారాయణ నిగమ్ అనే బాబా ప్రియ శిష్యుని సంపాదకత్వంలో ప్రచురించబడింది ఈ పుస్తకంలో ఘజల్సు, భజన కీర్తనలు, తదితర పాటలు బాబా వైభవాన్ని కీర్తిస్తూ ఉర్ధూ, హిందీ, మరాఠీ, తెలుగు, గుజారాతీ భాషల్లో చోటు చేసుకున్నయి.ఈ పాటల ద్వార వ్యక్తమయ్యే ప్రేమ, అనేక వూళ్లల్లో ఉన్న బాబా ప్రేమికుల్ని పలురకాలవ్యక్తుల్ని తమ మధ్యఉన్న జాతి, కుల, మత, భాషావివక్షతలు విస్మరించేట్లు సహాయపడింది. బాబా వీరందరిని, ఒకే ధారంలో గుది గూర్చిన పూసల్లా ఒకే చోటికి చేర్చారు.

1954 జూన్‌లో మరోపాటల పుస్తకం "మెహెర్ ప్రకాష్ భజనావళి" అనే పేరుతో సుల్లూమేస్రం వ్రాయగా అహ్మదనగరులోని మెహెర్ పబ్లికేషన్సు వారు ప్రచురించారు. ఈ పాటలన్నీ సుల్లూ యొక్క బాబా ప్రేమ అనే పూదోటలో విరబూసిన కుసుమాల పరిమళాల్ని విరజిమ్మాయి.

పునర్విమర్శగా చూస్తే, 1954లో మేహెర్ బాబాకు ఒక కొత్తనవశకం తెరవబడింది. బాబాను గురించి ఆయన మాటల్ని గురించిన పుస్తకాలు, గ్రంధాలు ప్రచురణల శకం ఆరంభమై తద్వారా అధికసంఖ్యాకులు అవతారుడు గురించి నేర్చుకొనే వీలుకలిగింది. అవతారుడి మౌనం తన ప్రేమికులు కొందరి హృదయాల్లోఆయన కలిగించిన ప్రేరణ ద్వారా మాటలై తనకు తానే నిరాటంకంగా అందరికీ అందుబాటుకా సాగింది!

## బాబా నాగపూరు సందర్శన మరియు సుల్లూమేష్రం

బాబా కుటుంబంలోని స్త్రీ పురుషులు ప్రతివారికి తమ ప్రియతముని యొక్క స్వంతకథ ఏదో ఒకటి ఉన్నది. ఇక్కడ మధ్యలో కల్పించుకొని నేను, బాబా ప్రేమికుల్లో ఒకరైన మెహెర్ ప్రకాష్ భజనావళి గ్రంధకర్త సూల్లూ మేష్రం యొక్క తోలి జీవిత ఘట్టాన్ని చెప్పదలచాను. మేష్రంకు 13ఏళ్ల వయస్సులో మొదటిసారిగా బాబా పేరువిన్నాడు. అతడు నాగపూరులో తన కుటుంబంతో ఉండేవాడు. నాగపూరు నగరాన్ని బాబా 1937 డిశంబరులో సందర్శించారు అప్పుడు బాబాతో పాటు మండలివారు, ప్రిన్సెస్‌నోరీనా మేచ్‌బెల్లి ఉన్నారు ఎరుచ్ తండ్రి పాపాజస్సావాలాగారి ఎస్టేటులో చ్ఛావ్‌నీ బజారులో వున్న మేరీ లాడ్జిలో బసచేశారు.

అసమయంలో చోటు చేసకున్న అనేక సంఘటనలవల్ల బాబా నగరానికి వచ్చిన విషయంపై కొంత ప్రచారం జరిగింది ఆయన గురించిన సమాచారము వార్త పత్రికల్లో ప్రచురితమైంది. ఆసమయంలో సుల్లూ బాబాను చూడలేదు అయితే, అయన రాక గురించి వార్తపత్రికల్లో చదవగా అతని హృదయానికి ఏదోహత్తుకుపోయింది అంత ప్రాముఖ్యత సంతరించుకున్న కేంద్ర బిందువైన అవ్యక్తిని గురించి మరింత తెలుసుకోవాలన్న ఆరాటం పెరిగింది బాబా చూట్టూ ఉన్న వారికి తను అనుభవంలో తరచుగా అవతారుని ప్రేమ ఫరిధిలోకి వచ్చే అనుకూల సమయానికి ఎన్నో సంబంధిత సంఘటనలు జరుగుట గమనిస్తూనే ఉంటారు ఒక్కోక్కప్పుడు, మృదువుగా,మరోకప్పుడు శక్తివంతంగా ఈసంఘటనలు ఆయన దగ్గరకు నెట్టుతయి. సుల్లూ విషయంలో కేవలం ఒక వార్తాపత్రికలోని ప్రచురణ, తొలి సమాగమాన్ని కల్పించింది

అయితే మేష్రం కథను కోనసాగించే ముందు 1937 డిశంబరులో బాబా నాగపూరులో విడిది చేసినప్పుడు జరిగిన అద్భుత సంఘటనను పునశ్చరణ చేయకుండా ఉండలేను ఇది మేష్రంకు సంబంధించింది కాక పోయినా ఆసమయంలో బాబా చూట్టూ అలుముకున్న వాతావరణాన్ని ఇది వ్యక్తపరుస్తుంది బాబా కాలాతీతుడైన ఏకైకుడు అందువల్ల ఏకధైనప్పటికి, అది ఆయన యొక్క ప్రేమ పూర్వక జ్ఞాపకార్థం ఉపయోగపడేదైతే ఈ ఇతిహాసం ఆ అవసరాన్ని తీర్చినట్లే.

ఈ ముఖ్యమైన సన్నివేశాన్ని బాబా వచ్చినప్పుడు అతిధ్యమిచ్చిన ఎరుచ్ అమ్మగారు గయ్‌మాయినాతో చెప్పింది ఈ క్రింది విధంగ గయ్‌మాయ్ అకథను గుర్తుచేసుకున్నది.

"నాగపూర్ లోని మాఇల్లు మేరీ లాడ్జిలో ప్రియతమ బాబా 1937 డిశంబరులో 3,4రోజులున్నారు. అది మాఅందరికీ మరపురాని సంతోషకర సమయం. మాఎస్టేటులో వరసగా మూడు రోజులుపాటు ప్రజాదర్శన కార్యక్రమానికి కొంత సమయాన్ని కేటాయించారు. ఒక సందర్భంలో నోరీనా మరికొందరు పురుష మండలితో బాబా తిరిగి వచ్చాక ఒక స్త్రీ లోనికి రావటాన్ని నేను గమనించాను. అకస్మాత్తుగా అమె పదేపదే బిగ్గరగా "కలికావతారుడు వచ్చాడు" అంటూ అరవసాగింది కలికి అవతారుడంటే, తెల్ల గుర్రం అవతారుడు లేదా ఎదురు చూస్తున్న ఏకైకుడు

అమెను సమాధాన పరచుటకు ప్రయత్నిస్తూ నేను ఆమెను ఎక్కడి నుంచి వచ్చిందో, ఎందుకు వచ్చిందో చెప్పమని అడిగాను కలవరపాటు పడుతూ ఆమెతన కథను నాకు చెప్పింది. తాను బరోడాలోని ఒక జడ్జిగారి భార్యనని, తనకు ఒక గురువు ఉన్నాడని ఆయన కొంత కాలం క్రితం మరణించాడని చెప్పింది అమెకుఒక కలవచ్చినట్లు తన గురువు కనిపించి నాగపూర్‌లోని చ్ఛావ్నీ క్యాంపు అనేచోటసాక్షాత్తు పరబ్రహ్మ పరమాత్మ కలికి అవతారుడిగా దర్శనం ఇవ్వబోతున్నట్లు తెలిసి తక్షణం బయలు దేరివెళ్లమని చెప్పాడట అప్రకారమే దొరికిన తొలి రైలు ఎక్కినాగపూర్ చేరి మాఇల్లు అరాతీస్తూ తిన్నగా ఇక్కడకుచేరింది అమెతో పాటు తన అన్నగారిని వదినగారిని బాబా దర్శనం చేయించుటకు తీసుకు వచ్చింది అమె కథంతా విన్నాక అమేకు భోజనం తినుబండారాలు ఏర్పాటు చేశాను అయితే అమే ఏవీవద్దని తిరస్కరించింది తానే కాక, మాఇంట్లోని వారెవరుకూడా, సాక్షాత్తు పరబ్రహ్మ పరమాత్మ మాఇంట్లో ఉన్నందున అన్నం తినుట మానేయాలని నామనస్సులో నాటుకొనేట్లు చేసింది.

దర్శన కార్య క్రమం ప్రారంభంకాగానే, ఆ స్త్రీ వెర్రి అవేశంలో కలికి అవతారుడు వచ్చాడు. అయన్ని దర్శించుకొనుటకు అందరూ త్వరపడండని పదే పదే ప్రకటించింది. బాబా దగ్గరకు బారులు తీరి ఉన్న సందర్శకుల గుంపువైపు

వెనక్కు ముందుకు అమె పరుగులు తీయసాగింది తుదకు బాబా నోరీనాని పిలిచి, అస్త్రీని హాల్లో దూరంగా చివర్లో ఉన్న స్త్రీబృందం దగ్గరకు వెళ్లి చెప్పమని, నాదగ్గర అరవ వద్దని చెప్పమాన్నారు. అయితే నోరీనా ఎంతో నమ్రతగా, వారిరువురి మధ్య భాష అడ్డున్నదికనుక తాను చేప్పే విషయాన్ని ఆ స్త్రీ అవగాహన చేసుకోవటం కష్టం కావచ్చని వాదించింది.

కానీబాబా,ఏది ఏమైనా వెళ్లి అస్త్రీతో మాట్లాడమని ఆమెకు సౌంజ్ఞలు చేశారు.అంత నోరినా ఆగుంపులోనించి దారిచేసుకొని ఆస్త్రీదగ్గరకు వెళ్లి నేమ్మదిగా బాబా సందేశాన్ని అంగ్లంలో వినిపించుట మొదలు పెట్టింది అయితే అస్త్రీ నోరినాయొక్క అందమైన రూపురేఖలు, ఆమెవచ్చిన దేశపుతీరుని గమనించి, వచ్చిరాని ఇటాలియన్ బాషలో సంభాషించుట ప్రారంభించింది. ఆశ్యర్యపడిన నోరీనా ఉన్నవారందరిలో తానోక్కతే అమేతో మాట్లాడకలిగిన వ్యక్తి అని బాబా ఎందుకువత్తిడి చేశారో అప్పుడు గుర్తించింది అపిమ్మట నేను బాబా దుస్తుల్ని ఉతుకుతుండగా ఈ స్త్రీమూర్తి నాదగ్గరకు వచ్చి, ఆయన బట్టలు కోన్నిటిని ఉతికే గోప్ప అవకాశాన్ని తనకూ కాస్త ఇవ్వమని అడిగింది.నేను మాత్రమే అపనిని నిర్వహించాలన్న బాబా అదేశం ఉండుటవల్ల అమె యొక్క సాదరపూర్వక విజ్ఞప్తిని నిష్కర్షగాతోసిపుచ్చాను. అయితే బాబా తన గదిలో లేనప్పుడు, ఆమె బాబా చెప్పులు జతనోకదానిని సేకరించి, చేతపట్టుకోని, అత్యాదరంతో ఇంటి చుట్టూతిరిగి చూట్టూవున్న వారందరి తలలు, ముఖాలపై ఆచెప్పుల్ని అనించింది.'

ఈజడ్జి గారి భార్య గయ్‌మాయికి అపరిచితురాలై నప్పటికీ, మరియు ఆతర్వాత మరెన్నడూ మేరీ లాడ్జికి రాకపోయినప్పటికీ, అమె రాక యొక్క విశిష్టత ఏమంటే, మన కాలపు వారికి అవతారుడు మన మధ్య ఉన్నాడన్న సమాచారాన్ని ఈమెముందుగా తెలియ చెప్పంది. తానుపురాణపు రుషుడనని తన నిజస్థితిని బాబా స్వయంగా బహిరంగంగా ప్రకటించుటకు చాలాకాలానికి ముందే ఇది జరిగింది. చూడటానికి, ప్రజలుబాబాను అవతారుడిగా కీర్తించుటకు తగు సయం ఇంకారానట్లున్నది.

ఆ స్త్రీ యొక్క ఆగమనం నిష్క్రమణ రెండూ హఠాత్తుగానే జరుగుట, ఆకాశంలో తళుక్కున మెరిశే మెరుపులా అలావచ్చి వెళ్లినట్లు జరిగి పోయింది.

బాబా సమక్షంలో అమె గడిపింది అతిస్వల్ప సమయమే అయినా అమె హృదయము అంచులు దాకా ప్రేమతో నిండిపోయింది మౌనం గానే బాబా ఆమెపై తాను అవతారుడినన్న విశ్వాసం పాదుకునేట్లు ప్రసరింపచేశారు.బాబా సముఖపు ఈ రకమైనమేలు కోలుపు అమె హృదయంలో నింపటం ఎంతో విశిష్టమైనది కనుకనే భౌతికంగా ఆమె మళ్లీ అయన్ని దర్శించాల్సిన అవసరం లేదు అమెను గురించి ఆరాతీయాల్సిన పని బాబాకూలేదు ఏమినమ్మలేని విషయం ? ఆయన సర్వ వ్యాపక దివ్యత్వంలో ఎవరికి ఏది ఎప్పుడు, ఎంత అవసరమో బాబాకు అంతాతెలుసు. అది బాబా యొక్క వ్యక్తిత్వపుదివ్యాకర్షణ ఆయన సమక్షంలోఇలాంటి అసాధారణ సంఘటనలు అపూర్వ మైనవేమీ కాదు.

ఇప్పుడు సుల్లూ మేష్రమ్ కధకువద్దాం 1938లో నాగపూరులో బాబా దర్శనం ఇచ్చిన ఒక సంవత్సరం తర్వాత, సుల్లూ ఇంకా చిన్న తనంలో ఉండగానే జస్సావాల గారింటికి వెళ్లి అక్కడ బాబా గురించి మరింత నేర్చుకున్నాడు. బాబా చిరునామాను సంపాదించి తానుస్వయంగా అయన్ని చూడాలనుకుంటున్నట్లు బాబాకు ఉత్తరం వ్రాశాడు సుల్లూ యొక్క కోరికను మన్నించి బాబా అతడు వచ్చిచూచేందుకు అనుమతిస్తూ జావాబు ఇచ్చారు. అందువలన 1938 ఏప్రియల్ మొదటి వారంలోబాబా ఆహ్వానాన్ని అందుకున్న 14ఎళ్ల సుల్లూ పెల్లుబికిన సంతోషంతో పూనాకు దగ్గరలో వున్న పంచగనిలో అప్పట్లో బాబా ఉంటున్నచోటుకు 70మైళ్ల ప్రయాణానికి సిద్ధమై రైల్లో నాగపూరునుండి బయలుదేరాడు. ప్రయాణ ఖర్చులకు అవసరమైన కొంత పైకాన్ని అతడి స్కూలు ప్రిన్సిపాలు సమకూర్చడు.అయన కూడ ఆధ్యాత్మికతపై కొంత ఉత్సాహమున్నవాడు. కళ్యాణ్ జంక్షను చేరాక సూల్లూరైలుమారాలి అక్కడ తనపెట్టెనుండి దిగేటప్పుడు, డబ్బు, బట్టలు బాబా ఫోటోలుంచిన తన సూట్‌కేసు పోయినట్లు, ఎవరో దొంగిలించినట్లు తెలుసుకున్నాడు. ఇప్పుడతని వద్ద పైసాలేదు. బాబాకు ఇవ్వమని జస్సావాలా ఇచ్చినరెండు బుట్టలు కమలాలు మాత్రమే అతని వద్ద ఉన్నవి . అటువంటి సుదీర్ఘ ప్రయాణంలో ఒక చిన్నపిల్లవాడికి ఎలాంటి దురవస్థ సంభవించింది ! అ పెట్టేతో పాటుకొన్నటిక్కెట్టు కూడా పోయినా, తాను కరుణా మయుని కలియుటకువెళుతుంటేఇటువంటి దురదృష్టం తనకు ఎదురైనందుకు కొంత అశ్చర్యపడినా,ఏదోరకంగా మారవలసినరైలుఎక్కాడుఅవతారుడిని కలియుటకు

చేసే ప్రయాణంలో ఏదో ఒకటి కనిపించకుండా పారవేసుకోవటం అసాధారణ మేమికాదు. బహుశ తెలియకుండా పారవేసుకోవటం, దైవమానవుడ్ని చూడవలసిన రీతిలో చూచేందుకు వీలుగా తెలియకుండానే ఆలోచనల్నిభావల్ని వదలి పెట్టుటకు సిద్ధపడాలన్న దానికి సంకేతముకావచ్చును.

అతడు పూనా చేరినప్పుడు,సుల్లూకుడబ్బులు,టికెట్టు లేకుండా పంచగని ఎలా వెళ్లాలో తెలియలేదు. అయితే అదృష్టవశాత్తు పంచగనికి వెళుతున్న బస్సు డ్రైవరుని కలిసి, తనకు జరిగిన దొంగతనం గురించి చెప్పాడు. ఆ డ్రైవరు కేవలం అతని మాటల్ని విశ్వసించటమేకాక తాను కొన్నేళ్ల క్రితం బాబా బంగళాకు నీరు మోసిఉన్నందున, ఆయన పైన ప్రత్యేకమైన భక్తి భావం ఉండుట వల్ల పరిస్థితి అనుకూలించింది ఈ డ్రైవరు సుల్లూను ఉచితంగా పంచగనికి తీసుకువెళ్లుటకు సంతోషంగా అంగీకరించాడు. మరోపర్యాయం, అగోచరమైన బాబా మార్గదర్శక హస్తము తనచెంతకు వస్తున్న ఒక ప్రేమికుని ప్రయాణంలో మౌనంగానే ఎంతో వివరంగా జాగ్రత్తలు తీసుకున్నది.

అతడు పంచగనిలో బస్సుదిగగానే ఈబాలుడ్ని పూర్తిగా ఆశ్చర్యపరుస్తూ, ఒక అపరిచితుడు అతడ్నికలిసి, సుల్లూ మేష్రం నీవేనా అని అడిగాడు. తీరాచూస్తే ఈఅపరిచితుడు బాబా సోదరుడు జాల్. బాబా అదేశంపై ఇతడి కొరకే ఎదురు చూస్తున్నాడు. అసలు ఏం జరిగిందంటే, పాపాజస్సావాలా నాగపూరు నుండి పంచగనికి, మేష్రమ్ బయలుదేరిన విషయాన్ని తెలుపుతూ బాబాకు టెలిగ్రాం ఇచ్చాడు. జాల్ మండలి ఉంటున్న చోటుకు సుల్లూను తీసుకెళ్లాడు. కొద్దిసేపు గడిచాక, బాబా వచ్చి తన కుర్చీలో కూర్చున్నారు. ఆయన పొడవాటి జుట్టు విరజిమ్మి ఎగురుతుంటే, ఆయన ముఖంపై తేజస్సు ప్రజ్వరిల్లుతోంది.

సుల్లూ హృదయం అంతర్గతంగా పరవళ్లు తొక్కింది. అతడు బాబా దగ్గరకు వేగంగా వెళ్లి ఆయన పాదాలకు సాష్టాంగ దండ ప్రణామాలర్పించాడు. బాబా ఎంతో ప్రేమతో అతడి ప్రయాణం గురించి అడిగారు. అతని పెట్టి దొంగిలించబడినదని విన్నప్పుడాయన చిరునవ్వు నవ్వారు. ఎందుకంటే ఆయన ఇంతకంటే పెద్ద దొంగతనమే చేశారు. ఈ బాలుడి హృదయాన్నే ఆయన దొంగలించారు. తన వీరావేశంలో సుల్లూ బాబాకు తన జీవితాన్నే అర్పిస్తానని,

ఆయనకు పరిపూర్ణ విధేయుడిగా ఉంటానని మొరబెట్టుకున్నాడు. ఆ క్షణంలో బాబా ఏమీ ప్రత్యుత్తరమీయలేదు. అయితే దగ్గరలోనే ఉన్న లాడ్జిలో విశ్రాంతి తీసుకొనుటకు మండలిలో ఒకరైన విష్ణుతో వెళ్లమని చెప్పారు.

సూల్లూ పంచగనిలో మూడు రోజుల పాటున్నాడు. రెండవ రోజున, అతడు స్నానం చేస్తుండగా బాబా శిష్యుల్లో ఒకడైన గుస్తాద్‌జీ తక్షణం సుల్లూను బాబా రమ్మంటున్నారని సౌంజ్ఞలు చేశాడు. అలా ఎప్పుడు పిలవ బడ్డా, ఆ వ్యక్తి ఏ మాత్రం ఆలశ్యం చేయక తక్షణం వెళ్లాలని సుల్లూ విని ఉన్నాడు. మరి అప్పుడే తను స్నాం చేయటం మొదలు పెట్టి కేవలం డ్రాయరుతోనే ఉన్నా, అతడు బట్టలేవీ వేసుకోకుండా వెంటనే బయలు దేరివెళ్లాడు.

అతడు వెళ్లేసరికి బాబా కొంతమంది శిష్యులతో కలసి కూర్చుని ఉన్నారు. సుల్లూ బాబా ముందు అర్థనగ్నంగా నిలబడ్డాడు. "నీవు బాగా నిద్రపోయావా ? నీకేమైన ప్రత్యేక ఆలోచనలు కలిగాయా ?" అనడిగారు. "బాబా ! నేను అనేక గంటలపాటు నిన్ను కీర్తిస్తూ పాటలు పాడుకున్నాను" అని బదులిచ్చాడు సుల్లూ.

బాబా సంతోషించి "ఆధ్యాత్మిక మార్గానికి సరిపోతావు" అని సౌంజ్ఞలు చేశారు. సుల్లూ మరే ప్రశ్న వేయక, వెంటనే బాబాకు విధేయుడై ఆయన ఆజ్ఞను పాటించినందున, అతడు అనుసరించుటకు కొన్ని మార్గదర్శక సూచనల్ని ఇచ్చారు. అవి ఏమంటే అతడు ఎవరికీ ఎప్పుడూ అబద్ధం చెప్పరాదు. అతడు వ్యభిచరించరాదు, ప్రొగత్రాగుట, మధ్యపానము వదులు కోవాలి. మాంసము, చేపలు, గ్రుడ్లు తినరాదు. నిత్యం సుల్లూ ఒక గంట సేవు ధ్యానం చేయాలి, "ఓం పరబ్రహ్మ బాబా" అని మరో గంటపాటు రోజూ వ్రాయాలని బాబా ఆదేశించారు.

సుల్లూ అక్కడున్న ఆఖరి రోజున, అతను నాగపూరు తిరిగి వెళ్లుటకు ప్రయాణపు ఏర్పాట్లు చేయమని బాబా విష్ణుని ఆదేశించారు. తన తిరుగు ప్రయాణంలో తొలి విడతగా పూనా వరకు సుల్లూను కారులో తీసుకువెళ్లారు. అక్కడ నుంచి నాగపూరుకు రైలు టిక్కెట్టు కొని ఇచ్చారు. అంటే అతని తిరుగు ప్రయాణానికి మొత్తం టిక్కెట్టు ఛార్జీలన్నీ బాబాయే చెల్లించారన్నమాట. పిన్నవయస్సులోనున్న తన ప్రేమికుడికి రారాజు నుండి ఎటువంటి రాజసమైన వీడ్కోలు ! అతడు బాబా చెంతకు పైసా లేకుండా వచ్చాడు. కానీ తన



7.

హృదయాన్ని యధార్థ ఆధ్యాత్మిక సంపదతో నింపుకొని వెళుతున్నాడు. అతడు నాగపూరుకు సురక్షితంగా చేరి, బాబా వద్ద వున్న అన్ని రోజులూ జరిగిందంతా వివరంగా జస్సావాలా కుటుంబానికి వివరించాడు.

ఈ తొలి సమావేశం జరిగిం తర్వాత, సుల్లూకు బాబాకు మధ్య ఒక అనుబంధం ఏర్పడి సంవత్సరాలు గడిచే కొలదీ క్రమంగా పెరగ సాగింది. సుల్లూ హృదయంలో బాబా దివ్య ప్రేమ బీజాన్ని నాటారు, ఆ విత్తనం క్రమంగా మొలకెత్తి సహజంగా పెరిగి పెద్దదై మొగ్గ తొడిగి సూర్య తేజస్సుకు వికసించి రంగు రంగు రేకులు విచ్చుకొని మెరవసాగాయి. 1954 తొలిరోజుల్లో అతనిలో ప్రేరణ కలిగి, బాబాపై అనేక పాటల్ని హిందీ, మరాఠీ బాషల్లో వ్రాశాడు. మెహెర్ ప్రకాశ్ భజన గీతావళిలో సంకలన పరచిన ఈ పాటలన్నీ శాశ్వత ప్రియతమునిపై సుల్లూకున్న ప్రేమ కుసుమాల మాధుర్యాన్ని గుబాళించినవి.

## ఉత్తర ప్రత్యుత్తరాల పునః ప్రారంభం - కొత్త సర్క్యులరు జారీ



1954 జూన్‌లో అంత క్రితం సంవత్సరం నవంబరు 1 నుంచి మహాబలేశ్వర్‌లో ఉడటం మొదలైన సుదీర్ఘ కాలానంతరము బాబా, మహారాష్ట్ర దేశంలోని అందమైన నగరం సతారాకు తమ మకామును మార్చారు. మహాబలేశ్వర్ లాగానే, 40 దశకం ఆఖర్లో బాబా యీ రెండు చోట్లా మస్తు ఆశ్రమాలు నడుపుట వలన ఆయన్ని అనుసరించే వారికి ఇంతకుముందే సతారా కూడా బాగా పరిచయమైంది.

షుమారు ఒక మైలు ఎడంగా బాబా ఉపయోగార్థం రెండు బంగళాల్ని అద్దెకు తీసుకున్నారు. గ్రాఫ్టన్ అనే బంగళా బాబా మరియు స్త్రీ మండలి ఉండేందుకు, రోజ్ ఉడ్ బంగళా పురుష మండలి ఉండేందుకు కేటాయించారు.

ఉదయపు వేళల్లో బాబా శిష్యుల్లో తన రాత్రి కాపలాదారునిగాని, మరొక శిష్యుడ్ని కాని వెంట పెట్టుకొని, ఉత్తరాలు చూచేందుకు రోజ్‌ఉడ్‌కు నడిచివెళ్లి తన రోజువారీ కార్యక్రమాల గురించి చర్చించేవారు.

ఈ రెండు ఇళ్లు కూడా సతారాలోని ప్రశాంతమైన మైదాన ప్రదేశంలో అనేక పెద్దా, చిన్న బంగళాలతో బాగా పెరిగిన పూలు తదితర చెట్లున్న తోటలతో అలరారుతున్నాయి. విశాలమైన రోడ్లు పరిశుభ్రంగా ఉన్నాయి. జనసంచారం తక్కువ. సంవత్సరం పొడవునా మహారాష్ట్రలో వాతావరణం హాయిగా ఉంటుంది. అంత వేడిగా ఉండదు. అంత చల్లగాను ఉండదు. సతారా చక్కని వాసయోగ్యమైన ప్రదేశం, బాబాకు ప్రత్యేకంగా ఇష్టమైన చోటు.

మే నెల ఆఖర్లో బాబాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటపై ఉన్న నిషేధం పూర్తయింది. కనుక, అంత వరకు తమ కుటుంబ క్షేమ సమాచారాన్ని, ఆయన ప్రేమ సందేశ వ్యాప్తికై తాము ఏర్పాట్లు చేస్తున్న కార్యక్రమాల గురించి వ్రాయాలన్న కుతూహలంతో అవకాశం కొరకు ఎదురు చూస్తున్న బాబా ప్రేమికుల నుండి ఉత్తరాల ప్రవాహం మొదలైంది. బాబా తరచుగా ప్రయాణాల్లో ఉండుట వల్ల, అహ్మదు నగరుకు ఆదీ కేరాఫ్ అడ్రస్సుకు వ్రాయమని ఆదేశాలిచ్చారు. ఉత్తరాలలో అత్యధికం, ఆయన యందు వారికున్న ప్రేమ సమాచారమే కలిగి ఉండేవి. అయితే కొన్నిటిలో వారికున్న సమశ్యల్ని కూడా వ్రాశేవారు. జూన్ రెండవ తేదీన బాబా పేర ఈ క్రింది తంతి ఆదీకి చేరింది.

"1954 జూన్ 1న నీ ఆదేశం ప్రకారం నా ఉద్యోగానికి రాజీనామా చేశాను. 1953 అక్టోబరు 18న నా భార్యను వదిలేశాను. హోటలులో విడిగా ఉంటున్నాను. దయచేసి నాకు సన్యాస దీక్ష నొసగి, ఏదో ఒక చోట బిక్షాటన చేస్తూ బ్రతుకుటకు అనుమతించండి"

ఆశ్చర్యకరమైన యీ సమాచారము, షుమారు ఒక దశాబ్దంగా బాబాతో సంబంధం ఉన్న కుప్పుస్వామి నుండి వచ్చింది. దైవాన్వేషణలో కుప్పుస్వామి త్రికరణ శుద్ధి కలవాడే కానీ, ఈ అన్వేషణను ఎలా నిర్వహించాలో నన్న తన ఆలోచనల్లో చాలా ఖండితమైన వ్యక్తి. అతని తంతిలోని భావములో బాబా తన

భార్యను, ఉద్యోగాన్ని వదులుకోమని ఆదేశించారన్నట్లు వ్యక్తం కాలేదు. అతను బాహ్య సన్యాసంపై బాబా ఇచ్చిన ప్రవచనాల్ని తనకు అనుకూలంగా వినియోగించుటకు అస్పష్టంగా ప్రయత్నిస్తున్నాడు.

బాబాకు సన్నిహితంగా ఉండే శిష్యులందరికీ, ఆయన ప్రేమికులు తమ కుటుంబాన్ని కానీ, బాధ్యతల్ని కాని వదిలి వేయాలని కోరరు అని బాగా తెలుసు. చిన్నా పెద్ద మీటింగులన్నిటిలో "నన్ను హృదయ పూర్వకంగా జ్ఞాపకం ఉంచుకొనుడు. నేను మీతో ఉంటాను. నేను మీకు సహాయ పడెదను. ప్రపంచంలో జీవించండి కానీ దానిని త్యజంచకండి" అని తరచూ వారికి చెప్పేవారు. బాబా తన ప్రేమికుల నుండి కోరేది బాహ్య సన్యాసం కంటే అంతర్గత సన్యాసాన్నే.

బాబా ఆదేశంపై, ఆదీ కుప్పుస్వామికి జవాబు పంపుతూ, బాబా అతడిని తాను చేసినట్లుగా ప్రపంచాన్ని త్యజించమని ఆదేశించలేదని మరియు అతను బాబా మాటలను అపార్థం చేసుకున్నాడని వ్రాశాడు. ఆదీ వ్రాసిన ఆ జాబులోని ఒక భాగాన్ని ఆయన వ్రాసే విధాన పసను వివరించుటకు ఈ క్రింది తెలుపుతున్నాను.

నీ ఉత్తరం అందుకున్నాను. మరో పర్యాయం వంచన, మూర్ఖత్వము యొక్క తరంగం నీలో ద్యోతకమైంది. కనుక మరోసారి - 3 లేక 4వ సారి నీ జీవితంలో - నీ ఉద్యోగాన్ని నీవు వదులు కున్నావు. నీవు నీ ఇంటిని, ప్రపంచాన్ని కూడా వదిలేసినట్లు నీవు చెప్పావు.

బాబా నిన్ను అడిగింది ఇది కాదు. ఇది ఒక పిరికి పందగా నీవు చేసిన పని. జీవితంలో చపల చిత్తంతో చేతకాని పనిని తలపెట్టవద్దని, మొండిగా మూర్ఖంతో జీవితం గడుపుతూ వాటిని నీ అభ్యుదయకర ఆధ్యాత్మికతగా పిలవవద్దని నీవు పదే పదే హెచ్చరించబడ్డావు.......

నీవు ఇంకా తెలివైన వాడివైతే, నీలో కాస్తంత స్వస్థ చిత్తం మిగిలి ఉంటే నీవు తక్షణం నీ తప్పుడు ఆలోచనను వదిలిపెట్టి, అసహజమైన రీతిలో జీవించడం మాని వెంటనే నీ ఉద్యోగంలో తిరిగి చేరి మీ ఇంటికి తిరిగి వెళ్లి నీ కుటుంబంతో

గడుపుము, నీ విద్యుక్త ధర్మాల్ని నిజాయితీగా నిర్వర్తించుము. ఒక యదార్థ కర్మ యోగిగా జీవితాన్ని గడిపితే బాబా సంతోషిస్తారు. (కర్మయోగి అంటే ప్రేమగా దైవ నామస్మరణలో గృహస్తుగా జీవితం గడిపే వ్యక్తి, కర్మఫలాల్ని ఆయనకే అర్పించువాడు)

బెంగుళూరులో మళ్లీ ఆదాయపన్ను శాఖలో కుప్పుస్వామి మళ్లీ తన విధులలో చేరాడో లేదో నాకు తెలియదు. అయితే 1955 నవంబరులో జరిగిన ఒక సహవాస్ కార్యక్రమంలో కాషాయరంగు బట్టలు పైజమా లాల్చీ ధరించి కనిపించినట్లు నాకు జ్ఞాపకం. బాబా ప్రేమలో పరస్పర శుభాకాంక్షలు చెప్పుకోవటమే జరిగింది కాని, ఆయనతో మాట్లాడే అవకాశం నాకు రాలేదు. ఆ సమూహంలో ఒకచోట, బాబా స్వామి యొక్క కాషాయ బట్టలను చూచి "ఎవరైనా తన హృదయానికి భవబంధ రహిత రంగుతో రంగు వేయవచ్చును గానీ, కేవలం తన దుస్తులతో వేయలేడు" అని వ్యాఖ్యానించారు.

స్వామి తన జీవితాన్ని గడిపే విధానంతో పాటు, ఇక్కడ ఇదే స్వామి నాతో చెప్పిన అత్యంత ప్రాముఖ్యత గల ఒక సంఘటన గురించి నాకు జ్ఞాపకం వచ్చింది. 40 దశకం మధ్య భాగంలో నేను మెహెరాబాదులో ఉన్న రోజుల్లో స్వామి నాతో ఇలా చెప్పాడు. బాబా పేకాట ఆడుతూ జోకరు గురించి అర్థవంతమైన దృష్టాంతరాన్ని చెప్పారట. అనేక రకాల పేకాటలలో అన్నిటికంటే అత్యున్నతమైన కార్డు ఐనప్పటికీ, అది ఎంత పెద్దదైనా, చిన్నదైనా జోకరును వాటితో సరిపోయేట్లు యధారీతిగా ఉంచవచ్చును. "అవతారుడు జోకరు వంటివాడు. ఆయన అందరితో పరిహాసమాడతాడు, గారడీ చేస్తాడు అయినా ఆయన అన్నిటికీ అతీతుడు" అని బాబా వివరించారు.

పైన పేర్కొన్న బాబా సందేశము వల్లనేను తెలుసుకున్నదేమంటే, అవతారుడు అందరికీ, సమానంగా అందుబాటులో ఉంటాడు, సాన్నిహిత్యంలో ఉంటాడు. ఆయన తెలివి గలవాడు, బుద్ధి మాంధ్యుడు, వివేకవంతుడు, చంచల స్వభావుడు. కనుక బాబా తన హాశ్య భావంతో, ఆయన యొక్క షరతులు లేని ఓర్పు బహుశః కుప్పుస్వామిని, అవతారుడిగా ఆయనతో తన సంబంధాన్ని సరైన దృష్టితో సంపాదించుటకు తగు విధంగా సహాయపడి ఉండవచ్చును.

ఏప్రియల్, మే నెలల్లో మెహెరాబాదులో తదుపరి సంవత్సరం జరుగబోయే తన అనుచరుల పెద్ద సమావేశపు పథకాల గురించిన వివరాల్ని బాబాకు ఆదీ ఎప్పటికప్పుడు తెలియచేస్తూన్నాడు. మండలి వారు చెప్పే అనేక సలహాల్ని పరిశీలించిన పిదప బాబా చివరకు యీ సమావేశాన్ని సెప్టెంబరులో నిర్వహించాలని నిర్ణయించారు. అందువల్ల జూన్ 10న ఇండియాలో పలు ప్రాంతాల్లో ఉంటున్న బాబా ప్రేమికులందరకూ యీ విషయాన్ని తెలుపుతూ ఆదీ ఒక సర్క్యులరును జారీ చేశాడు. బాబా తన కార్యక్రమాలు ఎటువంటివైనా ఎంత పరిశీలనగా వాటిపై శ్రద్ధ చూపుతారో పాఠకులకు ఒక అభిప్రాయం ఏర్పడుటకు ఈ సర్క్యులరు పూర్తి పాఠాన్ని యీ క్రింద పొందు పరుస్తున్నాను.

1. 1954 సెప్టెంబరు 29, 30 తేదీల్లో, తనకు సన్నిహిత శిష్యుల్ని, భక్తుల్ని సహాయకుల్ని మరియు ఎప్పుడైనా ఆయన్ని చూచినా చూడక పోయినా తనను ప్రేమించు వారందరినీ మెహెరాబాదు (అహమ్మదునగరు)లో కలవాలని వాంఛిస్తున్నారు.

2. బాబాను బాబాగా లేదా ఆయన కార్యక్రమంలో నిష్కళంకంగా విశ్వసించే వారు మాత్రమే అంతదూరం శ్రమపడి అయన వద్దకు వెళ్లి, ఆయన సముఖంలో దర్శన భాగ్యం పొంది, ఆయన కార్యక్రమము యొక్క యధార్థ అవగాహనను పొందే అవకాశాన్ని ఈ సందర్భంగా వినియోగించుకొని లబ్ధిపొందండి.

3. మెహెరాబాదులో జరుగబోయే సమావేశము లేదా సమావేశాల్లో బాబా అవశ్యంగా ఈ జీవితంలో ఆయన కార్యక్రమం గురించి స్పష్టంగా, రూఢి పరచాలని అభిలాషిస్తున్నారు. ఆంధ్రరాష్ట్రంలో జరిగిన రాజమండ్రి సమావేశంలో ఆయన కార్యక్రమము మరియు కార్యకర్తలకు ఇచ్చిన పిలుపు మొట్టమొదటిది మరియు చిట్ట చివరిది అని చెప్పినట్లుగానే, యీ మెహెరాబాదు సమావేశం కూడా ఆయన శరీర త్యాగం చేసేలోపు ఇదే మొదటిది మరియు ఆఖరిది కాగలదు.

4. 1954 సెప్టెంబరు 12న అహ్మదు నగరులో ప్రజాదర్శన కార్యక్రమం జరుగుట మినహా, ఒకటి రెండు సందేశాల్ని ఇస్తే ఇవ్వవచ్చేమో కానీ, పైన పేర్కొన్న మెహెరాబాదు సమావేశంలో మాత్రం, ఒక సందేశం లేదా సందేశాల్ని ఇచ్చుటకు కడపటిదవుతుంది.

5. బాబా కార్యక్రమపు అనేక ఘట్టాల మధ్య, 1954 అక్టోబరు మొదలైన తరువాత సందేశాలివ్వటమనే ప్రాముఖ్యత గల చర్య విరమించబడుతుంది. అవి విధిగా ప్రకటించిన రీతిలో ఆపివేయబడతాయి.

6. మెహెరాబాదు సమావేశానికి హాజరుకాగోరే వారంతా (16 ఏళ్లపై బడిన పురుషులు మాత్రమే) దీనిలో పంపుతున్న అంగీకార పత్రాన్ని పూర్తి చేసి, సంతకం చేసి, 1954 ఆగష్టు 1వ తేదీలోగా ఆది కె. ఇరానీకి చేరులాగ పంపాలి.

7. ఈ సమావేశంలో పాల్గొనదలచిన వారంతా దక్షిణగా రూ. 22/- (ఇరువది రెండు రూపాయలు) మనియార్డరు ద్వారా 1954 ఆగష్టు 1లోపు ఆది. కె. ఇరానీకి అందేట్లు పంపాలి.

8. అంగీకార పత్రాలు, మనియార్డర్లు రాదలచిన వారి నుండి అందగానే వారికి, పోష్టు ద్వారా లేదా మరేదో విధంగా అనుమతి పత్రాన్ని లేదా మెహెరాబాదులోనికి అనుమతించే టోకెను అందజేయ బడుతుంది. 1954 సెప్టెంబరు 29, 30 తేదీలలో వారికి ఉచిత భోజన వసతి ఏర్పాటు చేయబడుతుంది. మరియు అహ్మదు నగరు రైల్వే స్టేషను మరియు మెహెరాబాదుకు రానుపోను ఉచిత బస్సు సౌకర్యము ఏర్పాటు చేయబడుతుంది.

ప్రతివారు తమ పక్క బట్టల్ని, టార్చిలైట్లను, మరియు మెహెరాబాదులో ఉండే రెండు రోజులతోపాటు, రానుపోను ప్రయాణానికి అవసరమైన దుస్తులను తప్పని సరిగా తెచ్చుకోవాలి.

10. మీటింగులో పాల్గొనే వారంతా తమ ఊరు నుండి అహ్మద్ నగరు రైల్వే స్టేషనుకు మరియు తిరిగి వెళ్లుటకు అయ్యే ప్రయాణ చార్జీలను వారే భరించాలి.

11. ఈ సందర్భంగా హాజరయ్యే వారంతా, తమకు ఇచ్చిన అనుమతి పత్రంతో పాటు జతపరచిన ఒక స్లిప్పులో పొందు పరిచన కాలంలో వారు అహ్మదునగరు రైల్వే స్టేషనుకు సెప్టెంబరు 28 సాయంత్రం మరియు 29 ఉదయం మధ్య, ఏ తేదీన ఏ సమయంలో చేరుతున్నదీ ముందుగానే నిర్ణయించుకుని పూర్తి చేయాలి.

12. అహ్మదు నగరు రైల్వేస్టేషను నుండి మెహెరాబాదుకు ఉచిత బస్సు ప్రయాణాన్ని వినియోగించుటకు మీరు అహ్మదునగరు రైల్వేస్టేషనుకు ఈ క్రింది తెలిపిన వేళల్లో చేరుకోవాలి :

సెప్టెంబరు 28న డోండు వైపు నుండి సాయంత్రం 2-21, 9-23 మధ్య

సెప్టెంబరు 28న మన్మాడు వైపు నుండి సాయంత్రం 3-24లకు

సెప్టెంబరు 29న మన్మాడు వైపు నుండి మధ్యాహ్నాం 12-36కు

ఈ సర్క్యులరు అందుకోగానే బాబా ప్రేమికులలో ఆనందం ఉరకలు వేసింది. వారి కళ్లన్నీ ప్రియతమునిపై లగ్నమయ్యాయి ! మరో పర్యాయం, వారు ఆయన యొక్క ఘనమైన సముఖంలో ఆయన అనుగ్రహానికి పాత్రులయ్యారు. కొంతమందికి ఆయన్ని కలియుటకు ఇదే తొలి అవకాశం. ఈ సర్క్యులరులో ఇది ఆఖరి సహవాస్ అని ప్రకటించినా, 50 దశకంలో దీని తర్వాత మెహెరాబాదులో చాలా సహవాస్ కార్యక్రమాలు జరిగినా, ఈ మీటింగుతో బాబా తన కార్యక్రమంలో భాగంగా ఒక కొత్త ఘట్టాన్ని ఆవిష్కరించారు. ఈ సమావేశపు ప్రాముఖ్యతను ఏ ఒక్కరు ఊహించలేక పోయినప్పటికీ, యుగావతారుడి సముఖంలో ఉన్నామన్న నమ్మకం వల్ల అంతా మ్రాన్పడిపోయారు.

# ప్రేమ యొక్క బంధాలు



మెహెరాబాదు సమావేశపు ఏర్పాట్లు ఒకవైపు జరుగుతుండగా చాలామంది కొత్వాల్ కుటుంబ సభ్యుల జీవితాల్లో మార్పులు జరుగసాగాయి. కొత్వాలు బాబాతో సన్నిహితంగా చాలా కాలం నుంచి ఉంటున్నాడు. 1954 జూన్‌లో నజూకొత్వాల్ తన నర్సింగు డిగ్రిని పూర్తి చేసి, బొంబాయిలో ఉద్యోగానికి ఎదురు చూస్తోంది. ఈ సమయానికి ఆమె సోదరి హిల్లాకు వివాహమై పోయింది. ఆమె సోదరుడు ఆదీ పూనాలో విశ్వవిద్యాలయ చదువు కెక్కాడు. వాళ్ల తండ్రి సావక్ నివాస మండలిలో ఒకరిగా ఉంటూ బాబా ఎక్కడకు వెళితే అక్కడకు ఆయనతో పయనిస్తున్నాడు. వాళ్లతల్లి నర్గిజ్ చాలా సంవత్సరాల నుండి మెహెరాజాదులో ఉంటోంది. పిల్లలు మెహెరాబాదులోనే పెరిగారు.

వాళ్ల స్కూలుకు శలవులిచ్చినప్పుడు మెహెరాబాదు వెళ్లి ఉంటున్నారు. కానీ ఇప్పుడు ఆమె పిల్లలు పెద్ద వాళ్లయ్యారు. బాబా నర్గిజ్ మెహెరాబాదు వదిలి బొంబాయి వెళ్లి తన పిల్లల దగ్గర ఉంటే బాగుంటుందని సలహా చెప్పారు.

తన భర్త సావక్ 1930 దశకంలో బాబాను తొలిసారి కలిసినప్పుడు ఆయన్ని గురించి నర్గీస్ విన్నది. బాబా యందాతని కున్న ప్రేమవల్ల బొంబాయిలో తాను చేస్తున్న బ్యాంకు ఉద్యోగాన్ని వదులుకొని బాబాతో శాశ్వతంగా ఉండిపోవాలనుకున్నాడు. చాలా ఏళ్లు గడిచాక అతి హృదయావేదనకు బదులుగా బాబా అతని కోరికను తనకున్న సర్వం అమ్మాలన్న ఒక షరతుపై మన్నించగా, అరుదైన యీ సదవకాశాన్ని సంతోషంగా సద్వినియోగ పరుచుకొని, 1940 మార్చి నాటికి సావక్ తన యావదాస్థిని అమ్మివేసి, తనతోపాటు తన భార్యను ముగ్గురు పిల్లలను వెంట బెట్టుకొని బెంగుళూరులో ఉన్న బాబాతోపాటు ఉండిపోయేందుకు వచ్చి చేరాడు.

నర్గీస్ తన భర్త సావక్‌ను ఒక స్త్రీ ఒక పురుషుడ్ని ప్రేమించినట్లు హృదయ పూర్తిగా ప్రేమించింది. భాగ్యవంతుల కుటుంబం నుంచి వచ్చినా, ప్రేమ కోసరం

భాగ్యవంతుడు కాని సావక్‌కు భార్య అయ్యేందుకామె తన సర్వస్వం వదులుకున్నది. తర్వాత సావక్‌తో పాటు బాబాతో కఠినమైన ఆశ్రమ జీవితాన్ని గడిపే కొత్త ఆధ్యాత్మిక సాహస కృత్యంలో చేతులు కలిపింది. ఆమె ఎరుకతో స్వయంగా దైవ దర్శనాన్ని కోరుకోలేదు. అయితే సావక్ యందు తనకున్న ప్రేమవల్ల ఆమె అప్పుడప్పుడు ఎదురయ్యే అనుకోని యీరకపు కష్టతరమైన జీవితాన్ని గడుపుటకు ఒప్పుకున్నది. ఈ విధంగా అనేక సంవత్సరాలు మెహెరాబాదులో బాబా యొక్క ప్రత్యక్ష ఆదేశాల క్రింద జీవించే మంచి అదృష్టాన్ని పొందింది. ఎవరితోనైనా నిస్వార్థమైన ప్రేమబంధం కలిగి అది ఇష్టపూర్వకమైన త్యాగ శక్తివల్ల అనుసరించబడినప్పుడు చివరకా వ్యక్తిని దైవసాన్నిధ్యానికి చేరుస్తుంది.

నర్గీస్ బలహీనంతో పాటు సుకుమార శరీరతత్వం కలదగుటవల్ల, ఆశ్రమ జీవితము ఆమెకు అంత సులభం కాలేదు. వారి కుటుంబం బాబా దగ్గరకు వచ్చిన మొదట్లో ఆయనతో పాటు ఒకసారి బస్సులో ప్రయాణిస్తుండగా నిస్త్రాణ పడసాగింది. దానికి తోడు అలవాటులేని కఠోర నియమాలతో కూడిన కొత్త జీవిత విదానంలో తన వ్యాధినుండి ఇప్పుడిప్పుడే కోలుకుంటోంది. చివరకు ఆమెకు ఉపశమనము కలిగించేందుకు బాబా బస్సు కొంతసేపు ఆపించారు. బాబా బస్సు దిగి దానిపక్క నిలబడ్డారు. హఠాత్తుగా ఆమె మనస్సులో ఒక ఆలోచన తళుక్కుమన్నది. "ఒక వేళ నేను చచ్చిపోతే నా ముగ్గురు పిల్లల గతి ఏమవుతుంది ?" అనుకున్నది. సర్వజ్ఞుడైన బాబా ఆమెవైపు తిరిగి, ఎంతో ప్రేమతో ఆమె ఆలోచనకు ప్రతిస్పందిస్తూ "విచారించకు, నీవు ఇప్పట్లో చచ్చిపోవు. నేను ఎల్లప్పుడు నీ పిల్లలతోటే ఉంటాను" అన్నారు. అదివిన్న నర్గీస్ ఆశ్చర్యపోయింది. తగు సమయంలో స్పందించిన ఓదార్పుకు నర్గీస్ గాఢంగా ఊరట చెందింది, బాబాను అనుమానించినందుకు విచారించినది.

ఆమె తన జీవితంలో ఎదుర్కోవాల్సిన సమశ్యల్లో బాబా తప్పక తనకు సహాయ పడతారనుకోసాగింది. ఆయన సర్వజ్ఞత్వాన్ని యీ సంఘటన ఆమెలో నమ్మకాన్ని పెంచింది. బాబాపైన నమ్మకము, విశ్వాసమనే విత్తనము ఆమె హృదయ క్షేత్రంలో నాటబడింది. క్రమంగా ఆమె బాబాను తన ఆధ్యాత్మిక గురువుగా అంగీకరించ సాగింది. బాబాతో ఆమె బంధం ఆయన కురిపిస్తున్న ప్రేమవల్ల మరింత ధృడపడింది. అలా 14 ఏళ్లపాటు ఆమె ముగ్గురు పిల్లల్ని మంచి స్కూళ్లకు పంపి విద్యాబుద్ధులు అబ్బేట్లు చేశారు.

ఇప్పుడు 1954లో వాళ్ల స్కూలు చదువులు పూర్తగుట వల్ల, నర్గీస్

బొంబాయి వెళ్లి ఆదీ నజూల బాగోగులు చూచుకోవలసిన అవసరం ఏర్పడింది. కనుక ఆయన అనుమతితో ఆమె ప్రశాంతమైన మెహెరాబాదు వాతావరణాన్ని వదులుకొని మరోసారి, శబ్ద కాలుష్యంతో కూడిన రణగొణ ధ్వనులు, క్రిక్కిరిసిన జనం మధ్య కాపురం పెట్టింది. ఏమైనప్పటికి బాబాతో తన ఆంతరిక బంధాన్ని యధాతథంగా నిలుపుకున్నది. బాబాతో ఒకసారి ఎవరైనా సంబంధం పెట్టుకుంటే ఆయన సాన్నిహిత్యాన్ని అనుభవించుటకు, ఆయన భౌతిక రూపపు సాన్నిహిత్యముపై ఆధారపడి వుండదు. కావలసింది ఆయన ఇచ్ఛను పాటించుట మాత్రమే. ఆయన సర్వజ్ఞమైన ప్రేమతో బంధాన్ని కొనసాగించేది ఇదే.

1954 జూలై 6న నర్గీస్ మెహెరాబాదు నుండి బొంబాయి వెళ్లిన రెండు రోజులు తర్వాత బాబాకు అత్యంత సన్నిహిత సహచరుల్లో ఒకరైన గాబ్రియల్ పాస్కల్ న్యూయార్కులో రూజ్‌వెల్టు హాస్పిటల్‌లో పరమ పదించాడు. ప్రఖ్యాత హాలివుడ్ చిత్ర నిర్మాత అయిన పాస్కల్ మెహెర్‌బాబా పై చిత్రాన్ని నిర్మించే కార్యక్రమంలో కొన్నేళ్లుగా కృషి చేస్తున్నాడు. ఆయన మరణించగానే ఈ నిర్మాణానికి సహకరిస్తున్న మరో బాబా ప్రేమికుడు "అంతా అయిపోయింది. ఫొనెక్సు (ఇది పాస్కల్‌కు బాబా పెట్టిన మారుపేరు) నిన్ను ఎంతో గాఢంగా ప్రేమించాడు" అంటూ తంతిని పంపాడు. దానికి బదులుగా మెహెర్‌బాబా "పాస్కల్ నన్ను చేరాడు - బాబా నుండి ప్రేమతో" అంటూ తంతిని పంపారు. దివ్యప్రియతముని ప్రేమ గుర్తుగా ఒక మేధావంతుని నాటకీయ ఘట్టము ఇలా ముగిసింది.

ప్రపంచ చలన చిత్ర పరిశ్రమలో మేధావియైన పాస్కల్ బాబాను 1934లో స్విట్జర్లాండు నందలి జూరిచ్‌లో మొదటిసారిగా కలుసుకున్నాడు. ఈ తొలి దర్శనంలో మండలి సభ్యులు ఒకరు వ్యాఖ్యానించినట్లు పాస్కల్ సింహంలా లోనికి వెళ్లి మేక పిల్లలా బయటకు వచ్చాడు. ప్రకాశించే బాబా సమక్షము అతని హృదయానికి గాఢంగా హత్తుకు పోయింది. పాస్కల్ నిర్వహించే పనిలో బాబా ఉత్సాహాన్ని వ్యక్తం చేశారు. వారిరువురు కలిశిన తర్వాత, పాస్కల్ తాను నిర్వహిస్తూన్న అనేక చిత్ర నిర్మాణాల గురించి బాబాకు వ్రాశాడు.

50 దశకంలో పాస్కల్ "సద్గురు పాద రక్షలు" అనే పేరుతో బాబాపై ఒక సినిమా తీయాలని సంకల్పించి, తన యావశ్చక్తిని ధారపోశాడు. వ్యాపార రీత్యా భారీగా పంపిణీ జరిగేందుకు అనువుగా ఈ చిత్రానికి 1954 ఫిబ్రవరి 25న ఆంధ్రాలో జరిగే బాబా జన్మదినోత్సవ వేడుకల్ని చిత్రీకరించి జోడించాలనుకున్నాడు.

దానిని చిత్రీకరించుటకు పాస్కల్ అప్పటికే భారతదేశం వెళ్లుటకు విమానం టిక్కెట్లు కూడా కొన్నాడు. చివరకు అనుకోని సమస్యలెదురై అతని పథకాలన్నీ రద్దు చేసుకొనేట్లు చేశాయి. ఆ తర్వాత అతనికి జబ్బు చేసి, న్యూయార్కులోని రూజ్‌వెల్టు హాస్పిటలులో చేరాడు.

1954 జూన్‌లో హాస్పిటల్‌లో ఉండగానే పాస్కల్ రెండు ఉత్తరాలు వ్రాశాడు. ఈ క్రింది తెలిపిన వివరాలు బాబాతో అతనికున్న సంబంధపు మాధుర్యాన్ని తెలుపుతాయి.

నా ప్రియతమ బాబా,

నేను కొత్తగా పుట్టిన పశివాడిలా మళ్లీ జీవితాన్ని ప్రారంభించాను. అయితే అది మెల్లగా నడుస్తోంది. నీవు నాకు మానవ జీవితం గురించి ఒక భయంకరమైన కొత్త అనుభవాన్ని ప్రసాదించావు. ఇప్పుడు నేను ప్రతిదానిని ఒక సరికొత్త కోణంలో చూస్తున్నాను. ఇక్కడ నేను నా ఆరోగ్యంలో చాలా సార్లు తగ్గినట్లే తగ్గుతూ మళ్లీ రేగుతోందని నేను అంగీకరిస్తున్నాను. బాడెన్ - బాడెన్‌లో నేను ఆరోగ్యవంతుడినై ఆగష్టు నెలాఖరుకు మీ పవిత్ర బాహుబంధంలో (ఇండియాలో) ఉండగలను. మీరు సదానాతోనే ఉన్నారని నాకు తెలుసు. మీరు లేకపోతే యీ ప్రపంచంలో నేను ఒక చిన్నమాలవాని కంటే అప్రయోజకుడ్ని అవుతాను.

ఎన్నడూ లేనంతగా నా శరీరము బలహీనమైంది. కనుక నీవే గురువుగా సమతూకాన్ని నీ చేతులలో కలిగి ఉన్నావు. మానవ సూత్రాలనను సరించి నీవు దివ్య క్రీడను ప్రదర్శిస్తున్నావు.

అప్పుడప్పుడు నా మరణ వేదన సమయంలో సైతం నేను అతి నీచమైన వాఖ్యల్ని చేయటాన్ని నీవు విని ఉండవచ్చును. కానీ కొన్ని వేల సంవత్సరాల క్రితం, నేను ఒక వన దేవతనో లేదా పవిత్ర ప్రసాదం ఉంచే పాత్రనో అయివున్నానని నీవెరుగుదువు. దేవుళ్లకు వేడుక కలిగించే పోతరాజుగా నాకు అనుమతినిచ్చి నందున అది నా రక్తంలో నిండి ఉన్నది. కనుక వేలాది సంవత్సరాల క్రితం మాదిరి నేను మాట్లాడి ఉంటే దయచేసి నన్ను క్షమించు. అయినా అప్పటి దేవుళ్లు ప్రేమించినట్లే నీవు నన్ను ప్రేమిస్తావని నాకు తెలుసు. ఈ దౌర్భాగ్య కర దురవస్థలో నాకదే కొండంత ఊరట కలిగిస్తుంది.

ఎప్పటికీ నీ వాడైన

నీ ఫోనిక్స్ పక్షి, గాబ్రియల్

నిజానికి ఫాస్కల్ ఒక గొప్ప మేధావంతుడు. ఆయన జీవితమంతా దైవాన్వేషణకు బ్రతుకు తెరువుకు మధ్య నలిగి పిప్పై పోయాడు. ఆయన ఒక రాజుగా బ్రతికాడు. అయితే నిరంతరం అప్పుల్లో మునిగి నిర్ధనుడిగానే మరణించాడు. అయినప్పటికీ, అతని మరణానంతరం జార్జిబెర్నార్డ్ షా రచించిన పిగ్మేలియన్ చిత్రం ఆధారంగా తీసిన మైఫెయిర్ లేడీ అనేసంగీత చిత్రం ఫాస్కల్‌కుసర్వహక్కులు ఇవ్వటంవల్ల అయన వారసులకు బ్రహ్మాండమైన అదృష్టాన్ని తెచ్చి పెట్టింది. ఏమి దుర దృష్టం అయితే ఈ ఫోనిక్స్ పక్షి(హంస) "పాస్కల్ నాలో చేరాడు" అని బాబా తన కేబుల్‌లో తెలిపినట్లు, నిజమైన సంపదను జయించటం జరిగింది. ఈవిధంగా బాబా కృపవల్ల ఫోనిక్స్ పక్షి పాస్కల్ తన రెక్కలను విప్పి బాబా ప్రేమ మందిరంలోనికి ఎగిరిపోగలిగాడు!

## మతము మరియు మౌన దినముగురించి

1954జూలైలో బాబా శిష్యుల్లో అనేకులు "మతము గురించిన సత్యము' ' అనే పేరుతో అతిఘనమైనవ్యాసాన్ని వ్రాశారు బాబా బోధల అధారంగా ఆయన సందేశాలనుండి కొన్ని ముఖ్యమైన సదేశాలను జోడించి ఖరారు చేసిన అంగ్లవ్యాసాన్నిబాబాకు చదివి వినిపించారు. అయన దీనిని అమోదించి, హిందీ, మరాటి, తెలుగు, తమిళము, మళయాళం, గుజరాతి భాషల్లో తర్జమా చేసి ప్రచురించమని ఆదేశించారు. దీని ఆంగ్ల మూలాన్ని ముందుగా "ది ఆవేకనర్ 'లో ప్రచురించారు. ఇందులో ఎంపిక చేసిన కొన్ని భాగాల్ని ఈ క్రింద మళ్లీ పొందుపరుస్తున్నాను.

ఎవరైనా భగవంతుడ్ని త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తూ, రూపాలు లేదా విగ్రహాల మధ్యస్థత ద్వారా విశ్వాసాన్ని పెంచుకుంటే అటువంటివారు అందరికీ సన్నిహితుడైన దైవానికి మరింత చేరువ కాగలరు. నమ్మకము యొక్క స్వభావము, తమ విశ్వాసపు రూపము లేదా విధానములో ఉండదు. అయితే దాని వెనుక ఉన్న అవగాహన, మరియు నిష్కపటములందుంటుంది. విశ్వాస మనునది, మహాపర్వతాన్ని సైతం కదిలించగలదు. ఏ అజ్ఞానం వల్ల తన నిజమైన దైవత్వపు ఈషద్దర్శన భాగ్యాన్ని విస్మరించి, తన యధార్థ గుర్తింపును మరుగు పరుస్తున్నాడో, అటువంటి అజ్ఞానమనే మహాపర్వతాన్ని సైతం కదలించగలదు.

భగవంతుడు సర్వస్వతంత్రుడు, ఆనందము జ్ఞానము, శాశ్వత నిత్యుడు భగవంతుడే. ఆయన్ని మానవ నిర్మిత ఆలయాల్లో, నాలుగు గోడల మధ్య బంధించటం, మన అజ్ఞానానికి ప్రత్యక్ష తార్కాణం. భగవంతుడు కొలవశక్యం కాని వాడు. ఆయన్ని సిద్ధాంతాలు మతాలు, మతపర విశ్వాసాలు అనే ఇరుకైన పరిమిత మార్గాల మధ్య బంధించటాన్ని బట్టి మనలో భగవంతుని సర్వజ్ఞత్వము గురించిన యథార్థ జ్ఞానము లేదని ఒప్పుకున్నట్లవుతుంది.

మానవుడు తనకు తెలియకుండానే ఎప్పటికప్పుడు ఏదో ఒక ఉన్నతమైన దానిని పొందాలని నిరంతరం అన్వేషిస్తున్నాడు, అభిలాషిస్తున్నాడు, పరితపిస్తున్నాడు. అతడీతపనను, అత్యాస, అధికారము, మానవ ప్రేమల రూపంలో వంచనతో వ్యక్తపరుస్తున్నప్పటికీ అన్వేషణ సాగుతోంది.

విశ్వాస పాత్రుడు లేదా ద్రోహి, తాకదగిన వాడు, తాకరాని వాడు, నల్లవాడు, తెల్లవాడు, ఎర్రవాడు, పచ్చవాడు ఎవరైనా సరే ప్రతి స్త్రీ పురుషులు చివరకు నిర్దేశితమైన అద్వితీయ గమ్యాన్ని చేరాల్సినవారే.

వివిధ మతాల నుండి వచ్చిన వారెందరో మెహెర్ బాబాకు అనుచరులగా ఉన్నారు. ఒకప్పుడు వారి స్నేహితులు, అపరిచితులు సైతం మెహెర్ బాబా తన అనుచరులను తమ మతాన్ని వదిలి పెట్టమంటున్నారా, అని అడిగేవారు. ఇందుకు భిన్నంగా మెహెర్‌బాబా ఇలా వివరించారు :

నీకు ఇష్టమైన మతాన్ని అనుసరించు అయితే దాని లోపలి అంతరంగ భావం ప్రకారం నడుచుకో. అంతేకాని, అందులో అంతర్లీనమై ఉన్న సత్యాన్ని విస్మరించి ఊకదంపుడు పద్ధతులు అవలంభించి ఎగతాళి పట్టించకు మతమనేది యథేచ్ఛగా విహరించే ఒక సాధనము కారాదు. సత్యపు పదములో జీవించాలి. నేనే మతమునకు చెందను. ప్రతి మతము నాకు చెందినదే. నా స్వంత మతము, నేను పురాణ పురుషుడిగా, అనంతుడిగా ఉండుటయే. నేను అందరికి ప్రభోదించేది, భగవంతుని ప్రేమించండని, అన్ని మతాల సత్యము ఇదే.

ఈ సందర్భంలో బాబా సంగ్రహంగా వివరించిన మరో వివరణ గుర్తొచ్చింది. “అన్ని మతాలు గొప్పవే, కానీ భగవంతుడు అంతకంటే గొప్పవాడు” అన్నదే ఆ వివరణ.

జూన్ నెల ఆఖరి వారంలో ఇండియాలోని బాబా ప్రేమికులందరికి మౌన దినాన్ని పాటించుట గురించి ఈ క్రింది ఆదేశాలు పంపబడినవి :

10 జూలై 1954 సా॥ 6-00 నుండి తన ప్రేమికులంతా భారతీయ కాలమానము ప్రకారము 11 జూలై 1954 సా॥ 6-00 వరకు ఉపవాసం ఉండి మౌనాన్ని పాటించాలని బాబా కోరుతున్నారు. ఈ ఉపవాసం మౌనం పాటించే సమయంలో మంచి ఆలోచనలు, మంచి పనులు పోషించుటకు ప్రయత్నించాలని, ఆ 24 గంటల మౌన, ఉపవాస దీక్షా సమయంలో సాధ్యమైనన్ని సార్లు, ఏదో ఒక ఇష్ట దైవనామాన్ని మనస్సులోనే స్మరించాలని ఆదేశించారు.

ఉపవాస కాలంలో టీ, కాఫీలు మూడుసార్లు త్రాగుటకు అనుమతించారు. తరచుగా మంచినీళ్లు త్రాగవచ్చును.

మెహెర్ బాబా 10 జూలై 1925 నుండి మౌనాన్ని పాటించుట ప్రారంభించారు. అలా ఆ మౌనాన్ని 43 ఏళ్ల పాటు 31 జనవరి 1969న తన మానవ రూప శరీరాన్ని పరిత్యజించే వరకు అఖండంగా పాటించారు. 1953 అనంతరం, దాదాపు ప్రతి సంవత్సరం, బాబా ఆదేశాల ప్రకారం, మౌనాన్ని పాటించదలచిన తన ప్రేమికులు మౌన దినము నాడు, పాటించవలసిన ప్రత్యేక ఆజ్ఞలతో కూడిన సర్క్యులరు జారీ చేయబడేది. ఒక్కొక్కప్పుడు ఒకదైవ నామాన్ని బిగ్గరగానో లేదా మనసులోనో స్మరించమని ఆయన కోరేవారు. కొన్నిసార్లు ఉపవాసము ఉండమని లేదా మౌనం పాటించమని లేదా రెండూ చేయమని ఆయన కోరేవారు. అటువంటి ఆఖరి సర్క్యులరులో 1968 మేలో ఆది కె. ఇరానీ చే జారీచేయబడిన దానియందు మెహెర్ బాబా తన వాంఛితాన్ని ఇలా వ్యక్తం చేశారు :

జూలై 10న జరిగే నా 43వ మౌన వార్షికోత్సవం నాడు, నా ప్రేమికులంతా 9 జూలై అర్ధరాత్రి నుండి 10 జూలై 1968 అర్ధరాత్రి వరకు సంపూర్ణ మౌనాన్ని పాటించాలని నేను వాంఛిస్తున్నాను.

బాబా కార్యదర్శి ఆదీ ఈ క్రిది పంక్తులను జోడించాడు.

దయచేసి గమనించండి ఉపవాసం ఉండకపోతే మౌనాన్ని పాటించుట అసాధ్యమనుకోనే వారు తమ ఇష్ట ప్రకారం చేయుటకు బాబా ఎటువంటి అవకాశము ఇవ్వలేదు.కనుక దీని గురించి తదుపరి వివరణలు కోరుతూబాబాకు ఎవరూ ఉత్తరాలు వ్రాయవద్దు.

జూలై10 గురించి బాబా ప్రేమికులకు అందించిన ఒక నిర్ధుష్టమైన ఆదేశము ఇదే చివరిది.అనంతుడైన భగవంతుడు మెహెర్‌బాబాగా అగుటకు ధరించిన అవతార దుస్తు మన దృష్టి నుంచి ఇప్పుడు కనుమరుగైంది. అందువల్ల మండలి వారిని. అదేరోజున మౌనాన్ని పాటించాలా వద్దా అని ఎవరైనా

ప్రశ్నించవచ్చును. 1979లో మెహెర్ బాబా సోదరి మణీ మెహెరాజాద్ మండలి హాల్లో మాట్లాడుతున్నప్పుడు. ఈ విషయంపై తన ఉద్దేశాలను పాలు పంచుకుంటూ ఇలా చెప్పింది.

ఏ బాబా ప్రేమికులు కూడా మనము మౌనాన్ని పాటించాలా వద్దా అని ఎంత మాత్రం అనుకోవలసిన ప్రశ్నేలేదు. మనము దానిని వదలకుండా కొనసాగించుటకు అది ఒక అవకాశము ప్రతి బాబా ప్రేమికుడు మౌనదినమైన 10జూలైన తప్పని సరిగా మౌనాన్ని పాటించి తీరాలన్నదే నాఉద్ధేశ్యము. మీ ప్రియతమ బాబాకు నమస్కరించి ఒక గులాబీని సమర్పించండి. అలా చేయుటను మీరు ఆచారమనో లేదా కర్మ కాండ అనో పిలవవద్దు అది మీ ప్రేమను వ్యక్తపరచటం మీ హృదయంలో ఒక చిన్న ముక్కను అర్పించటం... బాబా అందరి కొరకు మౌనాన్నిపాటించారు. మనలో ప్రతిఒక్కరి కొరకు పాటించారు. కనీసం ఒకరోజునన్నా దీనికి ప్రత్తుతరంగా అకాస్తంత పాటించకపోతే సంవత్సరానికి ఒక్క రోజన్నాపెదాలు కదలకుండా ఉండ లేకపోతే అప్పుడది చాల దుష్కృత్యమే అవుతుంది. మనం మౌన్నాన్ని పాటించినంత మాత్రం చేత ఈ ప్రపంచాన్నేదో ఉద్ధరిస్తామని లేదా అలాంటిదేదో సహాయపడుటకని కాదు. అందు కోసం మనం పాటించటంలేదు.అది కేవలం ఆయనకు మనయందున్న ప్రేమకు భక్తిగా అందించే ఒకవందనం, ఆయనకు వ్యక్తపరిచే మన ప్రేమ. ఇన్నేళ్లు ప్రియతమ బాబా మౌనాన్ని పాటించారు. ఆయనతో పాటు కనీసంఒక్కరోజన్నా పాలు పంచుకోమని ఆయన చెప్పారు. మనం ఎంతటి అదృష్టవంతులం!

1954లో జులై10న హమిర్ పూర్ జిల్లాలోని ఒక గ్రామంలో ఉన్నప్రజలు దాదాపు 75శాతంపైగానే 24గంటల పాటు మౌనాన్ని పాటించారు. నిజానికది ఎంత అదృష్టమైన గ్రామం!

ప్రతి ఏడు జూలై10న మౌనం పాటించే అవకాశం గురించి ఆఖరి జీవిత సర్క్యులరులో పేర్కొన్న వివరణ అయన తనప్రేమికులకు అందించిన బహిరంగ అహ్వానంగా మిగిలిపోతుంది అనాడు మౌనంపాటించుట అంటే ఆయనతో తమకున్న సంబంధాన్ని పునరుజ్జీవింప చేయుటకు బాబాను అహ్వానించుట అన్న మాట. ఏమైనప్పటికీ కూడని పరిస్థితులలో తగు నిర్ణయం తీసుకోవటం, అయావ్యక్తులతోనే ఉన్నదని నావ్యక్తి గత అభి ప్రాయము - ప్రతి ఏడు ఎవరు ఏమి నిర్ణయించినా. అది నిజాయితీతో మనః పూర్వకమై ఉంటే తప్పక బాబాను సంతోష పెడుతుంది. మనకుమనం అవగాహన చేసుకున్న దానికంటే అధికంగా ఆయన మనలను అర్థం చేసుకుంటారు.

# అవతారునితో రోడా జరిపిన కీలక సమవేశం

జూలై మధ్య భాగంలో బాబా అదేశాలప్రకారం ఎరుచ్ వ్రాసిన జాబు నాకందింది. అందులో ఇలా ఉన్నది.

1954 సెప్టెంబరు 29-30 తేదీలలో మెహెరాబాదులో జరిగే సమవేశాల గురించి అందించినజీవిత సర్క్యూలరు నం18ని, బాబా ప్రేమికులకు, భక్తులకు, నీకు తెలిసిన అభిమానులకు పంచిపెట్టుటను మరచిపోవద్దని, సాధ్యమైనంత మందికి పంచి పెట్టమని మరోసారి బాబా నీకు జ్ఞాపకం చేయమని మళ్లీ చెపుతున్నారు.

ఈ ఉత్తరంలో ఈ సారి వివరిస్తున్న అతి ముఖ్య విషయమేమంటే, బాబా కేవలం అభిళిషించుట మాత్రమేకాక, తన ప్రేమికులు అందరూ (పురుషులు మాత్రమే) ఈ సమావేశాలకు తప్పక హజరుకావాలని కోరుతున్నారు. వాటికి ప్రత్యేకమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యత ఉన్నది... బాబా తన ప్రేమనందిస్తున్నారు'.

అదేవిధంగా నేను నాస్నేహితులకు బంధువులకు ఈ వార్తను పంచిపెట్టాను. దీనికి ప్రతి స్పందన అంత ఉత్సాహపరచలేదు అయినా నావంతు కృషి చేశాను, మిగిలిన దంతా బాబాకు వదిలాను ఈ భాధ్యతను నాకు వప్పగించుటలో బాబా నాయందుంచిన నమ్మకం నాకు ముఖ్యమైంది. ఈ చిన్న పని ద్వారా అయన నాతో తన కున్న అన్యోన్య సాన్నిహిత్యాన్ని వ్యక్తపరిచారని భావించాను. భవిష్యత్తులో ఇతరులతో పాలుపంచుకొనుటకు నాహృదయ క్షేత్రంలో బీజాల్ని నాటారను కున్నాను.

అదే సమయంలో ఆ సమావేశాలకు హజరు కాగోరే బాబా ప్రేమికులు వసతి ఏర్పాట్లకై పంపే ధరఖాస్తులను ఆదీ అందు కోవటం ప్రారంభించాడు. రాబోయే వారి సంఖ్యను పేర్లను బాబాకు అదీ తెలుపుతున్నాడు. దీనితో పాటు పాద్రి, పేండూ, చగ్గన్‌లు క్రింది మెహెరాబాదులో వసతి ఏర్పాట్లు చేయడంలో హడావిడిగా ఉన్నారు.

సరోష్, ఆదీలకు పాశ్చాత్యుల సౌకర్యార్థం సెప్టెంబరు 11 నుండే పై మెహెరాబాదులో ఉండేందుకు అవసరమైన ఏర్పాట్లు పర్యవేక్షించే పనిని వప్పగించారు.

బాబా యొక్క బహుకాల శిష్యులైన ఇంగ్లాండు దేశస్తులు విల్ బాకెట్,



8.

చార్లెస్ పర్డమ్‌లు అగష్టు 20కే బొంబాయికి చేరుకున్నారు. ఈ సమావేశ సమయానికి ఇండియాకు చేరుటకు అనుకూలంగావచ్చే స్టీమర్లు లేక పోవటం చేత మూడు వారాల ముందే రావాల్సి వచ్చింది. బొంబాయిలోని ఒక మంచి హోటలులోదిగి, మెహెరాబాదుకు వెళ్లాల్సిన నిర్ణీత సమయంవరకు, వారు నారిమన్ మెహెర్జీలను తరచూ కలుసు కుంటూ కాలక్షేపం చేశారు.

• అప్పటి వరకు సతారాలో ఉంటున్న బాబా అహ్మదునగరుకు వెళ్లుటకుఅగష్టు 31న బయలుదేరి దారిలో పూనాలో కొద్ది రోజులు గడపాలని నిర్ణయించారు. అలా బయలుదేర బోయే ఒక రోజుముందు, ఆయన ప్రేమికుల్లో ఒకర్తైన రోడాదుబాస్‌కు పురుషమండలి ఉంటున్నరోజ్ ఉడ్ బంగళాలో బాబాతో అత్యంత ఘనమైన సమావేశం జరిగింది

అసమావేశం ఇలా జరిగింది. 50దశకంలో రోడా మరియు అమె భర్త ఆదీ, పాకిస్తాన్‌లోని కరాచీలో ఉండేవారు.1954 అగష్టులో రోడాతన ఇద్దరు కొడుకుల్ని వెంటబెట్టుకొని మహాబలేశ్వర్ దగ్గర్లో ఉన్న ఒక అరోగ్య ప్రదమైన ప్రదేశం, పంచగనిలో ఉండి శలవులు గడపాలని వచ్చింది. అయితే అమె యీదేశంలో ఉండగానే బాబా దర్శనం చేసుకునే వీలుంటుందేమోనని అశించింది. అందువల్ల బాబా ఇప్పుడు ఎక్కడ ఉన్నారో తెలపమని బాబా కార్యదర్శి అదీకి జాబు వ్రాసింది. ఆదీ ప్రత్యుత్తరమిస్తూ ఇప్పుడు బాబా సతారాలోఉన్నారని అయన ఏకాంతంలో లేనప్పటికీ తన ప్రేమికులెవరికీ అయనదర్శనము ఇవ్వటంలేదని వ్రాశాడు

ఇది కొంత అసంతృప్తికరమైన వార్తే అయినా, రోడా గత రెండేళ్లనుంచి అయన్ని దర్శించ నందున బాబా దివ్య దర్శనంకోసం మరింత పరితపించింది. అమె పంచిగనిలో ఉండగానే అక్కడకు 50మైళ్ల దూరంలో ఉన్న సతారాకు తన బంధువొకరు తరచూ ఉదయం వెళ్లి మరల సాయంత్రానకి తిరిగి వస్తున్నాడని తెలుసు కున్నది. అతడ్ని కలసితనూ ఒకసారి సతారా వస్తానని అడిగింది.అమెబంధువు వెంటనే అంగీకరించాడు. అలా అగష్టు 30న రోడా తన ప్రియతమ ప్రభువు మెహెర్ బాబాను దర్శించాలన్న అతురతతో బయలు దేరింది.

సతారాచేరంగానే రోడా తన బంధువుతో తనను బాబా ఉంటున్న బంగళా గ్రాఫ్టన్‌కు తీసుకువెళ్లమని చెప్పింది అయితే దారిలో రోడా తన మనసులో చెప్పా

పెట్టకుండా ఊడిపడుతున్నందుకు బాబా ఏమంటారో? అని అనుతాపం చెందసాగింది ఇప్పుడు నేనేమిచేస్తున్నానని అశ్చర్యపడింది. అయినా తనకు తాను అనునయించుకొని, తాను ఒక అతిముఖ్యమైన వ్యక్తి గత విషయాన్ని ఆయనతో చెప్పదలచినందున తాను తప్పక వెళ్లాల్సిందేనని నచ్చ చెప్పుకున్నది. ఏమైనప్పటికీ ఇప్పుడు వెనుతిరిగి వెళ్లేసమయం మించి పోయింది.

కారు బంగాళా వద్దకుచేరువయ్యే సరికి అమె తన బంధువును గేటుకు కోచం దూరంలోనే అపమన్నది ఆక్కడ అమెదిగిపోయి, మళ్లీ సాయంత్రం వచ్చి తీసుకువెళ్లమని కోరింది. బాబా విధానాలుతెలిసిన రోడా, కారును అక్కడే అపి ఉంచితే బాబా అమెను కొన్నినిమిషాలు దర్శనం చేసుకోనిచ్చి వెంటనే పంపించి వేస్తారని అనుమానించింది నడిచి వెళితే వెళ్లిపోవుటకు నిస్సహాయురాలవుతుంది ప్రేమలోను కయ్యంలోనూ అంతా సాను కూలవే అనుకుంటూ కారుకనుమరుగయ్యేవరకూ చూస్తూ నిలబడింది. చిన్న మచ్చగా కనిపించినప్పుడు కదిలి బాబా బంగళా గేటువైపు అడుగులు వేసింది బాబా అమెరికన్ శిష్యుల్లో ఒకరైన రానోగాలే ఎదురై ఏంకావలని అడిగింది. అందుకు జవాబుగా రోడాబదులిస్తూ "నేను మెహెర్ బాబాను చూచేందుకు వచ్చా" నన్నది "అయన ఎవరిని చూచుటలేదు" అని రానోబదులిచ్చింది "అయతేసరే కొద్దిగా ఒక చిన్న కబురును ఆయనకు అందించండి. కరాచీ నుంచి అయన ప్రేమికురాలు ఒకరు తన జీవితాన్ని అయన పాదపద్మముల చెంత సమర్పించుకొనుటకు వచ్చిందని ఆయనతో చెప్ప" మనిరోడా అడిగింది రోడా మాటలువిన్న రానో చలించిపోయింది. మరుక్షణంలోనే గేటు చెంతకు వచ్చి రోడాతో కరచాలనం చేసింది. ఒక్క నిమిషం అగమని చెప్పి ఇంటిలోకి వెళ్లిపోయింది. కొద్ది నిమిషాలు గడిచిన తర్వాత రానో తిరిగి వచ్చి "నేను నీకబురును బాబాకు అందించాను. అయన చాల అనందించి నిన్ను పురుష మండలి ఉంటున్న రోజ్ వుడ్‌కు 2గంటలకు రమ్మన్నారు" అని చెప్పింది.

రోడా ఆనందపరవశురాలైంది "అయితే దయచేసి రోజ్‌వుడ్ ఎక్కడ వున్నదో చెప్పండి? అని అడిగింది" ఏం, ఎందుకని? నిన్ను తీసుకువెళ్లేందుకు ఎవరు లేరా?"అని రానో అడిగింది.రోడా చాలా ఆమాయకురాలు." ఏఒక్కరు లేరు? అని బదులిచ్చింది.

రానో అమెను కాశేపు మళ్లీ అగమాని చెప్పింది. ఇప్పుడుబాబా తప్పక

ఆమెను లోనికి రమ్మని అనుమతిస్తారని రోడా ఆశపడింది. కొద్దిసేపట్లోనే డా॥ గోహెర్ ఆమె వద్దకు వచ్చింది. ఆప్యాయతగా వారిరువురు ప్రేమాలింగనం చేసుకున్నారు. ఆమెతో గోహెర్ "నిన్ను కోహియార్ సతారావాలా గారి ఇంటికి తీసుకు వెళ్లమని బాబానాతో చెప్పారు. బాబా ఆదేశాల ప్రకారం ఆతను నిన్ను 2గంటలకు రోజ్ ఫుడ్‌కు తీసుకు వెళతాడు, అక్కడ బాబానీకు దర్శనమిస్తారు' 'అని చెప్పింది. అలా చెప్పి గోహెర్, రోడాను వెంట బెట్టుకొని కోహియార్ ఇంటికి తీసుకువెళ్లి సైకిలు పై వెనక్కి వచ్చింది చాలా ఏళ్లు గడిచినతర్వాత ఇప్పుడు,రోడా నవ్వుతూ "నేను గ్రాఫ్టన్‌లో బాబాను దర్శించుటకు ప్రయత్నించలేదని మీరుచెప్పలేరు. బాబా అవతారుడు. ఆయనెప్పుడు మనకంటే ఒక మెట్టుపైనే ఉంటారు" అన్నది

కోహియార్ రోడాను చేతులు చాచి ఆప్యాయతతో ఆహ్వానించాడు అతడు ఆమెను బాబా దగ్గరకు తీసుకువెళ్లుటవల్ల తాను కూడా బాబాను చూచేందుకిది ఒక చక్కని అవకాశమైనందున ఆనందించాడు. భోజనాలు కాగానే, నిర్ణీత సమయం ఇంకా చాలా ఉన్నప్పటికి రోడా ఆలశ్యాన్నితట్టుకోలేక తొందర పెట్టింది. ఆమెకోహియార్‌లు కలిసి,త్వరగా చేరాలని పొలాలకడ్డుపడి దగ్గర దారిలో బయలు దేరారు.వారు ప్రధానరహదారిపైకి రాగానే వారికి ఎదురుగా ఒక కారు హారను మ్రోగిస్తూ ఎదురైంది

"అరుగో బాబా! అది ఆయనకారు" అంటూ కోహియారు అరుస్తూ హఠాత్తుగా ఆగిపోయాడు కారు వచ్చి వారిపక్కనే ఆగింది కిటికీ గుండాఎరుచ్ తన తలను టక్కున బయటకు పెట్టి, రోడాతో" నీవు ఎంత మాత్రం ఆలశ్యం చేయవద్దు అంటూ నవ్వుతూబాబానీ కోసం తన కారు పంపారు నీవు ఎండలో నడిచి రాలేవని నాతోచెప్పి తన కారులో రోజ్ ఉడ్‌కు తీసుకు రమ్మనమని నన్నుపంపారు అని చెప్పాడు. "అయితే బాబా ఎక్కడ కూర్చున్నారు?" అని రోడా అడిగింది "ముందు సీట్లో" అని బదులు వచ్చింది రోడ ఒక్క ఉదుటున ఎగిరి ముందుసీట్లో మౌనంగా కూర్చున్నది. కారులో కూర్చున్నంతసేపు బాబాను గురించే ఆలోచిస్తూ ఆయన మనోభావాలకు హత్తుకుపోయింది వారు రోజ్ఉడ్‌కుచేరగానే ఆమెతో ఎరుచ్. "లోపలికి వెళ్లుబాబానీకోసం ఎదురు చూస్తున్నారు." అని చెప్పాడు.

రోడా హాల్లోకి ప్రవేశించింది, కానీ ఆమెకళ్లన్నీ తేజోవంతమైన సూర్యరశ్మికి

అలావాటు పడిఉన్నందున, ఆలోపల ఉన్న చీకటికి ఇంకా సర్దుకోలేక పోవటంతో ఆమె బాబాను తిన్నగా చూడలేక పోయింది. అంతలోనే అమె, ఆ హాల్లో ఒక పక్కన వాలు కుర్చీలో కూర్చున్న బాబాను హఠాత్తుగా చూచింది. అయన యావత్తు శరీరం నుండి ప్రేమ ప్రతి ఫలిస్తోంది.సందేహిస్తూ అమె సమీపించగానే, బాబా చిరునవ్వు నవ్వి అమె కోసం చేతులు చాచారు.మరుక్షణంలోనే అమె అయనబాహు బంధంలో ఇమిడిపోయింది.

జీవితంలో చెప్పుకోవటానికి మాటలు చాలని మధుర క్షణాలు కొన్ని ఉంటయి. అటువంటి క్షణాల్లో రోడాకు ఇది ఒక అద్భుత ఘట్టం. ప్రియతముడు అమెకు అలింగనం చేసుకున్నందువల్ల మధురానుభూతిని అమె అనుభవించింది. ప్రేమ, సౌందర్యం, ప్రశాంతి, అమెనుండి ప్రవహించాయి ఆమె స్వస్థానానికి చేరింది.

బాబా తనపాదాల చెంత కూర్చోమని రోడాకు చెపుతూ "నీ ప్రేమ నన్ను ముగ్ధుడ్ని చేసింది" అని సౌంజ్ఞలు చేశారు. అమె భర్త అదీ క్షేమసమాచారాల గురించి అమె కొడుకు మేర్వాన్ గురించి వాకబు చేశారు. కానీ ఆయన, ఆమె రెండవ కొడుకు హోమీ గురించి ఏమీ అడుగలేదు. అతి సన్నిహితంగా కొనసాగుతున్న వారి సంభాషణ మధ్య బాబా అనుకోకుండా ఆమెను "నేను గనుక నీ కుమారులలో ఒకరిని నాకివ్వమని అడిగితే నీవు ఇష్టపూర్వకంగా ఇస్తావా ?" అని ప్రశ్నించారు.

రోడా ఎంతో అనందించి,ఏదో ఒకరోజున, తన మండలితోపాటూ అయనతో ఉండి పోయేందుకు తన కోడుకుల్లో ఒకరిని అలా ఇవ్వమని ఆడుగుతున్నారను కున్నది. ఆమె తడుముకోకుండా "అవును తప్పకుండా ఇస్తాను బాబా!" అన్నది. అమె జవాబు అయన్ని మరింత ముగ్ధుడ్ని చేసింది. అరు నెలలు గడిచిన తర్వాత, అమె చిన్నకోడుకు, హోమి ఒక ప్రమాదంలో మరణించాడు. బాబా యొక్క ప్రశ్నకు నిజమైన ప్రాముఖ్యత అమెకు ఆప్పుడు తెలిసివచ్చింది అయతే అదంతా వేరేకథ అది బాబాతో ఆదీ, రోడాలు గడిపిన జీవితంలో ప్రేమ, విధేయ తలగురించిన కథ.

అంతట బాబా తన సన్నిహిత మండలిలో ఒకరైన భావూని పిలిచి "ఈమె నీకు తెలుసా?" అని అడిగారు.నాకు తెలియదని భావూ చేప్పేసరికి బాబా ఆశ్చర్యాన్నివ్యక్తంచేసి, "నీవామెను ఎందుకు ఎరుగవు? అమె అదీదుభాష్ భార్య'

అని చెప్పారు. అలా చెపుతూ రోడా వైపుకొంటే చూపుచూచి, "ఆదీ అంటే బారుగా ఉండే ఛాయ తక్కువవున్నఅందగాడు, పెండు ఎరుచ్‌లు కరాచీలో ఉన్నప్పుడు సముద్రపు కయ్యలో వాళ్లనుదాదాపు ముంచి వేసిన వ్యక్తి" అని వివరించారు.

బాబా అప్పుడు ఎరుచ్‌ని కరాచీలో ఏంజరిగిందో అకథంతా భావూకు చెప్పమన్నారు. ఎరుచ్ అకథను చెపుతూ ఉండగా,బాబాతన అద్భుత సౌంజ్ఞలతో అసంఘటన యొక్క తాత్పర్యాన్ని వివరించారు. రోడా ఆయన కదలికల సరళతకు,వక్తృత్వానికి మంత్రముగ్ధురాలైంది. అక్షరఫలకం పై వేగంగా కదిలే ఆయనవేళ్లు. ఆయన వ్యక్తంచేస్తున్న అనేక హావభావాల సొంపులు అమెను కదిలించి వేశాయి. ఆయన్నిగమనిస్తూ ఆమె హృదయం,ప్రేమతో పొంగిపొరలి "నాకప్పు పొంగిపొరులుతోంది" అన్న మాటలకు ప్రాణంపోసింది.

కొద్ది సేపు గడిచిన తర్వాత,బాబా మండలి అమర్నాదుపూనాకు బయలు దేరాల్సిఉన్నందునవారికికొన్ని అంతిమాదేశాల్ని అందించుటకు రోడాను హాలు బయట ఉండమన్నారు. తర్వాత ఈ రోజున నీవు వచ్చినందున ఎంతో అదృష్టవంతురాలవయ్యావు. నీవు ఒకరోజు తరువాత వచ్చిఉంటే నేను ఇక్కడ ఉండే వాడినికాను అని బాబా రోడాతో చెప్పారు.

హాలువెనుక ఆమె స్థిమితంగా కూర్చొని,ఇంటి పనులు చక్కపెడుతున్న తన దివ్య ప్రియతముని సన్నిధానమును చూస్తున్న రోడా కళ్ల వెంట బాష్పాలు జాలువారాయి బాబాకు కనిపించనంత దూరంలో ఆమె ఉన్నది.ఆమె ఎటువంటి బాహ్యసంకేతాన్నిఅందించలేదు, ఆమె బుగ్గలపై కారే కన్నీళ్లు ఆమె దుఃఖిస్తున్నదని పించింది. అయినా బాబా మండలితో మాటల్లో మునిగిపోయినా, ఆమెవైపు తిరిగి కరుణార్ద్ర దృష్టితో ఆమెకొక సౌంజ్ఞచేస్తూ "ఏడవకు" అని, మళ్లీ; వెంటనే మండలితో తన చర్చను కొనసాగించారు. సర్వజ్ఞుడు తన సంపూర్ణ కాలములో తట్టుట నెన్నడూ వదులుకోడు.

కొంత తడవయ్యాక, బాబా తన మండలిలో ఒకరిని ఏదో పుస్తకాన్ని అడిగి తెప్పించారు. పిమ్మట రోడాను పిలిపించి, పక్కనున్న గదిలోకి వెళ్లి దీనిని చదవమని ఆమెను ఆదేశించారు. అది నీకు అర్ధం చేసుకొనుటకు సహాయపడుతుందని చెప్పారు. అలా బాబా మళ్లీ తన కరుణను వ్యక్త పరిచారు. సరిగ్గా అదేరోజు ఉదయం ఆమె కోహియార్ ఇంటికి వెళుతూ బాబా భోధించేది

ఏమిటని డా॥ గోహెర్‌ని అడిగింది. "కేవలం ఆయన్ని మనం ప్రేమిస్తే చాలని డా॥ గోహెర్ బదులిచ్చింది. అది రోడాకు చాల క్లుప్తమనిపించింది. అయితే ఇప్పుడుబాబా ఆ కరపత్రాన్ని ఆమె కందించటం ద్వారా ఆమె హృదయంలో పలకలేని ప్రశ్నలకు తన సహజ సిద్ధమైన వివేకముతో ప్రతిస్పందించారు.

ఆమె ఆపుస్తకాన్ని తీసుకోగానే రోడా తనలో "ఏదోవిధంగా బాబా నాకు వ్యక్తిగతంగా ఏదో ఒకటి ఇచ్చారుఅంతే చాలు" అనుకున్నది అయితే బాబాతన కళ్లను మెరిపిస్తూ "ఇటుచూడూ! నీవా పుస్తకాన్ని చదివాక తిరిగి యివ్వటం మరచిపోకు సుమా,అది భావూపుస్తకం" అని సౌంజ్ఞచేశారు.

ఎవరో వచ్చి రోడాను పక్క గదివద్దకు తీసుకువెళ్లి, ఆమె కూర్చొని చదువు కోనుట కనువైన చోటును చూపించారు. ఆ పుస్తకం పేరు మతము యొక్క సత్యము. మతము గురించిన సత్యము అను ఆపుస్తకాన్ని బాబా శిష్యులు గడచిన జూలైలో వ్రాశారు రోడా కూర్చొని చదివేందుకు సిద్ధ పడేసరికి, ఆ గదిలో తాను ఒక్కతేకాక, బాబా ఆదేశాలపై చాలాఏళ్లుగా మౌనాన్ని పాటిస్తున్న గుస్తాద్‌జీ అదే గదిలో తనపాత కోటు చిరుగుల్ని కుట్టుకుంటూ వేరే పక్కన బాసేపెట్టు వేసుకొని కూర్చున్నాడు. అతడు తల ఊపుతూ రోడాను పలకిరించే సరికి, గులాబీ రెకులు వంటి ఆమె ముఖం చిరునవ్వుతో వెలిగిపోయింది. అతడ్ని చూస్తున్న రోడాకు "ఆయనకిప్పుడు రెక్కలుకావాలి ఆయన తప్పకుండా ప్రధానదేవతే" అనిపించింది. ఆ తర్వాత పుస్తకం తెరచి చదవటంలో పూర్తిగా నిమగ్నమైంది. అలా ఆమె దీనిని చదవటం పూర్తిచేయగానే ఎవరో వచ్చినిన్ను బాబా పిలుస్తున్నారని చెప్పారు.

ఆమె హాల్లోకి ప్రవేశించగానే తన తోబుట్టువు బాబాను దర్శిస్తూ కనిపించింది ముందుగానే ఆ ఉదయంవారు నిర్ణయించుకున్నట్లు, గ్రాఫ్టన్‌కు తిరిగి వెళ్లే సమయంలో రోజ్‌ఉడ్‌కు రమ్మని అలావస్తే దైవీ మానవుడ్ని దర్శించే అదృష్టం లభిస్తుందని చెప్పటంవల్ల అతను వచ్చి బాబా దర్శన భాగ్యాన్నిపొందాడు.

మరి ఇప్పుడు రోడాకు వెళ్లిపోయే సమయమాసన్నమైంది. తనను వదిలి వెళ్లే బాధను భరించేశక్తి నిచ్చికరుణామయుడైనప్రియతముడు ఆమెను ఓదారుస్తూ అహ్మదునగరు వాడియా పార్కులో జరిగే దర్శనానికి మరో పన్నెండు రోజుల్లో నీవు మళ్లీ నాసన్నిధికి వస్తున్నావన్నారు.

అలా రోడా మరోసారి అతిసుందరమైన ఆదయామయుని ఆలింగన భాగ్యాన్ని పొందింది. దీనిని రోడా, బాబాతో కీలకమైన సమావేశంగా మరువలేని

రోజుగా అభివర్ణించింది.

ఎందుకంటే రోడా మొదటిసారిగా బాబాను 1945లో కలిసినా, సతారాలోజరిగిన ఈ ఎదుటపడే సన్నివేశము తనలో మెహెర్‌బాబా ఈ యుగావతారుడిగా మానవరూపంలోఉన్న యధార్థ దైవంగా పూర్తి విశ్వాశాన్ని కలిగించిన అతి సన్నిహితసమయం ఈ అంతర్గత రూఢి 1952లో ఒకరోజు ఉదయం, కరాచీలో తన ఇంట్లో ఒక కిటికీ దగ్గర నిలబడి ఉన్నప్పుడు ఉదయించింది ఆయన దివ్యత్వస్థితి యొక్క నమ్మకం హఠాత్తుగా తన శరీరంలో నరనరాన ప్రవహించింది. అది ఎంతో బలంగా ప్రకంపిస్తూ తనకు తెలియకుండానే ఉత్తేజపరిచింది. ఈ అనుభూతి ఆమెలో విశ్రాంతి లేకుండా చేసి,స్వయంగా బాబాతో ఆయన తనకిచ్చిన బహుమతి గురించి చెప్పిపూర్తిగా తన జీవితాన్ని బాబాకు అర్పించుట ద్వారాతన కృతజ్ఞతలను తెలపాలనుకొనేట్లు చేసింది అందుకే సతారాలో ఆయన్ని చూచితీరాలన్న ఆకాంక్ష పెరిగింది ఆమె రోజ్‌ఉడ్ దర్శించినప్పుడు, ఆమెను బాబా నిజంగా అంగీకరించారని, ఆమె హృదయంలో గాఢంగా ఉన్న భావాల్ని తెలుసుకున్నారని ధృడంగా విశ్వసించింది.

అవతారునితో రోడా యొక్క కీలక సమావెశంలో గడిపిన మధుర క్షణాలు, 40వ దశకం మధ్య భాగంలో నేను మెహెరాబాదు సందర్శించినప్పుడు జరిగిన ఒక చిన్న ఘట్టం గుర్తోస్తోంది మేము చాలా మందిమి పాత ఆశ్రమభవనంలో జరుగుతున్న సంగీత కార్యక్రమంలో పాల్గొన్నాం. అది పూర్తయ్యాక తనకు ప్రీతిపాత్రుడైన ఒకాయన్ని పాడమని ఏడిపిస్తూ సౌంజ్ఞచేశారు . అతడేదైనా భజన గీతమో లేదా ఘజలో పాడతాడని నేను అశించాను కానీ, ఆశ్చర్యంగా అతను ఒక పాశ్యాత్య పాటను పాడసాగాడు. బాబా సమక్షంలో అటువంటి పాటనువినడం నాకు అదే మొదటిసారి ఏమాత్రం గర్వం లేకుండా ఎంతో నిలకడగా పాడాడు. నాకు గుర్తున్నంత వరకు అపాటలోని తొలిపంక్తులు "సరిగ్గా నేనేమనుకుంటున్నానో వ్యక్తం చేయనా! నేనునిన్ను ప్రేమిస్తున్నానని బాహాటంగా ఒప్పుకోనా!" అంటూ సాగాయి బాబా అకస్మీకంగా అడిగిన దానికి ప్రతి స్పందిస్తూ తనప్రేమ యొక్క సాక్షాత్తు అంగీకారాన్ని ఎంతో బాహాటంగా వ్యక్త పరిచాడు! అదివిన్నబాబా తన అద్భుతమైనచిరునవ్వును చిందించారు. అలాగే రోడాకూడా ఎంతో సహజంగా తనను తాను బాబాకు సర్వార్పణ కావించుకున్నప్పుడు కూడా బాబా ఆమెకు అలాగే చేసివుంటారనిపించింది అలా రోడాతన హృదయంలో బాబా ప్రేమను నింపుకొని రోజ్ ఉడ్ నుంచి వెళ్ళిపోయింది.

# అహ్మాద్‌నగరులో అవతారుని దర్శనానికై వేలాదిమంది పాల్గొన్నారు

## 1954 - 16వభాగము

### మెహెరాబాదు కొండపై బాబా కుటుంబంలోని మిల్ డ్రెడ్

సెప్టెంబరు నెల మొదట్లో మెహెర్‌బాబా సతారా నుంచి మెహెరాజాదుకు చేరగానే ఎలి - నోర్ - కిట్ (ఎలిజబెత్, నోరీనా, కిట్టీ)ల నుండి ఒక టెలిగ్రాం అందుకున్నారు అందులో ఆయనకు ఇష్టులైన వారిలో ఒకరైన మిల్‌డ్రెడ్ కైల్ అనే ఆమె, మిర్టిల్ బీచ్‌లో అదేనెల 8న తేదీన మరణించినట్లు తెలిపారు. అతిసున్నితమైన బాబా ప్రేమికురాలు తొలి పాశ్చాత్య శిష్యుల్లో ఒకరైన కౌంటెస్స్ నాడిన్‌టాల్‌స్టాయికి అతిసన్నిహిత స్నేహితురాలు. మొదట్లో నాడిన్ ద్వారానే మిల్‌డ్రెడ్ బాబానుగురించి విన్నది. చాలా ఏళ్లు గడిచాక 30దశకంలో నాడిన్ బారతదేశంలో బాబా ఆశ్రమంలో ఉంటుండగా ఒకరోజున, ఆమె మిల్‌డ్రెడ్ ఫోటోను బాబాకు చూపింది. దీనిని బాబా సంతోషంతో పరిగ్రహించి తనఅక్షరఫలకంపై "ఒక గొప్ప అత్మ" అని సూచించి ఆఫోటోను ఎంతో ప్రియమైన దానిలా చిరునవ్వుతో హత్తుకొని తన జేబులో ఉంచుకున్నారు.

40వ దశకంలో,మిల్ డ్రెడ్ 80ఏళ్ల వార్ధక్యంలో సీటిల్, వాషింగ్టన్‌లో ఉండేది. బాబాను దైవీమానవునిగా అంగీకరించిన తర్వాత, ఆమెసీటిల్ బాబా గ్రూపుకు నాయకురాలైంది. బాబా సందేశవ్యాప్తిలో వారన్‌హెలీ అనే ఆమె యీమెకు సహాయపడేది వారన్ హేలీ బాబాను "ఒకఅద్భుత వ్యక్తి" గాసంభోదించేది.

1948లో వారన్‌సహయంతో మిల్ డ్రెడ్ అందమైన బాబా కార్డులను ముద్రించింది. ఆఖర్లో బాబా పంపిన "జీవితపు మతము" అనేసందేశాన్నీ ప్రచురించింది. ఆ దరిమిలా ఈసందేశం ఏపుస్తకంలోను ప్రచురితంకాలేదు. అందువల్ల అది బాబా అమెకిచ్చినప్రత్యేక బహుమానమైంది అందులో ని ఒక ఫ్యారాగ్రాఫ్‌ను మీకందించ దలచాను.

## సజీవసత్యం



మానవుడుతను స్వీయదైవాత్మను శాశ్వతంగా తప్పించలేడు. ప్రాణాన్నిచ్చే సత్యానికి తప్పని సరిగా లొంగిపోతాడు. చివరికది అతడ్ని తెలివి తేటలతో కూడి నేర్పుగా అల్లిన శుష్కసిద్ధాంతాల రూపంలో కాక, అవతరణ లేదా సత్య ప్రత్యక్షీకరణ రూపంలో అధిగమిస్తుంది. ఆతర్వాత అది ఆపలేని అజ్ఞాన పాశవిమోచనా శక్తిగా బలపడి, ఎలాంటి ఒప్పందం లేకుండా అసత్యాన్ని ఎదుర్కొని ప్రేమ యొక్క అపరిమితమైన దివ్య జీవనపు అవగాహనను విడుదల చేస్తుంది.

వట్టి మాటల ఇసుకపత్ర నుండి మానవుడ్నితాను స్వయంగా ఒక పరిపూర్ణ ఆధ్యాత్మిక గురువుకు హృదయపూర్వకంగా సర్వార్పణ అయినప్పుడే తప్పించే వీలవుతుంది. ఆగురువే తనలా జీవితపు మతాన్నిఅతనికి అందిస్తాడు జీవితపు మతము వివేకశూన్యము, దూరదృష్టి లేని పరిమిత బుద్ధిగలసిద్ధాంతాన్ని యాంత్రికంగా పలుమార్లు స్మరించినంత మాత్రం చేత బంధించబడదు. సత్యము యొక్క సారూప్యము వల్ల అది యాంత్రికంగా శక్తి వంతమవుతుంది. భ్రమలేని ప్రకాశమానమైన, రంజకమైన బుద్ధి ద్వారా గ్రహింపబడుతుంది అదిఎన్నడు తడబడదు, ఎన్నడూ భంగపడదు ఎందుకంటే అది శిరము, హృదయము మరియు బుద్ధి ప్రేమల సమ్మిశ్రమముల నుండి బయట పడింది.

అధ్యాత్మిక విషయంపై మిల్ డ్రేడ్ చాలా ఎక్కువగా చదివింది. కానీ, మెహెర్ బాబాను గురించి విన్న తర్వాత మాత్రమే దీనికి జీవము వచ్చింది సంపూర్ణ అవగాహనను కలిగించే బాబా మౌనము, ఆమె హృదయంతో సూటిగా మాట్లాడి, భగవంతునితో జీవించే బాంధవ్యాన్ని పొందే అదృష్టాన్ని ప్రేరేపించింది. సజీవ సత్యమే తానైన బాబా, నిత్య జీవితంలో శిరము హృదయములనుకలిపి రంగరించి, అయనకు సేవలందిస్తూ బ్రతికేందుకు ఆమెకు సహాయపడ్డారు.

1950ప్రాంతములో ఫ్లొరిడాలోని సెయింటుపీటర్సు బర్గుకు ఆమె మకాం మార్చింది. అక్కడ ఆమె చూట్టూ ఒక బాబా బృందం తయారైంది. ఆమె

వయస్సుమరియు అంకితమైన జీవితము రీత్యా బృందమంతటికి ఆమె ప్రీతిపాత్రమైన తల్లిగా పేరు తెచ్చుకున్నది.

1952లో బాబా అమెరికా వచ్చారు. 1934లో ఆయన మొదటి సారి వెళ్లినా మిల్ డ్రెడ్ మాత్రం 52.జూలైలోనే ప్రథమంగా బాబాను కలిసింది న్యూయార్కులో. ఆమె చాల సంవత్సరాలుగా ఆయనకు అంకితమైనా ఇప్పుడు మాత్రమే, 90సంవత్సరాల వయస్సులో ఆమెకు అవతారుని శారీర కాలింగన భాగ్యాన్ని పొందే అవకాశం దొరికింది.

1954లో బాబా షష్ఠి పూర్తినాడు, మిల్‌డ్రెడ్, ఫ్లొరిడాలోని తన ఇంటి యందు ఒక చిన్న కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది "మెహెర్ బాబా ఈ తేనీటితో, ఆయురా రోగ్యములతో, సుఖ సంతోషాలతో నవజీవన భాగ్యాన్ని ప్రసాదించి ఆశీర్వదించుగాక" అనే ప్రార్ధనను చేయించి అందరికీ ఒక కప్పు మసాలా టీని ప్రతి అతిధికి అందించింది. జన్మదిన కేకునుకోసి మొదటి ముక్కను అగోచరుడు, సర్వవ్యాపి అయిన అతిధి మెహెర్ బాబాకు సమర్పించు కున్నది.

ఆసమావేశం ఆఖరిలో మిల్ డ్రెడ్ ప్రతి అవతారుడూ ప్రభోదించే ప్రదాన భోదను ప్రతి ఫలింప చేస్తూ ఒక కవితను వ్రాసి చదివింది. మెహెర్ బాబా గురించి ఆమె ఇలా వ్రాసింది

ప్రేమ ప్రభువు మరోసారి ఇక్కడున్నాడు.

అవసరంలో ఉన్న ప్రపంచానికి ఆయనందించిన పిలుపు అంతంలేని ఘర్షణాయుత జీవితాన్ని నివారించి,

ప్రేమాన్విత చేతలవైపు మరలటం
ఓ ప్రపంచమా, ఆశంఖ నాదాన్ని లక్ష్యపెట్టు,
దానిని సర్వత్రా చాటించు,
మెహెర్ బాబా మానవుడితో కలిసి
ప్రేమికుడిగా, మిత్రుడిగా,మార్గదర్శిగా నడుస్తారు.

బాబా అనుమతితో మిల్ డ్రెడ్ 1954 ఆఖరి రోజుల్లో,ఎలిజబెత్ పాటర్సన్ స్వగ్రామమైన యూపాన్‌డ్యూన్సుకు మారింది. 1952లో మెర్టిల్ బీచ్ వెళ్లినప్పుడు

బాబా ఇక్కడ గడిపారు. కిట్టీదేవీ తన పుస్తకం "ప్రేమమాత్రమే మనుతుంది" లో మిల్ డ్రెడ్ తన వార్ధక్యం సైతం, తనకు, ఎలిజబెత్‌కుఎంతో సహాయపడుతోందని, ఆమెరావటంవల్ల, తనకు కావలసిన వెసులుబాటు దొరికిందని వ్రాసింది.

యూపాన్ డ్యూన్సులో కొన్ని నెలలు ఉన్న తర్వాత, మిల్ డ్రెడ్ గుండెపోటు వచ్చి మరణించింది. అంతిమ ఘడియల్లో కొన ప్రాణంతో ఉన్న మిల్ డ్రెడ్ బాబాఫోటోను తీసుకొని ముద్దాడినట్లు కిట్టీ గుర్తు చేసుకున్నది. తక్షణమే ఆమె మరణవార్తను బాబా విన్నారు "మిల్ డ్రెడ్‌నాలో శాశ్వత శాంతిని కనుగొన్నది. బాబా" అంటూతంతిని పంపారు. ఆతర్వాత మణి పాశ్చాత్యులకు వ్రాసిన జాబులో, "మిల్‌డ్రెడ్ బాబాతో ఉన్నది. ఆయనకు కావలసిన వాళ్ళలో ఆమెఒకరు. బాబాతో ఆమెతన ఇంటికి చేరింది. ఆయన మిల్‌డ్రెడ్ ఆఖరి రోజుల్ని మెర్టిల్ బీచ్‌లో గడపాలని అభిలషించారు. అందుకే అక్కడ ఉండమని ఆమెకు సందేశాన్నిపంపారు." అని వ్రాసింది.

మిల్ డ్రెడ్ అస్థికలను,చెన్ మెమన్ 1954 సెప్టెంబరులో మూడు వారాలుగడిపేందుకు ఇండియాకు వస్తూ తీసుకువచ్చాడు. ఒక సంవత్సరం గడిచాక 1955 నవంబరులో, మెహెరాజాదు నుండి మెహెరా బాదుకు బాబా సహవాస్‌కార్య క్రమానికి వస్తూ తెచ్చారు. కొద్ది మంది మండలి వెంటరాగా.ఆయన వేంటనే కొండపైకి వెళ్లే కీంటెస్ నడీనా టాల్‌స్టాయి సమాధి ప్రక్కన సిద్ధం చేసి వుంచిన స్థళాన్ని చేరుకున్నారు. ప్రధమంగా బాబా గురించి తెలియ చేసిన మిత్రురాలు టాల్‌స్టాయి. మిల్ డ్రెడ్‌ను బాగా ఎరిగిన డాన్‌స్టీవెన్సు అప్పుడు అక్కడే ఉన్నాడు అమెరికాలో ఆమెను ఎరిగిన వారందరితో పాటు ఆతడ్ని కూడా ఈ ఘట్టంలో పాలు పంచుకోనుటకు హజరుకమ్మన్నారు. ఆ చిన్న సమాధిపైఉన్న రాతిపలకను తొలగించారు. బాబా తన చొక్కా చేతుల్ని పైకి చుట్టి మిల్‌డ్రెడ్ అస్థికలుంచిన గుడ్డ సంచీని సొగసుగా అందులో ఉంచారు. పిమ్మట ఆయన కొద్ది సేపు మధ్యాహ్నపు ఎండకైపట్టిన గొడుగు క్రింద తనకు ఎంతో ఇష్టమైన ఈ గొప్ప నిగర్వ ఆత్మ యొక్క సమాధిని విచారంగా చూస్తూ అక్కడే నిలబడ్డారు పిమ్మట రాతిని కప్పి సమాధిని మూసివేశారు. ఈవిధంగా అతి క్లుప్తంగా, హృత్తుకుపోయేసన్నివేశము పరి సమాప్తమైంది.

ఆమెసమాధి ఫలకంపై "మిల్ డ్రెడ్ కైల్ బాబా చెంతకు చేరింది" అని చెక్కబడినది. బాబా కుటుంబంలోని సన్నిహితుల్లో ఆయనచే ఎంచుకోబడి ఆయన అంతిమ విశ్రాంతి స్థళం సమాధికిచేరువలో సమాధి చేయ బడటం ఎంత అదృష్టమో కదా!

సమాధి అంతర్భాగంలోఅవతార్ మెహెర్ బాబా వారి మానవరూపం విశ్రాంతి పొందుతోంది. కనుక అది బాబా దివ్య సముఖంతో పునరుత్తేజిత మవుతుంది. అందువల్ల ఈ ప్రదేశము - విద్యుత్ సౌధము - ప్రధాన కేంద్రమై తద్వారా, అవతారుని నిత్య నిరంతర అనంత చైతన్యము ఎటువంటి షరతులు లేని ఆయన ప్రేమ, దయలు ఆయన్ని సందర్శించ వచ్చే ప్రతివారిపై ప్రతిఫలిస్తూ పనిచేయుట కొనసాగుతోంది.

## వాడియా పార్కులో బ్రహ్మాండమైన మహాద్దర్శనము

1954 సెప్టెంబరు 12 నిజంగా అహమ్మదునగరు ఆధ్యాత్మిక చరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో లిఖించతగిన రోజు. ఆరోజున అహ్మదునగరు వాడియాపార్కులో (దీనినే గాంధి పార్కు అంటారు) అవతార్ మెహెర్‌బాబా దివ్య దర్శనానికై వేలాది మంది వచ్చారు. ఆసందర్భంగా పెద్దపందిరిని షామియానాలతో నిర్మించారు. తాత్కాలికంగా లైట్లు, లౌడ్ స్పీకర్లు అమర్చి రంగుల్లో అలంకరించారు. ప్రియతమ బాబా రాకకు నిర్దేశించిన ఉదయం 9గంటలకు ముందే పదివేల మంది జనంతో పెండాలంతా నిండి పోయింది. హిందు సాంప్రదాయం ప్రకారం, పురుషులు ఒకవైపున స్త్రీలు మరోకవైపున కూర్చున్నారు.ఆపెండాలకు ఒక వైపున వేదికను అమర్చారు. అదంతా కార్పెట్లు పరిచి, బాబా కూర్చొనుటకు అందమైన కుర్చీనీ, బల్లను ఏర్పాటుచేశారు. మనోహరమైన ఆహ్లాదకర వాతావరణాన్ని ప్రస్ఫుటింప చేసేందుకు, సున్నితమైన మెత్తటి సిల్కు కర్టెను వేదిక చుట్టూ కట్టారు. చాపలు, జంఖానాలు, జనం కూర్చొనుటకు నేలంతా పరచారు. బాబా దర్శనానికై వచ్చే వారి సౌలభ్యం కోరకు ప్రవేశ మార్గము, నిష్క్రమణ మార్గాన్ని సూచిస్తూ బోర్డులు వ్రేలాడదీశారు. అమెరికా నుండి, లండను నుండి, ఆస్ట్రేలియా నుండి వచ్చిన 17మంది పాశ్చాత్యుల గ్రూపు వేదికకు చేరువలో

కూర్చున్నారు ప్రియతముని ఆహ్వానం పైనే వారంతా తమ తమ దేశాల నుండి వచ్చారు. వారితో పాటే అనేక మంది మండలి వారు కూడా కూర్చున్నారు.

సరిగ్గా 9 గంటల సమయంలో తాజాగా వెలిగిపోతు బాబా అరుదెంచారు. అయన ఎంతో హుందాగా వేదిక పైతిరిగి తన ఆసనంపై అధిష్టించారు. మహారాష్ట్రలో ప్రశిద్ధి చెందిన గాడ్గే మహరాజు పెండాలలో ప్రవేశించి, బాబా సన్నిధికి వచ్చి ఆయనకు సాష్టాంగ దండ ప్రణామాలర్పించారు. పిమ్మట బాబా సభికుల నుద్ధేశించి ప్రసంగిస్తూ తన అక్షర ఫలకంపై "ఒక మనిషి మరోమనిషికి చేసినట్లు కాక, భగవంతుడు భగవంతునికి నమస్కరించినట్లు నేను మీ అందరికి పాదాబి వందనములు అర్పిస్తున్నాను. దీనివల్ల మీరు నాకు వంగి నమస్కరించాల్సిన శ్రమ లేకుండా చేశాను" అనిసూచించారు. ఈ ప్రకటనను ఇంగ్లీషు, మరాఠీ భాషల్లో ప్రసారం చేస్తుండగానే బాబా వేదిక మెట్లుదిగి సమావేశమైన జన బాహుళ్యానికి సాష్టాంగ ప్రణామాలర్పించారు. మరల తన అక్షరఫలకంపై "మీతో ఒకడిగా, మీలో ఒకడిగా మీరంతా నా భావాన్ని పంచుకోనుట కనువుగా నేను మీ ప్రక్కన కూర్చుంటున్నాను" అని సూచించారు. పిమ్మట బాబా ఆజనంతో పాటు నేలపై కలిసి కూర్చున్నారు. ముంధుగా పురుషులతోను పిమ్మట స్త్రీలతోను కూర్చున్నారు.

వేదికపైకి తిరిగి వెళ్లేముందు, పేదకుటుంబాల నుండి వచ్చిన ఏడుగురికాళ్లు కడిగి, తుడిచి, తన శిరస్సును వారిపాదలపై ఉంచారు. అలాచేశిన పిదప అపురుషులంతా బాబాముందు, వరుసల్లో నిలబడ్డారు. "మీలో ప్రతివారు, ఏదో విధంగా, దైవాంశులే కనుక, నేను మీకు పాదాభివందనం చేసి ఈదైవ దక్షిణను మీ పాదాల ముందుంచు తున్నాను." అంటూ భగవంతునికి బహుమానము సమర్పించు కుంటున్నట్లు అక్షర ఫలకంపై సూచించారు. ఆతర్వాత అపురుషులదరికీ ఒక్కొక్కరికి ఏభై ఒక్కరూపాయల దక్షిణ ఇచ్చారు.

అదే సమయంలో సకోరీనుండి గోదావరిమాయి కొందరు కన్యలతో పాటు చేరుకున్నది. బాబా తన అసనం దగ్గరకు తిరిగి వెళ్లగానే,గోదావరి మాయి, గాడ్గే మహరాజు సమక్షంలో బాబా హారతి నిర్వహించారు. అనంతరం బాబా దైవత్వము మరియు మానవోద్ధరణకు చేసిన అధ్యాత్మిక కార్యక్రమంపై పలువురి

ప్రసంగాలు జరిగాయి. అహమ్మదునగరు జిల్లాఅధ్యక్షుడు, అజిల్లా ప్రజల మనోభావాన్ని ప్రతిధ్వనిస్తూ ఇచ్చిన స్వాగతో పన్యాసంలోని కొన్ని ముఖ్యాంశాల్ని ఈ క్రింద వివరిస్తాను.

అత్యంత పూజనీయులైన శ్రీ మెహెర్ బాబాగారు! ఇరువది ఐదేళ్లు గడిచిం తర్వాత అహమ్మదునగరు జిల్లా వాసులమైన మేము తమ ఘనమైన మహర్దర్శన భాగ్యం పొందే అదృష్టం కలిగి మీ ఆశీస్సులందు కుంటున్నామని తలుస్తున్నాము.ఈ జిల్లా వాసులందరి తరుపున మీరు మమ్ములనందరీని మీ గొప్ప ప్రేమ మరియు మీ పవిత్ర దర్శనము ద్వారా అశీర్వదిస్తున్న యీ శుభసందర్భంలో మీకు నాహృదయపూర్వక స్వాగతాంజలిని సమర్పించుట నా విద్యుక్త ధర్మం. నిత్య ప్రశాంత నిరంతర చిరునగు మోము, తేజోమయకనుదోయి, ఆధ్యాత్మిక తేజస్సులు ఏవ్యక్తి నైనా సంతోషంతో తమపాదాల చెంత సాష్టాంగ పడేట్లుచేయుటకు సరిపోతయి.....

ఈ జిల్లా లోని స్త్రీ పురుషులందరి తరుపున ఎంతోభక్తి శ్రద్ధలతో నేనీ మనవిని తమకు వినయంతో సమర్పించు కుంటున్నాను....

అలా ప్రసంగాలు కొనసాగుతుండగా అదే వేదికపై మహరాష్ట్రకు చెందిన గొప్ప యోగి గాడ్గే మహరాజు మరియు తన గురువు ఉపాశినీ మహరాజుకు ప్రీతి పాత్రమైన శిష్యురాలు గోదావరిమాయిలు అశీనులై యున్నందున బాబా తన ఆనందాన్ని వ్యక్తపరచారు. ప్రసంగాల ముగింపులో బాబా సందేశమిస్తూ "అవగాహన చేసుకోవాల్సిన ఒకేఒక్క యధార్థ విషయమేమంటే ఒక గొప్పనయ వంచకుడు తాను కపటుడై యుండి, ఇతరులను వంచకులు కావద్దని చెప్పేవాడే కపటి" అని సూచించారు. దర్శనార్థులై హాజరైన వేలాదిమందిని బాబా తరచూ మహాదయతో చూస్తూ వారందరి చూపుల్ని ఆకర్షించారు. ఆయన సన్నిధానపు మనోహరత్వము వారి హృదయాల్ని అరుదైనా ఆహ్లాదంతోనింపి అలసిన వారి మనస్సులనుస్వాస్థ్యపరచింది. ఆసందర్భంగా మెహెర్‌బాబా ప్రత్యేక సందేశాల్ని అంగ్లంలో ప్రవచించగా హాజరైన గౌరవనీయుల నుద్దేశించి చేసిన అన్ని ప్రసాంగాలకు ప్రత్యుత్తరంగాఈసందేశాలను బాబా చదివించారు. ఆ సందేశాలేవంటే "మెహెర్ బాబాపిలుపు" "నేను అవతారుడను అని నేను చెప్పినప్పుడు" "నామౌనము గురించి" మరియు "భగవంతుని ఎలా ప్రేమించాలి'
'. ఏ సమయంలోనైనా అవతారుడందించే మాటలకు అన్ని సమయాల్లోనూ

ఎంతో అర్థము ఉంటుంది. అలాగే యీ పై సందేశాలు నిజానికి విశిష్టంగా కనిపిస్తయి మొదటి సందేశం "మెహెర్‌బాబా పిలుపు" ను కేవలం మరాఠీలోమాత్రమే చదివారు . తక్కిన సందేశాల్ని మరాఠి, ఇంగ్లీషు భాషలు రెంటిలోను చదివారు. వాటినీ క్రింద పొందుపరుస్తున్నాను. బాబా ప్రకటించిన తన అవతార తత్వంపై ప్రజల ప్రతిస్పందనకు సంబంధించినది మొదటిది. రెండోది,ఆయన పాటించిన మౌనపు దివ్య రహశ్యము. మరి మూడోది, నిత్యం భగవంతుడ్ని ప్రేమించే ఆచరణీయ మార్గాల్ని అందిస్తుంది.

## నేనుఅవతారుడను అని నేను చెప్పినప్పుడు

నేను అవతారుడను అని నేను చెప్పినప్పుడు, కొద్ది మంది సంతోష పడతారు. కొందరు అదిరి పడతారు. మరి అత్యధికులు నేనలా ప్రకటించి నందుకు నన్ను ఒక మోసకారిగా, ఒకవంచకుడిగా, మహా అహంకారిగా లేదా శుద్ధ పిచ్చివాడిగా తీసుకుంటారు. మీ అందరికి నేను ఒక అవతారుడను అని చెపితే కొద్దిమంది సంతోష పడవచ్చునేమో కాని అత్యధికులు, దానిని ఒక దైవనిందగా లేదా ఒక ఎగతాళిగా తలుస్తారు.

భగవంతుడు ఏకైకుడు. అగోచరుడు, మనందరిలో సమంగా ఉంటాడన్నది నిజం. మనం పూజ్యం కావచ్చు కానీ యీ ద్వంద్వ చైతన్యపు మనస్సుకు ఒకరమేనని అంగీకరించటం అతి అవుతుంది. అయినా, మనమంతా ఆయనే దైయున్నాడో అదే అవుతాము. ఏభావంతో చూచినా నేను అవతారుడను అని నాకు తెలుసు అలాగే మీలోప్రతిఒక్కరూ, ఏవిధంగా చూచినా అన్ని విధాలా మీరూ ఒక అవతారుడే.

ఇది మార్చలేని, విశ్వవ్యాప్తంగా గుర్తించిన సత్యము, అనాదిగా భగవంతుడు సర్వము ఎరుగును. సర్వాన్ని చేసేది భగవంతుడే. భగంతుని ఇచ్చలేనిదే ఏదీ జరగదు. అందువల్ల నేను అవతారుడను అని, మీరంతా అవతారుడేనని చేప్పేట్లు దైవమే చేశాడు.మళ్లీ ఆయనే కొందరి ద్వారా సంతోషాన్ని చక్కలిగింతలు పెట్టి కల్పించి మిగిలిన వారందరి ద్వారా, అదర కొట్టాడు. ప్రవర్తించేది భగవంతుడు. ప్రతిక్రియ చేసేదీ భగవంతుడే పరిహసించేది, ఆయన, అందుకు ప్రతిస్పందించేదీ ఆయనే. తన స్వంత దివ్యనాటకంలో ఆయనే సృష్టికర్త, నిర్మాత, నటుడు, మరియు శ్రోతలూ ఆయనే !

# నేను పాటించే మౌనం గురించి



నేను ఎందుకు మాట్లాడుటలేదని మీరు నన్నడిగితే నేను మౌనంగా లేనని చెపుతాను. సౌంజ్ఞలు, అక్షరఫలకం ద్వారా ఎంతో వాగ్ధరితో మాట్లాడు తున్నాను.

నేను ఎందుకు సంభాషించుట లేదని మీరు నన్నిడిగితే, బహుశః అందుకు మూడు కారణములను చెప్పెదను. మొదటిది, మీఅందరి ద్వారా నేను అనాదిగా సంభాషిస్తూనే ఉన్నానని నేను భావించాను. రెండవది. మీఅందరి రూపాల ద్వారా నిరంతర సం భాషణ వల్ల కలిగే విసుగు నుండి విముక్తుడనగుటకు, నావ్యక్తిగత భౌతిక రూపంలో నేను మౌనం దాల్చాను. మరి మూడోకారణం మాటలన్నీ వృధా కాలక్షేపం కబుర్లే కనుక, మాటల్లో సోమారితనం అంతర్లీనమై యున్నది. ఉపన్యాసములు సందేశములు ప్రకటనలు, ప్రవచనములు వంటివి. అవి ఆధ్యాత్మికము లేదా మరే విధమైన వైనా సరే అవన్నీ ఉచ్చరించుట లేదా వ్రాతల ద్వారా భోదింపబడతయి. వాటిని ఆచరించనప్పుడు.లేదా జీవన దాయకం చేయనప్పుడు అవన్నీ వృధా కాలక్షేప కబుర్లే అవుతాయి.

నేనునామౌనాన్ని ఎప్పుడు విరమిస్తానని నన్ను మీరడిగితే, ఆరంభంలేని ప్రారంభంలో నేను ఉచ్చరించిన ఏకైక సత్యపదముఏదైతే ఉన్నదో ఆపదము మాత్రమే ఉచ్చరించ తగినదైనందున దీనినే, నాకు ఉచ్చరించాలన్న భావం కలిగినప్పుడు పలుకుతానని నేను చెప్పెదను. నా బాహ్య మౌనాన్ని విరమించి, ఆపదము ఉచ్చరించే సమయము అతి చేరువలోనే యున్నది.



9.

# దైవాన్నెలా ప్రేమించాలి

అత్యంత అనుభవ పూర్వకంగా దైవాన్ని ప్రేమించుట అంటే మన సాటి వారిని ప్రేమించటమే. మనకు ప్రియ మైనవారి గురించి వ్యాకుల పడుతున్నట్లే ఇతరుల గురించి కూడ వ్యసన పడితే మనము దైవాన్ని ప్రేమించినట్లు.

ఇతరులలో తప్పులనుచూచుటకు బదులు, మనలోని లోపాలను మనం చూస్తే మనము దైవాన్ని ప్రేమిస్తున్నామన్నమాట.

ఇతరుల బాధల్లో ఉన్నప్పుడు మనమూ బాధపడి, ఇతరులు సంతోషంగా ఉంటే మనమూ సంతోషపడితే మనముదైవాన్ని ప్రేమించినట్లు

మనఅవసరము కోసం ఇతరులను దోచుకొనుటకు బదులు, ఇతరులకు సహాయ పడుటకు మనల్ని మనము దోచుకుంటే మనం భగవంతుడ్ని ప్రేమిస్తున్నట్లు.

మనస్వంత దూర దృష్టాల గురించి వ్యసన పడే బదులు చాలామంది కంటే మనము ఎంతో అదృష్టవంతుల మని భావిస్తే మనము దైవాన్ని ప్రేమిస్తున్నట్లు

మనం మనకున్న భాగ్యాన్ని ఆయన ఇచ్ఛగా అంగీకంచి, ఓర్పుతో, సంతృప్తితో ఓర్చుకోగలిగితే మనం భగవంతుడ్ని ప్రేమిస్తున్నట్లే.

భగవంతునికి చేసే భక్తి, పూజ అనే అత్యున్నత చర్యవల్ల ఆయన ప్రాణులకు ఎటువంటి ఉపద్రవము, హాని కలుగ చేయకూడదని మనము అర్థం చేసుకొని తెలుసుకో గలిగితే మనము భగవంతుని ప్రేమిస్తున్నట్లే.

అయన్ని ప్రేమించ వలసిన రీతిలో దైవాన్ని ప్రేమించేందుకు జీవితపు ఉద్ధేశ్యము భగవంతుని ప్రేమించుటకేనని, ఆయన్నిమన స్వీయ అత్మగా కనుగొని మనము భగవంతుని కోరకే బ్రతకాలి, భగవంతుని కోరకే మరణించాలి.

ఈ విధంగా ఇలాంటి సూటియైన విస్పష్ట ప్రకటనల ద్వారా, మెహెర్‌బాబా సరళముగా ఉండే అతి శక్తి వంతమైన మాటల్లో అవతారుని అవతరణ యొక్క అర్ధాన్ని వివరించారు. ఆయన తన అనుచరులకు, సత్యాన్వేషకులకు, మార్గదర్శక

ఉపదేశాల్నిసిద్ధం చేశారు. దైనందిన కార్యక్రమాల మధ్య ఆధ్యాత్మిక జీవనాన్ని గడిపేమార్గాల్ని మానవాళి కాయన చూపించారు. ఈసందేశాలన్నీ సమాజము ఎంతో విశాల పరిధికల్గి చిత్ర విచిత్రంగా ఉన్నా, ప్రగాఢమైన గణ్యత కలిగి అత్యంత భక్తి శ్రద్ధలతో స్వీకరించ బడినయి.

ఈసందేశాల్ని చదివిన తర్వాత, బాబా తన కుర్చీనుండి దిగి వేదిక అంచున, కూర్చున్నారు. ఎందుకంటే ఆనాటి ప్రధానఘట్టం, దర్శనము మరియు ప్రసాదవితరణ. ముందుగా స్త్రీలు వచ్చేందుకు ప్రథమ అవకాశాన్నిచ్చారు. అనేక మంది బాబాను పుష్పమాలా లంకృతుల్ని చేశారు. తనకు పాదాభివందనం చేసి దర్శనము చేసుకున్న ప్రతివారికి ఆయన గుప్పిళ్ల కొద్ది స్వీట్సును పంచి పెట్టారు. అతర్వాత పురుషుల వంతు వచ్చింది ఆరోజంతా బాబా ఎంతో ప్రేమగా వెలిగి పోతూ ప్రకాశించారు. ఏమాత్రము అలసినట్లు ఆయాస పడలేదు. ఆయన అలు పెరుగని బలాన్ని, నిస్వార్థ ప్రేమని,కరుణని చూచి అంతా ఆశ్చర్యపోయారు.

## మహార్దర్శనము అరుగంటలవరకు సాగింది

దర్శన కార్య క్రమము బ్రహ్మాండంగా నిర్వహించబడి ఒకసామన్య రీతిలో నడిచింది. ఏమైనప్పటికి వందలాది మంది పెండాలలో గుమి గూడుట కొనసాగటంతో తోక్కిసలాట మొదలైంది. బాబా దర్శనం చేసుకోని ప్రసాదం స్వీకరించాలన్న ఆతురతతో బాబా ముందుకు వచ్చేందుకు జనమంతా ఆరాట పడ్డారు. మధ్యాహ్నానికి, స్త్రీల క్యూ వైపు పురుషుల గుంపులు తోసుకు రావడంతో ప్రాసదము పుచ్చుకొనటంలో అటంకం ఏర్పడింది. ఎవరికి వారు తమ వంతుకై ఆదుర్థాతో సహనాన్ని కోల్పోయి ముందువాళ్లను నెట్టుకుంటూ వేదిక అంచుకు దూసుకువచ్చారు. అహ్మదునగరు పోలీసులకు, బాబా మండలికి వారిని ఆడ్డుకొని అపటం గగనమై పోయింది. ఈ గందర గోళం వల్ల బాబాకు శారీరకంగా అపాయం జరగవచ్చున్నట్లు కనిపించింది. జనమంతా ప్రశాంతంగా ఉండండని బాబా మండలి వారు పలుమార్లు మైకులో ప్రకటన లిచ్చారు. బాబా స్వయంగా లేచి నిలబడి, చేతులు జోడించి వెనక్కు మళ్లుకోమని చేతితో సౌంజ్ఞలు చేసే

వరకూ అరుపులు, కేకలు కొనసాగి అప్పుడు ఆగిపోయాయి. అయినప్పటికీ,అకార్య క్రమంలో తర్వాత, ప్రజలు చూపే వీరావేశం బాబా నాలుగైదు సార్లు లేచి నిలబడి వారందరికి ప్రసాద మందించేందుకు చాలా సేపు పట్టినా తానక్కడే కూర్చొని అందరికీ ప్రసాదమందిస్తానని ఆయన వారికి అభయమిచ్చారు అలా చేప్పేసరికి జనానికి ఊరట కలిగి కార్యక్రమము సక్రమరీతిలో పునః ప్రారంభమైంది.

దర్శన కార్య క్రమం పూర్తయ్యేవరకు గాడ్గే మహరాజ్ బాబా చెంతనే ఉన్నారు.ముందుగా ఆయన బాబా పాదాల దగ్గర కూర్చున్నారు. అయితే బాబా ఆయన్ని పిమ్మట తనపక్కన కూర్చొ పెట్టు కున్నారు. బాబా యందాయన కున్న ప్రేమతో, బాబా చేస్తున్న మిక్కుటమైన పనివల్ల అలసి పోతారేమోనని వ్యధచెంది గాడ్గే మహరాజు బాబాకు సహకరించారు. అనేక పర్యాయాలు ప్రసాదంపంచటం ఆపమని ఆయన బాబాను కోరగా, బాబా అంగీకరించలేదు. ఆయన ఉద్దేశ్యంలో బాబాకు కొంత ఉపశమనం కలుగ చేయాలని, గాడ్గే బహు సున్నితంగా బాబా హస్తాల్ని వత్తాడు.అటువంటి సేవ చేయగా బాబా ఆయన్ని చూచి చిరునవ్వు నవ్వి, అలా చేయటము వల్ల, ఇంకా కొనసాగించేందుకు తన కెంతో శక్తినిస్తోందని సౌంజ్ఞలు చేశారు.

దర్శన కార్య క్రమ సమయంలో, కుత్రేవాలా బాబా అనే ఒక మస్తు బాబా ముందుకు వచ్చాడు. కుత్రే అంటే, "కుక్కలు కలిగి ఉన్నవాడు" లేదా "కుక్కల స్నేహంలో జీవిస్తున్నవాడు" అని అర్థం. కుత్రేవాలా తనతో కుక్కలకు ఆహారం ఉంచుకొన్న డబ్బాతో తిరుగుతాడు వాటిని తాను కూడా తింటాడు. అతడు బాబా ముందుకు వచ్చి, ఆయన ముందు ప్రణామాలర్పించాడు. అతడ్ని బాబా ఆలింగనం చేసుకొని, తన కుడి పక్కన కొంత సేపు కూర్చో పెట్టుకున్నారు. అంతేకాక కుత్రేవాల డబ్బాలోని అపరిశుభ్రంగా కనిపిస్తున్న ఆహారాన్ని కొద్దిగా తీసుకొని బాబా తిన్నారు.

అవతారుని సమక్షపు ఈ మహిమాన్విత సమయంలో, ఆ పెండ్యాలలో హాజరైన వారందరి కళ్లు ప్రకాశమానమైన, ఆయన దివ్య రూపంపైన కేంద్రీకృతమయ్యాయి. ఆయన ముఖము, కళ్లు, ప్రేమతో ప్రతిఫలిస్తున్నాయి. ఆయన చిందించే ప్రతి చిరునవ్వు చూచేందుకు ఒక మహ దైశ్వర్యము బాబా

వ్యక్త పరిచే ప్రేమ భావన ఆయన ఒక మస్తు లేదా ఒకసాధువుతో కలసి ఉన్నప్పుడు, ఎంతో ఘననీయంగా కనిపిస్తుంది. ఈ సందర్భంగా ఒకవైపు ఒక గొప్ప సాధువు గాడ్గే మహారాజు తనకు ఎడమ వైపున ఒక దైవోన్మత్తుడు కుత్రేవాలా కుడిపక్కన కుర్చో పెట్టుకున్న బాబా ముఖపు ప్రకాశాన్ని చూచినవారెంతో అదృష్టవంతులు.

సాయంత్రం 3-00 గం॥ల వరకు దర్శన కార్య క్రమము కొనసాగింది. తర్వాత బాబా వేదికను వదిలి దైవ ప్రేమలో ఉచితంగా అర్పించు కుంటున్న విందు భోజనారంభానికి వెళ్లారు. ఆహ్వానసంఘము వారు బాబా గౌరవార్ధము ఈ అన్నదాన కార్యక్రమాన్ని దర్శనార్థుల సౌలభ్యం కొరకు ఏర్పాటు చేశారు. బాబా భిన్నమతాలు,జాతులకుచెందిన అన్ని స్థాయిల్లోని స్త్రీలు, పురుషులు, పిల్లలు 1200 మందితో పాటు, మొదటి పంక్తిలోనే అందరితో పాటు నేలపైనే కూర్చున్నారు. బాబాతో పాటు అందరికీ విస్తళ్లల్లో భోజనం వడ్డించ బడింది.

భోజనంలో గోధుమ, పంచదార, వెన్న కలిపి చేసిన లస్సీ అనే స్వీటు, అమ్టి అనే కాయ ధాన్యపు పానీయం వడ్డించారు. ఆసమయంలోనూ, ఆరోజు దర్శనము జరిగినంతసేపు, బాబాపై చలన చిత్రాన్ని తీశారు.

జనం మధ్య బాబా భోజనం చేస్తున్నప్పుడు, ఆయన విస్తరినుండి కొద్దిగా ప్రసాదంగా ఆయన చేతుల మీదుగా తీసుకోవాలని కొంత మంది ఆయన చుట్టూ చేరారు. పైకిచెప్పని ఈ కోరికలకు ప్రత్యుత్తరముగా, బాబా తనకు దగ్గరగా ఉన్న ఒకరిద్దరు అదృష్టవంతులకు తన భోజనంలోఒక చిన్న ముద్దను అందించారు. అలా చేయటంతో చాలమంది బాబా విస్తరిపై తమకూ కావాలంటూ చేతులు చాచారు. కానీ ఆయన త్వరగా తన భోజనాన్నిపూర్తి చేసి, తిరిగి వేదిక వద్దకు, దర్శనాన్ని కొనసాగించుటకు వెళ్లారు. అన్న దాన కార్య క్రమం, బాబావెళ్లి పోయిన తర్వాత కూడా కొనసాగింది. ఆరోజునదాదాపు పదిహేను వేలమందికి పైగానే అన్నదానం జరిగినట్లు అంచనా వేయబడింది.

నాలుగు గంటల ప్రాంతంలో,దర్శనార్థుల గుంపులో మళ్లీ గందరగోళం మొదలైంది అందరు తనను స్పష్టంగా చూచేందుకు వీలుగా బాబా లేచి నిలబడ్డారు. కొద్ది సేపు గడిచినపిదప,కార్య క్రమంలో అరుదైన అద్భుత

మధురక్షణాలు సంభవించాయి. మెహెరాతో పాటు బాబా స్త్రీ మండలి బహిరంగంగా కనిపించటం ఇదే మొదటి బహిరంగ సమావేశం. వారందరికి బాబా ప్రసాదం పంచిపెట్టారు.

దర్శనము ప్రసాదవితరణ కొనసాగింది బాబా గురించి గాడ్గే మహరాజు వ్యసన పడి, కార్యక్రమాన్ని ఆపమని బాబాను కోరాడు. ఆరుగంటలకు సమాప్తం చేయబడింది. కొద్ది సమయం గడిచాక, గుంపులో గందర గోళం ఎక్కువైంది. బాబా గాడ్గే వైపు తిరిగి ఇప్పుడు నేను ఆపదలచానని సౌంజ్ఞ చేశారు.మిగిలి ఉన్న ప్రసాదన్నిబాబా స్పృశించి తన ఆశీస్సులందిస్తూ, తాను వెళ్లిన తర్వాత దీనిని పంచి పెట్టమని బాబా చెప్పారు. మిగిలి వున్న జనానికి ఆయన స్వహస్తాలతో ప్రసాదం అందించక పోయినా వారి మధ్య అనేక గంటల పాటు ఆయన దివ్య స ముఖము కనిపించటం వల్ల, అదే వారందరికి అవతారుడిచ్చిన బహుమానమైంది.

ఆయన కాలంలో, ఎవరైతే హృదయ పూర్వకంగా ఆయన మాటలపై విశ్వాసము ఉంచి ధ్యానించేవారో వారు కొత్త అవగాహనను పొందేవారు. అవతారుడి కోసం కన్నీళ్లతో ఎదురు తెన్నులు చూస్తే ఆయన్ని చూచే దృష్టిని పొందేవారు. నిష్పక్షపాతమనస్సుతో, ఆయన్ని గుర్తించుకున్నవారు తమ మనస్సులను ఉపశమింప చేసుకుంటారు. మరియు, తమ హృదయాల్లో భక్తితో వచ్చేవారు ఆయన పిలుపుకు తమ హృదయాలను మేల్కొలుపుకుంటారు.

ఆనాడు ఎంతమంది బాబా దర్శన భాగ్యాన్ని పొందారో చెప్పటానికి సాధ్యపడదు. కానీ ఆ జీవితకాలపు క్షణాల్లో షుమారు ఏభైవేల మందిపై చిలుకే వచ్చారని అంచనా. అన్ని కులాలు, జాతులవారు హాజరయ్యారు. హిందువులు, ముస్లింలు, పార్శీవారు, క్రిష్టియనులు, సిక్కులు, ఉన్నతులు లేదా అధములు, భాగ్యవంతులు లేదా నిరుపేదలు, పురుషులు లేదా స్త్రీలు, యువకులు లేదా వృద్ధులు అన్న ప్రశ్నేలేదు. దగ్గర్లో ఆపివుంచిన ఎడ్లబళ్ల వరసలు , కార్లు చూస్తే ఈ అత్యద్భుత అవకాశం కొరకు రకరకాల వ్యక్తులు రావటాన్ని తెలియచేస్తుంది.

కుంభవర్షం కురిసి, చెరువులు వాగులు పొంగి పార్లి అహమ్మదు నగరు

చేరేదారులన్నీ వరదల్లో మునిగిపోవుట వల్ల వారి ప్రయాణంలో కొంత జాప్యం జరిగినా, అనేక వేలమంది గ్రామస్థులు, దర్శన రోజుకు ముందు రాత్రే వాడియా పార్కుకు చేరుకున్నారు. మెహెరాబాదు పక్కనే ఉన్న ఆరంగాం నుంచి వచ్చిన వారంతా పెద్ద సైజు బాబా ఫోటోతో ఊరేగింపుగా ఎడ్లబండిపై అందంగా అలంకరించుకొని వచ్చారు. ఆజన సమూహంలో అధికారులకు క్రిందిస్థాయి ఉద్యోగులకు మధ్య, కూలీ మరియు భూకామందుకు మధ్య ఎటువంటి భేద భావము లేకుండా పోయింది. సర్వోన్నతుని దర్శనం కోసరం అంతా పక్కపక్కనే గుమికూడటం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

పశ్చిమ దేశాల్నుంచి వచ్చిన బాబా కుటుంబాల గురించైతే, వారికిది తమ శేష జీవితాలకు ఒక గొప్ప భాండాగారాను భవము. ఆ రోజున జరిగిన సంఘటనలన్నిటినీ క్రోడీకరిస్తూ మాల్కొమ్ స్లాస్ మరియు చార్లెస్ పర్డుములు ఇలా వ్రాశారు :

బాబా పార్కు నుండి బయలుదేరి తిరిగి వెళుతూ ఉండగా, మేము బాబా యొక్క ఈషద్దర్శనాన్ని చివరిసారిగ చేసుకున్నాం. అప్పుడాయన తన కారుపై భాగం మీద ఆశీనులై యున్నారు. అన్నివైపులా గుమిగూడి ఆయన వెళ్లి పోవటం అయిష్టంగా ఉన్న జనానికి బాబా ప్రణామాలర్పించారు. మొదట్లో కారు టాపు మీద కూర్చొని ఆలశ్యంగా వచ్చిన వారికి దర్శన భాగ్యం కల్పించారు. అయితే గుంపు అధికంగా పెరగటం వల్ల, ఆయన కారు టాపుపైకెక్కి దర్శనమిచ్చి టాపు దిగి వెనక్కివచ్చి కార్లో కూర్చున్నారు. అప్పుడా కారు అతి వయ్యారంగా అవతారుడితో మెల్లగా పార్కు బయటకు కదిలింది.

మా అందరికి యీ ప్రజాదర్శనం ఒక మరువరాని అతి ఘనమైన సంఘటన. అవగాహనలో మేమెంత పెరిగితే అంతగా ప్రాముఖ్యతలో యీ ఘట్టం పెరిగింది. దానిలో పాల్గొనే అవకాశాన్ని మాకందరకు బాబా కలిగించినందుకు మేమాయనకు కృతజ్ఞులము.

# మెహెర్ బాబా పిలుపు

వాడియా పార్కులో జరిగిన యీ అత్యంత ప్రదానమైన ప్రజా దర్శనలో "మెహెర్ బాబా పిలుపు" అనే అవతారుని సందేశం స్థానిక భాష మరాఠీలో మాత్రమే చదవబడింది. ఎందుకంటే, అది అవతారుడి గురించి, ఆయన అధికారము గురించిన సగం భాగము, అత్యంత ప్రధానమైన ప్రకటన కనుక దాని ఆంగ్లానువాదాన్ని ఇక్కడ మళ్లీ ప్రచురిస్తున్నాను.

డెహెరాడూన్‌లో 1953 సెప్టెంబరులో ప్రియతమ బాబా అందించిన "సర్వోన్నతుడు" అనే సందేశంలో "అయితే" పదాన్ని.... "నేను గనుక ఒకసాధరణ మానవుడిని అయితే ...." "నేను సర్వోన్నతుడను అయితే ...." "మీరు నిజంగా పరిపూర్ణ విశ్వాసంతో మీ బాబాను సర్వోన్నతుడిగా అంగీకరించినట్లైతే" అంటూ చాలా మార్లు వాడారు. కానీ ఆయన ఒక సంవత్సరం తర్వాత ఇచ్చిన సందేశము "మెహెర్ బాబా పిలుపు" లో ఆయన స్పష్టంగా తాను అవతారుడను అని ఖాయపరచారు. వాడియా పార్కులో ఆయనముందు కూర్చున్న వేలాది మందినుద్దేశించి ప్రసంగిస్తూ, ఆయన సకల మానవాళిని ఆయన పిలుపును ఆలకించమని లాంఛనంగా విజ్ఞప్తి చేశారు. బహిరంగంగా అధికారికంగా ఆయన ప్రజలందరినీ "అందరూ నా చెంతకు రండు" అని ఆహ్వానించారు.

తదుపరి సంవత్సరాలలో జరిగిన చిన్న పెద్ద సమావేశాల్లో ఆయన దర్శనం పొందిన వారికి, బాబా తన ప్రకటనకు మరికొంత భాగం "నేను అవతారుడను" అని చేర్చి ఎంతో నమ్రతగా "నన్ను ప్రేమించేవారికి నేను బానిసను" అని ప్రకటించారు. తన ప్రేమికులకు మౌనంతో సౌంజ్ఞలు చేస్తూ "నన్ను మీతో తీసుకు వెళ్లండి" అన్నారు. అప్పట్లో ఆయన్ని విశ్వశించిన వారు మళ్లీ ఇప్పుడూ నమ్ముతున్న వారు సైతం, మిలమిల మెరిశే ఆయన సన్నిధి, జ్ఞాన వంతమైన మార్గ దర్శకత్వమును వారు ఆయన్ని ఎప్పుడు కలిసినా అనుభవించారు. ఆయన పిలుపునిచ్చారు మరి దానికి బదులిచ్చుటకు ఆయన ఎన్నడూ తప్పలేదు. ఆ పిలుపు ద్వారా, మెహెర్ బాబా ఎంతో హుందాగా తన దివ్యత్వ స్థాయిని, అవతారునిగా తన అధికారాన్ని, యుగపు మేల్కొలిపే వాడినని బాహాటంగా తెలియపరచారు. పాఠకుల సౌలభ్యం కోసం, ఈ సందేశం మూల సందేశాన్ని అయిదు విభాగాల క్రింద విభజించబడింది.

# అందరూ నా చెంతకు రండు

యుగ యుగాలుగా ధర్మజ్యోతి కొడిగట్టినప్పుడు, అవతారుడు మరోసారి అవతరించి, సత్య ప్రేమ జ్యోతిని పునః ప్రజ్వలన చేస్తాడు. యుగయుగాలుగా అలజడులు భంగపాట్లు, యుద్ధములు, భయము, ఉత్పాతముల మధ్య "అందరూ నా చెంతకు రండు" అనే అవతారుని పిలుపు మార్మోగుతుంది.

మాయతెర అడ్డువల్ల ఆ పురాణ పురుషుడి యీ పిలుపు నిర్జన ప్రదేశంలో వినిపించే ధ్వనిలా ఎవరికన్నా అనిపించినప్పటికీ, దాని ప్రతిధ్వని, ప్రకంపనలు మాత్రం, ఎల్లకాలములు వ్యాపించి మార్మోగుతూనే ఉంటాయి. మొదట్లో దానికి ప్రతిస్పందిస్తూ తమ అజ్ఞానపు గాఢ నిద్ర నుండి బహు కొద్దిమంది మేల్కొంటారు. మాయ మధ్యలో శబ్దాల వెనుక నున్న శబ్దంగా అది, మానవాళి మధ్య భగవంతుని అవతరణకు సాక్షులుగా మానవుల్ని మేల్కొలుపుతుంది. ఇప్పుడా సమయమాసన్నమైనది. నేనా పిలుపును పునశ్చరణ చేస్తున్నాను. అందరూ నా చెంతకు రమ్మని ఆదేశిస్తున్నాను."

గౌరవించ తగిన ఈ నా పిలుపు అత్యంత సహనంతో తమ హృదయాల్లో భగవంతుని యెడల వున్న తమ ప్రేమను ఓర్పుతో ఉంచుకోగలిగితే దైవ ప్రేమ కొరకు మాత్రమే భగవంతుని ప్రేమించేట్లు చేసి ఆనందపరుస్తుంది. దాని ప్రతిధ్వనులుకు భయపడి, వణికి పోయే వారు బెదిరిపోవటమో లేదా నిలదొక్కుకోవటమో జరుగుతుంది. ఇంకా మరి కొందరున్నారు. వారు భంగపడి, ఈ సర్వోన్నతుడు, సర్వ సంపన్నుడు అయిన ఈయనకు ఎందుకు, ఈ పిలుపును మానవాళి కందిచ వలసిన అవసరం కలిగిందని అర్థం చేసుకోలేరు.

అన్ని అనుమానాలు, నమ్మకాలు మాత్రమే కాకుండా అనంత ప్రేమ కోసం, నేనన్నిటిని భరించి, నేను అవతారునిగా రావటాన్ని కొనసాగిస్తాను. మానవాళి తన అజ్ఞానంలో నారాకను విమర్శించినా, మానవుడు అసత్యము నుండి సత్యాన్ని తెలుసుకొనుటకు సహాయ పడతాడు.

పురాణ పురుషుని అనంతమైన యధార్ధ నమ్రత యొక్క వేషంలో తప్పనిసరిగా ముసుగు వేసి దివ్య ప్రేమ తొలుత, కొద్దిగా హెచ్చరించి, చివరకు తన అనంత శక్తిలో అదివిస్తారంగా వ్యాపించి, లెక్కలేనన్ని హృదయాల్లో సత్యము యొక్క శబ్ధంగా ప్రతిధ్వనిస్తుంది.

## యధార్థ అణకువ

శక్తి అణకువను పుట్టిస్తుంది. కాగా నమ్రత బలహీనతను సూచిస్తుంది. కేవలం, నిజంగా గొప్పవారైన మీరే యధార్థానికి వినమ్రులు. ఒక మనిషి, తన నిజమైన గొప్ప తనాన్ని దాని స్థిరమైన జ్ఞానంలో అంగీకరించినప్పుడు, అణకువ యొక్క వ్యక్తీకరణ అందులోనే ఉంటుంది. అతను తన గొప్పదనాన్ని ఎంతో సహజంగా అంగీకరించి, కేవలం ఒక మానవుడిగా తానేమిటో వ్యక్త పరిచి, తాను ఒక మానవుడినేనన్న సత్యాన్ని తానూ తదితరులు సైతం అంగీకరించేట్లు చేయుటకు ఏ మాత్రం వెనుకాడడు.

ఒక నిజమైన గొప్పవ్యక్తి తాను స్వయంగా నిజమైన గొప్పవాడినని తెలుసుకొని దానిని వ్యక్తం చేయకపోతే తాను నిస్సందేహంగా ఏదైయున్నాడో అట్టి తన గొప్పతనాన్ని చిన్నబుచ్చుకున్నట్లే. అయినప్పటికీ, అణకువ వేషము యొక్క ఆధారము. నిజమైన గొప్పదనము పొగడ్తలకు దూరంగా ఉంటుంది.

ఒక మానవుడు ఒక గొప్పతనాన్ని వ్యక్త పరచినప్పుడు, తనలో అది లేదని అతనికి తెలిసి వుంటే అటువంటి వ్యక్తి అతి గొప్ప వంచకుడు. గొప్పవాడు కాని వ్యక్తి, నిష్కపటంగా తాను గొప్పవాడిని కానని తెలుసుకొని, ఖచ్చితంగా స్పష్టంగా, తాను గొప్పవాడిని కాను అని వ్యక్తం చేస్తాడు.

గొప్పవారు కాని వారెందరో ఉన్నారు. అయినా తమదైన విలువ యెడల విశ్వాసాన్నుంచి నమ్రతను ఆరోపించుకుంటారు. మాటలు, చేతలు ద్వారా వారు విడువకుండా మళ్లీ మళ్లీ తమ నమ్రతను మానవాళికి సేవకులుగా చెప్పుతూ వ్యక్తపరుస్తారు. నిజమైన నమ్రత, ఆ నమ్రత యొక్క ఉడుపును ధరించినంత మాత్రం చేత సమకూరదు. నిజమైన నమ్రత, అవిరామంగా విడువకుండా యధార్థ గొప్పదనపు శక్తినుండి పుట్టుకొస్తుంది. తన నమ్రత గురించి చెప్పుకున్నంత మాత్రంచేత ఎవరూ వినయంకల వారు కాలేరు. ఒక చిలుక "నేను మనిషిని' ' అని చెప్పినంత మాత్రంచేత అది మనిషి కాబోదు.

నమ్రతను ఆపాదించుకొని లేని గొప్పతనాన్ని సృష్టించుకొనుట కంటే గొప్పతనం లేకపోవటమే మంచిది. నమ్రత గురించి జాగ్రత్తగా వుండండి. అణకువ ముసుగు క్రింద నమ్రత తప్పని సరిగా ఆత్మవంచన కోరల్లోనికి దారితీస్తుంది. నమ్రత అహంకారాన్ని పుట్టిస్తుంది. మరి మానవుడు చివరకు ఆపాదించుకున్న నమ్రత ద్వారా గర్వానికి లొంగిపోతాడు.

అతి గొప్ప గొప్పతనము మరియు గొప్ప నమ్రత అతి సహజంగా ఎటువంటి ప్రయత్నము లేకుండానే చేయి చేయి కలిపి పయనిస్తాయి.

## నేను గొప్పవాడిని



అందరికంటే గొప్పవాడు "నేను గొప్పవాడిని" అని చెప్పినప్పుడు, అది యధేచ్ఛగా తనకు తానే ఏ మాత్రం పొరపాటు లేకుండా నిశ్చయమైన సత్యాన్ని వ్యక్త పరిచినట్లవుతుంది. అతని గొప్పతనపు శక్తి మరణించిన వారిని బ్రతికించుటలో కాక బలహీనులైన వారి చేతుల్లో పరిహసించబడి, పీడించబడి, శిలువ వేయబడితే తనకు తాను సహజంగా అన్నిటినీ అంగీకరించ కలిగినప్పుడు అతనిలో ఉన్న ఆ గొప్ప నమ్రతలో ఉంటుంది. అనాదిగా మానవాళి, అవతారుని గొప్పతనపు నిజమైన లోతులను, ఆయన దైవత్వాన్ని మతపర ప్రమాణాల వల్ల కొలవలేక పోతున్నారు. ఆఖరికి యధార్థ ఋషులు, మునులు సైతము, సత్యము గురించిన కొంత జ్ఞానము ఉన్నా, అవతారుడు తన యధార్థ నమ్రతతో ఎదురుర్కొనప్పుడు ఆ అవతారుని గొప్పతనాన్ని అర్థం చేసుకోలేక పోయారు.

స్త్రీ పురుషులు తమ అజ్ఞానము, పరిమితులు, మరియు గర్వములో దైవం అవతారుడై అవతరించిన తన దైవత్వాన్ని ప్రకటిస్తే తమకున్న తెలివితేటలతో ఆయన్ని అర్థం చేసుకోలేక, ఆయన పలికే సత్యాల్ని ఖండించుట యుగయుగాలుగా జరుగుతూ చరిత్ర పునరావృతమౌతోంది. దూషణకు, విద్వేషంతో చేసే హింసలకు ఆయన నిష్పక్షపాతి. ఎందుకంటే, ఆయన యొక్క యధార్థ కరుణ ఆయనకు తెలుసు. సత్యమును ఎడతెగకుండా తాను అనుభవిస్తున్నట్లు ఆయన ఎరుగును. మరియు తన అనంత దయలో ఆయన క్షమిస్తాడు.

# భగవంతుడు తప్ప వేరేదీ లేదు

సర్వమూ భగవంతుడు. భగవంతుడు అంతయు ఎరుగును మరియు భగవంతుడే అన్నీ చేయును. అవతారుడు తాను పురాణ పురుషుడనని ప్రకటన చేసినప్పుడు అలా ప్రకటించేది యీ భూమిపై ఆయన అవతరణ యొక్క ప్రత్యక్షీకరణే. అవతార తత్వానికి వ్యతిరేకంగా మానవుడు పలికితే అతని ద్వారా అలా పలికేదీ భగవంతుడే. అనగా భగవంతుడు మాత్రమే, అవతారుడి ద్వారా, మరియు మానవుల ద్వారా కూడా తానే ప్రకటిస్తాడు.

నా దివ్యాధికారముతో నేను మీ అందరికి, మీరు నేను కలసి, మనము కాదు ఒకరమేనని చెపుతున్నాను. మీరు అజ్ఞానం వల్ల నా అవతారతత్వాన్ని మీలో తెలుసుకోలేకున్నారు. నేను చైతన్యయుతంగా మీలోని ప్రతి ఒక్కరు మీ మనస్సులో ఏమి అనుకుంటున్నారో తెలుసుకుంటున్నాను. ఈ విధంగా మనలోని ప్రతి ఒక్కరు అవతారుడే. ఏ భావంలో అనగా, ఎవరికి వారు, దేనికది ఒకే సమయంలో సర్వకాల సర్వావస్థల యందు ప్రతి ఒక్కరూ ప్రతిదీ కూడా అవతారుడవుతున్నారు.

భగవంతుడు తప్ప మరేదీ లేదు. అయన మాత్రమే సత్యము. ఆపరిపూర్ణ సత్యము పూజ్యమైన ఏకత్వములో మనమాంతా ఒకటే. భగవంతుని సాక్షాత్కారం చేసుకున్న వాడు, "నేను భగవంతుడను మీరూ భగవంతుడే మన మంతా ఒకటే" అనిచెప్పి మాయ బంధాలలో మునిగిన వారికి తెలిపినప్పుడు నీచము - ఉచ్చము, పేద - ధనిక, దీనత్వం - నమ్రత, మంచి - చెడు, వంటివన్నీ అదృశ్యమవుతయి. మానవుడ్ని కేవలం ద్వందము యొక్క అసత్యపు భావన మాత్రమే తప్పు దోవ పట్టించి తప్పుడు భేదాన్ని కలిగించి, వారిని ప్రత్యేక వర్గాల్లో నింపేస్తున్నయి.

నేనుమళ్లీ చెపుతూ నానిత్య నిరంతర శాశ్వత సత్యాను భూతిలో విశద పరుస్తున్నాను, ప్రాపంచికమైన భాగ్యవంతుడికి, పేదవాడికి మధ్య ఎటువంటి భేదం ఉండదు. కానీ ఎప్పుడైనా ఐశ్వర్యానికి, పేదరికానికి మధ్య బేధం విషయంలో నాకు యీ సంబంధమైన ప్రశ్న ఎదురైతే నేనటువంటి వానిని భగవంతుని కొరకు, ఇసుమంత ప్రేమ సంపదన్నా లేకుండా, భౌతిక సంపదలు

మాత్రమే కలిగివున్నట్లు నేను పరిగణిస్తాను. సిరిసంపద లేమీ లేకుండా ఉండి, అమూల్యమైన దైవప్రేమ సంపదను కలిగిన వారే నిజమైన సంపన్నుడని నేనెరుగుదును. అతడు ఎంత సంపన్నుడంటే, రాజులు సైతం అతడిని చూచి ఈర్ష్య పడతారు. రాజులకు రాజుసైతం అతనికి బానిస అవుతాడు.

అందువల్ల బాగా తెలుసుకోండి. భగవంతుడి దృష్టిలో పేద, ధనికుల మధ్య బేధము కేవలము సంపద, పేదరికములు కాక భగవంతుని గురించి పడే తృష్ణలో తీవ్రత, నిష్కాపట్యముల క్రమంలో ఉంటుంది.

భగవంతుని యడల ఉండే ప్రేమ మాత్రమే బుద్ధ్యభిప్రాయమైన జీవనాధారమైన పరిమితాహంకారపు అసత్యాన్ని తుడిచివేస్తుంది. అది మాత్రమే శాశ్వత ఉనికికి మూలాధారమైన అపరిమిత అహంకారపు సత్యాన్ని గుర్తించేట్లు చేస్తుంది. శాశ్వత ఉనికికి మూలాధారంగా ఈ దివ్యాహంకారము తనంతట తానుగా నిరంతరం వ్యక్తమవుతుంది, అయితే అజ్ఞానపు తెరతో కప్పబడి ఉండుటవల్ల మానవుడు తన అగోచరమైన అహమును అపార్థం చేసుకొని, దానినే పరిమితమైన భిన్నమైన అహంకారముగా అనుభవిస్తూ వ్యక్తపరుస్తున్నాడు.

నేను నా దివ్యాధికారంతో, సత్యము యొక్క ఏకత్వము సమాధాన పడనంత అపరిమితమైనదని, "మనము కేవలం ఒకటే" కాక సర్వవ్యాపకులమని, అంతే కాక "మనము" అనే యీ సాముదాయ పదానికి అనంతుడైన అగోచరుని ఏకత్వములో స్థానము లేదు అని విశద పరుస్తున్నాను.

## దైవ ప్రేమకై ప్రగాఢ వాంఛ

మీ అజ్ఞానం నుండి మేల్కొని సమాధాన పడలేని అగోచరుని ఏకత్వంలో అవతారుడైన భగవంతుడుమాత్రమే కాక, మీ అందరిలాగే చీమ, పిచ్చుక వంటివి కూడా ఉన్నందున, మీరు భగవంతుడు తప్ప మరేదీ కారని అర్థం చేసుకోనుటకు కనీసం ప్రయత్నించండి. ఇందు వ్యక్తమయ్యే బేధము చైతన్య స్థాయిలలో మాత్రమే ఉంటుంది ఏది పిచ్చుకో, ఏది పిచ్చుక కాదో అవతారుడికి తెలుసు,కానీ, అపిచ్చుక దీనిని గుర్తించ లేదు. దాని అజ్ఞానపు అవివేకమువల్ల తననొక పిచ్చుకగానే అది గుర్తిస్తుంది.

అజ్ఞానంలో జీవించకండి. విలువైన మీ ఆయుఃప్రమాణాన్ని మీసాటి వారి మధ్య వ్యత్యాసాల్ని అంచనాలు వేస్తూ వృధా చేసుకొనక, దైవప్రేమకై ప్రగాడంగా పరితపించండి. మీ దైనందిన కార్య క్రమాల్లో సైతం,మీ ప్రియతమ దైవంతో నిజమై అభేద్యతను కనుగొని గుర్తించుటకు మాత్రమే జీవించండి

పరిశుద్ధంగా, నిష్కపటంగా ఉండండి, అంతా ఒకటే గనుక అందరినీ ప్రేమించండి. సహజంగా ఉండండి. మీ అత్మతో నిజాయితీగా ఉండండి. అసత్యపు నమ్రతకు విరుద్ధంగా నిజాయితీ మిమ్ముల‌ను కాపాడుతుంది.నిజమైన అణకువ యొక్క శక్తిని మీ కది ఇస్తుంది. ఇతరులకు సహాయపడుటలో నొప్పించవద్దు. దివ్య ప్రేమ బహుమనము తప్ప మరే ప్రతిఫలాన్ని ఆశించకండి ఈ బహుమతికై నిజాయితీగా తీవ్రంగా పరితపించండి.నాదివ్య నిష్కాపట్యపు పేరు మీద నేను మీకు హామి ఇస్తున్నాను. మీరు పరితపించే దానికంటే అధికమైన బహుమానాన్ని నేనుమీకు ప్రసాదిస్తాను.

నాదివ్య ప్రేమయొక్క బీజాలు మీ హృదయాల్లో దైవ ప్రేమను రగుల్కొలిపి గాఢమైన పరితాపాన్ని నాటుగాక అని మీ అందరికి నా ఆశీస్సు లందిస్తున్నాను.

అతి త్వరలోనే ఈ సందేశము పశ్చిమ దేశాల్లోని తన ప్రేమికు లందరికీ చేరింది. అవతారుని పిలుపుకు ప్రతిస్పందిస్తూ 1931లో బాబా అమెరికా వెళ్లినప్పుడు మొదటిసారిఆయన్ని దర్శించిన జోసెఫైన్ ఎస్తర్ రోస్ అనే ఆమె సంగ్రహంగా మెహెర్ బాబాసందేశపు సారంశాన్ని "అవతార్ శ్రీబాబా" అనే శీర్షికతో పద్యరూపంలో వ్యక్తపరిచింది. దైవీమానవుని ఆహ్వానము "అందరు నాచెంతకు రండు" అన్న పిలుపును పద్య రూపంలో మనోహరంగా ప్రేరణ కలిగించే ఆమె వ్రాసిన పద్యాల్ని ఈక్రింద పొందు పరుస్తున్నాను :-

ప్రపంచపు రణగొణులక తీతంగా
ఆయన సందేశం పరిశుద్ధము మరియు మధురం
బాబా స్వరముమనల్ని పిలుస్తోంది
తనపాదాల చెంత పూజించమని,

ఒక్కో హృదయంలో అయన ప్రేమ కొనసాగుతోంది,
ఒక్కో ఆత్మలో ఆయన తేజస్సు,
ఒక్కో మనస్సులో ఆయన జ్ఞానము,
ఒక్కో జీవితంలో ఆయన సంపద



ఆయన సౌందర్యము ఒక జ్వలించే కత్తి,
వెలుగును విరజిమ్మే ఒక దివ్వెచి,
అది ఆత్మ మబ్బుల్లో చొచ్చుకుపోతుంది
చీకటిలో మనకది మార్గదర్శకమౌతుంది.

శబ్దించని ఆయన మాట ఒక సవాలు
ఆయన దాక్షిణ్యాము ఒక మణిరత్నం,
ఆయన అధికార సంయోగం
కరుణ కలిగిస్తుంది

ప్రాపంచిక రణ గొణులకతీతంగా
ఆయన సందేశం పరిశుద్ధం మరియు మధురం
నా బిడ్డలారా నా చెంతకు రండు
చెంతకు చేరి నిర్భయులుకండు

అలసిన మీరు నా చెంతకు చేరండి
గూటికి చేరిన పక్షుల్లా
మీ భారాన్నంతా నా పాదాల చెంత వదలండి
మీ విరామాన్ని నాలో పొందండి

నా ప్రేమికులారా నా చెంతకు రండు
నాలో విముక్తిని పొందండి
నిశ్చలంగా ఉండి నేను భగవంతుడినని తెలుసుకోండి
శాంతి దూతనని

నిశ్చలంగా ఉండి నేను భగవంతుడినని తెలుసుకోండి
శంకలు ఘర్షణలు విడనాడండి
నేను పునరుత్థానము
నేనే శాశ్వత జీవనం

ఎందుకంటే ఆ అరుదెంచు వాడిని నేనే
అలా వచ్చిన వాడిని నేనే
శిలువ వేయబడి స్తుతించబడిన వాడూ నేనే
అనాదిగా అదే అయిఉన్నాను.

ఛేదించుకుపోయే నా చేతుల్ని పాదాల్ని
నా శిరముపై యున్న ముళ్లను చూడండి !
అయినప్పటికీ, మరల నేను మీకు
పవిత్ర మధువును రొట్టెను ఇచ్చేందుకు వచ్చాను



"నేను మరోసారి జీసను త్రొక్కిన
ఆ పవిత్ర మార్గంపై
పాప పంకిలమైన ప్రపంచాన్ని ఉద్ధరించి
దైవ హృదయం చెంతకు చేర్చుటకు వచ్చాను"

ఆయన ఒక రూపం ధరించినప్పుడు అవతారుడి పిలుపు దైవం నుండి వచ్చే ఒక ప్రేమమయ ప్రయత్నం. అవతారుడు సర్వ శక్తిమయుడైనప్పటికీ తన వాంఛితమును ఎవరిపైనా బలవంతంగా రుద్దడు. ఇష్టపూర్వకంగా అది గౌరవించబడి ప్రతి వారు జన్మతః తాము భగవంతుడేనని తెలుసుకొని తన చెంతకు చేరే వరకూ ఆయన ఓర్పుతో మౌనంగా ఎదురు చూస్తాడు. తాను అనంత సత్యముగా తన సహజ స్వభావాన్ని ఎరుకతో అనుభవించేందుకు అవతారుని "అంతా నా చెంతకు రండు" అనే పిలుపును ఆలకించటమే చక్కని మార్గము.

## దర్శన రోజు విశేషాలు

మెహెర్ బాబా దర్శనాన్ని పొందుటకు వేలాదిమంది వాడియా పార్కును సందర్శించారు. ఏకొద్ది మందో తప్ప అంతా ఆబాబా చేతులు మీదుగా ప్రసాదాన్ని స్వీకరించారు. అయినప్పటికీ,అవతారుని భౌతిక సమక్షంలో ఉండే అదృష్టంవల్ల వారందరిపైనా షరతులు లేని ఆయన కృపా పూరిత దివ్యాశీస్సులు అను గ్రహించబడినవి. వారి హృదయాల్లో ప్రేమ బీజాలు మొలకెత్తి సకాలంలో చిగురించి విరియపూసేట్లు నాటబడినవి. చాలమంది బాబా ప్రేమికులు, ఆయన సర్వజ్ఞత్వాన్ని సర్వవ్యాపకత్వాన్ని అనేక విధాలుగా అనుభవించారు. ఇలాఈ అద్భుత ఘట్టం గురించిపూర్తి చేసే ముందు ఈ స్వానుభవాలు కొన్నిటిని నేను పొందు పరచాలనుకున్నాను. ఆయన్ని కలవాలని వచ్చిన తమ యెడల

బాబాచూపిననమ్మలేని విధానాలని కొన్నిటిని వ్యక్తపరచి, తమయందాయన కున్న ప్రేమను, తీసుకున్నసంరక్షణా భాద్యతలను చెప్పారు.

ఈ దర్శనా కార్యక్రమం అహ్మదునగరు జిల్లా వాసులకు మాత్రమే ప్రధానంగా ఉద్దేశించ బడినప్పటికీ, కొన్ని బాబా ప్రేమిక బృందాలు భారతదేశపు అనేక ప్రాంతాల నుండి వచ్చాయి. ఒక బృందము పాకిస్తాను నుండి కూడా వచ్చింది. పాకిస్తాన్‌లోని కరాచీ నుండి రోడాదుబాష్ అంతకు ముందు రోజే వాడి యాపార్కుకు చేరుకున్నది. కానీ బాబా ఆశీనులైన వేదికకు చేరువలో చోటు సంపాదించటం ఆమెకు అంత సుళువు కాలేదు. ఆగష్టు నెలలో ఆమె బాబాను సతారాలో కలుసుకున్న జ్ఞాపకాలు ఆమె హృదయంలో ఇంకా వాడలేదు. ఆయన దృష్టిని ఆకర్షించి, తన ప్రేమను, భక్తిని గురించిన సందేశాన్ని మౌనంగా పంపాలని ఆమె కాంక్షించింది. కానీ అంత పెద్దజన సందోహంలో అలా తెలిపేందుకు సాధ్యపడలేదు.

అతిత్వరలోనే బాబా దర్శనానికి క్యూ ప్రారంభమైంది. అప్పుడామె "ఇప్పుడు నేను బాబా దృష్టిని అందుకోగలను" అనుకున్నది అయినప్పటికీ, ఆ క్యూలో ఆమె బాబాకు మరింత చేరువవుతున్నా, బాబా మాత్రం ఎప్పుడూ అటూ ఇటూ చూస్తూ చాలా హడావిడిగా వున్నారు. దర్శనానికై ఆమె వంతురాగానే ఆమె ఆతురతతో బాబా ముఖం వైపు చూచే సరికి, ఆయన తనను గమనించకుండానే తన వెనుక నున్న ఆమె యోగక్షేమాలడుగుతూ ఎలా ఉన్నావు అంటూ కనిపించారు. రోడా ఈ విషయం గ్రహించేటప్పటికి బాబా ఎదుట ఆమెవంతు అయిపోయింది. అయినప్పటికీ, కనీసం ఒక్కక్షణమైనా ఆయన దృష్టిలో పడాలని ఆమె ఇంకా నిశ్చయించుకున్నది. అందువల్ల బాబా కూర్చున్న వేదికపైకి వెళ్లేందుకు ప్రయత్నించగా అక్కడ కనీసం నిలబడేందుకు కూడా చోటు లేదు.

అంతలో ఎవరో "ఏక్షణంలోనైనా ఈ వేదిక కూలిపోవచ్చు. కనుక మనమంతా క్రిందికి దిగిపోదా" మంటూ ఎవరో ఒక మూల నుంచి చెప్పటం వినిపించింది. కానీ రోడా అక్కడే ఉండిపోవాలని నిర్ణయించుకున్నది. ఆమె బాబా దగ్గరకు చేరేందుకు పోరాడి చివరకు సరిగ్గా ఆయనకు వెనకగానే చోటు సంపాదించింది. తన వైపు ఒక్కసారి చూడమని మౌనంగా వేడుకున్నది. ఆయనైతే తిరిగారు కానీ, ఆమెకు కుడివైపున నున్న ఆమె ముఖాన్ని చుంబిస్తూ

ఎడమ వైపున నున్న ఆమెను తట్టారు. కానీ రోడాకు ఆయన దృష్టిలో తానక్కడ లేనట్లు అనిపించింది. చాలా గాఢంగా ఆమె మదనపడింది. కేవలం కొద్ది రోజుల క్రితం సతారాలో ఎంతో ప్రేమను కురిపించిన తన ప్రియతమ అవతారుడు, ఇప్పుడు పూర్తిగా ఆమెను ఎరుగనట్లు ఉండటాన్ని ఆమె నమ్మలేకపోయింది.

అప్పట్లో ఆమె, తన ప్రేమను మరింత ఎక్కువగా స్వీకరించ కలిగేట్లు వారి హృదయాల్ని మేల్కొలుపుటకు బాబా చేసే విధానాల్లో ఇది ఒకటని ఆమె తెలుసుకోలేకపోయింది. 1930 ఆఖర్లో "అవతార్" గ్రంథ రచయిత, జీన్ ఏడ్రియల్ అనే తనకు అత్యంత ప్రియమైన ఒక అమెరికన్ శిష్యురాలి కిచ్చిన సందేశంలో ఇది నా కార్యక్రమ విధానము. నేను నిన్ను నావైపు ఆకర్షించాను. మళ్లానిన్ను ఆవలకు నెట్టి వేస్తాను. అప్పుడు ఇంకా చేరువకు లాగుతాను. మళ్లీ చాలా దూరంగా తోసివేస్తాను. చివరకు నీవు శాశ్వతంగా నాతో సమైక్యమయ్యేందుకు మరీ మరీ సన్నిహితంగా ఆకర్షిస్తాను" అని వివరించారు. నిజానికి, ప్రియతమ బాబాతో జీన్ ఏడ్రిల్ విషయంలో సరిగ్గా ఇలాగే జరిగింది.

ఇది తెలుసుకోలేని రోడాకు, ఆనాడు, ఈ పద్ధతి యొక్క రుచిని కొద్దిగా చూపించారు. దివ్య ప్రియతముడైన బాబా తన ఘనమైన విదానం ద్వారా రోడాకు తన యవ్వనావస్థలో నున్న ప్రేమ పెరిగి పక్వానికి వచ్చిన నిస్వార్థ ప్రేమకు దారి ఇవ్వాలని చూపించారు. బాబా మాటల్లో "ప్రేమకు ప్రతిమెట్టుపై గుర్తింపు అక్కర్లేదు. అది హృదయంలోనే మౌనంగా దహించుకు పోవాలి..." అన్నట్లుగా రోడా ప్రేమ ఆనాడు ఒక కొత్త ఘట్టంలో ఆరంభమైంది.

తన ప్రేమికులతో అవతారుని సంబంధాన్ని బహిర్గతపరచే మరో కథను వేరే దృష్టిలో తెలుసుకుందాం. చించవాడాకు చెందిన శివాజీ అనే వానికి సంబంధించిన కథ ఇది. శివాజీ మంచి వయస్సులో ఉన్న కుర్రవాడు. ఇతడు భగవంతుడిని "మల్హార్" అనే నామంతో నిత్యం స్మరించే అలవాటులో పడ్డాడు. ఆసాధనలో అతడు పూర్తిగా మునిగిపోయి ఆ నామస్మరణానందంలో, కొన్ని సమయాల్లో తన భౌతిక పరిసరాల ఎరుకను కోల్పోయేవాడే. ఆ మల్హార్ నామము అతని ప్రతి హృదయ స్పందనతో పాటు ప్రకంపించేది.

అతడు యువకుడిగా ఉండగానే వివాహం చేసుకొని, భారతీయ రైల్వేలో ఉద్యోగాన్ని కూడా సంపాదించాడు తన 30వ దశకంలో, అతడు మహారాష్ట్ర

సద్గురువులు సాధువుల రచనలను చదవటం ప్రారంభించాడు. వాటి నుండి అతను దైవనామాన్ని స్మరిస్తే లాభమే అయినా అది ఒక గురువు లేదా యోగి ముఖతః స్వయంగా అందిస్తే తప్ప దాని నిజమైన ఫలోత్పాదన అందుబాటు కాదు అని తెలుసుకున్నాడు.

1947లో ఉత్తర భారతంలోని బీనా రైల్వే జంక్షనులో విశేష శిక్షణకై ఇతను పంపబడ్డాడు. అతని ఆధ్యాత్మిక అన్వేషణ కొనసాగుతూనే ఉంది. అప్పుడతని కుటుంబం అతని వెంట లేనందున అతడు ప్రతి సాయంత్రం తన ఆధ్యాత్మిక సాధనకు మల్హార్ దివ్యనామాన్నిపునః స్మరణచేయుటకు వినియోగించ కలిగాడు. అదే సమయంలో అతడు అనేక మంది సాధువుల్ని పట్టణ పరిసరాల్లో సందర్శించటం మొదలు పెట్టాడు. భగవంతుడు ఎప్పుడు హృదయా వేదనకు ప్రతి స్పందిస్తాడు. శివాజీ ఒక సిక్కుసాధువును కలిసి,నిశ్చలము,సంతృప్తి, పొందిన ఆయన సమక్షాన్ని చూడగానే అతని మనస్సులో నాటుకు పోయాడు. ఈ సాధువు, ఎక్కువగా భగవంతుడ్ని స్మరిస్తూ ఒక చిన్న పూరి పాకలో ఉండేవాడు. శివాజీ అయన్ని కలిసి, తనకు గురూపదేశం చేసి ఆద్యాత్మక మార్గం భోదించమని అభ్యర్థించాడు. అందుకా సాధువు అంగీకరించి శివాజీ కి స్వయంగా స్మరించే చాలా పంక్తులున్న ఒక పెద్ద మంత్రాన్ని భోదించాడు. అందుకు శివాజీ సంతోషపడ్డాడు.

కొద్ది నెలలకు అట్రైనింగు కాలం పూర్తయి అతను మహారాష్ట్రకు తిరిగి వచ్చాడు. ఆపవిత్రమైన మంత్రాన్ని విడువకుండా భక్తితో అతడు అనుష్టానం చేయసాగాడు. అయినప్పటికీ ఆమంత్రం హిందీలో కాకుండాసిక్కుల భాషయైనగురుముఖి భాషలోఉండుటవల్ల,అతను కలవరపడసాగాడు.దాని భావాన్ని అర్థం చేసుకోవటం అతనికికష్టమై పోయింది.అతను తన ఆధ్యాత్మిక క్రమశిక్షణను ఎంతో జాగ్రత్తగా పోషించినప్పటికీ, అతను మరింత అసంతృప్తి చెందసాగాడు చివరకు బీనా వెళ్లి తన గురువును కలవాలను కున్నాడు.అయితే ఆయన్ని కలిసేలోపే,ఆసాధువుసిద్ధి పొందాడని విన్నాడు. "ఇప్పుడు నేనీ సంకటమును ఎలా పరిష్కరించ గలను?" అంటూ అతను విస్మయపడ్డాడు. సరిగ్గా అదే సమయంలో అతడు అహ్మదునగరు రైల్వే స్టేషనుకు అసిస్టెంటు స్టేషను మాష్టరుగా బదిలీ అయ్యాడు.

## అహ్మద్‌నగరులో అవతారుని దర్శనానికై వేలాదిమంది పాల్గొన్నారు

1950తోలి రోజుల్లో శివాజీకి మెహెర్ బాబా పేరువిని ఆయన దర్శనం పొందే చక్కని అదృష్టం దొరికింది. ఇది అతనిపై ఒక గోప్ప ప్రభావాన్ని కలిగించింది. బాబా స్పర్శవల్ల అతని హృదయమంతా అనందంతో నిండి పోయింది.బాబా దివ్యాధి కారపు సత్య ప్రేమలననుభవిస్తూ ఆమంత్రాన్ని స్మరిస్తూనేబాబా రూపాన్ని తనమనో నేత్రం ముందుకు తెచ్చుకొనుట మొదలు పెట్టాడు. అయినా అతనిలో ని అంతర్గతకల్లోలం విడవకండా కొనసాగింది.అతని జీవితా శయమైన మల్హార్‌దేముని నామంగా ధ్యానించటమా తన గురువును గౌరవించటమా ఇప్పుడు మెహెర్ బాబా కొరకు మెల్కోల్పబడిన ప్రేమనా ? తనఅంతర్గత జీవితపు యీమూడు విషయల్లో వేటినీ అనుసరించాలో నిర్ధారించుకో లేకపోయాడు.

చివరకుజూలై 1954లోసతారాలో ఉన్న బాబాకు తానుపడుతున్న ఆధ్యాత్మిక గుంజాటన గురించి వివరంగా జాబు వ్రాశాడు. "నేనీ జాబును తమరు నాహృదయ కవాటాన్ని తెరుచుటకు ఒక దివ్యావకాశంగా తీసుకొని వ్రాస్తున్నాను. గురువు నన్ను నిజంగా ప్రేమించాడు. ఆయనంటే నాకు ఎనలేని గౌరవమున్నది. అందువల్ల ఆయన సిద్ధి పోందిన తర్వాత కూడా నేనాయన్ని సంతోష పెట్టాలని కాంక్షించాను. ఆయన ఆదేశాల్ని పాటించదలచాను. ఈ నాటికీ నేనామంత్రాన్ని పునస్మరణచేస్తుంటే, నాఅంతర్గతంలో నాగురువు నన్ను మిమ్ములను కలుసుకోమని ఆదేశిస్తున్నట్లు నాకనిపిస్తోంది. తమరు పేర్లకు, రూపాలకు అతీతులు అందువల్ల నన్నుదైవాన్ని చేర్చేనామాన్ని నాకు ప్రసాదించమని తమను వేడుకుంటున్నాను "అంటూ ఆవేదనను బాబాకు నివేదించుకున్నాడు. భారతీయ సంప్రదాయాను సారం ఈనివేదన జరిగింది .శివాజీతన జాబులో బాబానుంచి జవాబుచేరిన పిదప సెప్టెంబరులోబాబా దర్శనం పొందే వరకు ఆనామాన్నేస్మరిస్తూ వ్రాసుకుంటానని బాబాకు అభయమిచ్చాడు.

అవతారుడు సాంప్రదాయాలన్నిటికీ అతీతుడు అలాగే ఆయన నామములోనే దైవ నామాలన్నీ ఆవహించి ఉన్నాయి. కనుక, బాబా తనదైన శైలిలో జవాబును పంపుటకు అద్భుతమైన స్వంత మార్గాన్ని అవ లంభించారు. తన మండలిలో ఒకరి ద్వారా కబురుపెడుతూ, శివాజీ ఉత్తరంతో తాను చాలా ఆనందించానని. వాడియా పార్కులో సెప్టెంబరు 12న బాబా ముందు

నిలబడినప్పుడు మల్హార్ నామాన్నిపైకి బిగ్గరాగా హృదయపూర్వాకంగా శివాజీ వుచ్చరించాలని, సందేశం పంపారు. దీని వల్ల అతనిలో చెలరేగుతున్న సందేహం పరిష్కారమై అంతరంగంలోని దైవాన్ని చేరే మార్గాన్ని సుగమం చేస్తుందని దీనినిబట్టి ఊహించ వచ్చును. అలాగే సెప్టెంబరు 12న బాబాముందే శివాజీ పిలవబడి నప్పుడు,తాను చిన్ననాటినుండి స్మరిస్తున్న తనకు ఇష్టమైన దైవనామం మల్హార్ పేరును బిగ్గరగా ఉచ్చరించాడు. ఆక్షణం నుంచి, శివాజీలో గూడు కట్టిన ఆరాటం, తొలిగి పోయింది. అతడు స్మరించే దైవ నామానికి ఇప్పుడుఅవతారుడి అనుమతి లభించింది. బాబా తన కరుణలో ఆపేరును, శివాజీతన వద్దకువచ్చే విధంగా తనలోకి తీసుకున్నారు.

తనమనస్సు హృదయంలో నిండిన గందర గోళమంతా తుడిచి వేసుకోని, తిరిగి నిత్య జీవితానికి తిరిగి వచ్చి బాబాతో తన ఆంతరిక స్పర్శవల్ల అతని బాహ్యజీవితపు సాధారణ పరిస్థితుల్లో తన ఉద్యోగం కుటుంబ బాధ్యతలు, ఆఖరికి అతనికి ఇష్టమైన క్రికెట్టు అటకు సైతం బాబాజోక్యం కల్పించుకోరన్న ధృడ విశ్వాసం అతనిలో కలగింది. మల్హార్ అనేదివ్య నామాన్ని సహజంగా స్మరించటం ప్రతి విషయం ద్వారా కొనసాగి దానితో పాటు, బాబా ప్రేమను కూడా మోసుకు వెళ్లింది.

బాబా ప్రేమ మరియు ఆయన ప్రేమికుల గురించి వ్యక్త పరిచే మరో సంఘటనను తెలుసుకుందాం.సెప్టెంబరు 12న అహ్మదునగరులో బాబా దర్శనమిస్తున్నారని బాపిరాజు అనే ఆయస విన్నాడు. తాను ఆర్థికంగా బాగా లేకపోయినా, యీ అవకాశాన్ని జారవిడుచుకో కూడదని నిర్ణయించు కున్నాడు. తన కుటుంబ మంతటిని వెంట బెట్టుకోని అవతారుని భౌతిక సహవాస్‌లో అంతాకలిసి పాల్గొనేందుకు తన వూరునుండి బయలు దేరాడు.

అహమ్మదునగరు చేరేందుకు కిక్కిరిసిన బోగీలో 24గంటల పాటువారు శ్రమతో కూడిన రైలు ప్రయాణం చేయాల్సి వచ్చింది. ఏమైనప్పటికీ, ఒక వ్యక్తి అవతారుని సందర్శించే సమయంలో ఎటువంటి అసౌకర్యం లేదా ఇబ్బందులు కలిగినా ఆసర్వజ్ఞుడివల్ల ప్రతిఫలం దివ్యంగా ప్రాప్తిస్తుంది. ఆయన్ని దర్శించేందుకు వచ్చే తన ప్రతి ప్రేమికుని అవసరాల్ని ఎంత చిన్న విషయాలైనా ఆయన పట్టించుకుని ఆదుకుంటారు.

వారు 12వ తేదీ ఉదయానికి అహ్మదునగరు చేరుకున్నారు. ఆ కుటుంబం వాడియా పార్కుకు చేరే సమయానికి, అప్పటికే వందలాది మంది బాబా దర్శనానికై ఎదురుచూస్తూ క్యూలో ఉన్నారు. బాబా కూర్చున్న వేదికకు ముందు కూడా చాలా పెద్ద జన సందోహం కూర్చొని ఉన్నారు. ఈ కుటుంబంవారు ఆ జనానికి వెనకగా మధ్యాహ్నం వరకూ కూర్చుండిపోయారు. అంతపెద్ద సమూహంలో బాబా వీరిని గుర్తించి, వేదిక పైకి తీసుకు రమ్మనమని కబురు పెట్టారు. వారిని బయట వేపుకు తీసుకువెళ్లి జనం చుట్టూ వున్న త్రోవగుండా బాబాకూర్చున్న వేదికపైకి చేర్చారు. అనుకోని ఈ హఠాత్ సంఘటనకు అతడు మహదానందపడి, తనచుట్టూ ఏమి జరుగుతున్నదో తెలుసుకోలేకపోయాడు. పిమ్మట అతని భార్య అతనితో "బాబా మీ నెత్తిమీదున్న దొరటోపీని తీసుకొని స్వయంగా ఆయన నెత్తిమీద సుతారంగా వంగిన కోణంలో పెట్టుకోగా దానిని చూచి దర్శనం చేసుకుంటున్నవారంతా కడుపార నవ్వుకున్నారు" అని చెప్పింది. బాబా అప్పుడప్పుడు హాస్య ధోరణిలో ఇటువంటి అనూహ్యమైన చేష్టల ద్వారా తనప్రేమను తన సాన్నిహిత్యాన్ని వ్యక్తపరిచేవారు.

ఈ కుటుంబాన్ని బాబా ఆనాటి సాయంత్రం మెహెరాబాదులో జరిగే ధునీ కార్యక్రమానికి హాజరు కమ్మని ఆదేశించారు. (బాబా ఆదేశాల ప్రకారం 1941 డిశంబరు 12వ తేదీ నుండి ప్రతినెల 12వ తేదీన విడవకుండా వెలిగించబడుతోంది) సాయంత్రం 7-00 గంIIలకు ధునీ వెలిగించబడింది. ఆ కుటుంబం మెహెరాబాదు నుండి బయలు దేరుటకు సిద్ధమయ్యారు. అయితే ఆ రోజుల్లో పట్టణంలోకి నియమ ప్రకారం వెళ్లే బస్సులు ఉండేవి కావు. చీకటి పడి బాగా చలిగా ఉన్నది. సహాయ మర్థించాలనుకున్నా, దరిదాపుల్లో ఎవరూ కనిపించ లేదు. వారి తాలూకు ఏడాది వయస్సున్న చంటి పిల్ల చలితో వణికిపోతోంది. ఈదురవస్థ నుండి బయట పడుటకు తగు సహాయ మందించమని బాపిరాజు బాబాను ప్రార్థించాడు.

అదే సమయంలో అతడ్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచుతూ, ఒక ఖాళీ వ్యాను ఆరంగాంవైపు నుంచి వచ్చి వారి ముందు ఆగింది. దాని డ్రైవరు చాలా దయాస్వభావుడు. ధునీకి దగ్గర్లో నిలబడిన యీ కుటుంబాన్ని చూచి, వారు అవతార్ మెహెర్ బాబా దర్శనానికి వచ్చి ఇప్పుడిక్కడ చిక్కుకు పోయారని

అతడు అనుకున్నట్లున్నది. అందుకే ఎవరూ ఆపమనకుండానే, అతడే స్వయంగా వ్యానును ఆపి, ప్రేమతో ఆహ్వానించి, ఆ కుటుంబాన్ని లోనికి ఎక్కించుకున్నాడు. వారు ఎక్కడికి వెళ్లాలో అడక్కుండానే తిన్నగా వాడియా పార్కుకు తీసుకువెళ్లాడు.

వారు బస చేసిన హోటలు అక్కడకు దగ్గర్లోనే ఉండుట వల్ల ఆ కుటుంబం తమ సామాన్లను తీసుకొని సకాలంలో స్టేషనుకు చేరి ఆంధ్రాకు వెళ్లే రైలును అందుకోగలిగారు. వారు తాడేపల్లిగూడెం చేరేవరకూ మార్గ మధ్యంలో తమకు కావలసిన అన్ని అవసరాల్ని బాబాయే స్వయంగా తీరుస్తున్నారన్న సంధర్భోచిత సంఘటనలెన్నిటినో అడుగడుగునా అనుభవించారు.

నేనూ స్వయంగా గమనించాను, ఎప్పుడైనా అవతారుడు ఎవరినైనా తనను దర్శించాలని సంకల్పిస్తే, వారి ప్రయాణము తప్పని సరిగా నమ్మలేని సంఘటనలతో నిండిపోతుంది. ఈ సందర్భోచిత సంఘటనలు తన అప్రయత్న సర్వజ్ఞత్వం, దయ, మరియు హాశ్యములకు మాత్రమే అన్వయించవచ్చును. ఇది ఈనాటికి మరింత ఉన్నత కోణంలో నిజంగా ఉండిపోయింది.

ఇది, అదే రోజున బాబాను మొదటిసారిగా కలుసుకోవాలనుకున్న బాబా ప్రేమికుడు భానూధాస్ గవాడే గురించిన మరో కథ. ఇతను గత 11 ఏళ్ల నుండి బాబాను దర్శించాలని పరితపిస్తున్నాడు. 1943లో అతడు బాబాను గురించి వినుటకు ముందు, భానుదాస్, షోలాపూర్ జిల్లాలోని మారుమూల ప్రాంతంలో ఒక ప్రాధమికోపాధ్యాయుడిగా పని చేశేవాడు. అది ఒకటవ తరగతి నుండి 4వ తరగతి వరకు వున్న ఏకోపాధ్యాయ పాఠశాల. ప్రొద్దుటిపూట తరగతులలో పాఠాలు చెప్పి, వారాంతంలో అక్కడకు కొన్ని మైళ్ల దూరంలో ఉన్న తమ కుటుంబపు పూర్వార్జిత వ్యవసాయ క్షేత్రంలో పనులు చూచుకొనేవాడు.

డిశంబరు జనవరి నెలలు సాధారణంగా కోతల కాలం. జనవరి నెలాఖరు వరకు భానూదాస్ మామూలుగా తన వారాంతపు కాలాన్ని పొలంలోనే గడిపేవాడు. అయినప్పటికి ప్రత్యేకంగా యీ వారాంతంలో అతని కోతల పనులు పూర్తికాకపోవటంతో జనవరి 31 సోమవారం నాడు కూడా అతను పొలంలో ఉండిపోయి గడపాల్సి వచ్చింది. ఆ మరునాటి రోజు ఉదయం అతను స్కూలుకు వచ్చాడు.

శాఖాపరమైన నిబంధనల ప్రకారం, ప్రతినెల ఆఖరి రోజున, ప్రతి ఉపాధ్యాయుడు జిల్లా కార్యాలయానికి విధ్యార్థుల హాజరు, ఆ నెలలో బోధించిన పాఠాలు మున్నగు వివరాలతో కొన్ని ఫారాలను పూర్తి చేసి నెలసరి రిపోర్టు పంపటం ఆచారం. ఇతను 31వ తేదీన గైరుహాజరైనప్పటికీ, బానుదాసు తాను హాజరైనట్లుగా ఆ ఫారాన్ని పూరించాడు. వెనుక ముందూ ఆలోచించకుండానే ఆ రిపోర్టును జిల్లా కార్యాలయానికి పోష్టు చేశాడు.

ఆ మర్నాడు గ్రామంలోని వారి ద్వారా, తన స్కూలుకు స్కూళ్ల ఇన్‌స్పెక్టరు జనవరి 31న తనిఖీకి వచ్చినట్లు ఆరోజున భానుదాస్ విధులకు గైరుహాజరయ్యాడని గమనించినట్లు తెలిసింది. ఆ విషయాన్ని జిల్లా కార్యాలయానికి రిపోర్టు చేస్తానని గ్రామస్థులకు చెప్పినట్లు తెలుసుకున్నాడు.

ఈ విషయాన్ని విన్నప్పుడు భానూదాసు చాలా కంగారు పడ్డాడు. దీని ఆధారంగా అతడిని సస్పెండు కానీ, డిస్‌మిస్ కానీ చేయవచ్చని అతనికి తెలుసు మరి అలా తన ఉద్యోగం పోతే తన కుటుంబాన్నిఎలా పోషించుకోవాలో అతడికి బోధపడలేదు. అందువల్ల పక్క ఊళ్లోని స్కూలు హెడ్‌మాస్టరు దగ్గరకు వెళ్లి ఆయన సలహానడిగాడు. జిల్లా అధికారి చాలా మంచివాడని భానూదాస్‌కు తెలుసు. కానీ ఆయన క్రమశిక్షణ గల అధికారని కూడా తెలిసేసరికి, చెడు జరుగుతుందేమో నని భయపడ్డాడు.

భానూదాసు ఆ హెడ్ మాస్టరుతో తన భావాలన్నిటినీ చెప్పగానే, ఆ ప్రధానోపాధ్యాయుడు, "ఏమీ విచారించకు, నీవు ఏం చేయాలో నాకు తెలుసు. అది చాలా తేలిక మరియు సులభం కూడా"

"ఏమిటి ?" అని భానూదాస్ ఆదుర్దాగా అడిగాడు.

"జిల్లా కార్యాలయానికి నీ మిత్రుడు ఒకరిని వెంటపెట్టుకొని వెళ్లి కార్యాలయం బయట అధికారి తన గుర్రబగ్గీ పై వచ్చేవరకు ఆగి ఉండండి. ఆయన వచ్చి బండి దిగే సమయంలో ఆయనకు వినిపించేటట్లు బిగ్గరగా "నీకు మెహెర్‌బాబా గురించి ఏమైనా తెలుసా ?" అని మీ మిత్రుడ్ని ప్రశ్నించు. నీ మాటలను ఆ అధికారి వినేటంత బిగ్గరగా నీవు అడగాలి. నీ సమస్య పరిష్కారమైపోతుంది" అని చెప్పాడు.

అపనమ్మకంతోనే భానూదాసు బుర్ర ఆడించాడు. "ఇలా చేస్తే నా సమశ్య ఎలా తీరుతుందో నేను ఊహించలేక పోతున్నాను. అసలీ మెహెర్‌బాబా ఎవరు ?" అనడిగాడు.

"అది తెలిస్తే మాత్రం నువ్వు ఏం చేయగలవు ? ఈ బాబా గురించి నాకు వ్యక్తిగతంగా ఏమీ తెలియదు కానీ మెహెర్ బాబా గురించి తెలుసుకొనుటకు ఈ ప్రశ్న వేయటం వల్ల ఆయనే నీ పనిని చేస్తారని నాకు తెలుసు. ఆయన నీకో కప్పు కాఫీ కూడా ఇప్పించవచ్చును."

భానూదాసుకు అలా చేయక తప్పలేదు. అందువల్ల మర్నాడు ఉదయం తనతో ఒక స్నేహితుడ్ని వెంటపెట్టుకొని షోలాపూరు వెళ్లాడు. వారు జిల్లా కార్యాలయానికి చేరి గేటు ప్రక్కన ఒక చెట్టుక్రింద నిలబడి అధికారి రాకకొరకు ఎదురు చూస్తున్నారు. కొద్దిసేపట్లో ఆయన కనిపిచారు. వీరి పక్కగా ఆ అధికారి వెళుతుంటే ఆయనకు వినిపించేట్టు భానూదాసు తన మిత్రుడితో బిగ్గరగా "మెహెర్ బాబా గురించి నీకేమైనా తెలుసా ?" అని అడిగాడు.

వెంటనే ఆ అధికారి ఆగి అతని దగ్గరకు వచ్చాడు. "మెహెర్ బాబా ఎవరు అనేనా నీవు అడుగుతున్నావు ?" అని ఆరాతీసాడు. "అవును" అని భానూదాసు బదులిచ్చాడు.

"నాతో రా. నేను నీకు చెప్పేదను" అంటూ అతడిని తన కార్యాలయంలోకి తీసుకువెళ్లి తన గది తలుపు తెరచి లోనికి రమ్మనమని సౌంజ్ఞ చేసి, "అయితే నీవు మెహెర్‌బాబా గురించి తెలుసుకోవాలను కుంటున్నావు కదూ ! మంచిది" అన్నాడు.

ఆ అధికారి ఉత్సాహము, స్నేహ భావమును చూచి భానూదాస్ తట్టుకోలేక పోయాడు. తాను మోసంతో నటిస్తున్నానని అతనికి తెలుసు. అది బయటపడితే తన సంగతి మరింత చెడిపోతుంది. కనుక, అతను కూర్చొబోయే ముందే తన రాకకు అసలుకారణాన్ని బయట పెట్టాడు. ఆ అధికారి అదేమీ పట్టించుకొనకుండా అదేమంత ముఖ్యం కాదన్నట్లు పక్కన పెట్టాడు. తన గుమాస్తాని పిలిచి నెలసరి రిపోర్టుల ఫైలు తెమ్మన్నాడు. బానూదాసుతో "నీవేం విచారించకు ఒకవేళ నీ రిపోర్టును సరిగా వ్రాయకపోతే అలాంటి తప్పు మరెన్నడూ చేయకు. నీ విధి

నిర్వహణలో నిజాయితీగా ప్రవర్తించు. ఇప్పుడు నీవు మరో కొత్త ఫారాన్ని పూర్తి చేసి సంతకం పెట్టి ఇవ్వు" అంటూ "నీవు మెహెర్ బాబా గురించి తెలుసుకోదలచినందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది" అని ముగించాడు. ఆ అధికారి ఎంతో ప్రేమగా బాబా దివ్య జీవనం నుండి కొన్ని సంఘటనలను వివరించి అందరియెడల ఆయన చూపించే కరుణను వ్యక్త పరిచాడు. భానుదాసుకు ఆయన బాబా బొమ్మతో ఉన్న ఒక కరపత్రాన్ని కూడా ఇచ్చాడు.

ఈ అధికారి పేరు ఆర్. కె. గడేకార్. బాబాకు అత్యంత సన్నిహితులైన శిష్యుల్లో ఈయన ఒకరు. ఏకాగ్రతతో కూడిన నిరుపమాన భక్తితో ఆయన సదా బాబా గురించే మాట్లాడాలని ఉవ్విళ్లూరుత్తాడు. ఆయన బాబా దైవత్వంపై చాలా పాటలు కూడా వ్రాశాడు.

ఇంత జరిగేసరికి భానూదాస్ పూర్తిగా మారిపోయాడు. "ఈ అధికారి విషయంలో కేవలం ఆయన పేరును ప్రస్తావించినంత మాత్రంచేతనే ఇంతటి శక్తి వంతమైన భక్తి ప్రపత్తులు పొంగిపొర్లాయి. కేవలం ఆయన పేరు మాత్రమే ఇంత చేస్తే వ్యక్తిగతంగా ఆయన మరెంత మహనీయుడై యుంటాడో కదా !" అన్న ఆలోచనలో పడ్డాడు.

ఉద్యోగంలో ఏఇబ్బందిరాకుండా పరిష్కారమైనందుకుసంతోషంగా భానూదాసు ఇంటికి తిరిగి వేళ్లాడు అయితే మెహెర్ బాబా పేరు యొక్క ఇంద్రజాలంవల్ల అతడు ఆ మాయలో గాఢంగా హత్తుకు పోయాడు. ఇది జరిగిన కొన్నాళ్లాకు ఆ జిల్లా అధికారి పూనాకు బదిలీ అయ్యాడు. అందువల్ల ఇతడికి మెహెర్ బాబా గురించి మరిన్ని విశేషాలు తెలుసుకొనే అవకాశం లేక పోయింది. కానీఅతనిలో బాబా గరించి మరింత తెలుసుకోవాలన్న జిజ్ఞాస ప్రబలమైంది అదృష్టవశాత్తు కొద్ది నెలలు గడిచిన పిదప, అతని స్నేహితుల్లో ఒకాయన మెహెర్ బాబా పై వ్రాసిన పుస్తకాన్ని పంపాడు.దీనిని చదివిన తర్వాత, భానుదాసు తన హృదాయంలో బాబా ఒక సద్గురువు ఒకదైవ సాక్షాత్కారం పొందిన గురువుఅని భావించాడు.

ఇప్పుడతనిలో బాబాను దర్శించాలన్న కోరిక రగులుకుంది. "మెహెర్ బాబానుస్వయంగా దర్శించే అదృష్టం, నాకెప్పుడు లభిస్తుంది?" అన్న అలోచనతో పదకొండేళ్లపాటు పరితాపం అతడ్ని దహించివేసింది. అంతటి అత్యున్నత సద్గురువు సజీవుడై యుంటే ఆయనను దర్శించ లేక పోవటమనేది భానుదాసు యొక్క పరితాపాన్ని ఇన్నేళ్లుగా తీక్షణమైంది.

అతడుఅలా 1954లో ఒక రోజున, వార్తా పత్రికలో అవతార్ మెహెర్‌బాబా అహ్మదునగరు లో ప్రజాదర్శన ఇస్తున్నారన్న వార్తనుచదవటం జరిగింది. ఆతేదీని గమనించిన భానుదాసు తప్పకుండా వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. సెప్టెంబరు11వతేదీన సమీపంలోని రైల్వే స్టేషనుకు అహమ్మదునగరు వేళ్లేందుకు తన ఊరునుంచి బయలు దేరే బస్సు ఎక్కాడు. దారిలో ఆ బస్సు అలశ్యమైనందున రైలు కదులుతుండగా అతను స్టేషనుకు చేరాడు. మరి ఆరోజుకు ప్యాసెంజరు రైళ్లేవీ లేనందున భానుదాసు తనకుదొరికిన అవకాశముచేజారి పోయిందన్న ఆలోచనతో రోడ్డుమీద నిలబడ్డాడు.

సరిగ్గా అదేసమయంలో ఒక లారీ వచ్చి అతడిముందు ఆగింది. దానిడ్రైవరు అతడ్ని పిలిచిఎక్కడకు వెళ్లాలి? అని అడిగాడు అహమ్మదునగరు వెళ్లేందుకు ప్రయత్నిస్తున్నానని చెప్పగా. "నేను అక్కడికే వెళుతున్నాను, లోపలికి రండి కలిసి వెళదాం" అని ఆడ్రైవరు చెప్పాడు ఈ హఠాత్సంఘటనకు భానుదాసు ఆశ్చర్య పోయాడు. ప్రత్యేకంగా ఎందుకంటే తాను నిలబడిన హైవే రోడ్డు పూనా వేళ్లే రోడ్డు అహ్మదునగరువేళ్లే రోడ్డుకాదు అసలు తనకు లారీలో వెళ్లాలన్న ఆలోచనే లేదు సరిగదా అడ్రైవరుని లారీ ఆపమనికూడా అతడెటువంటి సౌంజ్ఞ చేయలేదు. సంబరపడిన భానూదాసు సంతోషంగా లారీ ఎక్కాడు. అమర్నాడు తానొక దర్శనకార్యక్రమానికి హాజరుకావాలని మాటల మధ్య అతడు డ్రైవరుతో చెప్పగా "నేను బాబా దర్శనానికే వెలుతున్నాను" అని డ్రైవరు చెప్పాడు. బాబా విధానాలు ఎంతో అద్భుతంగా ఉంటాయి. సాయం కాలానికి ఆరీలా వాడియా పార్కు చేరింది. భానూదాసు తనప్రయాణ చార్జీని ఇవ్వపోగా "నీవు నన్నురేపు కలుసుకో. నీకు చార్జీలు ఇవ్వాలని ఉంటే అప్పుడు ఇవ్వు" అని డ్రైవరు చెప్పాడు.

మర్నాడు భానుదాసు దర్శన చోటుకు చేరుకున్నాడు. ఇంకా బాబారాలేదు.కానీ భజనలుసాగుతున్నయి. ఆభజనకీర్తనలు వింటున్న భానుదాసుకు, మెహెర్ బాబా రూపందాల్చిన విష్ణుమూర్తి త్వరలో వేదిక పైకి వచ్చి ఆశీనులు కాబోతున్నారన్న భావం కలిగింది అంతలో బాబా రానే వచ్చారు దూరం నుంచే భానూదాసు ఆయన్ని చూచాడు. సంబ్రమాశ్చర్యాలు, భయం, మరియుఎడతెగని భక్తిలో లీనమయిన అతనికి,బాబాశ్రీమహావిష్ణువువలే,ఆభజన గీతాల్లో ప్రస్తుతించిన విధంగా కనిపించారు. అతడి అనుభవాన్ని ఆతర్వాత చెపుతూ "నన్ను నేను పోగోట్టుకున్నాను.నిజానికి అప్పుడు నాకేమైందో చెప్పేందుకు నాకు మాటలు చాలవు" అన్నాడు.

అలా దర్శనమైన తరువాత, తనను వాడియ పార్కుకు చేర్చినతన మిత్రుడు లారీ డ్రైవరుకోసం కొంత సేపు ఎదురుచూచాడు. ఒక గంట గడిచిన పిదప, అతడు కనిపించనందున దర్శన క్యూలో నిలబడానుకున్నాడు. అలా నిలబడిన అతడు బాబా అసనం వద్దకు చేరగానే ఆయన పాదాలకు నమస్కరించి మౌనంగా మనసులోనే "ఓ ప్రభూ బాబా! నేను నా తనువు, మనసు హృదయాన్ని తమకు సమర్పించు కుంటున్నాను." అని విన్న వించుకున్నాడు. బాబా అతనికి ప్రసాదాన్నిచ్చినప్పుడు, బాబా తనప్రార్థనను మన్నించారని తనజీవితంలో అత్యంత అమూల్యమైన బహుమాన్నాన్ని అందుకున్నానని తలిచాడు. తన పాత జీవితం అంత్యదశకు చేరి, ఒక కోత్త జీవితం మొదలైంది. తన హృదయ నివాశిగా మెహెర్‌బాబాతో ఉన్నఆధ్యాత్మిక సంబంధంతో యీ కొత్తజీవితం మొదలైంది.

భానూదాసు ఆలారీ డ్రైవరును మరెన్నాడూ చూడలేదు. అతడెవరై యుంటాడు? అవతారుడి విధానాలు ఎంతోఉల్లాసంగా హాశ్యయుక్తంగా ఉంటాయి. ఆయన భగవంతుడు, మానవుడయ్యాడు. అన్ని రకాల ప్రజల కోసం మానవరూపాన్నిధరించాడు.ఆయన తన ప్రేమికుల్ని తనవైపు ఆకర్షించే సంఘటనలు కొన్ని సందర్భాల్లో గొప్పగా ఉంటే మరి కొన్నిసార్లు కొంటెగా ఉంటాయి. బానుదాసుగ వాడే విషయంలో బాబా ఒక అద్భుతమైన మన్నింపును వుపయోగించారు. తప్పుడు రిపోర్టు నింపటం తనశిష్యుడిని కలియటం, చివరకు తన నిజమైన బంధ రహిత ప్రేమవలలోకి లాగటం వంటివి యీవిధానంలో ముఖ్యమైనవి బాబా దర్శనపు ఫలితము ఎలా ఆవరిస్తుందో తెలియ పరిచేందుకు, నేనీకథా సేకరణలో ఆనాటి జనంలోమరో వ్యక్తి కథతో ముగించదలచాను. ఈ ముఖ్యమైన. సంఘటనలో బాబా అనుకోని సంకేతాన్ని వి. బర్గుల్ అనే వ్యక్తి విషయంలో సూచించారు. అతడు ఆహమ్మదనగరు ఆర్టీసీలో పని చేసేవాడు. అప్పట్లో అతను బాబా అనుచరుడు కాడు, ఈనాడూ కాడు. అయినప్పటికీ మతపరంగా ఒక సనాతన కుటుంబంలో పెరిగిన అతను సెప్టెంబరు 12నమెహెర్ బాబా దర్శనానికి వెళ్లాలనుకున్నాడు.

బాబాను చేరుటకు గంటల తరబడి క్యూలో నిలబడ్డాడు. చివరికెలాగో బాబా చెంతకు చేరాడు, తనచుట్టూ బ్రహ్మాండమైన జనసందోహం గుమిగూడినా,

బాబాబర్గుల్ వైపు అతడిని గుర్తించినట్లు ఒకచూపు చూచి "నీ చిన్నతనం నుంచి నిన్ను నేనుఎరుగుదును" అని సౌంజ్ఞ చేశారు. ఏదో విధంగా బర్గుల్ బాబా సౌంజ్ఞల్ని అర్థం చేసుకోగలిగి పూర్తి సాఫల్యాన్ని పొందాడు.

అతను ఇంటికి తిరిగి వేళుతూ దారిలో, చిన్నప్పుడు తన తలింద్రులు తరచు అనేమాటను గుర్తుకు తెచ్చుకున్నాడు "నీవు చాలా అదృష్టవంతుడవు. నీవు మెహెర్‌బాబా చేతదీవించ బడ్డావు" అని తరచూ అనేవారు.దీనికి సంబంధించిన కథ ఈవిధంగా జరిగింది.

అతని తలిదండ్రులకు పుట్టిన పిల్లలంతా చంటి పిల్లలు గానే మరణించగా బర్గుల్ ఒక్కడే బ్రతికి బట్టకట్టిన ఏకైక కుమారుడు. అతని తల్లి ఎందరో సాధావులను, గుళ్ళు గోపురాల్ని దర్శించి బ్రతికి జీవించే బిడ్డల్నిమ్మని ప్రార్థించేది 20వదశకం మధ్య భాగంలో మెహెర్‌బాబా పేరువిని, తన రెండేళ్ల కోడుకు బర్గుల్‌ని గుడ్డలో చుట్టి భుజానికి తగిలించుకోని (అలా పిల్లల్ని చంకలో మోయటం ఆరోజుల్లో అచారం) నాలుగుమైళ్ళు దూరం నడుచుకుంటూ మెహెరాబాదు వెళ్లింది.బాబాను కలిసి తనకోరికను విన్న వించగా, ఆయన ఆమెకు, ఆమెకోడుక్కి ఇద్దరికీ ప్రసాదం ఇచ్చారు. బర్గుల్‌కు తొడగమని ఒక చిన్న చొక్కాకూడా ఇచ్చారు. ఎంత కాలం వీలైతేఅంతకాలం ఆచోక్కాను అతనికి తొడగమని ఆ తల్లితో చెప్పారు.

అదిజరిగినతర్వాత విడవకండా కొంత కాలం అంటేబాబా టోకాకు మకాం మార్చేవరకు ఆ కుటుంబం బాబాను దర్శించింది. బాబా కార్యక్రమంలోమొదలైన కొత్త ఘట్టం వల్ల ఆకుటుంబం ఆయనతో సంబంధాన్ని కోల్పోయింది. బర్గుల్ ఈవిషయం గురించి అంతా మరచి పోయాడు.ఈ సంఘటనొక అస్పష్టమైన చిన్న తనం జ్ఞాపకాల్లో ఒకటిగా మిగిలి పోయింది

ఒకసారి 1980 ఆఖరి భాగంలో అతను మాటల సందర్భంగా ఈ కథనంతటినీ తన సహచరుడైన ఒక బాబాప్రేమికునితో చెప్పాడు. ఆ బాబా ప్రేమికుడు నాస్నేహితుడు. విషయం విన్న నేను దీనికి గాఢంగా హత్తుకుపోవటంతో, ఆసంఘటనను ఇక్కడ చేర్చాలనుకున్నాను.

ఏం? ఇది మీకు అశ్చర్యాన్ని కలిగించటం లేదా? చాలా కాలం తర్వాత మొదటి సారిగా బాబాను కలవ వచ్చిన ఒక పాశ్చాత్య ప్రేమికునికి బాబా అందించినసందేశాన్ని ఇదినాకు జ్ఞాపకం చేస్తోంది. "నేనేన్నడూ మరువను. నేనేన్నడూ విడువను" అన్నదే అసందేశం.

బర్గుల్‌కు బాబా చేసిన సౌంజ్ఞ, ప్రతివ్యక్తితో అవతారుని అనుబంధం ఎంత శుద్ధంగా ఉంటుందోస్పష్టంగా సూచిస్తుంది. ఆయనకు ప్రతివ్యక్తిఒక తెరచిన పుస్తకం, అవతారుని దర్శనము కనీసం కలలో కనిపించినా అది బ్రతికినంత కాలం అనుభవించే ఆశీస్సు అది తగు మాత్రపు గెంతు. సంబంధిత వ్యక్తికి అవగతం కాదు.ఇక్కడ మానవ రూపంలో అనంతత్వము పరిమితాత్మను స్పృశిస్తుంది. అవతారుడెన్నటికీ మరువడు. ఆయనతో ఉన్న బంధం శాశ్వతము దర్శనతేజము ప్రకాశిస్తుంది క్రమంగా నిర్దేశిత హృదయంలో అతిశయిస్తుంది.

ఈ విధంగా ఆనాడువాడియా పార్కులో జరిగిన అద్భుత దర్శనపు ఘనత సమాప్తమైంది. అయినప్పటికీ, చలింప చేసే ఆనాటి వ్యక్తి గత కథల భాగ్యము మాత్రమే అనంతంగా ఉంటుందనుటలో అనుమానము లేదు. ఉదయం 9నుండి సాయంత్రం 6వరకు ప్రియతమ బాబా తనప్రేమ యొక్క చల్లని చిరుజల్లులను, విడువకుండా అర్తులైన ప్రజలపై కురిపిస్తూనే ఉన్నారు. ప్రతి ఒక్కరికీ కేవలం కొన్ని క్షణాలు మాత్రమే సమయాన్ని కేటాయించి ఈ మహర్దర్శనసమయంలోబాబావేలది మందిని కలుసుకున్నప్పటికీ అక్షణ కాలపు జ్ఞాపకాలు మాత్రం ప్రతివారికి అపారమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యతను పాదుకొల్పింది. జలాలుద్దీన్ రూమి అనేకఅసమాన రచయిత మరియు గురువు తనకవితలో "ఒక సద్గురువు సమక్షంలో గడిపే ఒక్క క్షణ కాలము, వందేళ్ల త్రికరణ శుద్ధిగా ఆచరించే తపస్సు మరియు జపముతో సమానము" అని వ్రాస్తాడు. మరి సాక్షాత్తు అవతారుడి సమక్షంలో ఆయన అనుగ్రహాన్ని పొందిన వారింకెంత అదృష్టవంతులో గదా!

మరియు ప్రత్యేక అవతార కాలములో గురువులకు గురువు యొక్క సాక్షాత్తు సన్నిధానంలో గడిపే అవకాశం ప్రతి రోజు ప్రతివారికీ తమ హృదయాల్లో లభిస్తోంది. ప్రత్యేకించి ముఖ్యంగా మెహెరాబాదులోని ఆయన సమాధి వద్ద ఇది దొరుకుతున్నది.

# పాశ్చాత్య బృందానికి బాబా ఇచ్చిన సహవాస్
# 1954 - 17వ భాగము

## పాశ్చాత్య పురుషుల సహవాస్ ప్రారంభం

మెహెర్‌బాబా పంపిన ఆహ్వానాన్ని అందుకొని ఇరువదిమంది పాశ్చాత్య పురుషులు సెప్టెంబరులో అహమ్మదు నగరు వచ్చారు వారిలో ఇంగ్లాండునుండి విల్ బ్యాకెట్, చార్లెస్‌పర్డుమ్ అమెరికా నుండి డార్విన్‌షా, మాల్కోంస్లాన్, ఆస్ట్రేలియా నుండి ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌లున్నారు. బాబా సన్నిధానంలో కొన్నివారాల పాటు గడపాలని వారంతా వచ్చారు. కాలరహితుడైన ఏకైకునితో సంక్షిప్తంగా గడిపేందుకు వచ్చి వారు గడిపిన మధురమైన కాలము "మరువలేని మూడు వారాలు" గా వారికి గుర్తుండిపోయింది. తన శాశ్వతాలోచనా విధానంలో బాబా వారి ఆరోగ్యం మరియు సౌకర్యాలన్నిటినీ చాలా వివరంగా ఏర్పాటుచేశారు.

1938లో మెహెరాబాదు నీళ్ళ ట్యాంకుమీద ఒక పై అంతస్థు మరి ఒకబురుజు జతపరిచారు. అభవనాన్ని ఇప్పుడు పాశ్చాత్యులకు పడకటిల్లుగా మార్చారు. ఏర్పాట్లన్నింటినీ సరోష్ ఇరానీ అజమాయిషీ వహించాడు. ఆయన భార్య విల్లూ వారి భోజన ఏర్పాట్లు చూచే బాధ్యత వహించింది. వారి ఆరోగ్య భాధ్యతల్ని డా॥విలియం డాన్‌కిన్ తీసుకున్నాడు. సావక్ కోత్వాల్ రిట్రీటు దగ్గర ఉండి చీకటితోనే లేచి అన్నీ సక్రమంగా జరిగేట్లు చూచాడు.

అత్యధిక పురుషులు సెప్టెంబరు 12న వాడియా పార్కులో జరిగే మహర్దర్శనానికి హాజరయ్యేందుకు సకాలంలోనే చేరుకున్నారు. రెండు రోజులు గడిచిన తర్వాత 14వ తేది ఉదయం వారంతా మెహెరాబాదు కొండపై బాబా రాక కోసరం ఆతురతతో ఎదురు చూచారు. ప్రేమతో నింపబడిన వాతావరణంలో బాబాతో వారి యధార్ధ సహవాస్ మొదలైంది.

బాబా వచ్చీరాగానే, ఆయన, ఎంతో ప్రేమతో ప్రతి పురుషుడుని అలింగనం చేసుకొని, తన అక్షర ఫలకంపై, "నేను మీరంతా అత్యంత సహజంగా మరియు అవశ్యం నిష్కపటంగా ఉండమని కోరుతున్నాను" అని సూచించారు. మగవారందరినీ నెత్తిమీద టోపీలు పెట్టుకొమని చెప్పి, బాబా వారినందరినీ

మెహెరాబాదు చూపించుటకు బయలుదేరారు. ఆయన వారిని ముందుగా తన భావి సమాధిగా నిర్మించుకున్న స్థళం దగ్గరకు తీసుకువెళ్లారు. అప్పుడప్పుడు ఆయన దానిని తన "అంతిమ విశ్రాంతి స్థళము"గా చెప్పేవారు. దానిని చూపిస్తూ బాబా వారితో 1927 - 28లో తాను అందులో ఏకాంత వాసం గడపటం గురించి చెప్పారు. ఆ సమాధి లోపలి భాగపు గోడలపై స్విట్జర్లాండు నివాస్, హెలెన్ థామ్ చిత్రించిన అందమైన కుడ్య చిత్రాలను వారికి చూపారు.

ఆబృందంలోని కురు వృద్ధుడైన విల్ బేకెట్‌ను బాబా తన ప్రధాన దూతలో ఒకడిగా పిలిచేవారు. ఇతనుబాబా సమాధిని గురించి తన అనుభవాన్ని ఇలావివరించాడు.

ఆ డోముతో కప్పబడిన గదికి నాలుగు మూలలా క్రైస్తవుల శిలువ, మహమ్మదీయుల చంద్రవంక జోరాష్ట్రియనుల అగ్ని, హిందువుల ఆలయ శిఖరములతోఅది ఒక గొప్ప ప్రపంచమతానికి చిహ్నము. బాబా వచ్చింది ప్రతిమతములో నవజీవనాన్ని నింపుటకు.అద్భుతమైన భారతీయ నీలాకాశంలో అందమైన స్ఫటికంలాంటి యీ తెల్లని భవనపు తలుపు పైభాగానచెక్కబడిన "మాష్టరీ ఇన్ సర్విట్యూడ్" (సేవా ధర్మ ప్రావీణ్యత) పదములు ఈ భూమి పైన దివ్య ప్రేమ యొక్క విజయాన్నికన్నులార చూచేందుకు స్వర్గం నుండి దిగి వచ్చినట్లు కనుపిస్తుంది.

పిమ్మట ఆయన తన వాడిగల సొగసైన అంగలతో బాబా కొండక్రింది మెహెరా బాదుకు వారి నందరిని తీసుకు వెళ్లారు. అక్కడకు చేరుకోగానే, ప్రైవేటు బస్సు ఒకటి వచ్చింది. సకోరీలోని ఉపాశినీ మహరాజు ఆశ్రమం నుండి మహరాజు శిష్యురాండ్రుపద్నాలుగుమంది ఆబస్సులో వచ్చారు. వారితోపాటు గోదావరిమాయికూడా వున్నారు. ఈమె 1990లో మరణించే వరకు ఉపాశినీ ఆశ్రమానికి అధిపతిగా ఉన్నది. గోదావరి మా యి తదితరులంతా ఒక్కొక్కరూ ప్రియతముని పాదాలకు సాష్టాంగ దండ ప్రణామలర్పించారు. బాబా ఆబృందమందరితో మాట్లాడుతూఎరుచ్ద్వారా "సాక్షాత్తు సత్యమే నేను" అని ప్రకటన చేశారు.

ఈ పశ్చిమ దేశపు పురుషులు, ప్రాగ్దేశపు స్త్రీలు కలిసినసమైక్య బృందంతో బాబా మెహెరాబాదు యాత్రను కొనసాగించారు. ఆయన వారికి, 1925లో ఏకాంతంగా నెలలతరబడి గడిపి ఇంతవరకు ప్రచురించబడని పుస్తకాన్ని వ్రాసిన

కోయ్య భోషాణాన్ని చూపారు. సమిపంలో ఆ కాబినుకు చేరువలో ఉన్న ధునీని చూపారు. ఆధునీ మొదటిసారి 1927లో బాబా ఆదేశాలపైవెలిగించబడింది. మళ్లీ ఈ బృందమంతటిని కొండపైకి తీసుకువెళ్లి అక్కడున్న భావి సమాధిని, మరికొన్ని ఇతర ప్రదేశాల్నిస్త్రీలకు చూపారు.దాని తర్వాత, వాళ్లని సకోరీ పంపి వేశారు. త్వరలోనే తాను పాశ్చాత్యులతో కలిసి సకోరీ రాగలనని చెప్పి పంపారు.

పాశ్చాత్యులుండే విశ్రాంతి మందిరం క్రింద గదిలోచక్కనివిరామ మందిరాన్ని ఏర్పాటు చేశారు.ఇప్పుడది మ్యూజియంగా ఉన్నది. బాబా పురుషలందరిని దీనిలోనికి తీసుకువెళ్లి,అత్యంత సహజంగాను నిజాయతీగాను ఉండమని మరోసారి గుర్తుచేశారు. "నేను మీలో ఒకడిని,మరియు మీతో ఒకడిని" అనిసౌంజ్ఞలు చేశారు. ఈవిధంగా వారికి బాబా, అనంతుడైన భగవంతుడు అత్యంత అంతరంగుడైన ఏకైకునిగా కూడా ఉంటాడన్న అభయాన్నందించారు. ఏకత్వపు తన దివ్యత్వ స్థాయి ప్రతి వారికి సంబంధించి నంతవరకు "ప్రతిస్థాయిలోను మీతో నేను ఒకడిని అయితే మీరు దీనిని అహము మరియు తెలివి జోక్యం కల్పించు కోనప్పుడే తెలుసు కోగలుగుతారు. నేను ఏమైయున్నానో అదే నైనేయున్నాను. సకల ప్రపంచం నాకు పాద క్రాంతమైనా లేదా అది నాకు వ్యతిరేకంగా మారినా, చింతలేదు.అది ఏఒక్కరి తప్పుకాదు." అని బాబా ప్రభోధిచారు.

పురుషులందరినీ ప్రతిరోజు ఉదయం 9నుండి మధ్యహ్నాం వరకు తనతో ఉండమని కోరారు. రానున్న రోజుల్లో వారికి ఆధ్యాత్మికవిషయాల్ని వివరిస్తానని చెప్పారు. "నేను నాప్రియతమునిలో సమైక్యమగుటకు ముందు. నేనునాసర్వస్వాన్ని అనగా అహము, మనస్సు, అధమ చైతన్యములన్నిటినీ పోగోట్టుకున్నాను, కాని నాహాశ్యం ప్రియాన్ని కోల్పోలేదు. భగవంతునికి కృతజ్ఞతలు అందుకే, నేను మీ మధ్య మీస్థాయిలో కనిపిస్తున్నాను. నేను సాధువులతో ఉన్నప్పుడు, నేనున్నస్థాయి కంటే వారెవరూ ముఖ్యులు కాబోరు. నేనుపిల్లలతో ఉన్నప్పుడు, నేనువారితో గోలీలాడతాను. నేను అందరిలో ఉన్నాను. అందరిలో ఒకడిని, అందుకే నేను యాంత్రికంగా అన్ని రకాల ప్రజలకుస్వయంగా పొందికతో ఇమిడి పోయి వారెక్కడ ఉంటేఅక్కడే వారినికలుస్తాను

మర్నాడుబాబా తన సమయాన్ని మెహెరాబాదులో పురుషులకువ్యక్తి గత దర్శనాన్నిస్తూ గడిపారు.16వతేదీ గురువారం నాడు పురుషులందరిని మెహెరాజాదు



11

కు తెచ్చారు. తన ప్రేమకుల్ని కలువబోతున్నందుకుబాబా ఆనందంగా కనిపించారు. వారందరిని కొందరు పురుష మండలికి పరిచయం చేశారు వారిలో కైకోబాదు, కాకా బారియా గుస్తాద్ జీలున్నారు. పిమ్మట వారందరికి మెహెరా జాదులోని కొన్ని చోట్లు చూపారు.వారిని ముందుగా నవ జీవన కాలపు మనోనాశ్ ఘట్టంలో బాబా ఉపయోగించిన రెండు రేకులషెడ్లుతో కట్టించిన గది దగ్గరకు తీసుకువెళ్లారు. ఆక్కడి నుంచి వారినిఅందమైన తోట గుండా రానో, డా॥గోహెర్ గదులకు తీసుకు వెళ్లారు. ప్రధాన భవనంలో వారందరిని బాబా అనేక గదుల్లోకి తీసుకెళ్లారు.1956లో తనకు రెండవ సారి కారు ప్రమాదం జరిగినప్పుడు కొన్నాళ్లపాటు విశ్రాంతి కై ఉపయోగించినమేడ మీదున్నతన పడకగదితో కలిపి అన్ని గదుల్నీ చూపించారు.

మెహెరాజాదు ప్రాంగణాన్నివదిలి వెళుతూ వారినందరిని పొలాల గుండా ఏకాంత కొండ మీదికి తీసుకెళ్లారు. కొండ పైకిచేరాక,ఆరెండు సిమెంటు రేకు క్యాబిన్లు అసలుఎక్కడుండేవో వారికిచూపించారు.వారంతా క్రిందికి దిగిరాగానే.బాబా ఇంటిముందువరండాలో పళ్లరసం అందరికీ అల్పాహారంగా అందించ బడింది. ఆతర్వాతబహుశ అరోజుకే చెప్పుకోదగిన అద్భుత సంఘటన జరిగింది. స్త్రీ మండలిలో ఒకరు ఒకశాలువాలో చట్టబడిన మూటను భద్రంగా లోపల్నించి తెచ్చింది.ఆమూటనుతెరిచే సరికి, అందులో చినుగుల్ని అతుకులతో కుట్టిన కమిలీకోటు వారికి కనిపించింది 1921నుండిబాబాదీనిని ఎనిమిదేళ్లపాటు ధరించారు. అదితన కెంతో పవిత్ర వంతమైనఅస్తి అనివారితో బాబాచెప్పారు అకోటుతోపాటు తాను ధరించిన సదరాను చెప్పులనుకూడా చూపారు.వారందరిని అలింగనం చేసుకొని మెహెరాబాదుకు పంపేముందు "ఇప్పటినుండి బాబా ప్రేమతో అడుకోనుటకు ఏది మంచిది అనుకుంటే అదేచేయుదురు గాక... క్లుప్తంగా మీకు ఏదిమంచిదని నేనుఇష్టపడుతాన్నానంటే మీరుతిరిగి వేళ్లేటప్పుడు నన్నుమీతో తీసుకెళ్లండి అని" అని అంటూవారికి ఈ సందేశాన్నిచ్చారు. ఈసందేశం తన ఇల్లే అయిన తమ హృదయంలో బాబాను మోసుకెళ్లటం ఈనాటికి మెహెరాబాదు మెహెరాజాదు సందర్శించే ప్రతి వారికి ఇది అన్వ ఇస్తుంది

అదే రోజుసెప్టెంబరు 16న ఒకప్పటి మెహెరాబాదు మండలిలో ఒకరైన కాలేమామా మెహెరాబాదులో ప్రశాంతంగా తుది శ్వాసవిడిచాడు. ఆయన బాగా చదువుకున్న భాగ్యవంతులింట్లో పుట్టాడు. నారాయణ మహారాజు, సాయిబాబాలతో తనకున్న సంబంధం ద్వారా ఆయన బాబా పరిధిలోనికి వచ్చాడు. సంపూర్ణ

విధేయతను పాటించలేనన్న భయంతో మొదట్లో అతనికి ఒక గురువును అనుసరించాలంటే అయిష్టంగా ఉండేది. అయితే 1926లో అతను మెహెరాబాదులో బాబాను కలిసినప్పుడు దైవంవల్లే అతనుపూర్తిగా మారిపోయాడు బాబా కళ్లల్లోంచి ప్రకాశించిన మన్నించే ప్రేమ ఆయనకు సర్వార్పణయ్యేట్లు చేసింది. 20వ దశకం చివర్లో, కాలేమామా తన భార్య కోడుకుతో కలిసి మెహెరాబాదు కుటుంబంలో ఒకరైపోయారు. ఒక సివిల్ ఇంజనీరుగా తన అర్హతలో మెహెరాబాదులో అనేక ఇళ్లకు మండలి హాలుతో సహప్లానులు వేయటంతో పాటు నిర్మాణంలోపర్యవేక్షణ చేశాడు తనజీవితాన్ని తన ప్రియతమ గురువుమెహెర్ బాబాసేవకే తుది శ్వాసవిడిచే వరకూ అర్పించుకున్నాడు.

అమర్నాడు 17వ తేదీన, బాబా ఉదయం 9గంటల 20నిమిషాలకు చేరుకున్నారు. అలశ్యమై నందుకు క్షమాపణకోరి "అతి ముఖ్యమైన సందర్భాల్లో నాకు అత్యంత సన్నిహితులైన బహు కొద్ది మంది శిష్యులతో నేను ప్రార్ధనా సమావేశాలు నిర్వహిస్తానుఈరోజున నేను అటువంటి ఒక సమావేశాన్ని నిర్వహిస్తాను. మీరంతా అందులో పాల్గొనండి" అని తెలియచేశారు.

కొండదిగి అంతా మండలి హాలుకు వెళ్లారు. హాలు కిటికీలు, తలుపులు అన్నీ మూయమని బాబా ఆదేశించారు పిమ్మట జోరాష్ట్రీయను, ముస్లిం, హిందూ, క్రిష్టియన్ల ప్రార్ధనలను చేయించారు. ప్రార్ధనలు పూర్తి కాగానే డాన్‌కిన్ బాబా పక్కన బాబా పటంవంక చూస్తూ నిలబడి. ఈ క్రింది ప్రార్ధనను అలపించాడు.

ఓ నిరంతర దయామయుడవైన పరమాత్మా! ఓ కరుణామయుడవైన అల్లా! ఓ దయామయ భగవంతుడవైన సర్వశక్తిమయా ఓ వర ప్రదాతవైన యజడాన్! నీసంపూర్ణ సర్వస్వతంత్రత, మరి నీ సంపూర్ణ ఉదాశీనతలను పూర్తిగా తెలిసి వినయంతో బాబా నిన్ను ప్రార్థిస్తున్నారు. ఓ దయమయుడవైన దైవమా, ఆయన నుండి ఆయన ప్రేమికులందరి తరపున, క్షమార్హులైన వారందరి తరుపున పశ్చాత్తాప ప్రార్ధనను అంగీకరించ కోరుతున్నారు.

1952లో బాబా అందించిన పశ్చాత్తాప ప్రార్ధన చదవబడింది. ఈ ప్రార్ధన పర్వర్దిగార్ ప్రార్ధనతో పాటు బాబాచేప్రత్యేకంగా చెప్పబడింది. ఈ రెండూ ఆయన మానవాళికిచ్చిన గోప్ప బహుమానాలు. ప్రార్ధనలు పూర్తికాగానే బాబా కిటికీలు

తలుపులను తెరవమని సౌంజ్ఞలు చేశారు పురుషులంతా నేలపైనే కూర్చున్నారు. "ఈనాడు మీరంతా భగంంతుడు భగవంతుడిని ప్రార్థించటంలో పాల్గొన్నారు. నేను మరియు భగవంతుడు ఒక్కటే" అని తన అక్షరఫలకంపై అక్షరాలు కూరుస్తూ సందేశమిచ్చారు.

ఆతర్వాత, ఆ బృందమంతా కొండపైనున్న తమ విరామగదికివెళ్లి పోయారు. అక్కడ బాబా రానోగీచిన చిత్రాల్ని చూపించారు.ఏడు రోజుల పాటు ప్రతి రోజూ ఒక అరగంట సేపు ప్రత్యేకంగా తనను గురించే ఆలోచించమని వారినడుగుతూ "ఒకవేళ మీరలాచేయలేక పోతే అప్పుడు కనీసం నాబొమ్మ వైపు చూస్తూ మనస్సులో" బాబా "అని స్మరించండి మీ ఆలోచనలుమిమ్మల్ని తొందరపెడితే, ఏమి పట్టించుకోకండి. వాటిని వచ్చిపోనీయండి. అయితే మీ మనోనేత్రంలోబాబా రూపం స్పష్టంగా నిలుపుకొనునట్లు మీకు చేతనైనంతగా ప్రయత్నించండి" అని చెప్పారు.

ఈనాడు అయన సన్నిధిని అనుభవించాలని కాంక్షించే వారందరికి ఈ ఆదేశాలు సూచనలే అవుతాయి ఆయన నామాన్నిస్మరించటం లేదా నిత్యం ఆయన మాటల్ని చదవటం,చేస్తే , కర్మకాండల క్రిందకు రావు నిజానికి అలా మేలు కున్నవానిని గుర్తు పెట్టు కోగలిగితే ఆయన తో సన్నిహిత సంబంధాన్ని మనహృదయంలో పరవశింప చేస్తూ మేల్కొలుపు తుంది భగవంతుడ్ని నిత్యం జ్ఞాపకం పెట్టుకొనుట కర్మకాండ క్రిందకే వస్తుందని కొంత మంది వక్రోక్తులు వ్యక్తం చేయవచ్చును. అయినప్పటికీ అటువంటి వారే ఎటువంటి పిర్యాదు చేయకుండానే, తమ నిత్యకృత్యాల్ని భౌతికానందాల గురించి విడవకుండా నిత్యం గుర్తుంచు కోనుటను ఎంతో సహజంగా గుడ్డిగా అంగీకరిస్తున్నారు.

ఈ సందేశంతో ఆనాటి కార్యక్రమం పరిసమాప్తమైంది జోరాష్ట్రీయన్ ప్రార్థనా క్రమాన్ని "కుస్తీ" అంటారు. నాలుగు ప్రార్థనలూ చెప్పేది ఒకే విషయాన్నే. బాబాజాన్ నన్ను నుదిటి పై ముద్దిడి నప్పటి నుండి నేను నా స్వీయ ఆత్మకు పాదాభివందనం చేశాను. ఎందుకని? "వందన మాచరించుటకు వేరే మరేదీ లేనందున" అని ఎవరో బదులిచ్చారు.

"అది నాఅసలైన నిరంతరాను భవము. అసలు కావలసింది తయారవటమే కానీ, చూడటము మాత్రమే కాదు. మీరు ఏదైయున్నారో అలా తయారు కావాలి. మీరుభగవంతుడే, కానీ భగవంతుడిగా మీరెలా తయారు కావలో తెలుసు

కోవాలి. క్రీస్తు తనకు తాను అవమానాల్ని భరించాడు. భగవంతుడు స్వయంగా తనకుతానే శిలువ వేసుకున్నాడు. ఇంతకు మునుపే మీరేదైయున్నారో అలా తయారవ్వాలని ప్రేమ ద్వారా బోధించుటకు అయనలా చేశాడు.

ఆరోజున అంతకు ముందు బాబా ఇలా చెప్పారు. ''క్రీస్తు ఆయన ఆంతరిక మండలి, మరియు క్రిష్టియన్ మత గ్రంధాలన్నీహృదయ పరిశుద్ధత గురించే నోక్కి చెపుతయి. మహమ్మదు ఆయన ఇమాములు, కూడా హృదయ పరిశుద్ధత గురించే ప్రవచించారు'' ఈవిధంగా 17వతేదీ శుక్రవారం గడిచి పోయింది.

శనివారం ఉదయం మెహెరాజాదు నుండి మెహెర్‌బాబా మెహెరాబాద్‌కు రాగానే, ఆయన తన ప్రేమికులందరికీ షేక్‌హేండ్‌నిచ్చి అభినందించారు. మెహెర్‌జీ ఎరుచ్ లిరువురూ ఆయన వెంటవచ్చారు. మెహెర్‌జీ ఫోనోగ్రాంని కొన్ని రికార్డులను తీసుకువచ్చాడు. లాంజిలో సమావేశమైన బృందమునకు బాబా ఒక ప్రవచనమును అందించ దలచారు. తన అక్షర ఫలకాన్ని తీసుకోని, ఉపయోగిస్తూ సహజ సమాధితో పాటు సద్గురువులనుభవించే విభిన్నరకాల సమాధి స్థితుల గురించి, వివరించారు. ''నేను హామి నివ్వనుకాని, రేపు మీరు నాకు గుర్తుచేస్తే, నన్ను గురించి ఆలోచించినప్పుడు, మీరు ప్రపంచంలో చేయుటకు అవసరమైన దానిని ఎలా చేయాలో నేను మీకు చెప్పెదను. ఇది సహజ సమాధికాదు, కాని సహాజ ధ్యానము'' అని చెప్పారు.

బాబా ఆ బృందం వారికి, ఆమర్నాడు వారంతా భారతీయ సంగీతాన్ని వింటారని,అయితే ఇప్పుడు వారంతా ఆంగ్లేయ రికార్డులు వినాలని కూడా చెప్పారు.మేరియన్ ఆండర్సన్ ఫిట్జ్ క్రీస్లర్, రిచర్డు క్రూక్సు,యమాసుమక్‌ల రికార్డులు వేశారు. యమా సుమక్ పాడిన ఒక పాట ఇలా అనువదించ బడింది "నేను నిన్ను మాత్రమే ప్రేమిస్తాను నేను నిన్ను మాత్రమే పూజిస్తాను. నా కోశాగారపు తాళం చెవిని నీకు మాత్రమే సమర్పిస్తాను'' బాబా ఈ పాటకు ప్రతిస్పందించి 'ఇలా ఎవరైతే చేస్తారో వారు మాత్రమే నన్ను తెలుసు కోగలుగుతారు' అని బదులిచ్చారు.

సంగీత సభ మంచిపురోగతిలో ఉండగా బాబా ఒక చిన్న కార్డునిచ్చారు. అందులో ''నేను మిమ్మల్ని కేవలం ఒక్కక్షణకాలం మాత్రమే చూడకలిగితే నేను శాశ్వతంగా మరిమరువలేను.'' అని ఉన్నది. ఈకార్డును టోక్యో నుంచి వచ్చిన

కె.హితకర్ అనే ఒక జపాన్ దేశస్తుడు తెచ్చాడు. అతడు లోనికి వచ్చీరాగనే ఎంతో భక్తి ప్రపత్తులతో బాబా ముందు సాష్టంగ పడ్డాడు.బాబా అతడ్ని పైకి లేపి,సౌంజ్ఞల ద్వార''సర్వ సాధారణంగా నేనుఎవరినీ కొండపైకి వచ్చేందుకు అనుమ తించను.' 'అని తెలుపుతూ హితకర్ వైపు ప్రేమగా ఓర కంటితో పరికించి, తన కోసం తెచ్చిన ద్రాక్ష పళ్ల రసాన్ని త్రాగమని అతనికి ఇచ్చి ''నీవు చాలా దూరం నుండి వచ్చావు, ఇదంతా పూర్తిగా త్రాగుము'' అని తెలిపారు.

తరవాత అతడ్ని ఇంత దూరం నుంచి నీవుఎందుకు వచ్చావు? బాబా ప్రతి చోటవున్నాడు గదా!'' అని అడిగారు. ''నేను నిన్ను జపాను రమ్మనమని ఆహ్వానించుటకు వచ్చాను'' అని హితకర్ బదులిచ్చాడు..'' 700ఏళ్లతర్వాత వస్తాను!'' అని నవ్వుతూ బదులిచ్చారు బాబా.

నేనిక్కడ మీకో విషయన్ని చెప్పాదలచాను. 50వ దశకం మొదటి నుండి తన ప్రేమికు లెవరైనా తమ పట్టణాన్నో గ్రామాన్నో లేదా ఇంటినో దర్శించమని ఎప్పుడు కోరినా ముద్దులొలికే సౌంజ్ఞలతో ''ఏడువందల ఏండ్లు గడిచిన తర్వాత' 'అని క్లుప్తంగా బాబా బదులివ్వటం మామూలైంది.

బాబా హితకర్‌ని 28న జరిగేప్రత్యేక సమావేశంలో మెహెరా బాదుకు మరల ఎచ్చ పాల్గొన మని ఆదేశించారు అతను అదే రోజున తన వీసాను పొడిగించుకొనుటకై కలకత్తా వెళ్లిపోయాడు.

అమర్నాడు,సెప్టెంబరు, 19 ఆదివారం నాడు బాబాతన పాశ్చాత్య ప్రేమికులకు, చైతన్యపు భూమికలగురించి వివరించి చెప్పారు. ''నేను నిరంతరం మీతోనేఉన్నాను. కానీ మీరు నాపైలక్ష్యమును ఎలా ఉంచాలో నేను మరోసారి వివరిస్తాను'' అనిముగించారు.

బహుశః ఇది ఆపాశ్చాత్యులకు సహజ ధ్యానము గురించి బాబా గుర్తుచేయుటకు ఒక సూచన కావచ్చును, అయితే ఆయన సన్నిధిలో వారు తన్మయులై మునిగి వుండటంతో ఎవరూ గుర్తు చేయలేక పోయారు. అలా వారు భారతీయ సంగీతాన్నివిన్నారు. అఘజల్సులోని కొన్ని ఉర్దూ పదములను బాబా అనువదించారు.

గుర్తుంచుకోండి భగవంతుడ్ని నిజంగా ప్రేమించేవారిని
భగవంతుడు అతడిని నిర్మూలన చేస్తాడు
భగవంతుడతడిని ధూళితోమిళితం చెస్తాడు.



ఓ ప్రేమికాజాగ్రత్త
భగవంతుడుకఠినంగా ఉండినిను ...క్షిస్తాడు,
నీకు తప్పుడాశలు కలిపించి,
ఆఖరికి నిన్నుఖండఖండా... నరికైనాసరే

భగవంతుడం... ...ు,
ఓనా ప్రేమి...,
నీవునా ...ఖలో ప్రవేశించాలనుకుంటే
ముం... నీశిరమును నాపాదముల క్రింద పొర్లాడనిమ్ము
మ...ము ఒక బంతి వలెనన్ను తన్ననివ్వు.

...గవంతుని కరుణను ఎంతమర్మంగా మరుగు పరుస్తూ, దిగ్రాభంతి కొ... విధంగా వ్యక్తపరిచారు ! దైవ ప్రేమ యొక్క ఈస్థితిని "షమ్మా-ఇ-...లాల్" (దైవ స్తోత్రపు జ్వాల) అని కొందరువ్యవహరిస్తారు. బాబా స...న్ను అంతా పరవశంతో విన్నారు.

భోజనాలయ్యాక,ఆబృందంలో కొందరిని పిలి..., పశ్చిమదేశాల్లో తన కార్యక్రమాన్ని గురించి కొన్ని విషయాలపై బా...ించి. పిమ్మట రోజూ కంటే ముందుగానే మెహెరాజాదుకు తిరిగి ...యారు.

## స...ం మరియు సహజ ధ్యానము

...ప్టెంబరు 12న బాబా దర్శన కాలములో ఆయన గోదావరి మాయితో ...లోనే తాను సకోరీ సందర్శిస్తానని చెప్పారు అతర్వాత తాను వెళ్లే తేదీ సెప్టెంబరు 20గా ఖాయపరచారు. ఆదే రోజున మెహెరాబాదులో ఉంటున్న పాశ్చాత్య ప్రేమికులతో పాటు, తన పురుష మండలి కొందరిని కూడా వెంట బెట్టుకొని బాబా సకోరీ వెళ్లారు. ఉదయం 10గంటల ప్రాంతంలో వా... సకోరి చేరుకున్నారు. రాచ మర్యాదలతో బాబాకు స్వాగతం పలి...ఊరిపొలిమేర నుంచి ఆశ్రమం వరకు బ్యాండు మేళంతో ...గింపుగా తీసుకువెళ్లారు. గోదావరిమాయి, తక్కిన కన్యలు ఆయనను పుష్పమాలాలంకృతుల్ని చేసిహారతి నిచ్చారు. బాబా ఆతర్వాత బృంద సభ్యులకు "నన్ను గోదావరిమాయి ఎంతగా

ప్రేమిస్తోందో చూడండి! అమె ఎటువంటి పరి శుద్ధమైన కన్య! నేనామెను కృష్ణుడి పెంపుడుతల్లి - యశోదగా పిలుస్తాను. అత్యంత మనోహరమైన వారిలో ఆమె ఒకరు'' అని చెప్పారు.

ఆ బృందమంతా పిమ్మట ఉపాశినీ మహరాజు సమాధి వద్దకు కదిలారు. బాబా తన ఆసనంపై కూర్చొని పంజరంలోఉన్న ఉపాశినీ మహరాజు విగ్రహాన్ని చూపిస్తూ,తన అక్షర ఫలకం పై ''ఈ ముసలాయన అవతరించిన భగవంతుడు 1954 మార్చిలో ఇక్కడకు నేను తుది సారిగా వచ్చినప్పుడు, అప్పుడు సమావేశమైన వారికి, నేను, తిరిగి ఎన్నడూ సకోరీలో కాలుపెట్టను అనిచెప్పాను. అయితే అంతకు ముందు ఒకసారి మహరాజు ''మేర్వాన్ పాశ్చాత్యులను ఇక్కడ తీసుకువస్తాడు'' అని చెప్పినట్లు నాకుబాగా జ్ఞాపకమున్నది. అందువల్లఆయన కోరికను నెరవేర్చుటకు నేనీరోజున వచ్చాను.'' అని తెలిపారు.

పిమ్మట బాబా,పాశ్చాత్యులను, తన మండలి వారిని మహరాజు సమాధికి ప్రయణ మివ్వమన్నారు. ముందుగా తానే వందన మర్పించారు. అమెరికాలో జరిగిన ఒక సమావేశంలో డార్విన్‌షా, దీనిని గురించి తన జ్ఞాపకాల్నిలా వివరించాడు. నేను సేకరించిన వాటి సంగ్రహాన్నిక్కడ పొందు పరుస్తున్నాను!'' కొంత మందిపాశ్చాత్యులు వందనమర్పిస్తుండగా నావంతు వచ్చింది ఆసమాధిముందు వంగి నమస్కరించుట నాకు కొంత అసౌకర్యమనిపించింది. మరుక్షణంలోనే చిరునవ్వుతో బాబా నాదగ్గరకు వచ్చి నాసందేహానికి బదులిచ్చారు. ఆయన తన చేయి నొకదాన్ని నానుదుటిపై ఉంచి రెండవచేతిని నావీపుపై ఉంచారు. నేను ముందుకు వంగే సరికి. నేనాయన చేతి వైపుకే ముందుకు వంగుతున్నా ననిపించింది. అలా చేయుటకు నాకు అభ్యంతర మనిపించలేదు. ఎంతటి సునాయసంగా సమయానికి కల్పించుకొని. నాసందేహ నివృత్తికి జాగ్రత్తను తీసుకున్నారు. అదేవిధంగా ఆయన మరోఇద్దరు ముగ్గురు విషయంలో కూడా చేశారు. కనుక అది ప్రాధాన్యత పొందలేదు.

లడ్‌విగ్ డింఫీ ఈ సందర్భంలో తనకు కలిగిన అభి ప్రాయాన్ని మరో విధంగా చెప్పాడు. ''మేము క్యూలో నిలబడి ఉండగా అందరికంటే ముందున్న బాబా ప్రథమంగా మోకాళ్లపై వంగి ఉపాశినీ మహరాజుసమాధి ముందు నేలపై తన నుదుటిని ఆనించారు.నిజంగా యీ దృశ్యాన్ని మానాన్నే చూస్తే ఏమనుకుంటాడో నేనూ హించలేక పోయాను. అతని సందేహాలన్నీ తీర్చబడినవి. ఇక్కడ ఆయన కుమారుడు ఒక అన్య మతముతో సంకరమై పోయాడు.

ఇప్పుడతను వారి మతాచారాలకు వ్యతిరేకకంగా నడుస్తున్నాడు.అయితే మానాన్నగారి ఆలోచనలు నా భావాలకు పూర్తిగా భిన్నమైనవి అయితే మానాన్న అదృశ్యాన్ని చూడటం తప్ప వేరేమార్గంలేదని నామనస్సు అడ్డగించి నచ్చ చెప్పింది. క్యూలో నేను ముందుకురాగా నావంతు వచ్చింది. బాబా నన్నువంగి మోకరిలేట్లు చేశారు. మహరాజు సమాధి ముందు నానుదుటినినేలపై అ ంచిసాష్టాంగ ప్రణామా లర్పించేట్లు బాబా నా నడుమును వంచారు. నేను నేలపై తాకగానే, ఒక పాశ్యాత్యుడు, అహమ్మదునగరు నుంచి వచ్చిన మరో ఫొటోగ్రాఫరు ఆఫోజును ఫొటో తీశారు" ఎటువంటి బాబా హాశ్యము!

గోదావరిమాయితో బాబా కొద్ది సేపు ఏకాంతంగా మాట్లాడారు. పిమ్మట బయటకు వచ్చి మర్రి చెట్టు క్రింద కూర్చొనిసమావేశమైన స్త్రీ పురుషులెందరికో దర్శనమిచ్చారు. పిమ్మట సందర్శకులందరికీ ఉపాహారము లందించబడినవి. బాబా కన్యల క్వార్టర్లకు వెళ్లి అనారోగ్యంతో భాదపడుతున్న ఒక బాలికను కలిశారు. ఆమెను తినమని కొన్ని గులాబి రేకులిచ్చి, ఆమె విచారించ వలసిన పని లేదని, నిజానికి, ఆమె మహరాజును మెహెర్ బాబాను గుర్తుంచుకొనే అవకాశాన్ని ఆమె చ్చే కలిపించిందని అభయమిచ్చారు.వారిరువుర్ని ఆమె హృదయ పూర్వకంగా స్మరించ కలిగితే, ఏదో ఒక రోజున, ఆమె వారిసాన్నిహిత్య సమక్షాన్ని అనుభవించ కలుగుతుందని చెప్పారు.

మళ్లీ బ్యాండు మేళం మోగుతుండగా బాబా బృందం మధ్యాహ్నానికి సకోరి నుండి బయలు దేరారు. గ్రామస్తులు బాబాకు వీడ్కోలు పలుకుతూ రోడ్డుకు ఇరువైపులా నిలబడ్డారు.

మర్నాడు మంగళవారం ఉదయం, బాబా మెహెరాబాదు వచ్చినప్పుడు మంచి ఉల్లాసంగా కనిపించారు.తన ప్రేమికులకు గోలీకాయల ఆట ఎలా ఆడాలో ఆయన నేర్పాలనుకున్నారు. అయితే దానికి ముందు, అంతక్రితం రోజు జరిగిన సకోరీ దర్శనం విషయమై ప్రస్తావించారు. చాలా ఏళ్లక్రితం తాను సకోరీలో అధిక కాలం గడుపుట గురించి మహరాజుతోగల సంబంధం గురించి అబృందం వారికి చెప్పారు. తర్వాత అత్యంత ఆకశ్మికంగా "దైవ మహత్తు" గురించి ఒక గంభీరమైన ప్రకటనను సంక్షిప్తంగా చేశారు.

"నేను నా తండ్రి ఒకటే" అని జీససు చెప్పినప్పుడు, ఆయన భగవంతుడని ఆయన భావము. అది దైవము యొక్క మహత్తు మరియు జీసను యొక్క మహత్తు. దాని భావమేమంటే, జీసను వల్ల లెక్కలేనన్ని జీవరాసులు సృష్టించబడినవి. ఆయన తన ఇచ్ఛ ప్రకారం మరణించాడు. అయినప్పటికీ,

జీసస్ గొప్పదనము, మరణించిన కొందరిని ఆయన బ్రతికించుటలో ఉన్నది. దీనికి కొంత గూఢార్థమే లేకపోతే ఇది ఎటువంటి పరిహాసమవుతుంది !

చాలా మహత్తులు నాకు ఆపాదించబడుతున్నాయి. అయితే నేనెటువంటి మహత్తులు చేయుటలేదు. నేను మహత్తులకు ఎటువంటి ప్రాముఖ్యతను ఇవ్వను. నేను ఒకే ఒక్క ఏకైక మహత్తును నిర్వహిస్తాను. ఆ మహత్తుకు కాలము సమీపించింది. మరణించిన వారిని బ్రతికించటం నేను చేసే మహత్తు కాదు. అయితే ఒకరిని భగవంతునిలో జీవించేందుకు తనకు తాను మరణించేట్లు చేయటమేనని నేను చెప్పాను. నేను మళ్లీ మళ్లీ చెపుతున్నాను, నేను అంధులకు దృష్టిని ఇవ్వనని, భగవంతుని చూడకలుగుటకు ప్రజల్ని నేను అంధుల్ని చేస్తానని.

ఇటీవల కాలంలో "అది ఒక మహత్తు" అని ఎవరు చెప్పినా వింటూ ఉండే, ఆ పురాణ పురుషుని జీవితం ద్వారా విశదమయ్యే ఏకైక దైవ మహత్తు గురించి చేసిన గంభీర ప్రకటన నాకు గుర్తొస్తున్నది. గతంలో అత్యున్నత భావంలో ఈ "మహత్తు" అనే మాటకు బాబా ఏమి అర్థం చెప్పారో నేను అర్థం చేసుకోలేదు. బహుశః ఈ అనంత సృష్టిని నిరంతరం గుమ్మరించే భగవంతుని లీల, చివరకు తనే అవతారుడిగా పరిపూర్ణ మానవ రూపాన్ని ధరించేట్లు చేయుట మాత్రమే, దురవగాహ్యమైన మహత్తుగా కనిపిస్తుందేమో ! ఇది ఆయన దివ్య విజయము అలాగే ఆయన జగదోద్ధారక శిలువ కూడా.

జీసస్ యొక్క గురువు జాన్‌బాప్టిష్టు గురించి ఉపాశినీ మహరాజు గురించి ముచ్చటించారు. పిమ్మట ఆయన చైతన్యపు ఉన్నత భూమికలు అయిదు నుండి ఏడు వరకు గురించిన విషయాన్ని కొనసాగించారు. ఈ చైతన్య భూమికలలోని అనేక మజిలీలు స్థితులను తేటపరచిన తర్వాత తాను సహజ ధ్యానము గురించి చెప్పెదనని హామీ ఇచ్చిన విషయాన్ని గుర్తు చేశారు. "ధ్యానము" అంటే మనస్సును నిలుపుకోవటం లేదా ఏకాగ్రతతో మనస్సును హృదయాన్ని కేంద్రీకరించటం. కానీ సహజ ధ్యానము అనే పదానికి సరైన అనువాదం చెప్పటం చాలా కష్టం. ఒక విధంగా సహజధ్యానము అత్యంత సహజమైన జన్మతః సహజసిద్ధమైన, ప్రకృతి వైపు కదిలే దివ్యత్వపు ఎరుకగా చెప్పుకోవచ్చును.

బా.ా ిలా వివరించారు :

మీరు నన్ను గుర్తుకు తెచ్చుకున్నప్పుడు మీరు సహజ ధ్యానంలో ఉన్నట్లు. నన్ను గుర్తుంచుకొనుట ఎలా ? అన్నది ప్రశ్న. మీరు నేను చెప్పినట్లు ఆచరించుట ఒక్కటే సులభమైన నిశ్చయ మార్గము. మొదట్లో అది కొంచము కష్టమనిపించవచ్చును. మీరు దానిని ఆచరించుటకు మొదలు పెట్టినప్పుడు

మీకది అతిగా అనుభవించవచ్చును. కానీ మీరు నేర్చుకొనే సమయంలో దానిని సహజంగా అనుభవిస్తారు. మొదట్లో, మీరు దానిని బుద్ధి పూర్వకంగా చేయకలిగితే అప్పుడది సహజమనిపిస్తుంది.

ఉదయంపూట మీరు చేయవలసింది, నిద్రలేవగానే ఏ పనైనా చేయబోయేముందు ఒక్క క్షణం నన్ను స్మరించండి. అప్పుడు మీ ఆత్మ చేత బాబా హెచ్చరించబడతారు. తెల్లవారుఝామున మీ ఆత్మను బాబాతో శృంగారించండి. దీనిని మీరు నిజాయితీతో చేయండి. అప్పుడు ఆయన మీతోనే ఉన్నాడని తెలుసుకుంటారు. మరల మధ్యాహ్నం 12-00 గంటలకు ఒక్క క్షణం బాబాను స్మరించండి. మూడవ సారి సాయంత్రం 5-00 గం॥లకు మరల ఒక్క క్షణం బాబాను స్మరించండి, ఆ తర్వాత మీ నిత్య కృత్యాల్ని మీరు ఆచరించండి. నాల్గవసారి రాత్రి మీరు పరుండపోయే ముందు ఒక్క క్షణం బాబాను స్మరించండి.

మీరు అలా చేయకలిగితే, నేను అనుక్షణం మీతోటే ఉంటాను. మరియు మీరు నా సహవాసమును అనుభవిస్తారు. దానిని ప్రతిరోజూ మీరు నాలుగు క్షణాలు చేయండి. అప్పుడు మీరు ప్రపంచంలో గడిపినా, అనుక్షణం బాబా మాత్రం మీతోనే ఉంటారు. ఇదే సహజధ్యానపు ఆరంభము.

ఆధ్యాత్మిక ఐశ్వర్యము, ఒక సద్గురువు అందించిన మార్గదర్శక సూత్రాల్ని హృదయ పూర్వకంగా ఆచరించకలిగిన వారి హృదయంలో వ్యక్తవముతుంది. అయినప్పటికీ ముఖ్యంగా ఈ రోజున, సాక్షాత్తు అవతారుడే స్వయంగా తనదైన సరళ భావంతో అత్యంత స్వల్ప విధానంలో తనతో ఒక బంధాన్ని ప్రతిష్టించారు. దయామయుడైన అవతారుని నివేదనా ఫలితాన్ని స్వీకరించుటకు అన్వేషకునికి ఎటువంటి ప్రత్యేక అర్హతలు అవసరం లేదు, ప్రయత్నించండి అప్పుడు మీరు దాని విలువను తెలుసుకోగలుగుతారు.

ఈ క్రింది మాటలతో బాబా ఆనాటి సహవాస్‌ను సమాప్తం చేశారు. "ఉటంకించి చెప్పాలంటే, మనం మన హృదయాల్లో, భగవంతుడు మాత్రమే సత్యమని ఆయన మాత్రమే ఉన్నాడని, ఆయన మనందరిలో ఉన్నాడని, ప్రేమించబడుటకు ఆయనమాత్రమే ఉన్నాడని, ఉన్నది దైవం, ఉండేది దైవము మాత్రమేనని తెలుసుకోవాలి"

ఈ చిన్న బృందం ఎంతటి అదృష్ట వంతులో కదా ! ఎందుకంటే, అవతార్ మెహెర్ బాబా ఆధ్యాత్మిక సత్యాల్ని వారికి, ఎంతో విజ్ఞాపనారీతిలో వివరించారు. మెహెరాబాదు కొండమీద ఉంటున్న వారికి ఇటువంటి ఘనమైన కాలము మరువలేని విషయమంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు.

# అంతిమ పానీయము




బుధవారం నాడు బాబా పాశ్చాత్యులతో కలిసి మెహెరాబాదు వచ్చినప్పుడు, బాగా అలసినట్లు కనిపించారు. ఎంతో ఆప్యాయతతో అందరి ఆరోగ్యాల గురించి ఆరా అడిగారు. "ఈ రోజు నేను కాస్త బాగానే ఉన్నాను" అని విల్ బేకెట్టు చెప్పినప్పుడు బాబా చిరునవ్వు నవ్వి "నా ప్రియమైన విల్ ! నేను నిన్ను నా దేవ దూతగా పిలుస్తున్నాను. మరి నీవు నాకెంతో ప్రియమైన వాడివి. నేను నిన్ను ప్రేమిస్తున్నాను కూడా, అయితే, నీవు ప్రతిరోజూ "నేనీవేళ కాస్త మెరుగు" అని చెప్పటాన్ని అర్థం చేసుకోలేకపోతున్నాను' ' అని వ్యాఖ్యానించే సరికి అంతా ఘొల్లున నవ్వారు.

మనస్సు ద్వారా అప్రమాణిక నిరూపణ మరియు, భగవంతుని సత్యత్వముపై సంగ్రహ ప్రవచనమును బాబా అందిస్తూ దాని నిలా ముగించారు:

మీరు "ఆత్మ" "దైవము" "అనంతత్వము" అంటూ చెప్పినప్పుడు వాటర్థం శూన్యమన్నమాట. చదవటం లేదా వివరణలను వినటం వల్ల భగవంతుని అర్థం చేసుకొనుటకు ప్రయత్నించటమనేది అవగాహనల కతీతుడైన మన ప్రియతమ భగవానుడుని అవమానించినట్లే ప్రేమ మాత్రమే దానికి ఏకైక జవాబు.

ఈ విషయంలో మరింత లోనికి పోకుండా బాబా మరికాస్త జోడించారు.

ఈ రోజున నేను మీతో గోలీకాయలాడాలను కుంటున్నాను. మునులు, ఋషులు సైతం నన్ను నేనేదైయున్నానో దానిగా తెలుసుకోలేనంత కష్టతరమైన పరిపూర్ణ హాశ్యము మరియు సంపూర్ణ మానవత్వాన్ని కలిగియున్నాను. ఆఖరికి ఎవరైతే నాతో వున్నారో నేను ఎవరితో ఉన్నానో అట్టి ప్రియతమ దైవంతో పూర్తి సహజంగా ఉండటం నా సహజ స్వభావం.

ఆ బృందం వారు భోజనాలకు వెళ్లబోయే ముందు, బాబా ఇలా ప్రకటించారు.

'ఇప్పుడు నేను చెప్పిన దానిని మీరు అవగాహన చేసుకున్నట్లయితే,

ప్రతిదానికి పరిష్కారము మీ చేతుల్లోనే ఉన్నది. భగవంతుడు అనంతమైన యోగ్యుడు. మరి మన మాయన్ని నిజాయితీతో ప్రేమిస్తే తప్ప, ఆయన్ని తెలుసుకోలేము. అవగాహనకు అతీతుడైనప్పటికీ, ప్రేమతో నిండిన హృదయము, తెలుసుకోలేని దానిని తెలుసుకో కలుగుతుంది. మీరు దైవాన్ని ప్రేమిస్తే మీరు ఆయనతో లీనమైపోతారు. అలా చేయకలిగితేనే మీరు దైవాన్నిప్రేమించగలరు.'

బాబా ప్రతిగ్లాసులో కాస్త కాస్త పానీయాన్ని చప్పరించిన తర్వాత, ఆలాంజిలో ఉన్న పాశ్చాత్యులందరికీ వాటిని తలా ఒక గ్లాసు అందించారు. చివర్లో, వారివైపు ప్రేమగా చూస్తూ "మెల్లగా త్రాగండి" అని సౌంజ్ఞ చేశారు. ప్రతివారు ఆ పానీయాన్ని త్రాగటం పూర్తికాగానే, తలుపులు తెరవబడ్డయి. అనాడు ఎటువంటి ఆశీస్సులందించ బడినవి !

పిమ్మట బాబా ఆ బృందంతో క్రింది మెహెరాబాదుకు కదిలారు. కొంతసేపు హాల్లో భారతీయ బాబా ప్రేమికుల మధ్య గడుపుతూ కూర్చున్నారు. ఆ నెలఖరులో జరుగనున్న మీటింగు ఏర్పాట్లలో పెండరాకు సహాయమందించుటకు వారంతా వచ్చారు. అందరినీ కూర్చోమని బాబా సౌంజ్ఞలు చేశారు. ఆంధ్రా నుండి వచ్చిన ఒక ప్రేమికుడ్ని, భగవద్గీతలోని కొన్ని పంక్తుల్ని పఠించమని బాబా ఆదేశించారు. ఈయనికి "బాబాశాస్త్రి" అని బాబా మారుపేరు పెట్టారు. పఠనము కాగానే, బాబా అతనివైపు చూచి "నీవు చదివింది వింటుంటే నీవు సముద్రము మధ్యలో ఈదుతూ షార్క్ చేపల మధ్య చిక్కుకున్నట్లు నాకనిపించింది" అని వ్యాఖ్యానించారు. ఇతరుల వైపు చూస్తూ "మీకిది చోద్యంగా లేదు ! - నేను అందరిలో ఉన్నాను. కానీ నాకు సంస్కృతం రాదు, అది నాకు వచ్చినట్లు ఊరికే నాతలను ఆడించాను" అని వ్యాఖ్యానించారు.

ఎంతో భక్తి ప్రపత్తులతో బాబాశాస్త్రి బాబాకు నమస్కరించి "అంతా బాబాకు తెలుసు" అంటూ కూర్చున్నాడు.

బాబా తన మండలిలో ఒకడైన సిద్ధూను కొన్ని ఘజల్సు పాడమన్నారు. మధ్యలో ఒక ద్విపదకు అర్థాన్ని వివరిస్తూ "ఓ ప్రియతమా, నీ కురుల అందాన్ని చూచి, నేను ఆకర్షితుడనైనప్పుడు, నీ వెంతో చేరువలో ఉన్నావని నేననుకున్నాను.

కానీ ఇప్పుడు నా కాళ్లు బొబ్బలెక్కే వరకూ జీవితమంతా నడిచినా ఆ కురులింకా ఎంతో దూరంలోనే ఉన్నయి." అని చెప్పి "నేనెప్పుడూ చాలా దగ్గరలోనే ఉంటాను అయినా ఎంతో దూరంలోనే ఉంటాను" అని ముగించారు.

అవతారుడి ప్రేమ ఆటను, దివ్య ప్రియతముని క్రీడను ఎవరు కొలవ గలరు ? ఆయన కరుణ వల్ల కాళ్లు బొబ్బలెక్కటము దివ్యాశీస్సులకు శుభసూచికం. దాని ద్వారానే ఆయన తనప్రేమికుల హృదయాల్ని నింపాలనుకుంటారు.

ఒక అరగంట గడిచిన పిమ్మట, బాబా ధునీ ప్లాటుఫారం వద్దకు వెళ్లారు. ఆయన తన నుదదుటిపై తెల్లని వస్త్రాన్ని చుట్టుకొని చాలా తీక్షణంగా కనిపించారు. వాతావరణమంతా ఆయన తేజోమయ సమక్షంతో నిండిపోయింది. యధావిధిగా ధునీ వెలిగించబడి హారతి కూడా పాడటం జరిగింది. ఆ తర్వాత ఒక గ్రామస్తుడు కొమ్ముబూరా ఊదాడు. దాని భావమేమంటే పాశ్చాత్యులతో సహా అందరూ గ్రామంలోకి బయలు దేరే సమయమైందని ప్రకటించటం. మేళతాళాలతో బాబాను ఊరేగిస్తూ గ్రామస్తులంతా సందులు గొందులు గుండా బారులు తీరి బాబాను ఊళ్లోకి తీసుకు వెళ్లారు. స్త్రీలు, పిల్లలు, జనం గుంపుల్లోంచి తోసుకువచ్చి బాబా పాదాలకు నమస్కరించారు. ఆరు గంటలకు బాబా క్రింది మెహెరాబాదుకు చేరుకున్నారు. ఆయన హాల్లో కూర్చొని పాశ్చాత్యులందరినీ తన చుట్టూ కూర్చోపెట్టుకున్నారు. మలేరియా రాకుండా ముందు జాగ్రత్త చర్యగా తలా రెండు అనాసిన్ మాత్రలు మింగమని వారిని ఆదేశించారు. ఎప్పుడు ఎటువంటి సమావేశం జరిగినా, పాల్గొనే వారి ఎడల బాబా చూపించే దయ, తీసుకునే జాగ్రత్త ఎంతో ప్రేమాన్వితంగా ఉంటాయి. పిమ్మట ఆయన అందరినీ ఆలింగనం చేసుకొని, కొండమీద రిట్రీటుకు వెళ్లి విశ్రాంతి తీసుకోమని చెప్పారు.

టి.బి. శానిటోరియంలో ఉన్న రోగులను పరామర్శించి బాబా మెహెరాబాదు వెళ్లిపోయారు. మరుసటి రోజున అహమదు నగరులో జరుగనున్న దర్శన కార్యక్రమం గురించి కొంతపని ఉండటం వల్ల బాబా 25వ తేదీన మెహెరాబాదుకు రాలేదు.

## స్వల్ప దర్శనము

సెప్టెంబరు 12న మెహెర్ బాబా వాడియా పార్కులో, అహమ్మదు నగరు జిల్లాలోని అనేక గ్రామాలు పట్టణాల నుంచి వచ్చిన వేలాది మందికి బాబా దర్శనాన్నిచ్చారు. నిజానికిది ఒక గొప్ప దివ్యమైన సంఘటన కొన్ని రోజుల అనంతరం నగరునుంచి అనేక బృందాలుగా వచ్చే జన సందోహం వల్ల ఆయన దర్శన భాగ్యం పొందేందుకు ప్రజలు మరో అవకాశమివ్వమని అభ్యర్థించారు. ప్రియతమ బాబావారి అభ్యర్థనను ప్రేమతోమన్నించారు. అందుకు నిర్ణయించిన తేది సెప్టెంబరు 26 ఈ కార్యక్రమానికి స్వల్పదర్శనము అని పేరుపెట్టారు.

ఈ స్వల్ప దర్శనకార్య క్రమాన్ని కుస్రూ క్వార్టర్లలో ఏర్పాటుచేసే బాధ్యతను సరోష్, ఆదీలు తీసుకొని పూర్తిచేశారు. దీని ముందు ఖాళీ జాగా ఎక్కువగా ఉండి, దర్శనానికి వచ్చే జనం క్రమ ప్రకారంవచ్చి వెళ్లుటకు అనువుగా వెడల్పాటి మార్గమున్నది. ఆ ఇల్లు బాబాకార్య దర్శి ఆదీ.కె. ఇరానీకి చెందినది. ఆయన నివాసము, కార్యాలయం కూడా అందులోనేఉన్నాయి. ఆదీ ఆఫీసు ఎదురుగా ఒక ఎత్తు తక్కువ వేదికను తయారుచేసి పైనకప్పు ఏర్పాటుచేశారు. బాబా కొరకు ఒక సోఫానుంచారు. ఏర్పాట్లన్నీ క్లుప్తంగా ఉన్నా ఎంతోసొంపుగా ఉన్నాయి.

ఈ రోజున, బాబా మెహెరాజాదు నుండి సాయంత్రం 3-30లకు చేరుకున్నారు. మెహెరా బాదు నుండి పాశ్చాత్యులు కూడా ఇంకా ముందుగానేవచ్చారు. బెన్‌హేమన్, ఫ్రాంక్ హెండ్రిక్‌లు 12వ తేదీ కార్యక్రమానికి రాలేక పోయినందున వారిని బాబా వేదిక పైన తన పక్కనే కూర్చోమన్నారు. బాబాను తన ఆసనంపైకి తీసుకు వెళుతుంటే ఆయన కళ్ళు ప్రశాంత కరుణతో వెలుగొందాయి. ఏ దర్శనంలోనైనా ఆయన భౌతిక సముఖం ఒక మృదువైన ప్రకాశాన్ని ప్రసరింపచేస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ సందర్భంలో కూడా కొందరిలో ఆయన్ని కలవాలన్న తపన స్పష్టంగా వ్యక్తమైంధి ఒక్కోక్కప్పుడు అవతారుడి ఆతురత కూడ విశదమవుతుంది.

అప్పటికే జనమంతా కాంపౌండుబయట గుమికుడారు. నిర్ణయించిన గం3-30లకు, గేటు తెరవబడి మొదటి విడతగా స్త్రీలను దర్శనానికై లోనికి అనుమతించారు. బాబా ప్రక్కగా బుట్టలతో ప్రసాదాన్ని ఉంచగా ఆయన దానిని పంచిపెట్టసాగారు. కొంత మంది బాబాకు చిన్న చిన్న స్వీటు ప్యాకెట్లు, పళ్లు ఆయననుండి ప్రసాదన్ని స్వీకరించుటకు ముందు సమర్పించు కుంటున్నారు. కొందరి చేతుల్లో పూలు పూలగుత్తులు మరి కొందరి చేతుల్లో పెద్ద పెద్ద పూల

హారాలున్నాయి. ఇండియాలో వట్టి చేతులతో గురువును సందర్శించ రాదన్నది. సనాతన సాంప్రదాయం. జనం ఆయన ముందుకు రాగానే బాబా వాళ్లతో ఉన్న పిల్లల్ని బుజాలుతట్టి, కొందరిని ముద్దులతో లాలించారు. ఆ దైవీ మానవునితో మిళితమైన పసిబిడ్డ చిందించే చిరునవ్వు చూచేందుకు చలింపచేసే ఒక అత్యద్భుత సుందర దృశ్యమును వర్ణించలేము.

భారతీయ పాశ్చాత్య బాబా అనుచరులాయనకు ఎడమ వైపుగా క్రింద కూర్చున్నారు. ఒకదశలోఆయన వారికి"ఈ వ్యక్తి గతమైనస్పర్శతో ఏవివరణలు లేదా ప్రవచనములను పోల్చుటకు సరికావు. నేను అందరిలో ఉన్నానని భావిస్తున్నాను. కనుక ఈ విధంగా బాబాయే బాబాకు నమస్కరిస్తున్నాడు" అని ప్రవచించారు.

భిన్న మతాలకు చెందిన అనేక రకాల జీవితాలు గడుపుతున్న జనం క్యూలో నిలబడ్డారు. ప్రతివారి ప్రేమను వారి అనన్య భక్తిని బాబా స్వీకరించి వాటికి ప్రతిగా తన ప్రేమనందించారు. ఈకార్యక్రమ సమయంలో, బాబాతో సంబంధం ఉన్న ఏ వ్యక్తికైనా ముఖ్య కీలకంగా ఉపయోగపడే ఒక వాక్యాన్నిబాబా ప్రవచించారు. "ఎవరైనాసరే నన్ను ఎవరిగా తీసుకుంటే నేను అదే అయి ఉంటాను." ఈ అభయమే నా జీవితానికి చుక్కానై పురాణ పురుషునితో సంబంధాన్ని పెంచింది. కొద్ది సేపయ్యాక "నేను అందరినీ ప్రేమిస్తున్నాను" అని బాబా జోడించారు. ఇది అంతకు ముందాయనందించిన ప్రకటనకు అన్వయించే ఊరడింపు.

కనీసం, పండు లేక స్వీటునన్నా కొనలేని ఒక పేద వనిత బాబా పాదముపై ఒక పైసా బిళ్లను ఉంచింది. ఆయనకు మాత్రమే తెలిసిన ఏవో ఆధ్యాత్మిక కారణాల వల్ల, బాబా మస్తులకు ఇచ్చుటకు లేదా పేదల కిచ్చుటకు తప్ప, ఇతర సమయాల్లో పైకాన్ని తాకటం మానేశారు. పైకి స్వల్పంగా కనిపించే యీ ఒక పైసా సమర్పణతో బాబా తీవ్రంగా గంభీరులై బెరుకు చూపులతో లేచి నిలబడ్డారు. దర్శన క్యూ తాత్కాలికంగా ఆగిపోయింది. కొద్దిసేపటికి బాబా అతి కష్టం మీద కదలగలిగారు. నెమ్మదిగా తన పాదాన్ని దానిపై నున్న నాణెం జారిపడిపోయేట్లు పక్కకు వంచారు. తన కాలివేళ్లతో మట్టిన లాగి, ఆ నాణాన్ని మట్టిలో కప్పెట్టి తదేకంగా దానివైపు చూడసాగారు. పిమ్మట అతి ప్రశాంతంగా తన జుట్టును మృదువైన తన బారాటి చేతివేళ్లతో వెనుకకు దువ్వుకొని, దర్శనాన్ని కొనసాగించమని [illegible]లు చేశారు. అప్పుడాయన ముఖభా[illegible]మీ జరుగనట్లు వ్యక్తమయ్యాయి.

మెహెర్ బాబా జీవితంలో ఈ రకపు సంఘటన స్వల్పంగా కనిపించినా, అంతర్గతంగా గొప్ప భావాన్ని సూచిస్తూ అనేక మందిని దిగ్భ్రాంతి పరిచాయి. అయితే ఆయన అనుచరులకు మాత్రము, దానివల్ల విశదపడే ప్రాముఖ్యతను గురించి ఊహించేందుకు ప్రయత్నించక, అటువంటి విషయాల్లో తెలివిగా మౌనం వహించుటే మంచిది. "నన్నర్థం చేసుకొనుటకు ప్రయత్నించకండి. నా లోతు కొలువ శక్యం కాదు. శుద్ధముగా నన్ను ప్రేమించండి" అని బాబా ఒకసారి ఆదేశించారు.

ఈ స్వల్ప దర్శన జ్ఞాపకాలు, మరో ఇద్దరి జీవితాలను నాకు గుర్తుకు తెస్తున్నాయి. ఒకాయన బాగా చదువుకున్న వ్యక్తి. రెండవ వ్యక్తి నిరుపేద, నిరక్షరాశ్యత కల స్త్రీ. అవతారుడి అద్భుత దర్శన భాగ్యం వల్ల యీ ఇరువురూ లబ్ధిని పొందారు. అయితే ఆ ఇరువురూ పూర్తిగా రెండు విభిన్న విధానాల్లో పొందారు. అనుకోకుండా 20 ఏళ్లు గడిచాక ఆ ఇద్దరూ 1970లో ఆనాటి వారి దర్శన కారణంగా లభించిన ఫలితాన్ని సవివరంగా నా దగ్గర బయట పెట్టారు. ఒక వ్యక్తికి అవతారుడి స్పర్శ తగిలినంత మాత్రంచేత ఎంతో అదృష్టము కలిగినప్పటికీ ఆ స్పర్శ ఫలించి పిందెలు తొడుగుటకు అవతారుడి నిర్దేశిత సమయ మాసన్నం కావాలి. ఆయన ఓర్పు అపరిమితము. ఆయన ఎంచుకొనే క్షణము ఎప్పుడూ ఆయా వ్యక్తులను బట్టి నిగూఢమైన వ్యక్తిగత అర్థము కలిగియుంటుంది.

మొదటి సంఘటన :- ఈ రోజున కె. నారాయణ ప్రియతమ బాబా దర్శనం చేసుకున్నాడు. అప్పుడాతడు ఇంకా పాఠశాలలో చదువుతున్న విద్యార్థి. ఆ తర్వాత అతనికి చదువు మీదున్న ఏకాగ్రత వల్ల ఆ దివ్యమైన స్పర్శ గురించి మరచిపోయాడు. చివరకు అతడు భారతీయ రైల్వేలో మంచి ఉద్యోగాన్ని సంపాదించాడు. ఉద్యోగంలో చేరిన తొలి రోజుల్లో అతడు హిందీలో తన మాస్టరు డిగ్రీని పూర్తిచేశాడు. అతడు శ్రోత్రియ కుటుంబం నుండి వచ్చినందున, భగవద్గీతను క్షుణంగా చదివాడు. గీతపై జ్ఞానేశ్వర్ వ్రాసిన వ్యాఖ్యానమంటే అతనికి అమిత ఇష్టం. జ్ఞానేశ్వర్ (1275-1296) శతాబ్దపు ఒక అసమాన గురువు. ఎందుకంటే ఆయన అతి పిన్న వయస్సులోనే దైవసాక్షాత్కారాన్ని పొందాడు. ఆతనికి 21 ఏళ్లప్పుడు, తనకు సద్గురువైన తన పెద్దన్నయ్య చేత సజీవ సమాధి చేయబడాలని ఆకాంక్షించాడు. అతని జీవితంలో అతి తక్కువ కాలంలో, ఈ నాటికి కూడా అసమాన రీతిలో ఉండిపోయేట్లు ఎనలేని మరాఠీ ఆధ్యాత్మిక సాహిత్యాన్నందించాడు. మహారాష్ట్రలో ఆయన గురువులకే రాజుగా కీర్తించబడుతున్నాడు.

నారాయణకు ఆధ్యాత్మిక జీవితంలో అమిత శ్రద్ధ ఉన్నందున, తరచుగా తన మిత్రుడైన ఒక బాబా ప్రేమికుడ్ని కలిసే వాడు. వారిరువురూ కలిసి, మహారాష్ట్ర మునులు, సద్గురువులు వ్రాసిన రచనలను బిగ్గరగా చదివి వారి భావాల్ని పాలుపంచుకొనేవారు.

నారాయణ మెహెర్ బాబాను దర్శించిన 20 ఏళ్లకు గాని, తన స్నేహితుని ఇంట్లో బాబా ఫోటోను చూచే అవకాశం లభించలేదు. సరిగ్గా అదే సమయంలో నేనాతడ్ని కలిశాను. ఆతను మెహెర్ బాబాను గురించి మరింతగా తెలుసుకోవాలని తపిస్తున్నాడు. ప్రియతమ బాబా జీవితంలో జరిగిన అనేక కథల్ని నేను అతనితో చెప్పి పంచుకున్నాను. అలా అతడు బాబాకు మరింత చేరువయ్యాడు. మా మధ్య జరిగిన సంభాషణల వల్ల అతను తన చిన్నతనంలో చేసుకున్న బాబా దర్శన విషయాన్ని గుర్తుకు తెచ్చుకున్నాడు. బాబా ప్రేమకై అతని హృధయం తెరుచుకున్నది. బాబా దర్శనం చేసుకోగానే ఆయన్ని జ్ఞాపకము ఉంచుకొని అనుసరించే గొప్ప అదృష్టాన్ని జారవిడుచుకున్నందుకు అతడు ఎంతగానో కుపితుడయ్యాడు.

అప్పటి నుంచి అతను బాబాపై పాటలు, పధ్యాలు వ్రాయటం మొదలు పెట్టాడు. ఒకనాటి రాత్రి దివ్యమైన మహదవకాశాన్ని జారవిడుచుకున్నానన్న తలంపు తీక్షణమై ఆరాత్రంతా నిద్రపోలేదు. మర్నాడు ఉదయం అతని సహ ఉద్యోగి ఒకరు (అతను బాబా ప్రేమికుడు కాకపోయినా బాబా చిత్రాన్ని చూశాడు) అతడ్ని ఆఫీసులో కలిసి "నీవు ఎంతో అదృష్టవంతుడివి" అంటూ ఆశ్చర్యపోయాడు.

"అది ఎలా?"

"నీవుగత రాత్రి మెహెర్ బాబానుదర్శించావు."

"ఏమిటి నీవుఅంటున్నది?"

"రాత్రి ఒక కలవచ్చింది. అందులో నీవు మెహెర్ బాబా పాదాల పై నీ శిరము నుంచుటను నేను చూచాను. నీవు నిజంగా చాలా అదృష్టవంతుడవు. అందుకే నేనునిన్ను కలిసి ఈ శుభవార్త అందించాలని వచ్చాను" నిజంగా ఇది అతనిలోని తితీక్షకు ఏమి అద్భుత అనువర్తన!

కలలలో బాబా కలవటానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నది.ఇక్కడ నారాయణ విషయంలో. తనకే ఈ కలవచ్చి ఉంటేతనలోఉన్న వాంఛకు అను గుణ్యంగా ఆకలవచ్చిందని అనుకొని ఉండేవాడు. అయితే వేరే వ్యక్తికి ఆకల అనుభవమైంది. నారాయణను బాబా అదంతా. యధార్థమని అది తాను ఇచ్చిన ప్రత్యేక

బహుమతని తెలుసుకోనేట్లుచేశారు. స్నేహితుని కలవల్ల నారాయణలో తన తపనను బాబా తెలుసుకున్నారని, అందుకేతనకుదర్శన మివ్వటం ద్వారా తన తపనను తీర్చారన్న భావం కలిగింది. ఇహ అప్పటి నుంచి తన పద్యాల్లో,పాటల్లో నారాయణ మెహెర్ బాబానుకీర్తిస్తూ అవతారునిగా అత్యున్నత విశ్వాసంతో శ్లాఘించేవాడు.

రెండవ సంఘటన :- ఒకరోజున, 70వ దశకం మధ్య భాగంలో ఒకాయన మెహెర్ బాబా ట్రష్టు అఫీసుకు వచ్చాడు.ఎరుచ్,మణీలతో మాట్లాడుతున్న సందర్భంలో (అప్పుడు నేనూ అక్కడే ఉన్నాను) ఇదే ట్రష్టు ఆవరణలో మెహెర్ బాబానుండి స్వయంగా ప్రసాదాన్ని స్వీకరించుట గురించిన మంత్ర ముగ్ధుల్ని చేసేకథను చెప్పాడు ఇది ఆనాడు బాబా ఇచ్చిన కొద్దిపాటి దర్శన సమయంలో జరిగినట్లు తెలిసింది.

ఆ వ్యక్తి తన కథను ఇలా వివరించాడు.తనచిన్న తనంలో, అతని కుటుంబం చాలా పేదరికంలో గడిపింది. తల్లి చాకిరీ చేసికష్టపడి సంపాదించేది. వాళ్ల నాన్న పచ్చి తాగుబోతైనందున సంపాదించినదంతా త్రాగుడుకు ఖర్చు చేసేవాడు. తన తల్లి మెహెర్ బాబా దర్శనము ఇస్తున్నారన్న విషయం తెలుసుకున్నా. కూలి పనికి వెళితే వచ్చే డబ్బులను వదులు కొనుటకు సందేహించింది. ఎలాగైతేనేమి చివరకు తన పొరుగువారి ప్రోద్భలంతో ఆమె, ఆరోజున బాబాదర్శనం చేసుకోవాలనే నిశ్చయించింది. మెహెర్ బాబా లాంటి గొప్ప ఆధ్యాత్మిక మహనీయుల్నిదర్శిస్తే తన కష్టాలుతీరి తన కుటుంబ పరిస్థితులుమెరుగు పడి ఆర్థిక పరిస్థితులు బాగుపడతాయని తలపోసింది

అలా ఆమె ఆనాటిసాయంత్రం అందరితో పాటు క్యూలో బాబాను అంతరాంతరముల నుండి ప్రార్థిస్తూ నిలబడింది. చాలా సేపటికి బాబా ఉన్నవేదిక వద్దకు చేరుకున్నది. బాబా సందర్శకు లందరికీ తన ప్రసాదంగా పండు లేదా స్వీటును ఇస్తున్నారు. ఇతని తల్లికి కూడా బాబా ఏదో ప్రసాదాన్నందించారు. క్యూలో కదలాలన్న తొందరలో ఆమె ముందుకు నెట్టబడింది. పవిత్రమైన ప్రసాదాన్ని తనగుప్పెట్లో గట్టిగా నొక్కి పట్టుకొని ఆమె ప్రహరీ గేటు దాటి బయటకు వచ్చింది. తీరా ఆమె చేయి తెరిచి చూచేసరికి నోట్ల కట్ట కనిపించి మూగబోయింది. అందరికీ బాబా ఆనాడుడబ్బులుపంచి పెట్టారేమోనని ఆమెతలపోసింది. అమితానందంతో ఆమె ఇల్లు చేరింది.ఈ ఆర్థిక సహాయంతో ఆమె తన కుటుంబ అవసరాలన్నీ సమకూర్చు కోగలిగింది. ఈ విషయాన్ని తెలుపుతూ "అంతేకాదు.ఈ డబ్బును వినియోగించి నేనుఒక చెప్పుల దూకాణాన్ని

తెరిచి స్వయంగా అహ్మదు నగరులో ఇప్పటికీ నడుపు కుటుంన్నాను." అని తెలియ చేశాడు.

అతనీ విషయాన్ని చెపుతున్నప్పుడుఅక్కడ వింటున్న వారంతా ముఖ్యంగా యీ కథను విన్న ఎరుచ్ విస్మయం చెందారు. ఆనాడు దర్శనం పరి సమాప్తమయ్యే వరకు ఎరుచ్ బాబా ప్రక్కనే నిలబడి ఉన్నాడు. అసలు ఆరోజున బాబా పైకాన్ని ఎవరికీ పంచలేదని ఎరుచ్‌కి తెలుసు అందుకే ఎరుచ్ ఇలా అన్నాడు. "మరి యీ అపురూపమైన ప్రసాదము ఈ స్త్రీ చేతిలోకి ఎలా వచ్చింది? బాబా పైకాన్ని ఇవ్వలేదని నాకు బాగా తెలుసును. అది ఆయన విధానంకానే కాదు.ఇది నాకు తెలుసుననిచెపుతున్నాను.అయినా నాకు ఒకవిషయం గుర్తోస్తోంది.ఇన్నేళ్లుగా బాబాను గురించి ఎరిగిన నాకు ఇది నిజమని నమ్మశక్యం కాలేదు. బాబా మౌనంలో ఉన్నారు. ఆయన తన పనిని మౌనంలోనే చేశారు. మరియూ మౌనం ఎంత గొప్పదంటే భౌతికంగా ఆయన ప్రక్కనే ఉన్నా,ఆయన చేసేపనిని ఎవరూ గ్రహించలేరు. కనుక ఆనాడు ఆస్త్రీకి బాబా ప్రసాదంగా అందించిన ఆలడ్డూనుడబ్బుగా మార్చుటలో బాబా యొక్క అనంత కరుణను ఏ శక్తి అడ్డుకోగలదు? భగవంతుడికి ఏదైనా సాధ్యమే. పరిమితమైన మన మనసులు మన పరిమిత అవగాహన మాత్రం భగవంతుని గొప్పదనాన్ని పరిమిత పరిచేందుకే ప్రయత్నిస్తయి.

ఇప్పుడు మళ్లీ అసలు దర్శనం విషయానికి వద్దాం అది సాయంత్రం 6-00లవరకు సాగింది. అయినా క్యూ అంతం లేకుండా కనిపించింది. అప్పటికి దాదాపు 2000మంది బాబా దర్శనం చేసుకోని బాబా పాదాలు స్పృశించి ప్రసాదాన్నందు కున్నారు. పైకిబాబా తన ప్రేమనందిస్తూ అంతర్గతంగా తమ హృదయాల్లోనే నివసించే ఆ ఏకైకుడిని చేరేందుకు చేసే ప్రయాణంలో పొందే అపజయాల్ని క్షమిస్తున్నారు. మరో అరగంటపైగా దర్శన మిచ్చుటకు ఇష్టమేనా అని సరోష్ బాబాను అడిగాడు. బాబా ఉల్లాసంగా కనిపించినా, అంగీకరించలేదు. పాశ్యాత్య బృందాన్ని మెహెరాబాదు వెళ్లిపొమ్మని బాబా ఆదేశించారు.

బాబా మంచి ఉల్లాసంగా ఉన్నారు. కారు పైకప్పుపై కూర్చోని ప్రహరీ గేటు గుండాబయలు దేరారు. జనం మధ్యనుంచి ఆయన కారు వెళుతుంటే, ఆయన ముకుళిత హస్తాలతో అందరికి నమస్కరిస్తుంటే ప్రతిగా అంతా "అవతార్ మెహెర్ బాబాకిజై" అంటూజయజయ ధ్వానాలు చేశారు. బాబా కారు ప్రధాన రహదారిపైకి రాగానే బాబా కారు టాపుమీద నుండి క్రిందకు దిగి లోన సీట్లో కూర్చున్నారు. హుటా హుటినమెహెరాజాద్ లోని తనింటికి చేరుకున్నారు. అలా చిన్న దర్శనము సమాప్తమైంది.

27వతేదీన, బాబాకు మెహెరా బాదు వచ్చే కార్య క్రమం నిర్ణయం కాలేదు.అయినప్పటికీ మెహెరా తదితర స్త్రీ శిష్యురాండ్రు పాశ్చాత్య బృందానికి బాబా స్వహస్తాలతోఏవైనా ప్రత్యేక బహుమతులుఇస్తే బాగుంటుందని సూచించారు. ఈ ఆలోచన బాబాకు నచ్చి ఉదయాన్నే మెహెరాబాదుకు కారులో వెళ్లారు. తీరా ఆయన కొండపైకి చేరేసరికి, తమను సంబ్రమాశ్చర్యాలలో ముంచి అయన వస్తారన్న ఆలోచనలేక బృందము లోని వారెవరూ ఆయనకు స్వాగతము పలకలేకపోయారు.

బాబా తను పడుకోనే పెద్ద కుర్చీవద్దకువెళ్లారు కోద్ది సేపటికి మొత్తం బృందమంతా అక్కడకు చేరుకున్నారు. బాబారాకకు కారణము తెలుసుకున్న వారంతా చాలా సంతోషించారు. ఆయన బహుమతులను పంచిపెట్టుతూ తన ఫోటోలపై స్వయంగా సంతకం చేసి అవికూడా వారికందించారు. అనుకోని యీబహుమానాలకు ప్రతివారు సంబ్రమాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరయ్యారు.

ఆ బృందాన్ని ఉద్దేశించి తన అక్షరఫలకంపై ప్రసంగిస్తూ ఇలా ప్రవచించారు. "మీరుకలిసి సందర్శించే ప్రతివారికి నాప్రేమ నందించండి. స్వీకరించతగిన ఏకైక అమూల్యమైనది". మరోవ్యక్తికి "నీవు ముందుగా నన్నునీలో జీర్ణించుకొని నీవు నన్ను ప్రేమిస్తున్నట్లు అనుభవించు. అప్పుడు విశ్వాసంతో మాట్లాడు." అని సందేశ మిచ్చారు.

ఆ బృందం వారందరిని బాబా ఆలింగనం చేసుకున్నారు ప్రతివారి హృదయాన్ని ఆనందంతో నింపేశారు.తమ ప్రియతమగురువుమెహెర్ బాబాతోపాశ్చాత్యులు గడిపిన సహవాస్ ఈవిధంగా పరిసమాప్తమైంది. ఇప్పుడు వారంతా సెప్టెంబరు 29,30 తేదీల్లో జరుగబోయే మీటింగుపై దృష్టిని కేంద్రీకరించారు.

## కొన్ని గంభీరమైన మధుర స్మృతులు

ఈ అతిసన్నిహిత సహవాస్ ముగియగానే పాశ్చాత్య బృందం. త్వరలోనే ఇళ్లకు తిరిగి వెళ్లిపోయారు ఆయినా మెహెర్ బాబాతో తాము గడిపినసన్నిహిత సాహచర్యపు మధుర స్మృతులు, వాటి ప్రాముఖ్యత వారిమనసుల్లో, హృదయాల్లో తాజాగా పెనవేసుకు పోయాయి. ఆ తరువాత వాటిల్లో కొన్నిటిని బాబా అనుచరులతోమాటల ద్వారా, వ్యాసముల ద్వారా వివరిస్తూ పాలు పంచుకున్నారు.

చిరస్మరణీయమైన సమావేశపు ఘట్టాల్లో మెహెర్ బాబా ప్రపంచానికి

అందించిన "అంతిమ ప్రకటన" అనే సందేశం గురించి నేనుమీకు వివరించేందుకు ముందుగా, నేను పాశ్చాత్య బృందంలో కొందరి హృదయాంతరాళాల్లోంచి పెల్లుబికిన భావాల్ని మీ ముందు ఉంచు తున్నాను.

ఆవతారుడిగా మెహెర్‌బాబా అవతరణ విషయం గురించి ఇంగ్లాండు వాస్తవ్యుడు ఫ్రెడ్ మార్క్స్ ఇలావ్రాశాడు. "ఏదో ఒక గొప్ప సంఘటన జరగనున్నదని అందరూ ఎదురు చూస్తున్నారు. పాపకూపంలో కూరుకు పోయిన మానవాళిని సముద్ధరించి రక్షించే జగద్రక్షకుని రాక కొరకు తితీక్షతో తహ తహలాడే వారికోరికకు అనుగుణ్యంగా ఈ యుగాంతంలో ఆయన అవతరించాడు. ఆ ఏకైకుని కనుగొనుటకు ఎరుకతో కోరతగినది మరేదీ లేదని తెలుసుకోవాలి. తీవ్రమైన తపనకు ఇది చరమాంకం. ఈనాడు ఆయన పేరు మెహెర్ బాబా. ఆయన తనకు తానుగా మనకు అర్పితమయ్యారు.

బాబాయొక్క దివ్యత్వ స్థితి యందాయనకుఉన్న పూర్తి నమ్మకాన్ని జోసెఫ్ హార్బ్ ఇలా వ్యక్తపరిచాడు. అదే ఆణిముత్యాన్ని మరో రూపంలో వ్యక్తం చేశాడు. దివ్య చైతన్యము ఆయన (మెహెర్ బాబా) ద్వారా నిరంతరం ప్రవహిస్తోంది. కానీ అటువంటి ఆనందకర అమాయకత్వము ఒక పశివాడ్ని ముంచి వేయలేదు. ఆయినప్పటికీ, దీనిని కొలుచుటకు గాఢమైన మనస్సుకు సైతం శక్యము కాదు. ఆయన దివ్య మనస్సు మరియు ప్రేమల విశాల పరిధిలు, జటిలమైన చట్టములతో శాస్త్రీయమై ఆయన ఎంత గొప్పవాడో అంత గొప్పవి. అయినా, దీనినంతటిని సమన్వయపరచి,హృదయంలోసంతోషాన్ని పుట్టించి,మనస్సుకు ఒక పరిపూర్ణ చిత్రాన్నందిస్తాడాయన. హృదయము మనోచక్షువు క్రిందమారి, సద్గురువు చేసే సూక్ష్మము, మౌనంతో కూడిన శక్తి వంతమైన పరిపూర్ణ చర్యలను గమనించును.

అచైతన్య దివ్యత్వం నుండి చైతన్యవంతమైన దివ్యత్వపు ఆత్మ సాక్షాత్కార ప్రాప్తి పొందినవాడు సజీవ అవతారుడు ఉనికిలో ఉన్నఅన్ని భూమికలలో పని చేస్తూ,సూటిగా స్పష్టంగా దివ్య చట్టము మరియు ప్రేమల పరస్పరసమన్వయంలో ఆయన చేసే ప్రతి చర్యలోబ్రహ్మాండమైన శక్తిని ప్రత్యక్షీకరిస్తూ శాశ్వత సత్యపు శక్తిని కలిగిఉంటాడు. ఆయన దైవస్థితి మరియు మానవ స్థితులు రెండూ కలపోసి మలచిన ఒక పరిపూర్ణ రూపం, అదే బాబా. ఆయన "సర్వోన్నతుడు"

దైవీ మానవుని మనోజ్ఞమైన మానవ భాగము గురించి తొలి ఆంగ్లేయ శిష్యుల్లో ఒకడైన విల్ బ్యాకెట్టు తన అభిప్రాయాల్నిలా వ్రాసుకున్నాడుః "మెహెరాబాదులో ఉన్నప్పుడు,బాబా అప్పుడప్పుడు మాకు ఒకరితర్వాత ఒకరికి పండోఫలమో ఇచ్చేవారు.లేదా తన ప్రసాదంగా ఆయనేస్వయంగా భోజనపళ్లాన్ని

అందించేవారు. ఒక సందర్భంలో, ఆయన మాబల్ల చూట్టూ నడుచుకుంటూ మా భుజాలపై తన రెండు చేతుల నుంచేవారు. ఆసున్నితమైన బాబా స్పర్శ యొక్క సాధారణమైన సంకేతమునకు ఎంతో గంభీరమైన అర్ధమున్నది.ఆయన అలా బల్ల చూట్టూ ప్రదక్షిణం చేస్తున్నప్పుడు ప్రతివారిని చక్కలి గింతలు పెట్టి నవ్విస్తూ తాను ఆ ఎగతాళిలో పాలుపంచుకొనే వారు. ఎందుకంటే మమ్మల్ని ఉత్సాహపరచి సంతోష పెట్టటం ఆయనకెంతో ఇష్టం.

మా విరామం కొరకు ఏర్పాటు చేసిన టేబిల్ టెన్నిస్ బల్లవద్ద, ఆయన ఒక శూరుడైన ప్రత్యర్థిగా అద్వితీయమైన వడిగల అనుగ్రహశాలిగా అనిపించేది. ఆయనతో మరోకరమైన గోలీలాట గేమును కూడా ఆడించి, గురువు యొక్క యధార్థ క్రీడా వినోదమైన దివ్య ప్రేమ ఆటలో భాగంగా ఇందులో విజేతకు పారితోషికాన్నందించుటతో పాటు, అతని నేర్పుకు లేదా అదృష్టానికి మెచ్చుకొనేవారు".

1934లో తోలిసారిగా మెహెర్ బాబాను కలిసిన అమెరికన్ శిష్యుల్లోఒకరైన న్యూయార్కు నగరంలోని షెల్టన్ హోటలులో కలుసుకున్న డార్విన్‌షా మెహెరాబాదు కొండపై గడిపినపాశ్చాత్య బృందంలో ఒకరుగా వున్నాడు. 1967లో శాన్‌ఫ్రాన్సిస్‌కోలోవున్న సూఫి సెంటరులో ఆయన ఒకసారి ప్రసంగిస్తూ, "ఇది 1954లో జరిగింది. 17మంది పాశ్చాత్యులు, మెహెరాబాదు కోండపై మరుపురాని మూడు వారాలు బాబా అతిధులుగా వుండే గొప్పఅదృష్టం పోందారు"

"ఒక రోజునమేము బాబాతో క్రింది మెహెరా బాదునుండి మెహెరా బాదు కొండపైకి నడుస్తూ ఉన్నప్పుడు, కొండలపై జీససుతో నడుస్తున్నట్లు నాకుదృఢంగా అనిపించింది.ఇది పూర్తిగా చేయతగిన ప్రకటన ఇది20వ శతాబ్దం. "ఇలా జరగకూడదు" అని మీరనవచ్చును. అయితే మీరు బాబాతో ఉన్నప్పుడు అది జరుగుతున్నట్లే మీరు చూస్తారు.న్యూటెస్టు మెంటులోని ఒక అధ్యాయమునాకు గుర్తోస్తోంది. "అవును ప్రభూ" అంటూ మీరంతా చెపుతారు.కానీ నేను చెప్పినట్లు మీరు ఆచరించరు." (ఇది లూక్ 6:46 అని నాకుజ్ఞాపకం) నాకుఎడమ వైపుగా కొద్ది అడుగులు ముందు నడుస్తున్న బాబా నావైపు తీక్షణంగా చూశారు.బాబా శరీరత్యాగం చేశారని తెలిసి చాలా చింతించాను. అది త్వరలోనే జరగబోతోందని ఆయనమాతోచెప్పారు మరి అయన శరీరత్యాగం చేసిన తర్వాత ఆయనతో మాకున్న బాంధవ్యం ఏమవుతుందోనని నాకు ఆశ్చర్యం వేసింది.

"కొద్ది నిమిషాల్లో మేమంతా ప్రతి రోజూ కొద్ది గంటల పాటు బాబాతో గడిపే గదిలో కూర్చున్నాము. ఒక చిన్న సోఫాలో బాబా ఆశీనులయ్యారు. ఆగదికి అభిముఖంగా నేను కూర్చున్నాను. తక్కిన 16మంది పాశ్చాత్యులుబాబా చుట్టూ

వృత్తాకార పరిధిలో కూర్చున్నారు. బాబా తన అక్షర ఫలకంపై తన భౌతిక అంతం గురించి చెపుతూ మాట్లాడ బోతున్నందున ఆయన నావైపు చూడలేదు."నేను పురాణ పురుషుడను. నాశరీరత్యాగా నంతరము మీరంతా నన్ను అధికాధికంగా ప్రేమిస్తారు. నన్ను నిజమైన నేనుగా చూస్తారు. అప్పుడు మిరంతా "అవును బాబా" అంటారే కానీ,చేతల్లో నేనుచెప్పినట్లు చేయరు" అంటూ వివరిస్తుంటే నేను ఆశ్చర్యంతో "ఈలోతులను నీవెలా కొలవగలిగావో కదా!" అని అనుకున్నంతలో బాబా "నామార్గము కొలవశక్యం కానిది. ఒక్కొక్కప్పుడు నేనేవాటి పరిమాణమును తెలుసుకోలేను" అన్నారు.

ప్రియతమ బాబా, మెహెరా బాదులో వున్నపాశ్చాత్య బృందంలోని ప్రతిఒక్కరితో ఎంతసన్నిహితంగావున్నారో తెలిపేందుకు ఒకసద్గురువు ఎలా పనిచేస్తాడు అనే పుస్తకం నుండి లడ్ డిమ్ ఫిల్ యొక్క అనుభావాన్ని ఉదహరించదలచాను. బాబా తన ప్రేమికుల మనస్సులు హృదయాల్ని ఎరుగునని ఆయన ప్రేమికులు తెలుసుకోనేట్లు చేసే హాశ్య విధానాన్ని యీ సంఘటన తెలుపుతుంది.

మెహెరా బాదులోని స్త్రీల ఆశ్రమముయొక్క మొదటి ఆశ్రమాన్ని పడకటిల్లుగా మార్చ బడిందని అందులోనే పాశ్చాత్య పురుషులు ఉంటున్నారని, అవసరము వచ్చినప్పుడు పక్కల మధ్యఒకదుప్పటి వేసే వారని లడ్ విగ్‌డిమ్‌ఫిల్ చెప్పాడు. చావిట్లో తన పక్కకు అగ్ర భాగనవున్నపక్కను జోసెఫ్ హార్బ్‌కు కేటాయించారు.

తనసూట్‌కేసు నుండి ఏదైనా తెచ్చుకోవాల్సిన అవసరం వచ్చినప్పుడు, అసూట్‌కేసును తెచ్చి లడ్‌పక్క మీద ఉంచి తెరవటం జోసెఫ్‌కు అలవాటయింది తనపని పూర్తయ్యాక తిరిగి ఆపెట్టేను అక్కడి నుండి తీసేవాడు కాడు. దీనితో లడ్ విసిగిపోయి పైకి మెట్లెక్కి రాగానే ఒకసారి ఆ సూట్‌కేసును తనపక్కమీద నుంచి తీసి జోసెఫ్ పక్కమీద ఉంచి దానిలోని సరంజామను చిందర వందరగా గుమ్మరించాడు. సరిగ్గా అదే సమయంలో బాబా కారు వచ్చింది. ఎవరికి వారు హడావిడిగా క్రిందకు దిగిపోయి రోజువారీ సమావేశానికై హాల్లోకివచ్చారు. లడ్ మెల్లిగా క్రిందకు దిగుతున్నాడు. అయితే అదే సమయంలో తానుచేసిన పనికి విచారించ సాగాడు. బహుశః జోసెఫ్ సామాన్లను గిరవాటు వేసి చాలా తప్పు చేశానేమోనని పశ్చాత్తాప పడి మళ్లీ వెనక్కు వెళ్లి అతని సామానంతా సూట్‌కేసులో భద్రపరిచి అతని పక్క క్రింద ఉంచాడు. మరుక్షణంలోనే క్రిందకు దిగి హాల్లో ప్రవేశించేసరికి, బాబా, ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌తో తనఅక్షర ఫలకంపై అందిస్తున్న ఈ క్రింది సందేశాన్ని విన్నాడు :-

"చూడుఫ్రాన్సిస్, నీవు ఎవరి పైనైనా కోపంతో రెచ్చిపోతే వారి సూట్‌కేసులోని సామనంతా వారి పక్కపైన గిరవాటు వేయబోకు".

ఫ్రాన్సిస్‌కేమి అర్ధంకాక తన గురువువంక వెర్రిచూపు చూస్తూ "తప్పకుండా బాబా! అలా నేనెన్నడు చేయను" అన్నాడు. ఆక్షణంలో లడ్‌కు అంతకంటే ఎక్కువ మరేమీ అవసరము లేకపోయింది.

లడ్‌విగ్ ఇదే మాదిరి మరోముచ్చటైన కథను వివరించాడు.

గుమ్మానికి ఎదురుగా ఒక అసనంపై బాబాకూర్చోని ఉన్నారు. గోడల మధ్య వృత్తాకారంలో కుర్చీలు అమర్చారు. మేమంతా క్రింద కూర్చున్నాము. సిగరెట్లను, యాష్‌ట్రేలను మండలివారు నాలుగు వైపులా ఏర్పాటుచేశారు.

బాబా ఇలా చెప్పసాగారు "ఇప్పుడు నేను మీరంతా హాయిగా విశ్రమించాలని కోరుతున్నాను. మీరు మీ ఇంట్లో వున్నట్లే భావించాలన్నది నా ఆకాంక్ష. మీకు పొగత్రాగాలని ఉంటే హాయిగా సిగెరెట్లు త్రాగండి. ఒక వేళ దాహం వేస్తే అదిగో అక్కడ నీరున్నది."

కొద్ది సేపటి నుండి నేను సిగరెట్టు కాల్చాలని ప్రయత్నిస్తున్నాను. అయితే ఇప్పుడు సమయం చిక్కింది నాకు ఒక సిగిరెట్టు కావాలనుకున్నాను. కుషన్ కుర్చీపై నా చీల మండల మీద కూర్చున్నాను మెల్లగా 50 సిగరెట్లు పరిచినకుప్పలోంచిఒక సిగిరెట్టు తీసి ముట్టించాను.

నిజంగా బాబా నావైపు చూపిస్తూ "నాకు అది నచ్చింది నీవు చాలా సౌఖ్యంగా కనిపిస్తున్నావు" అన్నారు.

ఆసమావేశం రెండు గంటల పాటుజరిగింది. ఆపిమ్మట భోజన విరామములో బాబా వెళ్లిపోగా మేము భోజనానికి లేచాము.

భోజనాలయ్యాక నాదగ్గరకు మెహెర్జీవచ్చాడు. ఆయన ఎంతో ఆదుర్ధాగా ఉన్నట్లు కనిపించాడు "బాబానిన్ను పొగత్రాగమని చెప్పారని నాకు తెలుసును. కానీ నీవు అలా త్రాగి ఉండాల్సింది కాదు! బాబా పోగ త్రాగుటను ద్వేషిస్తారు. తన సమక్షంలో ఆయన మమ్మల్ని ఎన్నడూ త్రాగనివ్వలేదు" అని చెప్పాడు.

అది విన్న నేను తొట్రుపాటు పడ్డాను. అయితే ఆమర్నాడు ఏకాంత సమావేశాలకు కేటాయించారు. నేను బాబాతో 15 నిమిషాలు గడిపాను. (బాబా అక్షరఫలక సంకేతాలను ఎరుచ్ చదువుతున్నాడు) ఈ విషయంపై నేను బాబాను ప్రశ్నించాను :-

"బాబా, నీకు నిజంగా పొగ త్రాగటం ఇష్టం లేక పోతే,అది అంత ముఖ్యమేమీ కాదు. నేను ఆనందంగా పొగత్రాగటం మానేస్తాను" అనిచెప్పాను.

"పొగ త్రాగవద్దని నీకువెవరు చెప్పారు?"

"మెహెర్జీ"

"నేను చెప్పే మాటలకంటే మెహెర్జీ చెప్పేమాటలకు నీవు ఎందుకు ఆసక్తి చూపిస్తావు?"

నిజానికి అసలు ప్రశ్నకు ఇదే నిజమైన జవాబు. అయినా నేను భగవంతునితో మాట్లాడుతున్నానన్న విషయాన్ని ఇంకా గుర్తించలేదు. నా సమశ్యను పరిష్కరించే బదులు "నీకు పొగ త్రాగాలని ఉంటేత్రాగు" అని బాబా చెప్పినందుకు నేనుకొద్దిగా అసంతృప్తి చెందాను. అందుకని మరోసారి ప్రయత్నించాను.

"బాబా, మమ్మల్ని ఇంటివద్ద ఉన్నట్లు భావించు కోవాలని నీవు కోరుతున్నావని నాకు తెలుసును. అయితే అలా నేను ఇంటి వద్ద ఉన్నట్లు భావించుటకు ఎన్నెన్నో మార్గాలున్నాయి. నేను పొగ త్రాగటము నిన్ను ఇబ్బంది పెడితే నేను ఖచ్చితంగా పొగ త్రాగటాన్ని మానివేస్తాను.'

బాబా ఎరుచ్ వైపు చూచారు.

ఎరుచ్ బాబా వైపు చూచాడు.

వారిరువురు నవ్వుల్లో కరిగిపోయారు.

బహుశ లడ్ ఉద్దేశ్యంలో అతన్ని పొగత్రాగ వద్దని బాబా ఆదేశించాలని కోరుకున్నాడు. కనుక తనకు తాను ఒకనిర్ణయానికి రాలేకపోయాడు. కేవలం అలా భావించటం సహజం కూడా కానీ, చాలా వరకు అటువంటి నిర్ణయాలని మనకు మనమే తీసుకొనటాన్నే బాబా ఎంచుకుంటారు. ఈపై సంఘటనలు బాబా భౌతిక సమక్షంలో జరిగాయి.ఈనాడు కూడా,అనేక ఆసక్తి కరమైన అనుభవాలు మెహెర్ బాబాను ప్రేమించే వారికి సంభవిస్తునే వున్నయి.

వాటివల్ల వారు ఎటువంటి షరతులులేని బాబా ప్రేమ కరుణలు ఆయన హాశ్యముతో కలపోసుకోని అనుభవిస్తున్నారు. బాబా యొక్క సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వములకు చెందిన ఇటువంటి ఘట్టాలు ఆయన ప్రేమికుల హృదయాలకు హత్తుకుపోయి,మరువలేని అనేక మార్గాలద్వారా హాశ్యము, మహనీయము, సరళము, సంకీర్ణములు ద్వారా వారినిత్య జీవితాల్లో తాను సహాయ పడతానని వారికి అభయమిస్తున్నారు. మనము ఆయన్ని మన నిత్య సహచరునిగా చేసుకున్నప్పుడు బాబాసహవాస్ ఎప్పుడూ సదాలభిస్తూనే ఉన్నది.

ఒక పర్యాయం బాబా తన ప్రేమకులకు "నన్ను గుర్తు పెట్టుకోండి నేను ఎప్పుడూ మీతోనే ఉన్నాను" అంటూ ప్రేమతో తెలిపారు.

# మెహెరాబాదులో "అంతిమ ప్రకటన" సమావేశము
# 1954 - 18వ భాగము

## వానల్ని ఆపి విడుదల చేశారు

భగవంతుడు అవతారుడిగా ఒక మానవ రూపాన్ని ధరించిన ప్రతిసారి, ఆయన జీవితము యొక్క విశ్వాత్మక స్థితి (సర్వమునకు చెందుట) తన ప్రేమ యొక్క లెక్కలేనన్ని ముఖాల్ని సమర్పిస్తుంది. ఆయన చేసే కొన్ని చర్యలు పూర్తిగా మానవ సంబంధమైనవి కాగా మరికొన్ని పూర్తిగా దైవసంబంధమైనవై ఉంటాయి. ఈ రెండు దశలూ ప్రజల హృదయాలను హత్తుకొన్నా కొందరిని మాత్రం దైవం కొరకు జీవించేట్లు దైవం కొరకు మరణించేట్లు మేల్కొలుపుతాయి. అయితే బ్రహ్మాండమైన భేదాన్ని చూపేకొన్ని చిన్న ముఖాలు కూడా ఉన్నాయి. అందువల్ల అవి అసంబద్ధంగా కనిపిస్తాయి. చాలావరకు మానవాళిని దిగ్భ్రమతో కలవరపెడుతూ వీటి కొనసాగింపు జరుగుతుంది. సెప్టెంబరులో, మెహెరాబాదులో జరిగిన సమావేశంలో అందించిన "అంతిమ ప్రకటన" అనే మెహెర్ బాబా సందేశంలోని కొన్ని భాగాలు, తెలిసుకొనేందుకు శక్యం కాని వర్గంలో ఉన్నట్లు పరిగణించవచ్చును. అయితే ఈ "అంతిమ ప్రకటన సమావేశము" విషయంలో జరిగిన అనేక సంఘటనలను మీకు వివరించబోయే ముందు దాని వెనక జరిగిన విషయాన్ని కొంత చెప్పవలసిన అవసరము ఉంది. 10 జూన్ 1954న భారత దేశంలోని మెహెర్ బాబా అనుచరులందరికీ 1954 సెప్టెంబరు 29, 30 తేదీలలో మెహెరాబాదులో మెహెర్ బాబా జరుప తలపెట్టిన ప్రత్యేక సమావేశానికి హాజరు కమ్మనమని ఒక సర్క్యులరు పోష్టు చేయబడింది. ఈ సమావేశం కేవలం పురుషులకు మాత్రమే ఉద్దేశించబడింది. స్త్రీలు, 16 ఏళ్లలోపు బాలురు హాజరగుటకు అనుమతించ లేదు. బాబా తన భౌతిక శరీరాన్ని పరిత్యజించబోయే ముందు జరిగే ఆఖరి సహవాసు ఈ మీటింగేనని కూడా అందులో తెలియపరచారు. ఈ సమావేశంలో పాల్గొనదలచిన వారెవరైనా సరే దక్షిణగా రూ. 22-00లు మెహెర్‌బాబా కార్యదర్శి ఆది.కె. ఇరానీ పేర అడ్వాన్స్‌గా పంపాలని తెలిపారు. సమావేశం కాలములో యీ పైకాన్ని భోజన వసతుల ఏర్పాట్లుకు వినియోగించుటకు నిర్దేశించారు.

ఇటీవల బాబా జరిపిన హమీర్‌పూర్, ఆంధ్రా పర్యటన కారణంగా చాలామంది బాబా ప్రేమికులు యీ సమావేశానికి హాజరు కావాలనుకున్నారు. అనేక మంది బాబా అనుచరులు ఉద్యోగ వర్గాలు కాగా కొద్దిమంది రైతులు, గ్రామస్థులు కూడా ఉన్నారు. ఆ రోజుల్లో, తమ ఉద్యోగం నుండి వారం రోజుల శలవు దొరకటం, లేదా అంతదూర ప్రయాణానికయ్యే ఖర్చుకు ఆర్థిక వనరులు సమకూర్చుకోవటమంటే అంత సులభమైన విషయం కాదు.

ఆ సర్క్యులరులోని విషయాలు తెలుసుకున్న తర్వాత బాబా అనుచరులైన కొందరు స్త్రీలు, ఈ సమావేశానికి పురుషులు మాత్రమే రావాలన్న షరతు ఎందుకు విధించారని ఆశ్చర్యపోయారు. ఇదే ఆఖరి సహవాసమైనప్పుడు, ఇక్కడ స్త్రీ, పురుష బేధం ఎందుకు ఉండాలి ? ఏమైనప్పటికీ వారంతా చివరకు, అదంతా తన స్వీయ దైవకారణ రీత్యానే బాబా నిర్ణయిస్తారని సరిపుచ్చుకున్నారు. అందుకని కొందరు స్త్రీలు తమ నగలు అమ్మి ఆ డబ్బును తమ కుటుంబంలోని పురుష సభ్యులకు, బంధువులకు ఇచ్చి వారిని పంపటం ద్వారా ఆ సమావేశంలో తామూ పరోక్షంగా పాల్గొనాలని ఎంచుకున్నారు.

పేద ప్రాంతమైన హమీర్‌పూర్ జిల్లాలోని బాబా ప్రేమికుల మనసుల్లో, హృదయాల్లో, తమ బ్రతుకుల్లో ఎదురయ్యే ఆర్థిక సంబంధము, భక్తి సంబంధములను సమతూక పరిచే యత్నంలో పెనుగులాడుతున్నారు. ఈ పెనుగాలాటను గమనించిన కేశవ నారాయణ నిగమ్‌కు ఆసంవంత్సరము మొదట్లో జనవరి 26న మెహెర్ బాబా అందించిన ఒక సందేశం గుర్తుకు వచ్చింది.ఈ సందేశములో వివరించబడిన ప్రేమికులుఎదుర్కొబోయే కష్టావస్థలు ఆయనకిప్పుడు అర్థంపట్టింది.

"సత్యము నిన్ను తన వైపు గుంజుతుంది.
మాయకూడా నిన్ను తన వైపు లాగుతుంది.
నీవు కనుక సత్యము యొక్క గుంజాటనను వదిలావో
నీవు మాయా సాగరంలో మునిగిపోతావు
ఒక వేళ రెంటి వైపు ఒరిగావో నీవునలిగిపోతావు
కనుక ప్రేమ ద్వారా మాయ గుంజాటనను వదిలించుకో
ఆ సత్యముతో సమైక్యమైపో"

భారత దేశంలోనివివిధ రాష్ట్రాల్లో ఉన్న బాబా అనుచరులు ఆయన పిలుపుకు తగు రీతిలోప్రత్యుత్తర మిచ్చారు.షుమారుతొమ్మిది వందల మంది పురుషులు సమావేశానికి వస్తున్నట్లు తమఅంగీకార పత్రాలను పూరించి పంపారు. ఒక్క హమీర్ పూర్ ప్రాంతంనుండే 250మంది ప్రేమికులు రావాలని నిర్ణయించుకున్నారు.

మెహెరాబాదులో సెప్టెంబరులో జరుగనున్న ఈబ్రహ్మాండమైన సమావేశం కొరకు ఏర్పాట్లు మొదలయ్యాయి. అనేక పనులను పెండు, పాద్రీలు ఆధ్వర్యంలో పర్యవేక్షింప బడుతున్నయి. అది వానాకాలమైనందున జూలై ఆగష్టు నెలలు చాల చెమ్మగా ఉంటుంది.సెప్టెంబరుమొదటి వారంలో 6వతేదీన బాబా తన మండలితోసతారానుండి బయలు దేరి మెహెరాజాదు వచ్చారు. ఆమర్నాడు, ఆ నెలాఖరుకు రానున్న తన అనుచరుల కొరకు చేస్తున్నఏర్పాట్లను స్వయంగా పరిశీలించుటకు బాబా మెహెరాబాదు సందర్శించారు.

సమావేశ వేదిక,వసతికై గుడారాలు,పాయఖానాలు స్నానపు గదులు, భోజనశాల వంటి నిర్మాణపు పనులు పూర్తి చేయుటకు వానలు ఆటంక పరుస్తున్నాయని బాబా దృష్టికి పెండూ తీసుకువచ్చాడు. సెప్టెంబరు 29, 30 తేదీలలో జరిగే రెండు రోజుల సమావేశానికి షుమారు వెయ్యిమంది భారతీయ బాబా ప్రేమికులు వస్తారని అంచనా. ఈవిధంగా వర్షం ఆగకుండా కురవటం కొనసాగితే ప్రత్యేకించి సమావేశ సమయంలో వాన కురిస్తే వసతి డేరా యొక్క గుడ్డకప్పుద్వారా వాన నీరు కారుతుందని పెండూ తన మనోగతాన్ని గట్టిగా వ్యక్తపరిచాడు. అలా జరిగితే యాత్రికులకు గొప్ప అసౌకర్యం కలుగుతుంది కనుక వాళ్లను మనం అప్పుడు ఎక్కడకు మార్చగలము? అనిప్రశ్నించాడు. అతడు ఎటువంటి తెగింపును తీసుకొనుటకు సిద్ధపడలేదు. కనుక వసతి డేరాను గుడ్డషామియానాతో కాకుండా డోరియా రేకులతోకప్పితే బాగుంటుందని సలహా చెప్పాడు. ఈ గుడారము మరియు సభావేదికల నిర్మాణస్థళము, ప్రస్తుతము ఉన్న ప్రధాన రహదారి, రైలు గేటున్న రైలు రోడ్డులకు మధ్య నిర్దేశించబడింది.

పెండూ ప్రతి పాదించినసలహా ప్రకారం కేటాయించిన బడ్జెట్టు కంటే అధికంగా ఖర్చు పెట్టాల్సి వున్నందున, బాబా అతనికి కేటాయించిన మొత్తంతో ఇంత ఖర్చును పెట్టే అవకాశం అతనికి లేదు కొందరు మండలి సభ్యులు పెండూ ప్రతి పాదనను వ్యతి రేకించారు. అయినా అతను అతి కఠినంగా మారాడు

పెండూ ఒక ప్రేమింపతగిన వ్యక్తే, కానీ ధృఢ సంకల్పం కలవ్యక్తి. ఇటువంటి విషయాల్లో జరిగిన గత అనుభవమును పరిజ్ఞానాన్ని పరిగణించి,బాబా అదనపు ధనాన్ని మంజూరు చేసేసరకి పెండూ కళ్లు సంతోషంతో వెలిగిపోయాయి.

అయినప్పటికి బాబా, పెండూనూ, మెహెరాబాదులో ఉంటున్న వారందరినీ, "వర్షాలు కురిపించవద్దు" అని మనః పుర్వకంగా దైవాన్ని ప్రార్థించమని బాబా చెప్పారు. క్రింది మెహెరా బాదులోని మండలి హాలులో వారంతా బాబా ఫొటో ముందు నిలబడి సెప్టెంబరు 26నుంచి ప్రతి రోజూ బాబా చెప్పినట్లు భగవంతుడిని వేడుకున్నారు. మొదటి రోజున బాబా స్వయంగా "వానలు కురిపించవద్దు" అని దైవాన్ని ప్రార్థిస్తున్న బృందంతో కలిసి పాల్గొన్నారు. ఈ సంక్షిప్త ప్రార్థన చివర్లో,బాబా తన పెదాలపై చిరునవ్వులుచిందిస్తూ, "మీ ప్రార్థనులను భగవంతుడు వినుగాక" అని పెండూ పాద్రిలకు సూచించారు.

భారతీయ రీతిలో తయారైన వెయ్యినులక మంచాల్ని అద్దెకు తీసుకు వచ్చుటకు కూడా పెండూను అనుమతించారు. సువిశాలమైన వసతి డేరాలో యీ వందలాది మంచాల్ని పరిచారు. తొమ్మిది వందలకు పైగా యాత్రికులు తిరుగుటకు వీలుగా బారాటి నడవాలు మంచాల మధ్య ఉండేట్లు వాటిని వాల్చారు. అప్పుడది ఒక బ్రహ్మాండమైన పడకటిల్లుగా కనిపించింది.

బాబా ఎప్పుడు సమావేశానికి పిలిచినా, విధులను కేటాయించటంలో ఆయన ప్రత్యేక వైనంతో వివరిస్తారు. తాను కేటాయించిన ఆదేశాలు చివరిఅంశం వరకూ ఖచ్చితంగా అమలవుతున్నాయా లేదా అని బాబా స్వయంగా ఆయా విషయాల్ని పర్యవేక్షిస్తారు. దర్శన కార్యక్రమానికి లేదా సహవాస్‌కు హాజరై తనను సందర్శించేతన ప్రేమికులకుచాలినన్ని సౌకర్యాలను కల్పించుటలో ఆయనొక అనుగ్రహశాలియైన ఆతిథేయదాత. అయితే బాబా కొరకు పనిచేయటం, ఎప్పుడూ అంత సులభం కాదు. బాబా కొరకు పని చేసేవారు అకశ్మికంగా ఎదురుయ్యే కష్టాలు నిర్దేశిత పథకంలో మార్పులు, తేదీలు జాగాల్లో సైతం వచ్చే మార్పులను ఎదుర్కొనుటకు సిద్ధంగా ఉండాలి. అయన ప్రేమికులు కొంచమైనా దాచకుండా నిష్కపటమైన విశ్వాసంతో ఆయన ఇచ్చను అంగీకరించి పాటించేట్లు చేసి, అపని తమ స్వీయ యోజనాల్ని తుడిచివేసే ఆధ్యాత్మిక సాహసంగా, దైవ ఘటనగా తీసుకోగలిగేట్లు సహాయపడుతుంది. అటువంటి అంగీకారమువల్ల వారి జీవితాలు,ఆలోచనలు, భావాలు "ఆయనపని" గామారి. ఆయన కోసం పనిచేయుటకు పాటుపడేట్లు చేస్తుంది.

అదేమి మహత్మ్యమో! సెప్టెంబరు 8నుండి 27వరకు అసలు వానేకురవలేదు వాతావరణమునిర్మలంగా ఎంతో ఆహ్లాదంగా ఉన్నది. సర్వార్పణ అయిన కార్యకర్తల బృందంతో పెండూతాత్కాలిక కట్టడవు నిర్మాణపనులను పూర్తి చేయకలిగాడు. 26న ప్రార్ధనలుచేయటం పూర్తయింది.ఏమి దివ్య పరిహాసము! ఒకరోజు గడిచేంతలో వర్షాలు ప్రారంభమయ్యాయి. ఆ సాయంత్రం కుంభ వృష్టి కురిసింది.

ఆంధ్రా నుండి, హమీర్‌పూర్ నుండి వచ్చిన బాబా ప్రేమికులు ప్రత్యేకంగా రైలు భోగీలు రిజర్వు చేయించుకొని వచ్చారు. రైల్లో బాబా దివ్యనామాన్ని జయజయ ధ్వానాలతో మార్మోగించారు. అవతార్ మెహెర్‌బాబా ఘనవైభవాన్ని కీర్తిస్తూబాబా దైవత్వము పై పాటలు పాడుతూ భజనలు చేశారు. కొంత మంది ఈ అవకాశాన్ని వినియోగించుకొని ఆసక్తిపరులకు బాబా సాహిత్యాన్ని పంచిపెట్టారు.

28 సెప్టెంబరు సాయంత్రం 4-00గంటలకుఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాల్, ఆంధ్రా తదితర రాష్ట్రాల నుండి బాబా ప్రేమిక బృందాలు అహమ్మదునగరు రైల్వే స్టేషనుకు చేరుకున్నారు. వర్షంకురుస్తున్నా, ప్రతి వారు సంతోషంగా కనిపించారు. బాబా ప్రేమలో వారు ఒకరికొకరు పరస్పర అభినందనలు తెలుపుకున్నారు. భిన్న భాషలు మాట్లాడే వారైనప్పటికి, వారి హృదయాల్లో అద్భుతమైన పునరైక్యత వ్యక్తమైంది. కులము, వర్ణము,సాంఘిక స్థితుల భేదాల్ని బాబా ప్రేమ తుడిచి వేసింది. వారంతా మెహెరాబాదు చేరాలన్న ఆతురతలో ఉన్నారు. అయితే అప్పుడు ఇంకా కుంభ వర్షం కురుస్తూనే ఉంది. యాత్రీకులను, వారి సామాన్లను చేరవేయటం కష్టమైంది. క్రింది మెహెరాబాదులో ఎటుచూచినా బురద నీటి గుంటలతో నిండి పోయింది. మట్టిరోడ్లు, వేరు వేరు టెంటులను చేరుటకు అప్పటి కప్పుడు వేసిన కాలిబాటలు వంటి సౌకర్యాలన్నీ వానలో నానిపోయి బురద మయమయ్యాయి.

ఈ అధ్వాన్న స్థితిని మెరుగు పరచుట పెండూకు అసాధ్యమైంది. పెండూకు ఉపయోగించిన కొన్ని కఱ్ర బాజు కూలిపోయాయి. వసతి డేరా పైకప్పు నుంచి వర్షపు నీరు వేగంగా కారుతూ చొచ్చుకువచ్చి మంచముల క్రింద చెరువులా తయారైంది. చలి గాలులు తీవ్రమయ్యాయి కొండపైన పాశ్చాత్యులు ఉంటున్న హాలు యొక్కవాయువ్య భాగపు గోడ నెట్టుకొట్టడంతో వర్షపు నీరు పడకిటింటిలోకి చొరబడి భోజనశాలను కూడా జలమయం చేసింది 28వ తేదీ

సాయంత్రం వందలాది మంది యాత్రీకులు మెహెరాబాదు వెళ్లాలన్న అతురతతో అహ్మదనగదు రైల్వే స్టేషను ప్లాటుఫారంపై కాచుకొని ఉన్నారు. ఆ రోజుల్లో,అహ్మదునగరు రైలుస్టేషనులోని ప్లాటుఫారంపై ఉన్నపైకప్పు చాలా చిన్నదిగా ఉండేది. కొంతమంది ఒళ్లంతా వానలో తడిసి నానిపోయినా, వారి హృదయాలు మాత్రంబాబా ప్రేమలో తడిసిపోయాయి. వారిలో చాలా మందికి మెహెరాబాదు రావటం ఇదే మొదటిసారి. మరి యీ తోలి సందర్శనలో వారికి కలిగిన విస్మయము, రమణీయత గాంభీరత వంటివి యీనాటికి కూడా అనుభవమౌతునే ఉంది.

బస్సులు, లారీలను అంతకు ముందే ఏర్పాటు చేయుట వల్ల వాటి సహాయంతో ప్రతివారు సాయంత్రము అయ్యే సరికి క్షేమంగా తమ సామాన్లతో మెహెరాబాదు చేరుకున్నారు. ఇంకా వాన కురుస్తూనే ఉన్నది. అంతా బురదమయం.... అయితేమటుకు లెక్క చేసేది ఎవరు!

వారంతా రాగానే,ప్రతివారి కొరకు చేసిన సౌకర్యాలను వివరించి, వర్షం వల్ల కలిగిన అసౌకర్యం గురించి కూడా తెలియ పరచారు. ఏర్పాట్లు విషయంలో ఎవరూ పిర్యాదులేమి చేయలేదు. నిజానికి, సోదర భావం స్నేహ పూర్వక సహకారము యాత్రికుల మధ్య మెహెరాబాదులో పనిచేస్తున్న వాలంటీర్ల మధ్య నెలకొన్నది. వారంతా ఒక విధమైన సాన్నిహిత్యాన్ని బాబా ప్రేమ పాశం వల్ల అనుభవించారు. వర్షంపడుతూ గాలులు వీస్తున్నా, విధ్యుత్ సరఫరాకు అంతరాయం కలగకుండా చక్కగా పనిచేశాయి.దీనివల్ల యాత్రీకులు క్రింది మెహెరాబాదులో కదిలికలను సుళువయ్యేట్లు చేసి ఒక కృపను మిగిల్చింది. లేకపోతే పరిస్థితి విపత్కరంగా తయారయ్యేది!

ప్రతి వ్యక్తికి వారు రాగానే మీటింగులో పాల్గొనేందుకు ప్రవేశ టోకెను ఇవ్వబడింది. అలాగే ప్రతి వారికి "మతము యొక్క సత్యము" "మెహెర్ బాబా పిలుపు" అనే రెండు చిన్న పుస్తకాలు కూడా అందివ్వబడినవి. అటువంటి అనుకూల వాతావరణంలోతన ప్రేమికుల ఆరోగ్యం దెబ్బతిన కుండా వారియందు బాబాకు ఉన్న ప్రేమను పురస్కరించుకొని భోజనాలయ్యాక ప్రతివారికి రెండేసి అనాశిన్ బిళ్లలు ఇవ్వమని ఆయన ఆదేశాలు పంపారు. అనారోగ్యానికి గురైన కొందరికి తక్షణ వైద్య సహాయాన్నందించారు.

ప్రియతమ ప్రభువు మెహెర్ బాబా భౌతిక సమక్షంలో ఒకే కప్పు క్రింద

మెహెరాబాదులో 900మందికి పైగా ప్రేమికులు ఉండి పాల్గొన్న ఏకైక సహవాస్ ఇదే. ఆనాటి రాత్రి, ప్రయాణబడలిక వర్షం వున్నప్పటికీ, కొందరు పురుషులు "మెహెర్ బాబా పిలుపు" అన్న పుస్తకాన్ని శ్రద్ధగా చదివారు. అందలి బాబా ప్రకటనలువారి హృదయాల్ని హత్తుకున్నాయి. అవతారుని వీక్షిస్తున్నట్లు, ఆయన అంతర్ ప్రేరణ వల్లే, ఆయన పిలుపును లక్ష్యపెట్టేటట్లు ప్రత్యేకంగా ఈ మీటింగుకు హజరుయ్యేట్లు తమ తపనను తీర్చింది. సెప్టెంబరు నెల వానల సమయం దృష్ట్యా, అంతకు ముందు వానలుకురిపించవద్దని ప్రార్థనలు చేయమని బాబా ఇచ్చిన బాబా ఆదేశాలను ఇప్పుడు కుండ పోతగా కురుస్తున్న వర్షాలను గమనిస్తే, నాకు ఇలా అనిపించింది. బాబా ప్రేక్షకుడిగా వానల్ని అపి,మళ్లీ ప్రకృతి శక్తులను తన ఆధ్యాత్మిక కార్య క్రమం ప్రకారం విడుదల చేశారనిపించింది. బహుశః ఆయన యీపారిభాషిక పద్ధతిని తన ప్రేమికుల మనస్సులు హృదయాలతో ఉన్న తన సంబంధంరీత్యా ఉపయోగించి, కొన్నిసార్లు వానలు లేకుండా చేసి, ఇతర సమయాల్లో, తన సమక్షంలో తడిపి వేయటం చూస్తే ఇదంతా తన ప్రేమ కరుణల ఆటలో ఒక భాగమనిపిస్తుంది.

## తేజోమయుడైన ఏకైకుడిని అభినందించుటకు తయారు చేయుట

సెప్టెంబరు 29ప్రాతః కాలము తుఫాను గాలితో చాలా చలిగా ఉన్నది. అయినా అక్కడ సమావేశమైన వారికి నిజానికి వారంతా మెహెరాబాదులో ఉన్నా, దానినే వారు ఈ యుగానికి జరూశలంగా, మక్కాగా, లేదా కాశీగా భావించినందు వల్ల వారి హృదయాల్ని పరవశింప చేసి మనసుల్లో స్థిరంగా నిలిచిపోయింది. ప్రేమ ఆరోగ్య చట్టాన్ని, ఆత్మతత్వాన్ని అతిశయింప చేస్తుంది. మర్నాడు ఉదయాన్నే నాలుగు గంటలకు చాలామంది పురుషులు లేచి తిరగసాగారు. వాతావరణంలో హఠాత్తుగా జరిగిన మార్పువల్ల, ఉష్ణోగ్రత పడిపోయి, కొందరు వృద్ధుల దంతాలు అదరసాగాయి. కొందరు యువకులు సైతము స్నానాలకు వెళుతూ బురదదారుల్లో తూకంతప్పి జారిపడటం జరిగింది. అయితే అదంతా వారికి వినోదమనిపించింది.



12.

## మెహెరాబాదులో అంతిమ ప్రకటన సమావేశం

మెహెరాబాదు మేనేజిమెంటు వారు మెహెర్‌బాబాను కలువబోయే ముందు స్నానాలు చేయాలనుకున్న వందలాది మందికి వేన్నీళ్ళు సిద్ధం చేశారు. హిందూ సాంప్రదాయం ప్రకారం యీ ఏర్పాటు జరిగింది. అదృష్టవశాత్తు, ఉదయం 5-00గంటలకు వర్షం పూర్తిగా ఆగిపోయింది. గాలుల తీవ్రతకూడ తగ్గింది భోజన శాలలో బిస్కట్లు, వేడి టీని తీసుకొని అలసట తీర్చుకున్న పిదప ప్రతివారు బాబాకు స్వాగతం చేప్పేందుకు ఆతురతగా ఎదురు చూచారు. వారంతా బాబాను ఎంతగానో ప్రేమించారు. వారు మెహెరా బాదు వచ్చినప్పటి నుండి, బాబా కూడా వారిని ఒక ప్రత్యేక మార్గంలో ప్రేమిస్తున్నారని భావించారు.

బాబా అనుకున్న దానికంటే కాస్త ముందుగానే వచ్చారు. ఆయన కారు మెహెరాబాదు మండలి హాలు ముందు ఆగింది. సున్నితమైన భావాలు, బాధలతో ఉన్న పెండూకు ఒక మాట చెప్పబోయేముందు బాబా అతడ్ని అలింగనం చేసుకున్నారు. బాబా ఒక చిన్న కుర్చీపై కూర్చొనగానే ఆంధ్రా నుంచి వచ్చినడా॥ కనకదిండి సూర్యనారాయణను పిలిపించి, తన నాడిని పరీక్షించమన్నారు. ఆ డాక్టరు బాబా చేతిని పట్టుకొని, నవ్వుతూ "బాబా ! ఇది నిజంగా చాలా బాగా ఉన్నది !" అని చెప్పాడు. బాబా సంతోషంగా కనిపించి ఉపశమనం చెందారు. బహుశః మీటింగు సమయంలో జరిగే ప్రతి కార్యక్రమం బాగా జరిగిపోతుంద నటానికిది సంకేతంగా బాబా సూచించారని పించింది.

పిమ్మట బాబా వంట ఇంటిని భోజనశాలను సందర్శించారు. ఇవి పాత ఆశ్రమ భవనమునకు దగ్గర్లో ఏర్పాటు చేయబడినవి. మండలిలో ఒకరైన చగ్గన్ వంట అజమాయిషీలో ఉన్నాడు. తన ప్రేమికులకు టీ, స్వీట్సుతో కూడిన చక్కని ఉపాహారము ఇచ్చినందుకు బాబా తన సంతృప్తిని వ్యక్తం చేశారు. ఇప్పుడాయన తిన్నగా మీటింగు పెండాల వద్దకు వెళ్లదలచారు.

బాబా నడవటం మొదలు పెట్టగానే ఆయన చెప్పులు బురదలో కూరుకుపోయాయి. అందువల్ల బాబా వాటిని వదిలేసి చెప్పులు లేకుండానే గబగబా మీటింగు జరిగే పెండాలవైపు వేగంగా నడక సాగించారు. కొందరు బాబా ప్రేమికులు ఆయన అడుగు జాడలను మనఃపూర్వకంగా కళ్లారా చూచారు. ఈ స్వల్ప చర్య ద్వారా యాత్రీకులు ఎదుర్కొంటున్న అసౌకర్యాల్లో తానూ పాల్గొన్నట్లయింది.

ఈ సంఘటన పైకి గమనించ తగినదిగా కనిపంచక పోయినా, డెహెరాడూన్

నుండి వచ్చిన ఒక యువకుడి పై అమోఘమైన ప్రయోజనాన్ని కలిగించింది. ఇతడు వచ్చిన యాత్రీకులందరిలో చిన్నవాడు. అతని వయస్సు కేవలం 16 ఏళ్లు. అంతక్రితం సాయత్రం అతడు వచ్చీరాగానే బురద దారులను చూచి అసహ్యించుకున్నాడు. ఒకచోట అతడి పాదాలు బురదలో కూరుకుపోయే సరికి "మేము నడిచేటప్పుడు యీ బురద వల్ల మాకు కలిగే అసౌకర్యం బాబాకు ఏం తెలుస్తుంది ? హాయిగా చెప్పులు వేసుకొని ఆయన కారులో వస్తారు" అని మనసులో అనుకున్నాడు.

బాబా భోజనశాలనుసందర్శించినప్పుడు ఈ బాలుడువంట ఇంటి దగ్గర ఉన్నాడు.అతడు బాబానుచూడగానే తానుక్రితం సాయంతత్రం ఆయన గురించి మనసులోఅనుకున్న ఆలోచన గుర్తోచ్చింది. సరిగా అదే సమయంలో బాబా చెప్పులు బురదలోకూరుకుపోవటం జరిగింది. వెంటనే బాబా వాటిని అక్కడేవదిలి పెట్టి వట్టి కాళ్లతోనడిచి పోవటాన్ని గమనించాడు. వెంటనే అతడుతనలో కలిగిన తప్పుడు భావలకు విచారించాడు. ఆతర్వాత బాబా ముందు దుఃఖిస్తూ తాను చేసినతప్పును అంగీకరించి క్షమాపణ కోరాడు. అవతారుడి ప్రేమ పరిధిలోకి వచ్చినవారు తమ అనుమానాలు, వ్యాకులములకు ఆయన బాహ్య చర్యలులేదా యాదృచ్ఛికమైన వ్యాఖ్యానాల ద్వారా భావగర్భితమైన ప్రత్యుత్తరములను సకాలంలో అందుకుంటారు. ఇటువంటివి అనేక సంఘటనలు ఉన్నాయి కానీ ఇక్కడ వాటన్నిటినీ జ్ఞాపకం చేసుకోనుట సాధ్య పడదు.

ఎనిమిది గంటలు దాటాక బాబా పెండాల వద్దకు చేరుకున్నారు. కొంతమంది పనివారు.తుపాను గాలుల తాకిడికి కూలి పోయిన బాజులను నిలబెట్టి ఇంకా పునరుద్ధరించేప్రయత్నం చేస్తున్నారు. సమావేశ పెండాల దగ్గరలోనికి ప్రవేశించబోయేముందు తమ బుదర కాళ్లను శుభ్రపరుచు కొనుటకు తగిన ఏర్పాట్లు చేశారు. బాబా తన కాళ్లను కడుగుకున్నారు. అయినా వట్టికాళ్లతోనే చెప్పులు లేకుండా తన ప్రేమికుల మధ్య కొద్దిసేపు నిరాటంకంగా తిరిగారు. తొలినాడు కుర్చీలు ఏర్పాటు చేయలేదు. కార్పెట్లు పరచేందుకు కూడా

సాధ్యపడ లేదు. తన ప్రేమికులు మౌనంగా ఆయన్ని చిన్న చిన్న గుంపులుగా నిలబడి కన్నులారాచూస్తూ వుంటే బాబా ఆయిదారు సార్లు పెండాలలో అటూ ఇటూ తిరిగారు.

అప్పుడు తేజోమయుడైన బాబా ఎంతో సొగసుగా కొంచం ఎత్తుగా నిర్మించిన వేదిక వద్దకు చేరుకున్నారు. తన కోటుకు మీటింగు టోకెన్‌ను తగిలించు కున్నారు. సమావేశానికి రాబోయే ముందే దానినాయన ధరించారు. దాని వంక చూపుతు బాబా తనకు దక్షిణగా ఇరువది రెండు రూపాయలు ఇస్తున్న తొలివ్యక్తిని తానేనని చిరునవ్వు చిందిస్తూ సౌంజ్ఞలు చేశారు. బాబా దేదీప్య మానమైన తేజస్సుతో వెలిగిపోతూ కనిపించారు. ఆయన దివ్య రూపం నుండి ఉద్భవిస్తున్న దివ్య తేజస్సు ప్రతివారి హృదయాన్ని హత్తుకున్నట్లు కనిపించింది. ఆయన తన సాధారణమైన తెల్లలాగు, బారాటి ముస్లిం సద్రా ధరించి వాటిపైన పసుపు రంగు సిల్కు కోటు తొడుక్కున్నారు. ఆయన కన్నులు వెలుతురు మధ్య నిశ్చలంగా కనిపిస్తున్నాయి. ఒక్కోసారి కండ్లు మిరు మిట్లు కొలుపుతూ, ఒక్కోసారి ఉపశ మింపచేస్తూ, వాటిలో శాశ్వతత్వము వ్యక్తమైంది. తన ఆసనముపై బాబా ఆశీసులయ్యారు. మౌనంగా ఆయన చెప్పేశైలి తన ప్రేమికుల మనోగతాలు తనకు తెలుసునన్న అభయాన్ని తన ప్రేమికులకు ఇచ్చినట్లయింది.

ఇప్పుడు ఆయన అక్కడ సమావేశమైన తన ప్రేమికులను ఉద్దేశించి మాట్లాడాలను కున్నారు. బాబామాటలు ఎక్కువగా అక్షర ఫలకంపై ఆంగ్లంలోనే (మద్య మధ్య హిందీలోను గుజరాతీలోను) అందించబడినవి. అక్కడక్కడా సరళమైన సామాన్య సౌంజ్ఞలతో తెలియచేయబడినవి. మంచిమైకులు ఏర్పాటు చేయటం వల్లమాటలు స్పష్టంగా వినిపించాయి. బాబా అందించే ప్రకటనలను హాజరైన వారి అన్ని ప్రధాన భాషల్లో తర్జుమాచేసి చెప్పటం జరిగింది. అలా ఈ అతిముఖ్యమైన సమావేశపు గొప్పతనాన్ని తెలియచేసే గంభీర సందర్భం అప్పటికప్పుడు మొదలైంది.

## అవును నేను పురాణ పురుషుడను

మీటింగు మొదలు కాగానే, సభను ఉద్దేశించి ప్రసంగిస్తూ ఎరుచ్, ఉదయ కార్యక్రమంలో మూడు ముఖ్య విషయాలున్నాయని ప్రకటించారు. 1) ఈ సమావేశానికి వచ్చిన వారందరిని బాబా ఆలింగనం చేసుకుంటారు. 2) దైవాన్ని కీర్తిస్తూ ప్రార్ధనలు నివేదన, 3) పశ్చాత్తాప ప్రార్ధనలోబాబా స్వయంగా పాల్గొనుట. భోజనాలయ్యాక చిన్న చిన్న బాబా గ్రూపులను విడివిడిగా కలుసుకొనుటకు కూడా బాబా అనుమతించారు. ప్రతివారు బాబా వైపు యీ ప్రకటనలు చేస్తున్నంత సేపు ఆరాధనగా రెప్పలార్పకుండా తేరిపార చూడ సాగారు, కొందరైతే సాక్షాత్తు పతితపావనమైన శాశ్వతత్వము తమ ముందే తెరవ బడినట్లు అనుభూతి పొందారు.

"నేను నాప్రేమికులైన మిమ్మలనందరిని అత్యంత ముఖ్యమైన ఈ సమావేశానికి రమ్మని పిలిచాను. సామాన్య భావంతో "సమావేశము" అంటేప్రజలను సమావేశ పరచటం కానీ యీ సమావేశం అటువంటిది కాదు. సమావేశమవటం వలన.నేనుస్వయంగా మీలోప్రతివారిని కలుస్తాను: ప్రతివారు బాబానుకలుస్తారు. కనుక మనముఏదైనా మొదలుపెట్టబోయే ముందు అఖరిసారిగా మనము కలుసుకొనిపరస్పర ఆలింగనం చేసుకుందాం." అంటూ బాబా ప్రారంబించారు "తళతళ మెరిసేకళ్లతో' కానీ నాప్రక్క ఎముకలు విరిగిపోయేట్లు నన్ను గట్టిగా కౌగలించుకోకండి అని బాబా సౌంజ్ఞలు చేశారు.

ఏమైనప్పటికీ,మరుక్షణంలోనే అంతా గంభీరంగా మారింది. కొన్ని గంభీర ప్రకటనలను బాబా స్వయంగా తనఅక్షర ఫలకం పై అందించటం ప్రారంభించారు. ఎరుచ్ మైకు ద్వారా ఆప్రకటనలను చదువుతున్నాడు. బాబా సభకు అందించిన సందేశము

గత రాత్రిఅంతా నేను ఆలోచించాను ఈ వర్షాలు ఎందుకు మొదలయ్యాయని, ముఖ్యంగా సెప్టెంబరు 28నమీరంతా ఇక్కడకు చేరవలసిన సమయానికి వర్షం ఎందుకు వచ్చింది? ఎందుకో ఇన్ని రోజులుగా సెప్టెంబరు 28వరకూ సూర్యతేజము బాగానే ఉన్నది.ముందటి కార్యక్రమాలన్నీ నిరాఘాటంగా బాగానే జరిగి పోయాయి. సెప్టెంబరు 12న అహ్మదునగరులో దర్శన కార్యక్రమము ఇక్కడే ఉన్న పాశ్చాత్య బృందానికి వేరు వేరురోజుల్లో వివరణ లందించటం,

20వతేదీన పాశ్చాత్యులతోసకోరీ సందర్శన చేసి, నాగురు దేవులు ఉపాశినీ మహరాజు పాద సన్నిధిలో నాశిరము నుంచుట, సెప్టెంబరు 26న అహ్మదునగరులోని సరోష్ మోటారువర్క్సు సమీపంలో ఒక చిన్న దర్శనకార్య క్రమం, ఇవన్నీ బాగానే జరిగాయి. ఈ ఘటనలన్నీ నాకు సంతృప్తి కరంగానే నిర్వహించబడినయి.

కానీ ప్రత్యేకంగా సెప్టెంబరు 28తెల్లవారుఝామునుంచి, భగవంతుని ప్రేమికులు ఇక్కడకు చేరుకుంటారని ఎదురు చూస్తున్నప్పుడు, వారికి గొప్పఅసౌకర్యాన్ని కలిగిస్తూ ఇంత కుంభ వర్షం ఎందుకు కురవవలసి వచ్చింది? దీని వెనుక వున్న ఆయన కారణమేమిటో చెప్పమని నేను దైవాన్ని అడిగాను. దీనికాయన ఇలా బదులిచ్చాడు. నిజమైన దైవప్రేమికులు తమ ప్రియతముడ్ని కలుసుకోనేందుకు వారి తలల్ని తమ చేతుల్లో ఉంచుకోని వస్తారు. కనుక ఈ అసౌకర్యము వారికి ఆనందాన్నిస్తుంది.

అపుడు నేను మొదటి సారిగా నన్ను, నేను అవతారుడి నేనా అని అడిగాను. దీనికి స్పష్టమైన, ఖచ్చితమైన జవాబుగా "అవును, నేనాపురాణ పురుషుడను, ఆసర్వోన్నతుడను" అని బదులు వచ్చింది. అప్పుడు నేను అవతార్ మెహెర్‌బాబాను అడిగాను. "ఇంత దూరం ప్రయాణం చేసి నిన్ను చూచేందుకు వచ్చిన ప్రేమికులకు ఇటువంటిఅసౌకర్యాన్ని ఎందుకు కల్పించాల్సి వచ్చింది?' ' అని ప్రశ్నించాను అందుకు అవతార్ మెహెర్‌బాబా ఇలా బదులిచ్చారు. ప్రేమికులు గతించిన అవతారులగుళ్లకు వెళ్లి, కష్టాలు అనుభవిస్తారు. కొన్ని సార్లు కాలినడకన సుదూర ప్రయాణాలు చేసి, మార్గమధ్యంలో అనారోగ్యం వల్ల చాలామంది మరణిస్తారు. కానీ వారిలక్ష్యం నుండి ఇది మరల్చలేదు." సజీవులైన అవతార్ మెహెర్ బాబాను ఆయన ప్రేమికులు దర్శించినప్పుడు,ఇటువంటి ప్రాముఖ్యత లేని అసౌకర్యాలను ఆనందంగా భరించలేక పోతే వారికి ఆయనయందున్న ప్రేమ ఒక తమాషా మాత్రమే అవుతుంది.

ఈ పరిచయం జరిగాక బాబా చెప్పటం కొనసాగించారు. "ఇప్పుడు మిమ్మల్నందరిని చివరిసారిగా ఆలింగనం చేసుకున్న తర్వాత, మనము మన తప్పులను బాహాటంగా ఒప్పుకొని తప్పులను క్షమించమని ప్రార్థిద్దాము. మీ పశ్చాత్తాపంలో మీరు ధైర్యంగా ఉండండి త్వరలోనే మతపర కర్మకాండలన్నటినీ నేను రూపుమాప బోతున్నాను. మతము ఉంటుంది. దాని తమాషా అదృశ్యమవుతుంది."

వేదిక కెదురుగా బాబా ప్రేమికులంతా వరుసలో నిలబడి ఒక్కొక్కరే బాబా ఆలింగన భాగ్యాన్ని పొందటం మొదలైంది. కొద్దిసేపు జరిగాక, ఆయన ఆలింగనాన్ని ఆపి, ప్రేమతో నలుదిశలా పరికించి చూచి, "నేను నాశరీరాన్ని త్వరలోనేపరిత్యజించబోతున్నాను, కనుక నన్ను ఆలింగనము చేసుకొనుటకు మీకు ఇదే ఆఖరి అవకాశము. మెహెరాబాదులో జరుగుతున్నయీ సమావేశానికి వచ్చిన మీరంతా తప్పకుండా నన్ను కలుసుకొని ఆలింగనంచేసుకోండి. మీరంతా నా ప్రేమకు అర్హులయ్యెదరు గాక! మిరంతా నన్ను వదల కుండెదరు గాక! నన్ను అమ్మివేయకండి," అని వివరించారు. తన శరీరాన్ని పరిత్యజించ బోతున్నానన్న బాబా ప్రకటన అకశ్మికంగా జరిగే సరికి బలమైన విఘాతము ఏర్పడి ఓదార్చలేని పరిస్థితి తయారైంది. కొందరి కళ్లల్లో అశ్రుధారలు జలపాతాలయ్యాయి. పురుషుల మనస్సుల్లో పర్వతాలు డొల్ల సాగాయి. వారి హృదయాలను రకరకాల అభిప్రాయాలు ముంచి వేశాయి. చాలమంది దుఃఖిస్తూ నిలబడ్డారు.

అయితే, బాబా మాత్రం వేదిక మీదను నువెచ్చని చిరునవ్వుతో తనదైన వ్యక్తి గతస్థాయిలో ప్రతివారి హృదయాన్ని హత్తుకుపోతూ తన ప్రేమికులకు ఆలింగనం ఇస్తూనే ఉన్నారు. డా॥ దౌలత్ సింగ్ (బాబా నవజీవన సహచరుల్లో ఒకరు) ఏడుస్తూ చెక్కిళ్ల పై కన్నీళ్లు కారుతుండగా వచ్చి బాబాను కలిశాడు. అదేసమయంలో బాబా అతడ్ని ఆలింగనం చేసుకున్నారు. అతని అంతరిక సంక్షోభం అతడ్ని నిలబడనీయలేదు. అతడ్ని కొంతసేపు తన వేదికపై కూర్చొనుటకు అనుమతించారు. బాబాకు ప్రియమైన శిష్యుల్లో ఒకడైన ఫిలాసఫీ ప్రొఫెసరు డా॥ సి.డి.దేశ్‌ముఖ్ వచ్చి బాబాను ఆలింగనం చేసుకున్నాడు. అంతకుముందు బాబా అతడ్ని ఒకవైపే ఆలింగనం చేసుకోమని ఇచ్చన ఆదేశాన్ని మరిచిపోయి రెండు వైపులా చేసుకున్నాడు. బాబా అతడి భుజం పట్టుకొని ఆపి, తన అసంతృప్తిని వ్యక్తపరిచారు అయినప్పటికి బాబా అతని నియమోల్లంఘనను క్షమించటమే కాక అంతకు ముందు దేశ్‌ముఖ్ చేసుకున్న రెండు అలింగనములను రద్దు చేశానని ఇప్పుడు మళ్లీ కేవలం ఒకవైపున మాత్రమే అలింగనం చేసుకోమని సౌంజ్ఞలు చేశారు. చిన్న చర్యలో బాబా క్షమాగుణం, కరుణతన దివ్యహాశ్యంతో ఎలా జోడించ బడివుంటుందో మనం చూడగలము.

ఆంధ్రానుంచి వచ్చిన తనప్రేమికులలో ఒకరైన ఒక భగవద్గీత చదివిన పండితుడ్ని ఆలింగనం చేసుకోబోతు, గీత 14వ అధ్యాయం నుండి రెండు

శ్లోకాలు చదవమన్నారు. ఆశ్లోక పంక్తుల్లో కృష్ణుడు ఇలా వివరిస్తాడు. "యుగ యుగాలుగా ధర్మం నశించి, అధర్మం ప్రబలినప్పుడు, దుష్టసంహారం చేసి నిజ ధర్మాన్ని ప్రతిష్టించుట కోసం నేను ఒక మానవ రూపాన్నిధరిస్తాను" గీతలోని ఈ అభయము ఆపెండాల్లో వున్న కొందరికి, కృష్ణుడుమళ్లీ ఒక సారి తమ మధ్యకుమెహెర్ బాబాగా వచ్చాడని గుర్తు చేసింది.

తన ప్రేమికుల్లో జనక్ సింగ్ అనే మరొకరిని ఆలింగనంచేసుకోబోయే ముందు, ఆరోజు ఉదయం అతను సరిగా స్నానం చేశాడా లేదా అని బాబా ఆరాగా అడిగారు. గట్టిగా నొక్కి నొక్కి అడుగుతున్నట్లు కాకుండానే బాబా ప్రత్యేకంగా అడుగుతున్నట్లు సౌంజ్ఞలుచేస్తూ తనకు ఉదయాన వేన్నీళ్లు, టవలు, సోపుకేసు మొదలైనవి సక్రమంగా అందాయా అని అడిగే సరికి జనక్ సింగ్ అవునంటూ తల ఊపాడు. అప్పుడు బాబా అతడ్ని ఆలింగనం చేసుకున్నారు. జనక్ సింగ్ అనందంతో చాలా ఉప్పొంగి పోయాడు. కొన్ని క్షణాల పాటు తన పరిసరాల్ని పూర్తిగా మరిచి పోయాడు. ఇక్కడ బాబా అతడి స్నానం గురించి ప్రశ్నించడంలో ఏమీ విశేషం లేదు. అరోజు ఉదయం నుండి జనక్ సింగ్ మనసులో కలవరపెడుతున్న ఒక ప్రశ్నకు జవాబు దొరికింది. అరోజు ఉదయం స్నానపు సరంజామాను మరిచి దోడ్లో కూర్చున్న తనకు, ఒక అపరిచిత వ్యక్తి ఇవన్నీ ఇచ్చి సహాయపడ్డాడు. తాను 20ఏళ్ల యువకుడైనప్పటికీ, బలము, నిబ్బరము ఉన్నా, ఆరోజు ఉదయం చలివల్ల, బురద, వానవల్ల స్నానం చేయుటకు భయపడ్డాడు. అయితే ఎవరో అనుకోకుండా సహాయపడతాననే సరికి జనక్ సింగ్ సంతోషంగా సరే అన్నాడు. ఆతర్వాత యీవ్యక్తి ఎవరో తెలుసుకోలేక పోయాడు. వేదికపై బాబా అతనితో చేసిన సౌంజ్ఞల ద్వారా ఉదయం తనకు సహాయపడిన ఆవ్యక్తి బాబాయేనని అప్పుడు తెలుసుకున్నాడు. అంతగా ప్రాముఖ్యత లేని తన స్నానము విషయంలో ఎంతో శ్రద్ధ చూపిన బాబా విధానానికి ఆశ్చర్యపోయాడు. ఈ సంఘటన అతని జీవితంలో బాబాతో ఒక నూతన అధ్యాయాన్ని తెరిచింది. బాబా సర్వజ్ఞత్వం తనజీవితంలో ఎప్పుడూ ప్రేమతో కనిపెడుతూ చిన్నా పెద్దా తేడా లేకుండా అతనికి సహాయపడుటను సూచించింది.

నౌరంగా నుంచి వచ్చిన ఒక ప్రేమికుడు పిశాచాలబారిన పడి వాటిచేత పీడించబడి కడు దురవస్థలో ఉన్నాడు.

అయితే అతను బాబా ఆలింగన భాగ్యం పొందగానే తనను పట్టి పీడిస్తున్న పిశాచాలు వదిలి పోయాయన్న భావన కలిగింది. అప్పటి నుంచి అతనికి అటువంటి కష్టం మళ్లీ రాలేదు. ఈ సమావేశ సమయంలో బాబా ప్రేమికులు ఒకరికొకరు తమ మధ్య జరిగిన వ్యక్తిగత అనుభవాలు, వ్యక్తిగత జీవితాల్లో బాబా తమకు సకాలంలో అందించిన సహాయాన్ని బహిర్గత పరుచుకుంటూ పరస్పరం పాలుపంచుకొనుట కనిపించింది.

"ఆఖరి ఆలింగనం" యొక్క ఉత్కృష్ట సమయాన్ని ఒకింత విడమర్చి, మరింత తేలిక పరుచుటకు బాబా, ఆంధ్రా హమీర్‌పూరూర్‌ల నుండి వచ్చిన తన ప్రేమికులతో పరిహాస మాడసాగారు. ఆయన ప్రేమికులందరినీ తన బాహువుల మధ్య బంధించిన తర్వాత, ఆ ఉదయం జరగాల్సిన రెండవ అయిటము ప్రార్థనలు మొదలవుతాయని సౌంజ్ఞలు చేశారు.

ఇది వినగానే జనము, వేదిక చుట్టూ గుమికూడారు. కొందరు గ్రూపులుగా నిలబడి, పెండాలంతా వ్యాపించారు. అంత మంది పురుషులు ఉన్నా, రద్దీగాని, క్రమభంగం కానీ జరగలేదు. ప్రతివారు బాబావైపు తిరిగి నిలబడ్డారు. ఒక వైపున బాబా తన ప్రేమికులను కలుస్తూనే, మరోవైపు, కొందరికి తనను ఫోటోలు తీయుటకు, ఫిలిం చిత్రీకరించుటకు అనుమతినిచ్చారు. అయితే తన ప్రేమికులను ఆలింగనం చేసుకున్న పిదప, భోజన సమయం అయ్యే వరకు ఫిలిం తీయటం ఆపమని ఆదేశించారు. ప్రార్ధనలు పూర్తయ్యే వరకు సభలో ఎవరూ "అవతార్ మెహెర్ బాబాకి జై" అని అనవద్దని కూడా అదేశించారు.

బాబా మెడలో పూలమాలను ఎరుచ్ తొలగించాడు బాబా అమోఘంగా తన కురులను మృదువుగా నునుపు చేసి తన కోటును సవరించు కున్నారు. గంభీరమైన శైలితో చేతులను కడుక్కొని కైకోబాదుకు ఎదురుగా నిలబడ్డారు. అతడూ ఆవేదిక పైనే ఉన్నాడు. ముందుగా జోరాష్ట్రరు ప్రార్దన ఎంతో గంభీరంగా మొదలైంది. అది పూర్తి కాగానే పాల్గొన్నవారిలో ఒకరు అలవాటుగా "బాబాకి జై' ' అని బిగ్గరగా అరిచాడు దీనితో ప్రతివారు వెనక్కు జంకారు. ఆకాశం నుండి అక్కర లేని మేఘమేదో ఉరిమినట్లయింది. "అలా అన్నది ఎవరూ?" అని బాబా ప్రశ్నించారు. ఆవ్యక్తి తానేనని అంగీకరించి కంగారుపడిపోయి తన తప్పును క్షమించమని బాబాను కోరాడు. బాబా మకమకలాడుతూ కనిపించినా, "క్షమించాను" అన్న సౌంజ్ఞలు చేశారు. తన ఆదేశాలకు ఎప్పుడూ లోతైన

అర్ధముఉంటుంది కనుక వాటి గురించి ప్రతివారుఎంతో జాగ్రత్తగా ఉండాలని బాబా మళ్ళీ చెప్పారు. సమావేశమప్పుడు, ఆయన ఒకసారి తెలిసి లేదా కావాలని తన వ్యక్తిగత ఆదేశాలను అవిధేయతతో ఉల్లంఘిస్తే, ఫలితంగా విపరీతమైన బాధలు పడాల్సి వస్తుంది. అభాధను నయంకాని వ్యాధి అనగా విడవని నొప్పులతో పోల్చవచ్చును అని వివరించారు.

బాబా మళ్ళీ తన చేతులను కడుగుకొని కైకోబాదు ఎదుట దక్షిణాభి ముఖంగా నిలబడ్డారు. ఆయన ఎంతో ప్రశాంతంగా వెలిగిపోతూ కనిపించారు. ప్రార్ధనాఘట్టం మళ్ళీ తాజాగా మొదలైంది. కైకోబాదు, అలీఅక్బరు (అలోబా) డా॥ నీలు, విష్ణు మరియు డా॥ డొన్‌కిన్‌లు జోరాష్ట్రియన్ ఇస్లాం, హిందు, క్రిష్టియన్ ప్రార్ధనలను వరుసగా చేశారు. బాబా డా॥ దౌలత్ సింగ్‌ను గురు గ్రంధసాహబ్ నుండి (సిక్కుల పవిత్ర గ్రంథం) ఒక అధ్యాయాన్ని పఠించమన్నారు. డా॥ డొన్ కిన్ వివిధ మార్గాల ద్వారా సేకరించిన వివరాల్ని క్రోడీకరించి సంకలన పరచిన క్రిష్టియన్ ప్రార్ధనకు బాబా ప్రత్యేక అనుమతి ఇచ్చారు. ప్రతి ప్రార్ధన చివరలో, ఆ ప్రార్ధనను పఠించిన వ్యక్తి, తన కుడికాలిని బాబా వద్ద ఉంచిన కుర్చీ చేతిపై ఉంచాలి, అప్పుడు బాబా ఆవ్యక్తి పాదంపై తన శిరము వుంచి వంగి నమస్కరిస్తారు. అదేసమయంలో ఆవ్యక్తి ఉచ్ఛైస్వరంతో గాఢమైన భక్తి ప్రేమలతో, ఆయా మతములకు సంబంధించిన భగవంతుని దివ్యనామము - అహురమజదా, అల్లా అక్బర్, ఓం పరబ్రహ్మ పరమాత్మ, గాడ్ ఆల్మైటీ అనే ఏదో ఒకనామన్ని ఉచ్ఛరించాలి. డా॥ దౌలత్ సింగ్ "సత్‌శ్రీఅకల్" అని బిగ్గరగా పలికాడు.

ప్రార్ధనలు పూర్తి కాగానే, వారంతా అంతసేపు నిలబడినందువల్ల అలిసిపోయారేమోనని బాబా వాకబు చేశారు. వారు కోరుకుంటే ఆ సమావేశపు మూడవ అంకము మోదలయ్యేముందు కొద్ది సేపు స్వల్ప విరామము ఇచ్చేందుకు బాబా సిద్ధపడ్డారు. కానీ అత్యధిక ప్రేమికులు "దయచేసి కోనసాగించండి" అని చెప్పటంతో "నేనేమీ అలసి పోలేదు. కనక కార్యక్రమం కోనసాగిద్దాం" అని బాబా సౌంజ్ఞలు చేశారు.

బాబా అక్షరఫలకం నుండి ఎరుచ్ చదువు తున్నాడు. "ఇక్కడ హాజరైన వారందరి తరపున,మరియు ప్రపంచమంతటి తరపున బాబా పశ్చాత్తాపప్రార్ధనను సమర్పిస్తారు. పూర్తి శ్రద్ధను దానిపై వుంచి, హృదయాన్ని, దానిలోకి జొప్పించండి. మనస్సు చేప్పే దానిని భగవంతుడు వినడు. కానీ హృదయభాషను వింటాడు.

కనుక మీరు హృదయ పూర్వకంగా ప్రాయశ్చిత్తము విధించి, విమోచన మిచ్చే పాప నివేదకలో నాముందు పాల్గొంటే, భగవంతుడు తప్పకుండా మీరు నన్ను ప్రేమించేట్లు చేస్తాడు." అంతట కైకోబాదు అవెస్తానుండి "బనామియజడాన్"ను పునశ్చరణ చేస్తూ పాపనివేదనను ఆరంభించాడు అప్పుడు పశ్చాత్తాప ప్రార్థన భారతీయ భాషలైన హిందీ, మరాఠీ, గుజరాతీ, తెలుగులో పఠించబడింది. డా॥ డాన్‌కిన్ ఆప్రార్థనను ఇంగ్లీషులో పఠించాడు. అవతర్ మెహెర్ బాబాతో కలసి సభ అంతా ప్రార్థనను పఠించటం, కలిసి పాల్గొనటంతో ఆనాటి ఉదయ కార్యక్రమపు ప్రధాన భాగం పూర్తియింది. బాబా సౌంజ్ఞలతో ఫ్రాన్సిస్ బ్రాబజాన్, ఆస్ట్రేలియావాసి, మైకుదగ్గరకు వచ్చి "అవతార్ మెహెర్ బాబాకీజై" అని జయ ధ్వానం చేయగా అందరూ గొంతు కలిపి పల్లవి నందుకున్నారు.

సమావేశం పూర్తి అయి, సభాసదులు లేవబోయే ముందు భారత దేశంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన తన ప్రేమికులను బాబా బృందాలుగా కలుసుకొని దర్శనమిస్తారని ప్రకటించబడింది. ఇది మధ్యాహ్నం 2-00 గంటల నుండి మండలి హాలులో మొదలవుతుంది. దీని కంటే ముందు, తన కార్యక్రమాన్ని పురస్కరించుకొని ఆ హాలుకు ఎదురుగా ఉన్న చిన్న క్యాబిన్‌లో కొంతమందిని కూడా చూడాలని ఆయన కోరుతున్నారు. బయలుదేరుదామని ఆయన తన ఆసనం నుండి లేవగానే, ఆ కూటమినుద్దేశించి 'రేపు వాన ఉన్నా వానలేకున్నా, సమావేశము పెండాలలో ఉదయం 9 నుండి 11-00 గంటల వరకు జరుగుతుంది. మరల సాయంత్రం 3-30 నుండి 6-00 వరకు తిరిగి ఆరంభమవుతుంది మీరంతా ఇక్కడ తప్పక హాజరు కావాలి. ఆసమావేశములో, నేను ఏమి చెప్పాలనుకున్నానో దానిని ఖచ్చితంగా చెపుతాను". ఈ సందేశముతో ఉదయపు సమావేశము సమాప్తమైంది. కొంతమంది మండలి వెంటరాగా బాబా తన క్యాబిన్‌కు వట్టి కాళ్లతో చెప్పులు లేకుండానే నడిచి వెళ్లారు. యాత్రీక ప్రవాహం పెండాల నుంచి బయటకు రాగానే, ఆకాశంలో ఎటువంటి మేఘాల ఆచూకీ కనిపించలేదు. జనం నెమ్మదిగా తమవసతి డేరావైపు దారితీశారు. వారి ఆలోచనల్లో "అవును, నేను పురాణ పురుషుడను" అన్న బాబా మాటలు జీర్ణించుకు పోయి హృదయల్లో మార్మోగుతున్నయి.

## ఆంధ్రా మరియు హమీర్‌పూర్ గ్రూపులు బాబాను కలిశారు

భోజనాలయ్యాక, క్రింది మెహెరాబాదులోనిహాలు వద్దకు ఆంద్రా నుంచి వచ్చిన తన ప్రేమికులను బాబా పిలిపించారు. ఇది అతి పెద్ద గ్రూపు. బాబా ఎంతో ప్రేమగా కొందరి ఆరోగ్యాన్ని గురించి విచారించారు. బాగాలావుగా వున్నందుకు కొందరిని కాసేపు ఏడిపించారు. ఆతర్వాత ఆయన వారికి ఇటీవల తాను చేసిన సకోరి దర్శనము గురించి వివరించారు. చివర్లో "ఉపాశినీ మహరాజు మూర్తీభవించిన పరిపూర్ణత ! మరి నేను అవతారుడను. ఆది మధ్యాంత రహితమైన శాశ్వతత్వంలో అనాదిగా ఉన్న ఏకైకుడనను. మీరు నన్ను ప్రేమిస్తే, కనీసం కాస్తంత ప్రేమించినా మీరు శాశ్వతంగా విముక్తులవుతారని నా దివ్యాధికారంతో నేను మీకు అభయన్ని హామిని ఇస్తున్నాను అయితే ఒకటి మాత్రం గుర్తు ఉంచుకోండి. మీరు నాయందుఎంత తక్కువ ప్రేమ కలిగి ఉన్నప్పటికీ మీరు తప్పని సరిగా దాని గురించి నిజాయితీగా ఉండాలి. ఏదో ఒక ప్రదర్శనగా దీనిని చేయకండి.

అందరితో మామూలుగా మాట్లాడుతున్నప్పుడు బాబాను అమితంగా ప్రేమించే ఎం. అన్నపూర్ణయ్య పేరు ప్రస్తావనకు వచ్చింది. ఆయన ఒక తెలుగు మాసపత్రికకు సంపాదకుడు. ఆ పత్రికలో ఆయన యుగావతారుడు మెహెర్ బాబా గురించి తన అభిప్రాయాలను ధైర్యంగా వ్యక్త పరిచేవాడు. సెప్టెంబరు నెల ప్రారంభంలో మెహెరాబాదులో జరిగే సమావేశంలో ఆందరితోపాటు కలిసి పాలుపంచుకోవాలని ఆయన ఒక ప్రత్యేక వ్యాసాన్ని తయారు చేశాడు. ఏమైనప్పటికీ, అది వ్రాయిటం పూర్తి చేయగానే, ఆయనకు జ్వరం వచ్చింది. విస్తారమైన వైద్యం చేయించినా జ్వరం తగ్గలేదు. టెంపరేచరు ఎక్కువగానే ఉన్నది. విడవకుండా ఒక వారం పాటు ఆయన బాబా నామాన్ని లయబద్ధంగా స్మరించాడు. బహుశః ఆయన శరీరం ఆ ప్రేమను తనలో ఎంతో కాలము ఇముడ్చుకోలేక పోయిందేమో, సెప్టెంబరు 11న ఆయన పరమపదించారు. అయన గదిలో తాను మెహెరాబాదు సమావేశం కోరకు వ్రాసి పెట్టుకున్న వ్యాసము, ఆయన సన్నిహితులు ఒకరికి దొరికింది. దానికాపీని బాబాకు చదివి వినిపించాలని మెహెరాబాదుకు తీసుకువచ్చాడు. అవతార్ మెహెర్ బాబా యందు ఆయనకు ఉన్న ప్రేమ మరియు విశ్వాసమును వ్యక్తంచేస్తూ ఎం. అన్నపూర్ణయ్య ఇలా వ్రాశాడు.

## ఒక ప్రేమికుడు వెళ్ల బోసుకున్న వేదన




బాబా ప్రేమతో నా హృదయం పూర్తిగా విడవకుండా నిరంతరం నిండి వున్నదా? అలా అయితే,నేను తలపోసే ప్రతి ఆలోచన తప్పని సరిగా స్వచ్ఛంగా ఉండాలి. నేను మాట్లాడే ప్రతి మాట నిజమైయుండి తీరాలి. నేను నిర్వహించే ప్రతిచర్య, నిస్వార్ధమై యుండి తీరాలి. బాబాను ప్రేమించట మంటే, ప్రతి తోటి వ్యక్తిని కులము లేక జాతి, దేశము, లేక ప్రాంతము, స్వజాతి, విజాతి అనే తారతమ్యం లేకుండా అందరిని, ప్రేమించటం. ఎవరైతే అల్పాతి అల్పమైన వారిని, ఎలాంటి ఫలితాన్ని ఆశించ కుండా సేవించ కలుగుతారో వారు మాత్రమే బాబాను సేవించ కలుగుతారు. పరిత్యాగము, కూడలిజాయి, ప్రేమ యొక్క అడుగుతట్టు త్యాగమనే ఆలోచనకూడా అదృశ్యమైనప్పుడు ఇది పూర్తి అవుతుంది. అందువల్ల నేను కేవలం ఐహికమైన సంపదలనే కాక, యధార్ధ త్యాగపు గమ్యంలో ఆడ్డుగా నిలిచే మానశిక అహమును కూడా నేను సమర్పించు కోవద్దా? పూర్తి అహంకార నాశము, ప్రభువు యందున్న ప్రేమ మరియు సత్యముల యొక్క శాశ్వత ఊటచలమగా హృదయం మారినప్పుడు మాత్రమే సాధ్యపడుతుంది. మానవాళిని తప్పుల నుండి విముక్తి చేయుటకు భగవంతుడు మానవుడిగా మారినప్పుడు, ఆకాలంలో జన్మించినవారు ఎంతో అధృష్టవంతులు. ఆ అవసరం తీర్చేందుకు రూపుదాల్చిన భగవంతుని ప్రత్యేక రూపాన్ని గుర్తించి, అవగాహన చేసుకొన్నవారు మరింత ధన్యులు, అత్యంత సన్నిహితంగా ఉండి. ఆయన్ని గురించి తెలుసుకొని, ఆయన్ని అనుసరించుటకు ప్రయత్నించిన వారుఇంకా అత్యధిక ధన్యతములు, ఆయన అంతరంగిక మండలిలో చేరి ఆయన మంత్రాంగాన్ని నెరవేర్చటంలో ఒక ఇష్టపూర్వకమైన పనిముట్టుగా తయారైన వారు వీరికంటే మరింత ధన్యులు. ఎంచుకొను వానిచే స్వయంగా ఎంచుకో బడినవానిగా మారితే పరిపూర్ణ అధృష్టవంతుడైనట్లే !

ఈ పవిత్రమైన 1954 సెప్టెంబరు 29 రోజు నా జీవితంలో చిరస్మరణీయదినము. ఏకైకుడు ప్రభులకు ప్రభువు సర్వోన్నతుడైన పురాణ పురుషుని భౌతిక సమక్షంలో ఉండే అరుదైన చక్కని అదృష్టం, కలిగి నందుకు, నేను ఆయనకు పాధాభి వందనముచేసి, ప్రణామములు సమర్పిస్తున్నాను. ప్రేమాన్వితమైన అయన చూపు మంత్రముగ్ధుల్ని చేసే చిరునవ్వు, పవిత్రమైన స్పర్శ, యుగ యుగాలుగా మునులు, ఋషులు ఈర్ష్య పడిన ఆయన ముందు నిలబడిన నేను ఎంతో ఆదృష్టవంతుడిని.

నాకు చూచుటకు కళ్లుండీ చూడటం లేదనీ, వినుటకుచెవులు ఉండీ వినుటలేదని, అర్థము చేసుకోనుటకు హృదయం ఉండీ నాస్థాయికి దిగివచ్చి అగాధమైన అధోగతి నుండి నన్ను ఉద్ధరించేందుకు దిగివచ్చిన ఆయన్ని అవగాహనచేసుకోవటం లేదని చెప్పబోకు. నిశ్చయంగా ఆయన నీవు జయించేందుకే లొంగి పోయాడు.

నాయావదాత్మ యీ క్షణంలో ఆయన రహశ్యాన్ని బహిరంగంగా వ్యక్త పరిచేశుభ వేళ చేసే ఏకైక ప్రార్థనతో మార్మోగు గాక! ఓప్రభులకు ప్రభువా! నీకోసం నిర్మించేందుకు నాకు ఏదేవాలయాలు లేవు. నీవు నాహృదయలలోనే ప్రతిష్టితుడ వయ్యావు. నిన్ను పూజంచేందుకు నావద్ద పూలేమీ లేవు. నీ పాదపద్మాల చెంత నా హృదయమాలనే పూదండగా సమర్పించు కుంటున్నాను.

ఓ దివ్య సనాతనా నిన్ను శాశ్వతంగా ప్రేమించే శక్తిని స్థైర్యాన్ని నాకు ప్రసాదించు. ఎల్లప్పుడు తొట్రుపాటు లేకుండా శాశ్వతానందపు స్వరమునకై అనశ్వరమైన విశ్వాసముతో నిన్ను అనుసరించేభాగ్యం ప్రసాదించు.

ఈ వ్యాసములోని అధిక భాగాన్ని ఈ సమావేశంలో పాల్గొన్న అత్యధికులకు బాబా దైవత్వంలో గాఢమైన నమ్మకము, ప్రేమ యొక్క తీవ్రత గురించి అవగాహన కలిగించుటకు మళ్లీ మీ ముందుంచు తున్నాను.

మెహెరాబాదు హాలులో పరిచయాలుప్రారంభమగుటకు ముందు, బాబా ఇలా ప్రవచించారు "నేనుమీ అందరిని ఎరుగుదును.యావత్ప్ర పంచము నాకుతెలుసు. కానీ ఇప్పుడు నేను నా ప్రేమికులప్రియమైన పేర్లను చివరిసారిగా వారినోటి నుండే వినాలను కుంటున్నాను. బాగా తెలుసుకోండి. నన్ను ఎరుకతో ప్రేమించని వారు సైతము వారుకూడా నావారే ! అంతట బాబా హాల్లో హాజరైనవారందరినీ ఒక్కొక్కరే లేచి నిలబడి తమకు తాము పరిచయము చేసుకోమని అన్నారు.

ఆయన ప్రేమికులలో ఒకరు ఆయన 1954 సెప్టెంబరులో అందించిన సందేశాన్ని ప్రచురించేందుకు అనుమతినిమ్మని బాబాను కోరాడు. "బాబా అవతారుడని నీవు నమ్మితే అచ్చువేసే దానిలో అలాగే చెప్పు. ఒక వేళ బాబా అవతారుడు కాడు అని నీవు భావిస్తే అలాగే చెప్పు. నీహృదయంలో నిష్కపటంగా ఉండాలని గుర్తు ఉంచుకో. నీవు ఏమి చేస్తున్నా, అది హృదయపూర్వకంగా నిర్వర్తించు. నీకు నా ఆశీస్సులు," అని బాబా అతనికి తెలిపారు. కొత్తగా వచ్చిన మరొకరు తనకు తాను పరిచయం చేసుకోగా బాబా సౌజ్ఞలతో అయితే నేను నిన్ను యుగ యుగాలుగా చూస్తూన్నాను. కనుక నీవు నన్ను మొదటిసారే చూస్తున్నానని విచారించకు". అని చెప్పారు. వ్యక్తిగత విషయాల్ని ముచ్చటించ బోయిన మరొకరితో బాబా ఇలా వ్యాఖ్యానించారు. "నేను సర్వజ్ఞడను" అడిగిన దాని కంటే ఎక్కువగా నాకు చెప్పవలసిన అగత్యము లేదు.

బాబా సందేశ వ్యాప్తి కై తమ తమ కేంద్రాలద్వారా తాముచేస్తున్న కార్య క్రమాల గురించి చాలా మంది బాబాకు విన్న వించుకున్నారు. తన యందువారికున్న ప్రేమను బాబా మెచ్చుకున్నారు. దడాలున కను రెప్ప మూయకుండా ఆగ్రూపు వారికి బాబా ఇలా సందేశ మిచ్చారు. "నాకుఒక హృదయ మంటూ ఉంటే, ఆహృదయముమీ అందరికోసం ప్రేమతో పొంగిపొరలుతోంది. నాహృదయంలో ఆంధ్రులకు ఒక ప్రత్యేక స్థానము ఉన్నది. మీరంతా ఇక్కడకు వచ్చుటకు ప్రయత్నించి నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. ఏమైనప్పటికీ ఏదో ఒక కారణం చేత ఇక్కడకు రాలేనివారు సైతం ఇక్కడ నాతో ఉన్నారు. అంటూ చిరునవ్వుతో వివరించాడు.

బాబా ఆంధ్రా గ్రూపుతో ఒక గంటపైగానే గడిపారు. ఆతర్వాత హమీర్‌పూర్ నుంచివచ్చిన వారికి అవకాశమిచ్చేందుకు వీలుగా వారిని హాలు నుండి బయటకు వెళ్లమన్నారు. వారు బయలుదేరుతుండగా, బాబా లేచినిలబడి, తనయందు వారికున్న ప్రేమకు బదులుగా చేతులు జోడించి నమస్కరించారు. కొంత మంది ఆయన దగ్గరకు వెళ్లి చేతులు చాచి కరచాలనం చేస్తూ ఆయన స్పర్శనుపొందారు.

బాబా తన హమీర్‌పూర్ ప్రేమికులతో చాల ప్రేమాన్విత సాన్నిహిత్యముతో గడిపారు. ఆసమయంలో ఉత్తర ప్రదేశ్ లోని ఇతర ప్రాంతాల నుండి వచ్చిన ప్రేమికుల్ని కూడా పిలిపించారు. వారికి కొన్ని ఆధ్యాత్మిక వివరణలుచెప్పే ఉద్దేశ్యంలో ఉన్నారు. వాటిలో కొన్ని తన దైన చమత్కారదోరణిలో జోడించబడినవి.

పరిచయాల్ని వేగిర పరచేందుకు. వారందరిని పరిచయం చేయమని కేశవ నిగమ్‌ను అడిగారు తొలివ్యక్తి బాబాతోపాటు అంధ్రాటూర్‌లో పాల్గొన్న ఒక యువకుడు అప్పటి నుండి అతడు బాబా ప్రేమలో పూర్తిగా మునిగిపోయి తన ప్రాపంచిక విధులకు సక్రమంగా పాల్గొనలేక పోతున్నాడు.

అ సందర్భాన్ని పురస్కరించుకొని, బాబా వారి కిలా వివరించారు. "అంతరంగంలో ఉన్న ప్రేమాగ్ని జ్వాలను బయటకు బహిర్గత పరచకూడదు. కనీసం దాని పొగకూడా ఇతరలకు కనిపించ కూడదు. మీరు నన్ను ప్రేమించినప్పుడు, మీరు లోపల దహించబడటం ప్రారంభిస్తారు. కానీ మీరు ఆనందంగా నవ్వుతూ కనిపించాలి. ఎడబాటు యొక్క వేదనను నిశ్చలంగా, శాంతంగా భరించాలి. ఏవిధంగా పైకి వ్యక్తం చేసినా అది ప్రేమను అగౌరవ పరచినట్లే. మీ విద్యుక్త ధర్మాలన్నీ ఆచరిస్తూనే. మీరు బాబాను ప్రేమించ వచ్చును. మీరుచేసే మంచి, చెడు చర్యలన్నీ నాకు అర్పించండి, మీ శరీరానికి మీరు దుస్తులు ధరింప చేసి ఆతర్వాత దాని విషయం మరచిపోయినట్లుగా యీ ఆత్మకు బాబా అలోచనలతో బట్టలు వేయండి. అప్పుడు బాబా మీతోటే ఉంటాడు. అది మీరు తెలుసుకోకుండానే జరిగిపోతుంది."

మరోకరికి బాబా ఇలా చెప్పారు. "నేను ఒక పహిల్వాన్‌ను. నాలాగ అబద్ధాలు చేప్పేవారూ వేరెవరు లేరు. మరి నాలా నిజం చెప్పేవారూ లేరు. ఎవరూ కూడా నామీద పిడికిట బిగపట్టలేరు. నేను ఎంత కొలవ శక్యం కాని వాడినంటే నా స్వీయ ఆత్మను నేనే కోలవ లేను. ఆయితే నేను ధివ్య సనాతనుడనని నేనెరుగుదును. అట్టినేను ప్రేమవల్ల , నిజాయతీ గల ప్రేమవల్ల మీ వాడిని కాగలను.

బాబా నిజంగా ఏద్దైయున్నారో. అరూపాన్ని చూచే కృపను ప్రసాదించమని ఒక వ్యక్తి బాబాను కోరేడు అందుకుబాబా బదులిస్తూ "నాకృప నాఇచ్ఛ ప్రకారం అవిచ్ఛన్నంగా ప్రవహిస్తుంది. నన్ను గురించి ఆలోచించుటకు ప్రయత్నించు తక్కినదంతా నాకు వదిలి పెట్టు." అని చెప్పారు. ఇంకా చెపుతూ కేవలం ప్రేమ మాత్రమే నిన్ను దైవసన్నిధికి చేరుస్తుంది. కాగా కామం నిన్ను మాయకు బందీని చేస్తుంది. కామము సర్వాన్ని వాంచిస్తుంది. దేనిని ఎన్నడూ కోరకుండుటే ప్రేమకుచిహ్నం."

వారిలోతండ్రి ఇష్టానికి వ్యతిరేకంగా వచ్చిన ఒకపాఠశాల విధ్యార్థి ఉన్నాడు.

బాబా అతడితో తన తండ్రికి బాబా తరపున క్షమాపణ చెప్పమని, ఆయన యందున్న ప్రేమేతనను ఇక్కడకు తెచ్చిందని తెలుపయని ఆదేశించారు. ఏమి దివ్యమైన అణకువ మరో విధ్యార్థి బాబాకు పరిచయం చేయబడ్డాడు. ఇతడ్ని బాబా స్కూలువారు అనుమతిస్తేనే రమ్మనమన్న షరతు పై బాబా అనుమతిని మంజూరుచేశారు. యీ అనుమతి తీసుకొనుటకు అతడు అనేక కష్టాలుపడ్డాడు. చివరకు తన ప్రిన్సిపాలుతో సహనాన్ని కోల్పోయి ఘర్షణ కూడా పడినట్లు అతడు తెలిపాడు. నీ కోపాన్ని నీవు ఎందుకు నిగ్రహించుకోలేక పోయియావని బాబా అడిగారు "నాకు ఉన్న సమశ్యే అది" అని అతడు ఒప్పుకున్నాడు. "నీవు ఎవరో ఒకరి మీద ఎప్పుడు కోపం తెచ్చుకున్నా, నేను అవ్యక్తిలోనూ ఉన్నానని గుర్తుకుతెచ్చుకో. అలా చేస్తే నీలో కోపం తగ్గిపోవుటకు సహాయపడుతుందది.' ' అని బాబా సౌంజ్ఞలు చేశారు.

ఆయన్ని తొలిసారిగా కలుస్తున్నఒక ప్రేమికుడు తన మనస్సును నిగ్రహించుటకు సహయ పడమని బాబాను కోరాడు. ఆతడికి బాబా చాలా స్వల్పమైన విధానాన్ని సూచించారు. అంతకుముందు పాశ్చాత్యులకు తెలిపిన పద్ధతి లాంటిదే ఇది. "ఉదయం ఏడుగంటలకు ఒక పర్యాయం మళ్లీ మధ్యాహ్నం ఒకసారి, సాయంత్రం అయిదు గంటలకు, చివరగా రాత్రి పడుకుండబోయేముందు నా నామాన్ని స్మరించండి" అని సూచించారు. ఈవిధంగా చేయటం ప్రతి నిత్యం అలవాటుగా జరగాలని అలాచేస్తే తన నామమందుతుందని ఆ వ్యక్తికి బాబా అభయమిచ్చారు.

ఒక మంగలి బాబాకు పరిచయం చెయబడ్డాడు "నేను ఒక విశ్వాత్మ కక్షురకుడిని. నేను అందరి తలలను క్షౌరము చేసి రూపమే మారుస్తాను." అని బాబా వ్యాఖ్యానించారు. పెద్ద బొజ్జగల ఒక లంబోదరుడు బాబాను కలిశాడు. అతడ్ని చూచి "నీకు గుండ్రని హృదయం, ఒక గుండ్రని శరీరము, ఉన్నందున నాకు నీవంటే ఇష్టం. నీ ప్రేమ కూడా గుండ్రంగా ఉంది." అని బాబా అతనితో అన్నారు. అంతా ఫకాలున నవ్వారు. ఒక ఓషధి శాస్త్రవేత్త పరిచయం చేయబడినాడు. తననాడిని పరీక్ష చేయమని బాబా అతడిని కోరారు. అతడు పరీక్షించి బాబా నాడి చాలా సత్తువ కలిగి ఉన్నదని. సకల ప్రపంచాన్ని భరించే

శక్తి ఉందని తెలియచేశాడు. ఈ మాటలు బాబాను చాలా ఉల్లాసపరిచాయి. బాబా ఆ మొత్తం గ్రూపును ఉద్దేశించి "నేను మాత్రమే మిమ్ములను ప్రేమిస్తున్నాను. నాప్రేమ మాత్రమే మీ అందరి ద్వారా ప్రతి ఫలిస్తోంది" అనిప్రకటించారు.

ఉదయపు సమావేశంలో త్వరలోనే తన భౌతిక శరీరాన్ని పరిత్యజించ బోతున్నానని బాబా పేర్కొన్నందు వల్ల అనేక మంది ప్రేమికులు ఖిన్నులైపోయారు. అయినప్పటికీ వారిలోధైర్యాన్ని పెంచేందుకు బాబా ఇలా మరో సందేశమిచ్చారు. "శారీరకంగా బాబా త్వరలో మరణించినా, బాబా శాశ్వతంగా ప్రతి చోటా ఉంటారు. కనుక ఎక్కడివారు అక్కడే ఉండి నన్ను ప్రేమించండి. మరి మీరు ఎక్కడ ఉంటే నేను అక్కడే ఉంటాను" అన్నారు.

హమీర్‌పూర్ నుండి వచ్చిన వారితో సమావేశం పూర్తి కాగానే, బాబా బొంబాయి, గుజరాతు మరియుభారత దేశంలోని తదితర ప్రాంతాల నుండి వచ్చిన గ్రూపుల వారిని రమ్మని పిలిచారు. ఈరకమైన గ్రూపు సమావేశాలు సాయంత్రం 4-30కు పూర్తయింది. ఏదోవిధంగా బాబా ప్రతివారితోను వ్యక్తిగతంగా కొన్ని మాటలైనా మాట్లాడారు. దీనివలన వారిలో ప్రతివ్యక్తితో తన అంతర్గత భాంధవ్యాన్ని వేగిరపరచారు. ఒక హృదయం నుండి మరో హృదయానికి బాబా ప్రేమ ప్రతిధ్వనించింది. ప్రేమికుడికి ప్రియతమునికి మధ్య జరిగిన అంతర్నాటకము, సరసము మరియు గాంభీర్యతలు చిత్ర విచిత్రంగా మళ్లించటంతో, హాశ్యధోరణిలో పనివాడిగా మారగలిగిన ఒక నిజాయతీగల అన్వేషకుడిని మాత్రమే ఇష్టపడేట్లు చేయవచ్చును.

క్రింది మెహెరా బాదులోని తన కుటీరంలోబాబా విశ్రాంతి తీసుకుంటూ, మెహెరాబాదు నిర్వాహకుల తోను, మండలిలో అనేకమంది తోను మెహెరా బాదులో తన ప్రేమికులకు జరుగుతున్న ఏర్పాట్లు గురించి ఇంకా తాను చేయవలసిన, మిగిలిన పనుల గురించిచర్చించారు. చీకటిపడ్డాక ఆయన మెహెరాజాదు వెళుతూ రోడ్డుపై తనకు వీడ్కోలు పలికేందుకు బారులు తీరిన వారికి చేతులు ఊపుతూ శుభాశీస్సులందించారు.

# సెప్టెంబరు30 ఉదయపు సమావేశము



సెప్టెంబరు 30 ఉదయం మెహెరాబాదు రాగానే, బాబా తన కుటీరానికి వెళ్లారు. అది ఎనిమిది గంటల సమయం. ఆయన తన దిన చర్యను, సకోరీ నుంచి వచ్చిన కొందరు. ఉపాశిని మహారాజు శిష్యులకు స్వల్పకాల సమావేశపు అవాకాశం ఇవ్వటంతో ప్రారంభించారు.

అది అయ్యాక, ఇతరులను అనుమతించారు. వారిలో ఢిల్లీలో ఒక పేరున్న కాలేజీకి ప్రిన్సిపాలు, కెమెస్ట్రీలో ప్రసిద్ధి కెక్కిన పరిశోధనా విద్వాంసుడైన నిరంజన్ సింగ్ ఉన్నాడు. ఆనాటి సాయంత్రం బాబా అత్యంత గంభీరమైన సందేశాల్లో ఒక దానినందించాలను కున్నారు. ఆరోజు ఉదయం బాబా చాలా సరదాగా కనిపించారు. అంతకు ముందు బాబా నిరంజన్‌ని తనతో పది రోజులు గడుపుటకు అవకాశమున్నదని చెప్పినట్లు గుర్తున్నందు వల్లే ఇప్పుడు అతడిని ప్రత్యేకంగా రమ్మని పిలిచినట్లు బాబా అతనితో చెప్పారు. బాబా నవ్వుతూ "అయితే ఇప్పుడు నేను నీకు కేవలం పదినిమిషాలు మాత్రమే నాతో గడుపుటకు అనుమతినిస్తున్నాను. దీనివల్ల నీవు నాతో పదిరోజులు ఉన్న దానితో సమానమౌతుంది" అని చెప్పారు. తనయందు నిరంజన్‌కు ఉన్న ప్రేమను బాబా కొనియాడారు. "నీకున్న తపన నాకు తెలుసు విచారించకు. నేను భగవంతుడినని నీవు తెలుసుకొనుటకు నేను తప్పక నీకు సహాయం చేస్తాను అని అతడ్ని ఏడిపిస్తూ "నేను నీకు మరేదైనా హామి ఇచ్చానా?' ' అని అడుగగా, "అవును బాబా! నీవు ఢిల్లీలోని మా ఇంటికి వస్తానని హామీ ఇచ్చావు" అని నిరంజన్ బదులు పలికాడు. అందుకు బాబా నవ్వుతూ "నేను నాశరీరాన్ని త్వరలోనే త్యజించినప్పటికీ, నేను నీ ఇంటిని సందర్శిస్తానన్న నా హామీని నిలబెట్టుకుంటాను. అయితే నాదైన మార్గంలో, నాదైన సమయంలో వస్తాను!" అన్నారు. అప్పుడప్పుడు బాబా మాటలు మామూలు అర్ధానికి కొంత అతీతంగా సూచిస్తాయి. నిరంజన్ మరేదో చెప్పబోయే సరికి తనకు కేటాయించిన

పది నిమిషాల సమయం అయిపోయింది. బాబాకు నిరంజన్ ప్రణామాలర్పించుకొని వెళ్ళిపోయాడు.

మరి కొంతమంది వ్యక్తుల్ని కలిశాక, బాబా కుటీరం నుండి బయటకు వచ్చి నగరు ఆరంగాం రోడ్డు దాటుకుంటూ రైలు పట్టాల వైపు నడక సాగించారు. గతం రోజు ఇచ్చిన ఆదేశాల ప్రకారం ఆయనతో పై మెహెరాబాదు వెళ్లేందుకు చాలా గ్రూపులవారు మెహెర్ బాబా రాకకై ఎదురు చూస్తున్నారు. బాబా సమీపించగానే జనం ఆయనతో చేరి ఎన్నో ఏళ్లుగా అనేక పర్యాయలు బాబా పాదస్పర్శతో పునీతమైన దారి వెంట కొండపైకి నడిచారు.

కొండపై భాగానికి చేరగానే బాబా ఆగిపోయి మెహెర్ రిట్రీటు గేటు ఎదురుగా ఉన్న పాత నీటి ట్యాంకు వద్ద గల వేప చెట్టు నీడలో కూర్చున్నారు. ఆయన ఒక కాలిని బారచాపి, వెనుకకు వాలి కూర్చున్నట్లు కనిపించారు. ఆ సమయంలో ఫోటో తీయుటకు అనుమతించిన ఫోటోలో ఈ దృశ్యాన్ని చూడవచ్చును. కొందరు వృద్ధులు, అనారోగ్య పీడితులు వెనుకబడిన వారు కలుసుకొనేందుకు ఆ సమయం సరిపోయింది. మళ్ళీ వారితో కలుసుకోగానే బాబా మొత్తం బృందాన్ని ఇప్పుడు సమాధి అని పిలువబడుతున్న ఆయన భావి సమాధికి ఒక చిన్న గేటు ద్వారా తీసుకు వెళ్లారు.

బాబా తన సమాధిలోకి ప్రవేశించలేదు. కానీ దానిపక్కన ఉన్న ప్లాటుఫారంపై నిలబడ్డారు. "ఇది నేను ఇంతకు ముందు సుధీర్ఘకాలము ఏకాంతవాసం, ఉపవాసంతో గడిపిన స్థలము." అని నలు చదరంగా రాతితో నిర్మించిన సమాధిని చూపిస్తూ వివరించారు. "లోపలి భాగంలో మీరు ఒక గోరీని చూస్తారు. ఏకాంత సమయమంతా నేను రాత్రిం పగళ్లు అందులోనే గడిపాను. నేను నా శరీరాన్ని వదలిన పిదప అంతిమ విశ్రాంతి కొరకు నా పార్థివ శరీరం ఇందులో ఖననం చేయబడుతుంది." చాలాసార్లు బాబా గోరీని గురించి వివరిస్తూ అది తన "అంతిమ విశ్రాంతి ప్రదేశము"గా చెప్పేవారు.

బాబా తన పాశ్చాత్య శిష్యుడొకరిని ఆ సమాధి తలుపు తెరవమని చెప్పారు. ప్రతి వారిని లోనికి వెళ్ళి చూడమన్నారు. గోరీ లోపలకు వెళ్ళేందుకు మెట్లున్నాయి సమాధి లోపలి గోడలన్నీ హెలెన్ దాహమ్‌చే చిత్రీకరించబడిన అందమైన కుడ్య చిత్రాలతో వెలిగిపోతున్నాయి. పురుషులంతా గడపపై ప్రణమిల్లారు. కొందరు పుష్పాలు సమర్పించుకున్నారు. ఆ తర్వాత

బృందమంతటినీ తిరిగి బయలుదేరి మీటింగు పెండాలకు చేరి తమ తమ సీట్లలో కూర్చోమన్నారు.

అనుకోకుండా ఆనాడు చెట్ల నీడలో, బాబా విశ్రాంతి తీసుకున్న ఆ చిన్ని వేపచెట్టు ఈనాటికీ అలరారుతోంది. అందరి కోసం ఆగి ప్రతివారిని స్వయంగా తన అంతిమ విరామ స్థలానికి తీసుకు వెళ్లిన ఆపురాణ పురుషుడిని అది నాకు జ్ఞాపకం చేస్తుంది. ఇలా అవతారుని నిలయంలో ప్రతివారు ఉండేట్లు చేయటం జరిగింది.

9-30కు బాబా కొండపై నుంచి మీటింగు పెండాలకు చేరుకున్నారు. బాబా వచ్చినప్పుడు ఎవరూ లేచి నిలబడవద్దని, అందరినీ తమ కుర్చీల్లోనే కూర్చోమని ఆదేశించారు. అనేకమంది మండలి వెంటరాగా బాబా వేదిక వద్దకు చేరి తన ఆసనముపై సుఖాసీనులయ్యారు. తన ప్రేమికులను ఉద్దేశించి బాబా ప్రసంగిస్తూ, "ఈనాటి సాయంత్రం నేను నా అంతిమ ప్రకటనను చేయబోయే ముందు, నేను ఇతర విషయాల గురించి కొన్ని మాటలు చెప్పాలను కుంటున్నాను. సాయంత్రం 3-00లకు సాయం సమావేశం మొదలవుతుంది. అది పూర్తికాగానే తక్షణం నేను మెహెరాజాదుకు బయలుదేరుతాను. ఈ మీటింగు యొక్క పూర్తి లాభాన్ని పొందాలను కున్నవారంతా మరియు, ఈ ప్రదేశపు వాతావారణంతో తమ ఇళ్లకు చేరాలనుకున్న వారందరూ తిన్నగా తమ ఇళ్లకు తిరిగివెళ్ళండి. ఇప్పుడు నేను నా గురువులు గురించిన కొన్ని మాటలు చెపుతాను" అని వివరిస్తూ సకోరి నుండి వచ్చిన అయిదుగురిని పిలిచి వేదికపై కూర్చోమన్నారు. బాబా తన ప్రవచనాన్నిలా కొనసాగించారు.

దివ్య సనాతనుడిగా నేను ఏదై ఉన్నానో, నేను ఏదై ఉంటినో నేను ఏదై ఉందునో అది ఎప్పుడూ ఆ కాలపు పంచ సద్గురువులు వల్ల జరుగుతుంది. సాయి బాబా, ఉపాశినీ మహారాజు, బాబాజాన్, తాజుద్దీన్ బాబా, నారాయణ మహారాజులు, నాకీ యుగంలో పంచ సద్గురువులు. నేను వారికి పాదాభివందనం చేస్తున్నాను. అయినప్పటికీ, బాబాజాన్ మహరాజులు మాత్రమే ప్రధాన పాత్రలను ప్రత్యక్షంగా పోషించారు. బాబాజాన్ ఒక సెకండు యొక్క లక్షోవంతు కంటే తక్కువ సమయంలోనే నన్ను నేను భగవంతుడిని అని తెలుసుకొనేట్లు

చేసింది. షుమారు ఏడు సంవత్సరాల కాలంలో ఉపాశినీ మహరాజు నేను అవతారుడి నన్న దివ్య జ్ఞానాన్ని నాకు ప్రసాదించారు.

ప్రస్తుతం సకోరి ఆశ్రమానికి గోదావరి మాయి అధిపతి. ఆమె ఒక అద్భుతమైన స్త్రీ మూర్తి. మాటల కందని రీతిలో ఆమె నన్ను ప్రేమిస్తోంది. ఆమె నాకు ప్రియాతి ప్రియమైన ప్రేమికురాలు.

మహారాజు శిష్యులైదుగురినీ బాబా సభకు పరిచయం చేశారు. భోజనాలయ్యాక ఇటీవల తన సకోరి దర్శనంలో తీసిన చాయా చిత్రాలు చూపబడతాయని బాబా తన ప్రేమికులకు చెప్పి మరలా ఆయన కొనసాగించారు.

దయచేసి ఇప్పుడు శ్రద్ధగా వినండి. పూర్తిగా మెలకువ తెచ్చుకోండి, మగతగా ఉండ వద్దు. నేను మాట్లాడటం మానినప్పటి నుంచి, మరియు సంతకం చేయమనేటప్పుడు తప్ప వ్రాయటం మానినప్పటి నుంచి నేను మౌనం ప్రారంభించిన ఇన్నేళ్లుగా నేను తెలిపే సమాచారాన్ని అక్షరఫలక సహాయం ద్వారా అందిస్తున్నాను. 1954 అక్టోబరు 7 నుండి నేనీ అక్షర ఫలకాన్ని కూడా విసర్జించబోతున్నాను. కనుక అప్పటి నుండి నేను మాట్లాడను, వ్రాయను, అక్షర ఫలకాన్ని వినియోగించను. చేతి వేళ్లతో సౌంజ్ఞలూ చేయను. అవన్నీ నాలో నేను వెనక్కు తీసుకున్నట్లుగా ఉండిపోతాను. ఎందుకంటే, ఎంతో కాలంగా వాగ్దానం చేస్తున్న, అనేక పర్యాయాలు వాగ్దానము చేసిన నా మౌన విరమణా సమయము ఆసన్నమైంది. అక్టోబరు 7 నుండి నేను నా ప్రస్తుత కార్యక్రమాల నుండి పూర్తిగా చాలించుకుంటాను. ఇక ముందు సామూహిక దర్శనాలుండవు. ఏ కార్యక్రమాలూ ఉండవు. ఏ సమావేశాలుండవు ఏ సందేశాలుండవు. ఉత్తర ప్రత్యుత్తరాలుండవు, దీనిని తీవ్రంగా తీసుకొని, అక్టోబరు 7 నుండి ఎటువంటి ఉత్తరాలు నాకు వ్రాయవద్దు. నేను ఏ ఉత్తరానికి ఆసక్తి చూపను. అయినా ఇంతకు ముందే వాగ్దానం చేసినట్లుగా నేను గాడ్గే మహారాజుకు అలా చేసే అదృష్టం ఉంటే ఆయన నన్ను పండరీపురం తీసుకు వెళ్ళినప్పుడు ఆయనతో కలిసి వెళతాను" అన్నారు.

బాబా డా॥ డాన్‌కిన్‌ని వేదిక వద్దకు పిలిపించి తన మౌన విరమణ దాని పర్యవసానము గురించి ఒక ప్రసంగ రూపంలో అతనికి వివరించారు. అంత

డాన్‌కిన్ సభలో మైకు ద్వారా ఇలా మాట్లాడాడు. ఒక ఆటంబాంబు అది ఎంతో చిన్న అణురూపంలో ఉన్నా పేలినప్పుడు మహా విస్ఫోటనాన్ని ఎలా కలిగిస్తుందో అదే విధంగా బాబా తన మౌనాన్ని విరమించినప్పుడు విశ్వాత్మకంగా ఆధ్యాత్మికోన్నతి పైకి లేస్తుంది. అలా చోటు చేసుకున్న స్థితిని ఎవరూ వర్ణించలేరు. ఎవరూ ఎదురు చూడని తరుణంలో ఇది సంభవిస్తుంది. భూకంపం జరిగినప్పుడు ఎవరూ ఏమీ చేయలేకపోయినా ప్రతివారు అది తాకిన ప్రాంతంలో దానిని అనుభవించే విధంగా బాబా మౌన విరమణ కూడా ఒక ఆధ్యాత్మికోన్నతిని సృష్టిస్తుంది. ప్రతివారు తమ హృదయంలో దానిని అనుభవిస్తారు.

ఆ పిమ్మట బాబా తన ప్రేమికులకిలా చెప్పారు. "నేనెన్నడూ మరణించను. నేను సదా సనాతనుడను. గుర్తుంచుకోండి. భగవంతుడు మాత్రమే సత్యము. తక్కినదంతా మిథ్య. మీరంతా లేక మీలో కొందరు లేదా కనీసం ఏ కొద్ది మందన్నా నా ప్రేమ సందేశాన్ని ఇతరులకు వ్యాప్తి చేస్తే మీరు ఈ సమావేశానికి హాజరైనందుకు విలువ వుంటుంది.

"నా అంతిమ ప్రకటనను వినేందుకు మీరంతా మూడు గంటలకు ఇక్కడ ఉండండి. అది నాలుగు ప్రధాన భాషలైన, ఆంగ్లము, హిందీ, తెలుగు, మరాఠీలో చదవ బడుతుంది. ఆ పిమ్మట మీరు బయలుదేరవచ్చును. మీరంతా రేపు మధ్యాహ్నం బయలు దేరాలి. ఈ వేళ భోజనాలయ్యాక నేను ఇటీవల సకోరి సందర్శించినప్పుడు తీసిన ఛాయాచిత్రాలను చూచే అవకాశం మీకిస్తున్నాను. అయితే ఎవరూ నాకు పుష్పమాలలు సమర్పించే ప్రయత్నం చేయటంగాని నన్ను ఆలింగనం చేసుకోవటం కాని చేయవద్దు". అని చెపుతూ, కొద్దిగా ఊపిరి తీసుకొని "ఏమైనప్పటికీ, నేను భోజనం తర్వాత మీలో కొందరితో గోలీలాడతాను" అన్నారు.

బాబా వెలిగిపోతూ ఆ రోజు ఉదయ సమావేశం జరిగినంత సేపూ చాలా ఉల్లాసంగా కనిపించారు. ఆయన ఆలోచనాలేమిటో ఉన్నప్పటికీ, సమావేశమంతా విచారవదనం నెలకొన్నది. పురుషులు బయలుదేరు తుంటే, కొందరిలో తమకిక అవతారుని భౌతిక సమక్షంలో గడిపే అవకాశాన్ని త్వరలోనే కోల్పోతున్నామన్న ఆవేదన సప్పష్టంగాద్యోతకమైంది.

## సాయం సమావేశం : అంతిమ ప్రకటన



భోజన సమయంలో, బాబా భోజన హాల్లోకి వచ్చి సందర్శించారు. ఆయన రాగానే ఆయన ఒకరిని తనతో అనుసరించి రమ్మన్నారు. అతనికి పూరీలున్న బుట్టను ఇచ్చి పట్టుకోమన్నారు. ఆయన వాటిని తన ప్రేమికుల భోజనంలో స్వయంగా వడ్డించారు. అలా ఆయన వడ్డన చేసిన వారందరి హృదయాలను ఆయన సమక్షం ఆనంద పరచింది. ఈ విధంగా అనాపేక్షతంగా లభించిన అరుదైన ప్రత్యేక ప్రసాదం వల్ల వారు అదృష్ట వంతులయ్యారు.

బాబా ఇంకా వంటిల్లును కూడా దర్శించారు. వంట తయారీలో కూడ తన శ్రద్ధను చూపారు. ఆటలాడుతున్నట్లు వంటవారిలో ఒకతనితో పూరీలు వత్తి తయారు చేయటంలో పోటీపడ్డారు. తనదైవ వేడుకలో చివరకు బాబా ఓడిపోయారు.

ఆయన వంట ఇంటి నుంచి మండలి హాలుకు బయలు దేరుతుండగా డా॥ దేశ్‌ముఖ్ ఆయన వెంటే ఉండి "బాబా! మానవాళి కోసమన్నా, దయచేసి నీ శరీరాన్ని త్వరలోనే విసర్జించకండి. మాకు మీరు కావాలి" అని బ్రతిమలాడాడు. పట్టు విడువకుండా డా॥ దేశ్‌ముఖ్ ఎంతగా హఠం చేసినా బాబా అతడి వైపు నవ్వుతూ చూచారే తప్ప ఎటువంటి సమాధానము ఇవ్వలేదు.

హాల్లో బాబా తనతో ఆడిన ఒకప్పటి తన క్రికెట్ టీమ్‌లోని సభ్యులను కలుసుకున్నారు. పాత జ్ఞాపకాలు గుర్తుకు వచ్చి కమలాలను వారివైపు బంతుల్లా విసిరి వేశారు. పిమ్మట, అనేక ఇతర గ్రూపుల వారిని లోనికి పిలిపించి ఇటీవల బాబా మహారాజు ఆశ్రమాన్ని దర్శించినప్పుడు తీసిన ఫోటోలను చూడమన్నారు.

పిమ్మట, కాసేపు బయట వరండాలో పచార్లు చేసి, తన ప్రేమికులు కొందరితో గోలీలాడారు. భజనగానం జరిగింది. ఆ పాటలకు బాబా చాలా

ముగ్ధులయ్యారు. సంగీతానికి అనుగుణ్యంగా బాబా మధ్య మధ్య చప్పట్లు కొడుతూ తన మోకాలిపై తాళం వేశారు.

అంతిమ ప్రకటన చదివే సాయంకాల సమావేశపు వేళ దగ్గరపడటంతో బాబా సమావేశపు పెండాల వైపు బయలు దేరారు. దారిలో ధుని దగ్గర ఒక గ్రామస్థుల బృందము ఆయన దర్శనం కొరకు ఎదురుచూస్తుంటే కాసేపు అక్కడ నిలబడ్డారు. బాబా పెండాలలో ప్రవేశిస్తున్నప్పుడు సభను నిలబడవద్దని ఆదేశించారు. తిన్నగా ఆయన వేదిక వద్దకు వెళ్లి తన ఆసనాన్ని అలంకరించారు. ఆయన ముఖము అతి అరుదైన ప్రకాశంతో వెలుగొందుతోంది. మూడు గంటలకు 10 నిమిషాలు ముందు బాబా ఆంధ్ర నుంచి వచ్చిన ఒక ప్రేమిక బృందాన్ని భజన కీర్తనలు పాడుటకు అవకాశమిచ్చారు. వారు స్వయంగా వ్రాసిన పాటలు పాడే సరికి బాబా మెచ్చుకొని వారికి తన యందున్నప్రేమకు, విశ్వాసానికి తన సంతోషాన్ని వ్యక్తపరచారు. వాతావరణమంతా బాబా దివ్య సముకంతో నిండుగ వ్యాపించింది.

సరిగ్గా 3-00లకు బాబా నుండి ఎటువంటి ఆదేశాలు లేకుండానే, ఎరుచ్ అంతిమ ప్రకటనను ఆంగ్లంలో చదువ ప్రారంభించాడు. ఆ సమావేశానికి ముందే బాబా యీ సందేశాన్ని ప్రవచించారు. అందలి విషయాలు టైపు చేయబడి రహశ్యంగా ఉంచబడినవి.

ఎరుచ్ కంఠ స్వరం మైకు ముందు మాట్లాడటం వల్ల చాలా గంభీరంగా వినిపిస్తోంది. వినే వారు ఏకాగ్రతతో వింటున్నారు. చాలా కళ్లు బాబాపైనే లగ్నమైయున్నవి. చాలామంది వ్యక్తులు ఆ క్షణంలో వారికి అక్కడ బాబా శారీరకంగా లేనట్లు, అయినా రూప రహితుడైన భగవంతుడు బాబా మాటల ద్వారా తానే మాట్లాడుతున్నట్లు అనుభవమైందని చెప్పారు.

అవతార్ మెహెర్ బాబా అంతిమ ప్రకటనను ఈ క్రింద పొందుపరుస్తున్నాను. పాఠకుల సౌకర్యార్థం, నేను మూల విషయాన్ని నాలుగు విభాగాలుగా విభజించే స్వేచ్ఛను తీసుకున్నాను.

## ప్రతి హృదయము నా మందిరము

మీరంతా ఇక్కడ ఉన్నందుకు నాకు చాలా ఆనందంగా ఉన్నది. చాలా కష్టతర పరిస్థితుల్లో ఉండి మీలో చాలామంది మెహెరాబాదు వచ్చారని నాకు తెలుసును. మీలో కొందరు వేలాది మైళ్ల ప్రయాణం చేసి, ఆఖరికి మహా ఖండ ద్వీపాలు సైతం దాటి ఈనాడు మెహెరాబాదులో గడిపేందుకు వచ్చారు. నా యందు మీకున్న గాఢమైన ప్రేమే మీకు ఎదురైన అడ్డంకులన్నీ అధిగ మించేట్లు చేసి మీ సౌఖ్యాల్ని, అనుకూలాన్ని త్యాగం చేయమని పురికొల్పి, నా పిలుపును గౌరవించి మిమ్మల్ని కూడా ఈనాడు నా చెంత ఉండేట్లు చేసింది.

మీ భక్తికి నేను గాఢంగా ముగ్ధుడినయ్యాను, అటువంటి ప్రేమను, రాజభక్తిని కలిగి వున్న ఆ హృదయాల్ని చూస్తే నాకెంతో గర్వంగా ఉన్నది.

మీలాంటి మరింకెన్నో అర్పణైన హృదయాలింకా ఉన్నాయి. ఇక్కడకు వచ్చి హాజరవ్వాలని తపిస్తున్నా అవి యీ నాడు మీ మధ్య ఇక్కడ కనిపించక పోవచ్చును. నా దగ్గర ఉండాలన్న ప్రగాఢ వాంఛ వారికి ఉన్నప్పటికీ, ఏదో ఒక కారణం వల్ల వారు రాలేక పోయారని నాకు తెలుసు. అందువల్ల ఈ రెండు రోజులూ ఒక అద్భుత అవకాశంగా ఇక్కడ జరిగిన విషయాలన్నీ స్పష్టంగా వివరాలతో చెప్పే బాద్యత మీ పై ఉన్నది. అలా ప్రతిదీ చెప్పకుండా వదిలి వేయరనే నేను విశ్వసిస్తున్నాను.

నాయందు పరిపూర్ణమైన ప్రేమ విశ్వాసంతో మీరు ఇక్కడ హాజరైయున్నప్పటికీ, మరియు నన్ను వ్యక్తిగతంగా కలుసుకొన్నందున మీరు అదృష్టవంతులని మీరు భావించినప్పటికీ, మీరు యీనాడు గుర్తించవలసిన దానిని ఇంకా గుర్తించలేదని నాకు తెలుసును. నా పిలుపు యొక్క యధార్థ భావాన్ని ఈ తరుణంలో మీరు ఇక్కడ ఉండ కలిగినందుకు దాని అర్థాన్ని మీరు గ్రహించలేరని నేనెరుగుదును. కాలము మాత్రమే మీలో చాలామంది దీనిని గ్రహించేట్లు చేస్తుంది. ఈ సమావేశపు ప్రాముఖ్యతను అర్థం చేసుకొనుటకు మరింకెన్నో నెలలు కూడా పట్టదు.

కాలము అతివేగంగా సమీపిస్తోంది. నేను కాలానుగుణ్యంగా మాటి మాటికి నొక్కి చెపుతున్నదంతా, తప్పకుండా జరిగితీరుతుంది. ఆ సంఘటనలన్నీ మీలో కొందరు ప్రత్యక్షంగా చూస్తారు. ఈ రెండు రోజుల నుండి మీరు

మెహెరాబాదులో ఉన్నప్పుడు జరిగినవన్నీ మీరు బహు స్పష్టంగా గుర్తుకు తెచ్చుకుంటారు.

నేను ఏదీ కొత్తగా స్థాపించేందుకు రాలేదు. నేను వచ్చింది జీవితాన్ని పాతదాన్లో ఉంచేందుకే, నేను ఆరామాల్ని, ఆశ్రమాల్ని స్థాపించేందుకు రాలేదు. నా దివ్య కార్యక్రమ అవసరం కొరకు నేను వాటిని సృష్టిస్తాను. ఆ అవసరం తీరిపోగానే వాటిని కేవలం పలుమార్లు ఎత్తివేస్తాను.

"ఈ జగత్తే నా ఆశ్రమము. ప్రతి హృదయము నా మందిరము. కానీ నేను తప్ప అన్యులెవరూ ఉండకుండా ఉన్న హృదయంలోనే నేనుంటాను."

## సార్వజనిక ప్రేమ మతము



మతముల పేరుతో వట్టి బూటకమైన నియమ నిబంధనలతో, కర్మకాండలు, ఆచార కర్మలతో భ్రష్టు పట్టిస్తున్న తరుణంలో నా సార్వజనిక ప్రేమ మతపు ప్రాముఖ్యత వాడిపోయినప్పుడు తిరిగి దానికి ప్రాణ ప్రతిష్ట గావించుటకు నేను వస్తాను.

ప్రస్తుతము సర్వత్రా వ్యాపించిన గందర గోళము, కలవరము, అధికార వ్యామోహంతో, ధనము కీర్తి ప్రతిష్టల కోసం పేరాశతో తపించే వారి హృదయాల్ని నింపి, చెప్పలేనంత దుఃఖాన్ని ఈర్ష్యా ద్వేషాల్ని, నిరర్థకమైన భంగపాటును, భయాన్ని తెచ్చిపెడుతోంది. శాంతిని, అభ్యుదయాన్ని శుఖ శాంతులు అచిర కాలం వ్యాప్తి చెందేందుకు ఎంత గట్టిగా ఉద్యమించినా జగత్తులో బాధపడటమనేది తారస్థాయికి చేరింది.

శాశ్వత సుఖపు మధుర క్షణాన్ని మానవుడు అనుభవించాలంటే, అతడు ముందుగా అందరిలో ఉన్న, అందరినీ ఎరిగిన, ఆ దైవాన్ని గుర్తించాలి. అంతే కాదు. భగవంతుడు మాత్రమే అందరి ద్వారా క్రియ, ప్రతి క్రియలు చేస్తాడని

లెక్కలేనన్ని జీవ నిర్జీవ రూపాల్లో ఉండే అస్థిత్వము భగవంతుడేనని, అసంఖ్యాకంగా కనిపించే వేర్వేరు సుఖ దుఃఖాలన్నీ అనుభవించేది భగవంతుడేనని యీ మాయా పూరిత సంఘటనలన్నీ భగవంతుడే స్వయంగా పడుతున్నాడని, తెలుసుకున్ననాడే ఆ మధుర క్షణాను భవం పొందుతాడు. ఈ విధంగా యీ మాయాపూరిత వ్యధను భగవంతుడు తుడిచి వేసి, భ్రామాన్విత సుఖాన్ని పైకెత్తుతాడు.

అది సృష్టిగా అవతరించినా లేదా సత్యము యొక్క ఏకత్వంలో అదృశ్యమైనా అది ఉనికిలో నిజంగా ఉన్నట్లు అనుభవించినా, లేదా, తాను అసత్యమని ఉనికి లేదని గ్రహించినా మాయ అనేది సర్వత్రామాయే. ఊహలకు అంతములేనట్లు, దానికీ అంతము లేదు.

మాయలో అనేకత్వము. ఏకత్వము అనే రెండు స్థితితులు అనుభవ మవుతాయి. అనేకత్వము, గుణించబడి అనేకంగా విస్తరిస్తుంది, కాగా ఏకత్వము స్వంయగా ఆకారపువృద్ధి చేస్తుంది. అనేకత్వము మాయ యొక్క "మతము". దీనిపైనే మాయ వర్ధిల్లుతుంది.

మాయా పూరిత కాలపు ప్రారంభంలో ఈ రోజున ఉన్నంతగా మాయలో యీ గందర గోళం లేదు. చైతన్యపు పరిణామము మొదలైనప్పుడు మాయలో భిన్నత్వం ఉన్నప్పటికీ, ఏకత్వము మాత్రమే ఉన్నది. చైతన్యము అభివృద్ధి చెందటంతో, అనేకత్వము కూడా పెరుగుతూ పోయింది. ఇప్పటి వరకు అది పరిమితులను దాటి పోయింది. ఒడ్డుకు వచ్చిన అల సాగర గర్భంలో కలసిపోయినట్లు, ఇది కూడా దానంతట అదే మాయలో ఏకత్వాన్ని తేవడం మొదలు పెడుతుంది. బాధ తారస్థాయికి చేరటం వ్లల, మాయలోని అనేకత్వము ఉత్కృష్టంగా ముమ్మరమై దాని వినాశనానికి కారణమవుతుంది. ముందుగా నిర్ణయించినట్లు అసంఖ్యాకమైన వియోగపు సంహారము జరగపలసిన సమయమాసన్నమైంది. దీనివల్ల మానవుడు, సమైక్యత, సోదర భావాను భవాన్ని కలిగి ఉంటాడు. ఈ సంహారము అతిత్వరలోనే జరుగుతుంది. దానివల్ల మూడు వంతుల ప్రపంచం నాశనం చేయ బడుతుంది. మిగిలిన నాలుగోవంతు ఐకమత్యం పరస్పర అవగాహనతో కలిసి జీవించేట్లు సన్నిహితమవుతారు. ఈ విధంగా సాటి వారందరిలో ఏకత్వ భావన ప్రతిష్టించబడి, శాశ్వత సుఖమువైపు వారిని నడిపించుట జరుగుతుంది.

# నేనా పదమును పలికినప్పుడు

నేను నా మౌన విరమణ చేయుటకు ముందు లేదా అలా చేసిన మరుక్షణంలో మూడు వంతుల ప్రపంచం నాశనం చేయబడుతుంది. అతి త్వరలోనే జరగబోయే దంతా సంపూర్ణంగా జరిగేందుకు నేను తప్పక త్వరలోనే మాట్లాడుతాను.

మతపర విశ్వాసములను నిర్ధారణ చేసి చెప్పుటకు, సంఘాలను స్థాపించటము, లేదా సమావేశాలు నిర్వహించటము వల్ల ఇప్పుడు మాయ యొక్క అనేకత్వంలో పూర్తిగా మునిగిపోయిన మానవాళి జీవితంలో ఐకమత్యము మరియు ఏకత్వ భావనను తీసుకు రావటం ఎన్నటికీ సాధ్యపడదు. భిన్నత్వం మధ్య ఐకమత్యాన్ని హృదయాంతరాళంలో హత్తుకుపోవటం వల్ల మాత్రమే తేవచ్చును. ఈ పని చేయటకే నేను వచ్చాను.

మీ హృదయాల్లో ప్రేమ బీజాన్ని నాటుటకే నేను వచ్చాను. దీని వల్ల మాయలోని మీ జీవితంలో పైకి కనిపించే చిత్ర విచిత్రాలన్నీటినీ సహనంతో తప్పక అనుభవించి తీరాలి. ప్రేమద్వారా ఏకత్వ భావన ప్రపంచంలోని అన్ని జాతుల మధ్య మతాలు, తెగలు, కులాల మధ్య యీ ప్రేమ ద్వారానే తేబడుతుంది.

దీనిని తీసుకు వచ్చే ప్రయత్నంలో నేను నా మౌనమును విరమించుటకు సమాయత్త మవుతున్నాను. నేను నా మౌనాన్ని విరమించినప్పుడు అది ఆధ్యాత్మిక ఉపన్యాసములతో మీ చెవులను నింపదు. నేను కేవలం ఒకే ఒక్క పదమును పలికెదను. మరి ఈ పదము మానవులందరి హృదయాల్లోకి చొచ్చుకు వెళ్లి ఆఖరికి పాపాత్ముడు సైతము తాను యోగిగా ఉండాలను కొనేట్లు చేస్తుంది, అలాగే ఒక యోగి సైతము తనలో భగవంతుడు ఉన్నట్లే పాపాత్ముడిలో కూడా భగవంతుడున్నాడని తెలుసుకుంటాడు.

నేనా పదమును ఉచ్ఛరించినప్పుడు తదుపరి ఏడు వందల సంవత్సరములలో జరుగవలసి వున్న దానికి పునాదిని నేను వేసితీరుతాను. ఏడు వందలేండ్ల తరువాత నేను మరల వచ్చినప్పుడు చైతన్య పరిణామము ఎంతటి శిఖరాగ్ర స్థాయికి చేరుకుంటుందంటే, నాస్తిక భావాలు యాంత్రికంగా ఆధ్యాత్మిక తపనగా మారిపోతాయి. విశ్వాత్మక సోదరత్వంలో సమానత్వ భావన వెల్లివిరుస్తుంది. అనగా ఐశ్వర్యము పేదరికము, విధ్య - అవిధ్య, ఈర్ష్య - ద్వేషము వంటివి నాడు

పూర్తి ప్రమాణములో అలుముకొని ఉన్నప్పటికీ, అప్పుడవన్నీ మానవులందరి ఏకత్వ భావన ద్వారా కరిగిపోతాయి. అప్పుడు శ్రేయస్సు, సౌఖ్యము పూర్తి ఉచ్ఛదశలో ఉంటాయి.

దీని అర్థం, మాయలో ఏకత్వం శాశ్వతంగా ఉంటుందని కాదు. మాయలో శాశ్వతంగా ఉంటుందని కాదు. మాయలో అనేకత్వంలాగానే పరిణామపు విధానంలో ఇది ఒక భాగము. మాయలో అనేకత్వపు మరియు ఏకత్వపు పెరుగుదల మరియు ఉచ్ఛదశలు పతాక స్థాయికి చేరుకున్నప్పుడు ఈ విధంగా మళ్లీ పునః సంభవమగుటకు కాలము కట్టుబడి ఉన్నది.

## యుగ పరంపరలో ఒక శకము

నా తదుపరి అవతరణ, నేనీ భౌతిక శరీరాన్ని పరిత్యంచిన తరువాత ఏడు వందల ఏళ్లకు జరుగుతుంది. దానితో ఒక శకము అంతమై మరో పౌరాణిక యుగము ఆరంభమవుతుంది. శకములన్నీ మాయలోని కాలంలో సమాప్తమై మరల 700ల నుండి 1400 ఏళ్ల తరువాత మొదలవుతాయి. అటువంటి లక్షలాది శకములు పౌరాణిక యుగములలో ఉన్నాయి మరియు ఉంటాయి. ఈ విధంగా మాయకు అంతము లేదు. అది నిరంతరం నిలిచి ఉండే మాయ.

ప్రతి యుగములోను ఒకసారి నేను మానవాళి మధ్యకు వచ్చి, మాయ యొక్క నా స్వంత సృష్టిని పోషిస్తాను. దానితోపాటు, మానవాళి దానిని తెలుసుకొనునట్లు కూడా మేల్కొలుపుతాను. ఈ మాయ యొక్క అల్లిక పని ఎప్పుడూ ఒకే తీరులో ఉంటుంది. కానీ మాయలోని ఆకారాలు కోకొల్లలు. నిరంతరం మారుతూనే ఉంటాయి. నా అవతరణ మాయను నాశనం చేయుటకు కాదు. ఎందుకంటే మాయ దానికది అవశ్యం శూన్యం. ఈ మాయ యొక్క శూన్యత్వాన్ని మీరు గ్రహించ కలిగేట్లు చేయుటకే నేను వచ్చాను. మీ ద్వారా, నేను యాంత్రికంగా మాయను పోషిస్తాను. అది నా అనంతాత్మ యొక్క నీడ తప్ప వేరేదీ కాదు. నా ద్వారా మీరు యాంత్రికంగా మాయ యొక్క కాపట్యమును తెలుసుకొనేట్లు తయారు చేయబడినప్పుడు, మాయను యాంత్రికం గానే విడిచిపెడతారు.

అవతారుడిగా, నా ప్రత్యక్షీకరణ బహు స్వల్ప కాలం ఉంటుంది. ఈ స్వల్ప కాలం బిరబిరా జరిగిపోయి, నా అవమానము, నా మౌన విరమణ, నా

ఘన వైభవము, మరియు నా బలవన్మరణము వెంటవెంటనే జరిగిపోవును. అనాదిగా నా లోపల ఉండే దివ్యానందంతో, నేను నిరంతరం ప్రతి ఒక్కరి కోసం బాధపడుతున్నాను. ఈ విధంగా నేను అందరి కోసం విడవకుండా నిత్యం శిలువ వేయబడుతున్నాను. ఈ స్వల్ప కాలములోనే, నా ఏకైక పదము సకల మానవాళి హృదయాల్ని తాకుతుంది. యధేచ్ఛగా ఈ దివ్య స్పర్శ మానవుడిలో తోటి సహచరు లందరూ ఒకటేనన్న ఏకత్వ భావన, మనసున పడేట్లు చేస్తుంది. క్రమంగా రాబోయే ఏడు వందల సవత్సరాల్లో ఈ భావము వేర్పాటు ఆశయాన్ని తోసి పారేస్తుంది. అందరి హృదయాల్ని క్షాళన పరచి ఈర్ష్య ద్వేషము, పేరాశలను పారదోలి, సుఖశాంతులు ఏలుబడి అయ్యేట్లు పరిపాలిస్తుంది.

ఇంగ్లీషు అర్థం కాని వారి కోసం ఈ ప్రకటన అనువాదాన్ని తెలుగులో, హిందీలో, మరాఠీలో కూడా చదివారు. డా॥ దేశ్‌ముఖ్ మరాఠీ అనువాదాన్ని చదవటం మొదలు పెట్టాడు. అంతలో వర్షం మొదలైంది. ఆ గుడ్డ పెండాలపై కప్పు నుండి వర్షపు నీరు కారుతుందేమోనని నేను విస్మయపడ్డాను. అయితే ఆశ్చర్యంగా కొద్ది నిమిషాల్లోనే వాన పూర్తిగా ఆగిపోయింది. బాగా ఎండ వచ్చేసింది. బాబా ఏమాత్రం చలించకుండా, ఆ చదువుతున్న దానిని ఏకాగ్రతతో వింటున్నట్లు కనిపించారు. ఆయన దేనిమీద వివరణ చెప్పటం కాని, వ్యాఖ్యానించటం కానీ చేయలేదు. ఆఖరి అనువాదం చదవటం పూర్తికాగానే, తన ఆసనం నుంచి బాబా లేచారు. కొద్దిసేపు గడిచాక నేను ఆయన్ని వేదిక అంచుమీద ఉండటం చూచాను.

సరిగ్గా అప్పుడే మైకులో అక్కడ హజరైన వారంతా క్యూలో నిలబడి బాబా చేతులు మీదగా ప్రసాదం తీసుకోమని ప్రకటించారు. ప్రసాదం తీసుకోగానే ఎవరిళ్లకు వారిని వెళ్లిపొమ్మని తెలియజేశారు. ఆ సందేశం చాలా మంది హృదయాల్నితిమ్మిరి పట్టించింది. కొంత మంది కలవరపాటుతో దిమ్మెరపోయినట్లు కనిపించారు. బాబా ప్రసాదాన్ని అతిలాఘవంతో నిరాఘాటంగా పంచి పెట్టారు. పాశ్చాత్యులు ఆయన వద్దకు వచ్చినప్పుడు, ముద్దు పెట్టుకొనుటకు వీలుగా తన చేతినందించారు. వాళ్లు సామాన్లన్నీ సర్దుకొని ఆ సాయంత్రం బయలుదేరుటకు సిద్ధంగా ఉండమని తెలియపరిచారు. తరువాత బాబా తన కారు వద్దకు వెళ్లగానే చాలామంది ఆయన్ని చుట్టుముట్టి విలపించసాగారు. వారిలో ఒక యువకుడు, కారు బయలు దేరగానే పరుగున వచ్చి బావురుమని విలపించసాగాడు. సరిగ్గా ఆ కుర్రాడు కారు తలుపుకు తన తలను బాదుకొనబోయే సమయంలో బాబాకారును ఆపమని సౌంజ్ఞ చేశారు. ఎంతో ఆప్యాయతగా బాబా అతనిని ఊరడించి ధైర్యము తెచ్చుకోమని అనునయించారు. పిమ్మట కారు మెహెరాజాదుకు బయలుదేరింది.

## ఆత్మ శుద్దే ఆత్మార్పణ

బ్రహ్మాండమైన సమావేశము ముగిసింది. అక్టోబరు 1 మధ్యాహ్నం నుండి అందులో పాల్గొన్న వారంతా మెహెరాబాదు నుండి బయలు దేరారు. సూర్యుడు బాగా ప్రజ్వరిల్లుతున్నాడు. భారతదేశంలో, అక్టోబరు నెలను రెండవ వేసవిగా భావిస్తారు. కాంట్రాక్టరు, పెండాలను, టెంటులను, భోజనశాలను ఊడదీయటం ప్రారంభించాడు. ఆ మర్నాటికి ఎడ్లబండ్ల నిండా కొయ్య బాజు, గుడ్డ షామియానాలను ఎక్కించి అహ్మదు నగరుకు తీసుకు వెళ్లటం మొదలైంది. ఈ కట్టడాలన్నీ కట్టేందుకు పట్టిన ఎక్కువ సమయంతో పోలిస్తే, అవి ఊడబెరికేందుకు అతి తక్కువ సమయంలో త్వరత్వరగా జరిగిపోయింది.

అక్టోబరు 1 నుండి 3 వరకు బాబా మెహెరాబాదును రోజూ రెండుసార్లు దర్శించారు. అత్యధిక భాగము ఆయన మండలితోనే హడావిడిగా గడిపారు. తన భవిష్య కార్యక్రమాల గురించి, వాటికిసంభందించిన వారిపై ఉన్న బాధ్యతల గురించి అవసరమైన ఆదేశాల్ని ఇవ్వటానికే అధిక సమయాన్ని వెచ్చించారు. ఒక వ్యాపారిగా బాబా ఆ సమావేశ సమయంలో అయిన జమా ఖర్చుల గురించి ఆరాతీసి, ఏ బిల్లు డబ్బు చెల్లించకుండా వదిలి పెట్టలేదని ధృవ పరుచుకున్నారు.

అక్టోబరు 4 వరకు నేను నా పాఠశాలకు వెళ్లవలసిన అవసరం లేనందున మరో మూడు రోజులు పాటు నేను ఇక్కడ ఉండిపోయేందుకు నాకు అనుమతి నిచ్చారు. ఈ సమావేశం సమయంలో కొద్దిమంది బాబాతో గడిపిన తమ జీవితాల్లో కలిగిన సంఘటనలను సంక్షిప్తంగా చెప్పారు. ఆ తొమ్మిది వందల హృదయాల్లో ప్రతి ఒక్క హృదయం మెహెరాబాదులో ఆయన ప్రేమ, బాబా దైవత్వం పై తమకున్న నమ్మకము మరియు ఆయనతో తమకున్న సంబంధాన్ని భిన్న రూపాల్లో ప్రతిఫలించినట్లు బహిర్గత పరచారు. రకరకాల సంఘటనలు, ఆ కథల్లోని మాధుర్యమైన అతిశయము నా హృదయంలో హత్తుకుపోయింది. వాటిని వినటమే నా అదృష్టము. వాటన్నిటినీ ఇక్కడ వివరించే ప్రయత్నం చేయటం సాధ్యపడదు. అయితే మెహెర్‌బాబాతో గడిపిన నా జీవితంలో దీప స్థంబాలుగా వెలుగుతున్న అనేక వ్యక్తిగత సంఘటనలను మీ ముందు ఉంచదలచాను.

ప్రతినెల 12వ తేదీన మెహెరాబాదులో ధునీ వెలిగిస్తారు. అయినప్పటికీ,

తన పాశ్చాత్య ప్రేమికులు ధునీలో పాల్గొనే అవకాశము ఇవ్వాలని బాబా సెప్టెంబరు 24న ధునీ వెలిగించే కార్యక్రమాన్ని అనుమతించారు. ఆ రోజున భోజనాలైన కొద్ది సేపటికి, పాశ్చాత్య బృందంతో బాబా క్రింది మెహెరాబాదు హాలులో కూర్చున్నారు. పిమ్మట తన పాశ్చాత్య ప్రేమికులు, భారతీయ ప్రేమికులతో కొద్ది సేపు మాట్లాడిన తర్వాత, బాబా ఆ మొత్తం బృందాన్ని ధునీ ప్లాటుఫారం వద్దకు తోడ్కొని వెళ్లారు. చాలామంది గ్రామస్థులు అప్పటికే అక్కడకు చేరుకున్నారు. ధునీ వెలిగించబడింది. ఆ ప్లాటుఫారం మీదున్న గుంటలో వెలుగుతున్న దివ్యాగ్నిని బాబా కళ్లనుంచి వెలువడే దివ్యాగ్ని ఇంధనంగా వెలిగించుటను అక్కడున్న చాలామంది చూచారు.

ఆ కార్యక్రమము అంతంలో అగ్ని జ్వాల ఇంకా మండుతుండగా బాబా మండలి అందరితోపాటు, మెహెరాబాదులో వాలంటీర్లుగా పనిచేస్తున్న భారతీయ ప్రేమకులందరిని, ప్లాటుఫారం దగ్గరకు రమ్మనమని కబురు పంపారు. బాబా పిలుపుకు బదులుగా నేను ఫ్లాటుఫారం దగ్గరకు వెళ్లగానే, బాబా నేతిలో ముంచిన ఒక గంధపు చెక్క ముక్కను ధునీలో విసరమని నన్ను ఆదేశించారు. అలా చేయటంలో నాలోని ఏదో ఒక కోరికను ఆహుతి చేయుట కిది ఒక సంకేతమని నాకు తెలిపారు.

క్యూ చాలా తక్కువగా ఉండటంతో నిజానికి నాకు దీని గురించి ఆలోచించుటకు సమయం లేకపోయింది. నాకు గుర్తున్నంత వరకు, ఎటువంటి ముందాలోచన లేకుండా ఈ క్రింది మాటలు నా మనస్సులో కలిగాయి "బాబా, నీ వెలుగులో నా ఆత్మనే సమర్పించు కుంటున్నాను" అనిపించింది. ఇదంతా ఎంత సహజంగా జరిగిందంటే, నేను మౌనంగా ఏమి మాట్లాడానో, ఏమని ప్రార్థించానో అవన్నీ మరచిపోయాను. ఆ తర్వాత యీ మాటలు నాకు జ్ఞాపకం వచ్చినప్పుడు, సరైన సమయానికి అంతర్గతంగా మార్గదర్శకత్వం వహించి ఏమాత్రం ఆలశ్యం లేకుండా పురికొల్పినందుకు నేనాయన కెంతగానో ఋణపడి ఉన్నాను. నేను ధుని కార్యక్రమంలో పాల్గొనటం అదే మొదటిసారి. ఒక వేళ మరో పర్యాయం హాజరై ఉంటే, సర్వాన్ని హరించే బాబా ప్రేమాగ్నిలో నేను సమర్పించుటకు ఇంకనాకేమి మిగిలింది !

ఆ సాయంత్రం బాగా పొద్దుబోయింది. అరంగాం గ్రామాన్ని సందర్శించేందుకు బాబా ఆ ఫ్లాటుఫారం మీద నుండే బయలు దేరారు. తక్కిన



14.

జనంతో పాటు నేనూ అనుసరించాను. మనుషుల మధ్యలో బాబాతో నడవటం, అది ఒక అద్భుత నడక. ఆ వూళ్లో ఒక ఇరుకు సందులో వెళుతుండగా అనుకోకుండా నేను బాబా ప్రక్కనే ఉన్నట్లు గమనించాను. ఆయన జడలోని ఒక పాయ విడిపోయి జుట్టు ఎగరటాన్ని నేను గమనించాను. నేను ఆదుర్దాకొద్దీ, లేదా పిచ్చి కానీ మరేదన్నా అనుకోండి, నేను దానిని మళ్లీ దువ్వి సరిచేయకుండా ఉండలేక పోయాను. ఆయన శిరోజాల్ని నేను ముట్టుకున్నానో లేదో ఆ మరుక్షణంలోనే బాబా నా వైపు తీవ్రంగా చూచే సరికి, ఆ చూపు నాకు ఆయన్ని సేవించుటకు కేటాయించిన హద్దులను అతిక్రమించానన్న భావము వెంటనే నాలో కలిగింది. విద్యుత్తు ప్రవహిస్తున్న వైరును పట్టుకున్నంత షాకు నాకు తగిలింది. అలా నేనందుకున్న కుదుపు ద్వారా, ఆయన వ్యక్తిగత అవసరాలు చూచే భాగ్యం నావంతు కాదని, ఒక వేళ నేను ఈ విషయంలో వత్తిడి చేస్తే ఆయనతో నాకున్న బాంధవ్య పరిధుల్ని నేను అతిక్రమించినట్లేనని తెలుసుకున్నాను. అప్పటి నుంచి, నేను మరెన్నడూ బాబా అనుమతిస్తేనే తప్ప ఆయన భౌతిక శరీరాన్ని తాకే ప్రయత్నం చేయలేదు. నేనీ చిన్న సంఘటన ద్వారా ఆయన వ్యక్తిగత సహాయకులు బాబాకు చేసే సేవను చూచి మెచ్చుకోవటమే తప్ప, అదే మాదిరి నేను చేయాలని ఎన్నడూ ఊహించలేదు. దైవీ మానవునితో మనకున్న సంబంధంలో, ఆయన దయతో నిర్దేశించిన విధంగా మనమంతా ఒకే వరుసలో నడవాల్సి ఉన్నది. అయితే ఇతరుల్ని అనుకరించకుండా ఉండటం అంత సులభం కాదు.

సెప్టెంబరు 29న జరిగే మీటింగు తొలి రోజు ఉదయం బాబా నన్ను తన గదికి రమ్మనమని కబురు పెట్టారు. అక్కడ అదీజీ ఉన్నాడు. ఆయన నాకు ఒక బారాటీ సీలుచేయబడిన కవరు ఇచ్చి "ఇవి రేపు చదవబోయే టైపు చేయబడిన అంతిమ ప్రకటన పేజీలు. ఈ సందేశాన్ని బాబా నిన్ను మరాఠీలో అనువాదం చేయమన్నారు. రేపు ఉదయం అనువాదం చేసిన కాపీతో పాటు ఈ ఆంగ్ల ప్రతిని నాకు అప్పగించు. ఇందలి విషయాల్ని ఎవరికీ బహిర్గత పరచవద్దు. వాటిని రహశ్యంగా ఉంచు. నీవు చేసిన బాషాంతర నకలును ఆఖరిసారిగా సవరించి ప్రకటించేందుకు డా॥ దేశ్‌ముఖ్‌కు వప్పగిస్తాను" అని చెప్పాడు. బాబాతో నేను కేవలం కొద్ది నిమిషాలే గడిపాను. అంతలో బాబా నన్ను బయలు దేరమని సౌంజ్ఞలు చేశారు. ఆయన ఎటో చూస్తూ, నాకేమీ చెప్పలేదు. అయినా, ఆయన దివ్య సమక్షంలో ఉన్నంత మాత్రం చేతనే నాలోని శక్తి ఉల్లాసపడింది. బాబానాలో ఉంచిన నమ్మకము వల్ల నేనెంతో గౌరవించబడ్డానను కున్నాను.

ఆ సమయంలో పెండూ నాకు వప్పగించిన యితర పనులతో చాలా హడావిడిగా ఉన్నాను. అయినప్పటికీ, ఏ మాత్రం ఆలశ్యం చేయకుండా బాబా మాటల్ని చదివేందుకు, నిశ్శబ్దంగా ఉండే చోటుకై వెతికాను. అది ఒక చిన్న సందేశం కాదని వెంటనే అవగతమైంది. మూడవ పేజీ చదవటం మొదలు పెట్టగానే మూల విషయం నా మనస్సు మీద చాలా కష్టమైన భారంగా అనిపించింది. దానిని చదవటం పూర్తి చేయగానే, బాబా అంతర్గత మార్గదర్శకత్వం లేకుండా దాని తర్జుమాను నేనెన్నటికీ చేయలేనని గుర్తించాను. బాబా అవసరమైన సహాయాన్నందించ కుండా ఎప్పుడూ ఎవరికీ ఎటువంటి పనిని చేయమని వప్పగించరన్న విషయాన్ని నేను మర్చిపోయాను.

ఆ రాత్రి షుమారు 10 గంటల సమయంలో వ్రాసుకొనుటకు అవసరమైన సరంజామాతో పెండూ గదిలోకి తొంగి చూచాను. ఆంగ్ల హిందూభాషల్లో గొప్ప పండితుడైన కేశవ నారాయణ నిగమ్ అక్కడ ఉండటం చూచి ఆశ్చర్యపోయాను. ఈ సందేశపు హిందీ అనువాదాన్ని ఆయన చేయటంలో నిమగ్నమైయున్నాడు. మెల్లగా ఆయన దగ్గరకు వెళ్లి తన హిందీ అనువాదాన్ని ఒక్కసారి చదివేందుకు అనుమతించమని నేను కేశవ్‌ను కోరగా ఆయన అంగీకరించాడు. ఇది బాబా ఆదేశానికి విరుద్ధం కాదు.

హిందీ, మరాఠీలు సజాతీయ భాషలు. అందువల్ల కేశవ నారాయణ చేసిన అనువాదం నాకు సహాయపడింది. ఆ పని అలసిపోయేట్లు చేసేదైనప్పటికీ, తెల్లవారేసరికినా అనువాదాన్ని పూర్తి చేశాను. నేను చాలా సంతృప్తి చెందాను. బాబా సమక్షంలో నా అనువాదాన్ని ఆంగ్ల పేజీలను ఆదీకి వప్పగించేటప్పుడు సగర్వంగా అందించాను. బాబా నుండి కొన్ని మెచ్చుకోలు మాటల్ని నేను ఆశించాను. అందుకు భిన్నంగా ఆయన నన్ను పూర్తిగా అలక్ష్యం చేశారు. దానితో నాకు చిర్రెత్తుకొచ్చింది. ఆ సమావేశం పూర్తికాగానే అతి త్వరలోనే ఉన్నత శిఖరాలనందు కొనుటకై మొదలుపెట్టిన ఒక ఆధ్యాత్మిక శస్త్ర చికిత్సగా దానిని నేను గ్రంహించ లేకపోయాను.

మూడు రోజుల తర్వాత అక్టోబరు 3 ఆదివారం నాడు, నేనా సాయంత్రం రైలుకు వెళ్లిపోతున్నందున వెళ్లివస్తానని బాబాతో నమస్కరించి చెప్పాలని మండలి హాల్లోకి వెళ్లాను. బాబా నా వైపు కనీసం ప్రేమ పూర్వక చూపులు కానీ, ఒక చిరునవ్వైనా గాని చూపలేదు. నేను మెదలకుండా గోడకానుకొని నిలబడ్డాను.

ఆయన తన సంభాషణను ఇతరులతో కొనసాగిస్తున్నారు. మధ్యలో పెండూ కల్పించుకొని, నాకు మెహెరాబాదులో వప్పగించిన విధులను మనస్ఫూర్తిగా ఎలా నిర్వహించానో బాబాకు పొగుడుతూ వివరించాడు. దానికి తోడు విష్ణూ కూడా "బాబా! బాలనాటు దుర్బలుడైనప్పటికీ, రాత్రింబగళ్లూ అతను కష్టపడి పనిచేశాడు. అంతిమ ప్రకటన మరాఠీ అనువాదం చేసిన రాత్రి అతను అసలు నిద్రేపోలేదు." అని పొగిడాడు. తనకు వివరించిన విషయాల్ని బాబా వినిపించుకోకపోగా అసలు పట్టించుకో లేదు. ఇది అత్యంత అసాధారణం. ప్రత్యేకంగా నేను కురుద్వాడీకి తిరిగి వెళ్లబోతున్న సమయంలో నాకు ఎదురైన యధార్ధ అనుభవము.

ఏమైనప్పటికి, సమయం గడిచిన కొద్దీ బాబా యొక్క స్పష్టమైన ఉపేక్షా భావం, ప్రత్యేకంగా ఆయన కళ్లల్లోని తేజస్సు నాకు ఒక గాఢమైన అర్థాన్ని స్ఫురింప చేశాయి. ఆ జ్వలించే కడగంటి చూపు, నేను ధునీలో ఏ ఆత్మను సమర్పించు కున్నానో దానిని ఆయన అంగీకరించినట్లుగా ఒక దివ్య సంకేతానికి చిహ్నాముగా కనిపించింది. ఆ ఆత్మ ఇప్పుడు ఆయన తేజః పుంజపు జ్వాలల్లో ధహించబడుతోంది. అది చివరకు పూర్తిగా బాబా యొక్క పరిశుద్ధమైన యధార్థ ధుని, యొక్క జ్వాలల్లో హరించుకు పోయినప్పుడు అది ఎంతటి మహిమాన్వితమైన అద్భుత క్షణము అవుతుంది !

నేను మా ఇంటికి చేరాను. కొద్ది రోజుల తర్వాత నిర్ధయాత్మకమైన బాబా ముఖ వైఖరి నాకు గుర్తువచ్చింది. అందులో దాగి ఉన్న అన్యోన్యత విశదమైంది. ఈ జ్ఞాపకాలన్నీ భాధాకరమైనవే అయినా, నాలోనే ఉన్న నా నిజాత్మయైన బాబాకు మరింత చేరువయ్యేందుకు గొప్పగా సహాయపడ్డాయి. పరిశుద్ధమైన ఆయన దివ్య తేజస్సులో నా అహమును తుడిచివేయుటకు నిష్కపటంగా కృషి చేసేట్లు ఆ జ్ఞాపకాలు నాకు ఉపకరించాయి. అంతిమ ప్రకటన సమావేశ సమయంలో, పురాణ పురుషుడిగా మెహెర్ బాబా త్వరలోనే తనదైన సమయంలో ప్రస్తుత యుగంలో ఏలుబడి అవుతున్న స్వార్థ పూరిత విలువల్ని తాను భస్మీపటలం చేస్తానని ప్రపంచానికి ప్రకటించారు. అంతే కాకుండా ఒక ప్రత్యేకమైన మార్గంలో, ఆయన తన ప్రేమికుల హృదయాల్లో, వారి హృదయాల్ని పరిశుద్ధ పరచేందుకు బాబా ధునీని వెలిగించారు. నిజానికిది ఒక జ్ఞాపకముంచుకొన దగిన, అతిముఖ్యమైన సమావేశము.

# అక్షర ఫలక విసర్జన మరియు పండరిపురం సందర్శన 1954 - 19వ భాగము

## సతారాలో మకాం పునరారంభం

అక్టోబరు 5న మెహెర్ బాబా, మెహెరాబాదు నుండి సతారాకు సరోష్ కారులో తన స్త్రీ మండలితో బయలుదేరారు. నీలూ, కుమార్‌లతో పాటు పురుష మండలితో మస్తుటూరుల్లో అనేక సార్లు ఉపయోగించిన ఆదీ కారులో నడుపుకుంటూ ఎరుచ్ బయలు దేరాడు. అతి త్వరలో కొందరు మస్తుల్ని కలుసుకోవాలని బాబా ఆలోచించటం వల్ల, ఈ కారుని సతారాలో తన ఆధీనంలో ఉంచమని బాబా కోరారు. అందుకే ఆ కారుకి అవసరమైన మరమత్తులు ఓవర్ అయిలింగ్ చేయించమని రూ. 500/-లు ఆదీ ఎరుచ్‌కి ఇచ్చాడు. దానికి అయ్యే ఖర్చు మరో రూ. 20/-లు అదనంగా ఖర్చువుతుందని తెలుసుకున్న ఆదీ, ఆ మిగిలిన పైకాన్ని కూడా వెంటనే ఎరుచ్ పేర మనియార్డరు చేశాడు. ఇది పైకి ఎటువంటి ప్రాముఖ్యత లేని అల్ప విషయంగా కనిపించినా, బాబా మరియు ఆయనతో ఉండే వ్యక్తులు అతి చిన్న విషయాల్లో సైతం ఎంత ఖచ్చితంగా ఉంటారో తెలుపుట కొరకే నేనీ విషయాన్ని కూడ ప్రస్తావించాను. సర్వజ్ఞునితో ఏ విషయమైనప్పటికీ, ఎలా అల్పమైన వవుతాయి ?

మెహెరా, మణి, మెహ్రూ, డా॥ గోహెర్, నజా, రానోలతో పాటు బాబా గ్రాఫ్టన్‌లో ఉన్నారు. జూన్ మొదటి వారంలో అద్దెకు తీసుకున్నప్పటి నుండి ఇంకా అది బాబా ఆదీనంలోనే ఉంది. పురుషమండలి రోజ్‌వుడ్‌లో ఉన్నారు. ఇది మూడు ఫర్లాంగుల దూరంలో ఉన్న మరో బంగళా. బాబా తరుచుగా ఒక పురుష మండలి సభ్యుడు ఎండకు ఆచ్ఛాదనగా గొడుగు పడితే అంత దూరం నడుచుకుంటూ వెళ్లేవారు.

అక్టోబరు 6న సతారా చేరుకోగానే, షిరిడీ శ్రీ శాయి బాబా సంస్థాన్ మేనేజింగు ట్రస్టీ నుండి వచ్చిన జాబును అందుకున్నారు. ఆ మర్నాడు అక్టోబరు 7న సాయి బాబా సమాధి మందిరంలో సాయిబాబా నిలువెత్తు విగ్రహావిష్కరణకు హాజరు కావలసిందిగా కోరుతూ పంపిన ఆహ్వానమది. హిందూ పంచాంగము ప్రకారము ఆ సంవత్సరం అక్టోరు 7న దసరా పండుగ రోజైంది. అంతే కాకుండా

సాయిబాబా భౌతికంగా శరీర పరిత్యాగం చేసిన 36వ వార్షికోత్సవము కూడా అయింది. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకొని, బాబా ఆదీని పిలిచి షిరిడీ సంస్థానం ట్రస్టీలకు ఈ క్రింది సందేశాన్ని పంపమని ఆదేశించారు.

పురాణ పురుషుడు, అవతార్ మెహెర్ బాబా, తన గురువు సాయిబాబాగా అవతరించిన దైవమైన సాయి బాబాకు వందనములర్పిస్తున్నారు

మెహెర్‌బాబా అనుమతితో

సం॥ ఆదీ

6వ తేదీన డా॥ డాన్‌కిన్ నుండి కూడా నానాఖేర్ ఆరోగ్యం గురించి ఒక తంతిని అందుకున్నారు. మీటింగు సమయంలో నానాఖేర్ అనారోగ్యం పాలై అహ్మదునగర్‌లోని ఒక ఆయుర్వేద ఆసుపత్రిలో చేర్చబడ్డాడు. ఆయనకు టైఫాయిడ్ సోకిందని రోగ నిర్ధారణ చేశారు. కానీ జ్వరతీవ్రత తగ్గి నాడి సాధారణ స్థాయికి ఇంకా రాలేదు. ఒక వేళ అతడ్ని నాగపూరుకు వాళ్లింటికి పంపించేట్లైతే బాబా అంతకు ముందు నానాకేర్‌ను ఆదివారము ఉపవాసము ఉండటం, పేదలకు అన్నదానం చేయటమనే రెండు ఆదేశాల నుండి మన్నించాలని డాన్‌కిన్ ప్రత్యేకించి వ్రాశాడు.

డాన్‌కిన్ సలహాలను బాబా అంగీకరించారు. డిశంబరు చివరి వరకు వాటిని వాయిదా వేసేందుకు ఒప్పుకున్నారు. ఇటువంటి సంఘటనలు, తాను వత్తిడి పనుల్లో నిమగ్నమై యున్నప్పటికీ, తన సన్నిహితుల యెడల బాబా చూపే వ్యక్తిగత శ్రద్ధను ప్రతిబింప చేస్తాయి. అంతేకాక, మండలివారు బాబా ఆదేశాల్ని పాటించుట గురించి ఎలా పట్టించుకుంటారో కూడా తెలియ చేస్తుంది. ఈనాటికి ఆయన కొరకు పని చేస్తూ ఆయన్ని అనుసరించుటకు నిజాయితీగా ప్రయత్నించే వారికి అనేక విధాలుగా బాబా చింతన, వ్యాకులతల అనుభవం కొనసాగుతూనే ఉన్నది.

బాబాకు అక్టోబరు 6న చాలా హడావిడిగా ఉన్న రోజుగా మారింది. ఎందుకంటే, ప్రజలు ఆయనకు ఉత్తరాలు వ్రాయటానికి ఆఖరి రోజుగా నిర్దేశించిన దినమది. ఫలితంగా అనేక ఉత్తరాలు కట్టలు కట్టలు వచ్చాయి. అయినా, తాను అనేక విషయాల మధ్య హాజరవుతూ కూడా బాబా అంతకు ముందు మెహెరాబాదులో ప్రకటించినట్లు, ఆ మర్నాడు ఉదయం తాను తన అక్షర ఫలకాన్ని విసర్జించబోతున్న విషయాన్ని తన మండలికి జ్ఞాపకం చేశారు.

1925లో తన మౌనాన్ని ప్రారంభించి నప్పటి నుండి, యీ అక్షర ఫలకము చాలా కాలంపాటు బాబా సంభాషించుటకు ప్రధాన సాధనమైంది. భవిష్యత్తులో తానెలా సంభాషిస్తారో ఈ సమయంలో ఆయన బహిర్గత పరచలేదు. ఈ విధంగా బాబా మౌనం పాటించటం ద్వారా తనపై ఇంతకు ముందే మోపుకున్న భారపు గొప్ప పరిమితి ఇప్పుడు మరింత నిర్భంధకరమైంది. ఈ ప్రత్యేక సంఘటన సందర్భంగా బాబా తన మండలి వారందరిని అక్టోబరు 7న అర్ధరాత్రి వరకు మేలుకొని ఉండమన్నారు.

మరునాటి చరిత్రాత్మకమైన సమావేశం గురించి వివరించబోయే ముందు నేను ఒక ముఖ్యమైన సంఘటనను మీకు చెప్పాలను కుంటున్నాను. తన అక్షర ఫలకమును ఉపయోగించుటను వదిలి వేయుటకు యీ సమావేశం జరుగనున్నది.

ఆ సమయంలో పాకిస్తాన్ పౌరులైన ఆదీ మరియు రోడా దుబాషీలు కరాచీలో ఉంటున్నారు. ఇటీవల వారిరువురు పంచగనిలో ఉండటం తటస్థించింది. సతారాలో ఉన్న అధికారుల ఆమోదానికి పంపుకున్న తమ పాస్‌పోర్టుల గురించి తెలుసుకొనుటకై వారు 6వ తేదీన సతారా వచ్చారు. వారు త్వరలోనే కరాచీ తిరిగి వెళ్లేందుకు నిశ్చయించుకున్నారు. ఆ రోజున కార్యాలయంలో తమ పని త్వరగా అయిపోవటంతో ఒక గంటలోనే బయటకు వచ్చేశారు.

బాబా సతారాలోనే ఉంటున్న విషయం వారిద్దరికి తెలుసు. పైకి మాట్లాడుకుండానే వారిరువురు పరస్పరం కళ్లతోనే బాబాను చూద్దామా ! అన్నట్లు సౌంజ్ఞలు చేసుకున్నారు. వద్దని ఆదీ తల అడ్డంగా తిప్పాడు. అయితే రోడా రెచ్చిపోయింది. "ఆయన్ని దర్శించకూడదని బాబా నుండి మనకేమీ ఆదేశాలు లేవు. అక్టోబరు 7 నుండి ఉత్తరాలు మాత్రమే ఆయనకు వ్రాయటం ఆపబడినట్లు ఆదేశము అందింది ! క్రితం నెలలో నీవేమో మూడు వారాల పాటు రోజూ ఆయనతో గడిపావు !" అని చెప్పే సరికి ఆదీ అయిష్టంగానే అంగీకరించాడు. వారిరువురూ బాబా ఉంటున్న గ్రాఫ్టన్ బంగళాకు వెళ్లారు. తీరా అక్కడకు వెళ్లగానే సరిగ్గా మధ్యాహ్నం 2 గంటలకు రోజ్‌ఉడ్ బంగళాలో ఉంటే వారిని బాబా కలుసుకుంటారని చెప్పే సరికి వారెంతో ఆనంద పరవశులయ్యారు. వారిద్దరు చాలా ఆనందించి, కేటాయించిన సమయాని కంటే కొన్ని నిమిషాల ముందే రోజ్‌ఉడ్‌కు చేరుకున్నారు.

బాబా రోజ్‌ఉడ్‌కు చేరి తన కారు దిగుతున్న క్షణంలో ఆదీ, రోడాలు తామిరువురు వచ్చినందుకు బాబా సంతుష్టులు కాలేదని అర్థం చేసుకున్నారు. ఆయన కన్నులు మిరిమిట్లు గొలుపుతూ జ్వలిస్తున్నాయి. "నా గుండెలపై కూర్చున్నట్లు యీ ఇరువురు ఇక్కడ ఉన్నారు" అని బాబా సౌంజ్ఞలు చేశారు. పిమ్మట ఆయన ఆదీ వైపు తిరిగి అతని వీపు మీద చిన్నగా ఒక దెబ్బ వేశారు. "ఇటీవల మూడు వారాలపాటు నీవు నా భౌతిక సమక్షంలో ఉండే అదృష్టం పొందావు. ఏం నీకింకా తృప్తి కలగలేదా ? మళ్లీ ఇప్పుడు వచ్చావు ? నిన్నిప్పుడు రోడాయే తీసుకు వచ్చింది కదూ, నిజం చెప్పు ?" అనడిగారు. "అవును బాబా' ' అని ఆదీ అంగీకరించాడు.

బాబా రోడా వైపు తిరిగి "మూడు నెలల తరువాత ఈ వేళే నేను తలంటి స్నానం చేశాను. అందువల్ల నేను నిన్ను అలింగనం చేసుకోను. నీవు గనుక అలా చేస్తే నేను మళ్లీ స్నానం చేయాలి. ఇప్పటికే నేను జ్వరంతో బాధపడు తున్నాను" అన్నారు. రోడా అపరాధం చేసినట్లు బాధపడుతూ, తనకు అలింగన భాగ్యాన్నివ్వమని కోరనని బాబాకు అభయ మిచ్చింది. తాను చూడవలసిందెంతో ఉన్నందున, తనను ఎటువంటి ప్రశ్నలూ వేయరాదని, అలజడి కలిగించరాదని వారిని బాబా ఆదేశించారు. ఆ మర్నాడు తన అక్షర ఫలక విసర్జన చేయబోతే ముందు, ఆయన తన పురుష మండలికి ఆఖరి నిమిషపు ఆదేశాలెన్నో ఇవ్వాల్సి ఉన్నది. బాబా తన వద్ద ఉండేందుకు అనుమతిస్తూనే వారినిలా ఆదేశించారు. "ఏమైతే నేమి మీరు ఇక్కడ ఒక గంట మాత్రమే ఉండి వెంటనే వెళ్లిపోవుటకు అనుమతిస్తున్నాను. ఇప్పుడు రెండు గంటలైంది. కనుక మీరు మూడు గంటలకు వెళ్లిపోవాలి" అన్నారు. అందుకు వారిరువురూ బాబా చెప్పినట్లే చేస్తామని బాబాకు మాట ఇచ్చి, ఆయనతో పాటు పెద్ద హాల్లోకి వెళ్లారు. బాబా తన ఆసనంపై కూర్చోగా వారిరువురూ ఆయనకు ఎదురుగా నేలపై కూర్చున్నారు.

మండలికి ఆఖరి నిమిషపు ఆదేశాలివ్వటంలో తీవ్రంగా నిమగ్నమై ఉన్నప్పటికీ, బాబా మధ్య మధ్య వారివైపు ఆప్యాయంగా చూస్తూ పరిహాసా లాడుతూ, ప్రశ్నలు వేయసాగారు. ఆ గంట కాలములో ఎరుచ్ కోల్హాపూర్‌లోని శ్రీదీక్షిత్ అనే ఆయన వ్రాసిన ఉత్తరం చదివి వినిపించాడు. అక్కడున్న బాలికల కోసరం నిర్మించిన కొత్త పాఠశాలను ప్రారంభించుటకు రమ్మనమని ఆయన బాబాను ఆహ్వానించాడు. ఒకవేళ బాబా రావటానికి అవకాశం లేకపోతే ఆసందర్భానికి అవసరమైన సందేశాన్ని, ఆశీస్సులను పంపమని కూడా శ్రీ దీక్షిత్

అభ్యర్థించాడు. బాలికలను మంచి పౌరులుగా మంచి గృహిణులుగా, మంచి మాతలుగా, అన్నిటి కంటే ఎక్కువగా మంచి దైవీ ప్రేమికులుగా తీర్చిదిద్దాల్సిన విద్య గురించి ప్రత్యేకంగా నొక్కి వక్కాణిస్తూ బాబా ఎరుచ్‌కి సందేశాన్ని ప్రవచించటం మొదలు పెట్టారు. దీనిని సాధించేందుకు, వారు పూర్తిగా తమతో, ఇతరులతో, ముఖ్యంగా దైవంతో నిజాయితీగా ఉండేందుకు ప్రయత్నించాలన్నారు.

పిమ్మట తన కళ్లల్లో ఒక మెరుపుతో బాబా హఠాత్తుగా ఆదీ దుబాష్ వైపు తిరగి "రోడాను గురించి నీవేమనుకుంటున్నావు ? ఆమె ఒక మంచి భార్యయేనా ?" అని అడిగారు. "ఎ-వన్ బాబా" అని టపీమనీ ఆదీ సమాధానం చెప్పాడు. బాబా ముఖం ఆనందంతో వెలిగి పోయింది. ఆయన రోడా వైపు తిరగి "ఆదీ మంచి భర్తయేనా ?" అని అడిగే సరికి రోడా బదులిస్తూ "అవును బాబా ! ఆయన ఎ - వన్" అన్నది.

ఎంతో సంతృప్తి చెందినట్లున్న బాబా ఎరుచ్ వైపు తిరగి "నేను పంపించాలనుకున్న సందేశాని కనుగుణ్యమైన యీ ఇద్దరు సజీవ ఉదాహరణ లిక్కడ మనతోటే ఉండగా ఆ స్కూలు ప్రిన్సిపాలుకు వేరే సందేశం పంపేందుకు నన్ను ఎందుకు అనవసరంగా తొందర పెడుతున్నావు ? ఒక పురుషుడు, ఒక స్త్రీ జీవితంలో ఎలా గడపాలో నిరూపించే యీ ఇరువుర్ని సజీవ ఉదాహరణలుగా నీవు ఎందుకు పంపించవు ?" అని అడిగారు.

అప్పటికి, ఆదీ రోడాలకు కేటాయించిన ఒక గంట గడువు సమాప్తమయింది. వారిరువురికీ ఆ విషయం తెలిసినా, ఒక్కరూ కూడా వెళ్లిపోవాలన్న ప్రయత్నంలో లేరు. "బాబా ఏమీ చెప్పటం లేదు కదా ! దానిని బట్టి మనము ఇక్కడ ఉన్నా ఆయనేమీ అనుకోరు" అని రోడా అనుకున్నది. మూడు గంటలు దాటి అయిదు నిమిషాలు, పది నిమిషాలు, పదిహేను నిమిషాలు, ఇరవై నిమిషాలు - గడిచింది. అకస్మాత్తుగా బాబా ఆదీ వైపు చూస్తూ "నీవు నిజమైన జొరాష్ట్రయను వేనా ?" అని అడిగారు. ఆదీ గతుక్కుమన్నాడు. బాబా అడిగిందేమిటో అతనికి కచ్చితంగా అర్థం కాలేదు. "బాబా ! నీ ఉద్దేశ్యంలో నేను సద్రా కుస్తీ ధరించ లేదనా ?" అని అడిగాడు.

"కాదు, నా ఉద్దేశ్యంలో నీవు మంచి ఆలోచనలు, మంచి మాటలు, మంచి చేతలు, ఆచరిస్తున్నావా ?" అని అంటూ బాబా "ఇప్పుడు టైము ఎంతైంది ?" అని ప్రశ్నించారు.,

"మూడు గంటల ఇరువది నిమిషాలైంది బాబా!" అని ఆదీ బదులిచ్చాడు.

"నీవు మూడు గంటలు కాగానే వెళ్లి పోతానని నాకు మాట ఇచ్చావు. ఒక నిజమైన జోరాష్ట్రియన్‌గా నీవిచ్చిన మాటను ఎక్కడ నిలుపుకున్నావు ?" అనడిగారు.

అంతలో రోడా కల్పించుకొని, "కానీ బాబా, మేమిక్కడ ఉన్నందుకు నీవు పట్టించుకోలేదు కదా ?" అన్నది.

బాబా వెనక్కు తీసుకొని, మీరు మూడు గంటలకు వెళ్లిపోతామని నాకు మాట ఇచ్చారు. మరి గడియారం మూడు కొట్టగానే మీరు నాకు మాట ఇచ్చియున్నందున దానికి కట్టుబడి ఉండవలసిన అవసరం మీదే కనుక లేచి ఉండాల్సింది. మీరు అలా లేచినప్పుడు మీరు మరి కొంత సేపు ఉండాలని నేను అభిళషిస్తే నేను అలా చేయమని మీకు చెప్పి ఉండేవాడిని. ఒక జోరాష్ట్రియను ఒక పర్యాయం తన మాటను ఇచ్చి ఉంటే ఎటువంటి పరిస్థితుల్లోనైనా సరే ఆ మాటను గౌరవించాలి. నిజమైన జోరాష్ట్రియన్ అంటే నా ఉద్దేశ్యంలో ఇదీ అర్థం." అని బాబా వివరించారు.

ఆదీ, రోడాలు తమ తప్పిదమునకు సిగ్గుపడి శిరములు వంచి ఇరువురూ ఒకేసారి వెళ్లేందుకు లేచి నిలబడ్డారు. బాబా అప్పుడు ఆదీ చేయిపుచ్చుకొని ఆపి, మళ్లీ కూర్చోమని సౌంజ్ఞలు చేస్తూ "ఇప్పుడు మీరు నేను ఎప్పుడు వెళ్లమంటే అప్పుడు వెళ్లండి" అన్నారు. చాలా సేపటికి, చివరిగా వారిని వెళ్లమని అనుమతినిస్తూ మర్నాడు మధ్యాహ్నంలోపు మళ్లీ రమ్మని ఆదీతో బాబా చెప్పారు. అది విన్న రోడా వంతపాడుతూ "బాబా నేనూ వస్తాను" అన్నది.

బాబా తన తలను అడ్డంగా తిప్పుతూ "నీవు వస్తానని బలవంతం చేస్తే అసలు ఆదీనే రావద్దని చెపుతాను" అన్నారు. రేపు జరగబోయే మీటింగుకు రమ్మనమని బాబా బహిర్గత పరచకుండా ఎందుకు ఆహ్వానిస్తున్నారో రోడా తెలుసుకోలేక పోయింది. అయినా ఆమె తన కోరికను ఉపసంహరించు కున్నది.

రోడా, ఆదీలు వెళ్లిపోగానే, బాబాకు వచ్చిన ఉత్తరాలను వినటం కొనసాగింది మధ్య మధ్య అవసరమైన ఆదేశాలు జారీ చేశారు. చీకటి పడగానే ఆదీ కారులో రోజ్‌వుడ్‌ను విడిచి బయలుదేరారు.

## అక్షర ఫలక వీడ్కోలు



అక్టోబరు 7 గురువారం, హిందువుల పండగ దసార అయింది. ఏ కొత్త కార్యక్రమం మొదలు పెట్టాలన్నప్పటికి ఆరోజెంతో ప్రశస్తమైనది. కొన్ని నిర్దేశిత రోజుల్లో హిందువులు వివిధ జంతువులను పూజిస్తారు. దసరా గుర్రాలను పూజించే పండుగ రోజు. ఆ రోజు విశిష్టతను దృష్టిలో ఉంచుకొని, షెబా అనే ఒక ఆడ గుర్రం బాబా నుంచి గ్రాఫ్టన్‌లో వున్న ఇతర స్త్రీ మండలి నుంచి ప్రత్యేకమైన ప్రేమ పురస్కారాన్నందుకున్నది.

1953లో బాబా డెహెరాడూన్‌లో ఉండగా, కుమార్, చాలా చురుకైన మూడు నెలల గుర్రపు పిల్లను బాబాకు బహూకరించాడు. దానిని మెహెరా పెంచింది. ఆ గుర్రప్పిల్ల అంటే స్త్రీ మండలి అంతా ఎంతో ఇష్టపడేవారు. ముఖ్యంగా అది మెహెరాకు ఇష్టమైన ఆడ గుర్రమైంది. డెహెరాడూన్ నుంచి మెహెర్‌బాబా మహా బలేశ్వర్‌కు ఆ తర్వాత సతారాకు వచ్చినప్పుడు ఆయనతో పాటే ఈషెబా కూడా కలిసి ఉన్నది. చివరికది బాబాకు "నాలుగు కాళ్లమండలి' 'లో బాబా కుక్క పీటరువలె ఒకటైంది. నిజానికి, మెహెరాజాదులోని ప్రస్తుత మండలి హాలులో మొదటి సారిగా గడిపినది యీ షెబాయే. అది 50వ దశకం మధ్య భాగం వరకూ అక్కడే వున్నది.

షెబా ఒక పరిపూర్ణమైన పందెపు గుర్రం. బాదం కాయ రంగు వంటి మేని ఛాయతో ముఖాన తెల్లని నక్షత్రం వంటి మచ్చ చక్కగా జాలువారే జూలుతో చూడ ముచ్చటగా ఉండేది. దశరా రోజున ఉదయం స్త్రీ మండలి దానిని పట్టుజల్తారీ, పసుపు పూలమాలలతో చక్కగా అలంకరించి, కాళ్లకు గజ్జెలు కట్టి, దాని వీపుపై పూలమాలల తోరణాలు కట్టి చక్కగా అలంకరించారు. బాబా ఎంతో ఆప్యాయంగా దాని వీపునిమిరి పక్కలు మృదువుగా స్పృశించారు. ఆయన మెహెరా కలిసి దానికి క్యారెట్లు తినిపిస్తుంటే బాబా బుజ్జగింపు తన ప్రియమైన కుక్కపిల్ల పీటరుకు ఆ వినోదాన్ని చూచే పూర్తి అవకాశం దొరికి

పరమానందం పడేది. బాబా జీవితంలో చేసిన కార్యక్రమాల్లో జంతువుల యెడల ఆయన చూపిన ప్రేమ ఒక ప్రత్యేక ఘట్టంగా నిలుస్తుంది.

దశరా ఒక పండుగ సందర్భమైనందున, స్త్రీ మండలి అంతా మంచి చీరలు ధరించారు. ఏకైక పాశ్చాత్య వనిత రానో మాత్రం ఆకర్షణీయమైన దుస్తుల్ని ధరించింది. ఆమె బయట దొడ్లో నడుస్తుంటే బాబా ఆమెను చూచి "ఆమె షెబా రాణి"లా కనిపిస్తోందని వ్యాఖ్యానించారు. ప్రతివారికి ఆనాటి ఉదయం ఎంతో ఆనందాన్నిచ్చింది.

అంతకు ముందు రోజునే బాబా తన పురుష మండలిని మర్నాడు ఉదయాన్నే స్నానం చేసి, శుభ్రమైన బట్టలు కట్టుకోమని ఆదేశించారు. సాధారణంగా దశరా చక్కని విందు చేసుకునే పండుగ రోజు. కానీ బాబా ఆ రోజు మధ్యాహ్నం నుండి, అర్ధరాత్రి వరకు ప్రతివారు ఉపవశించాలని ఆదేశించారు. మండలికి సబంధించినంత వరకు బాబా ఆదేశాలను పాటించటమంటే, ఆయన్ని సంతుష్టుడ్ని చేయటమన్నమాట. అది ఉపవాసమైనా, లేదా విందైనా ఆయన ఏం చేయమంటే అది చేయటం వారి కర్తవ్యం.

మధ్యాహ్నం 2-00 కావస్తుండగా బాబా పురుష మండలి ఉంటున్న రోజ్‌ఉడ్‌కు వచ్చారు. ఆయన చాలా సంతోషకరంగా కనిపించారు. షెబాకు చేసిన పండుగ అలంకారము గురించి వారికి వివరంగా తెలిపారు. ఆయన తనతో పాటు మూడు అక్షర ఫలకాలను తీసుకు వచ్చారు. ఒక చిన్న సంచిలో ఉన్న ఆ మూడు ఒకటి ప్లై ఉడ్‌తో, మరొకటి ప్లాస్టిక్‌తో మూడోది అట్టతో చేయబడి ఉన్నాయి. ప్రతివారు బాబా చుట్టూ చేరగానే, ఆ మూడు బోర్డుల్లో రెండింటిని ఇరువురు వ్యక్తులకు ఇవ్వదలచానని - ఒకటి కుమార్‌కి, రెండవది ధాకే ఫాల్కర్ కని వివరించారు. వారిరువురు వాటిని భద్రంగా దాచి పెట్టుకోమని చెప్పారు.

ఏది కావాలో కోరుకొనే తొలి అవకాశాన్ని ఆయన కుమార్‌కి ఇచ్చారు. ప్లై ఉడ్‌తో చేసిన బోర్డు ఇమ్మనమని కుమార్ కోరుకున్నాడు. ధాకే ప్లాస్టిక్‌ది కోరుకున్నాడు. మిగిలిన అక్షర ఫలకం కార్డుబోర్డు అట్టది. దానికి ఒక మూల అట్ట నలిగిపోయి విరగటానికి సిద్ధంగా, చిన్న జిగురు టేపుతో అతికించబడి వేలాడుతోంది. ఆ ఫలకంలో ఉన్న సున్నా మధ్యగా విరిగిపోవడంతో ఆ మూల నున్న ముక్క అతుకుతో వేలాడుతోంది.

ప్రత్యేకంగా తానీ బోర్డును చాలా చెత్తగా వాడానని బాబా తన మండలికి తెలుపుతూ, అయినా విరిగిపోయిన ఆ అంచుముక్క దానికి అంటి పెట్టుకొని ఉండేట్లు ఏదో విధంగా ప్రయత్నించానని చెప్పారు. తర్వాత ఆ బోర్డును సావక్ కొత్వాల్ వైపు విసిరివేశారు. సావక్ దాన్ని పట్టుకుంటున్నప్పుడు అతుకు పెట్టిన మూల ఉన్న ముక్క ఊడిపోయింది. మళ్లీ ఆ బోర్డును బాబా తీసివేసుకొని, ఎరుచ్‌కి ఇచ్చి, మెహెరాబాదులో ఉన్న పాద్రీకి ఇవ్వమని, అతడు ఉపయోగిస్తున్న ఇతర వాటితో దీనిని భద్రపరచమని చెప్పమన్నారు. ఆ పిమ్మట, ఆ విరిగిపోయన ముక్కను సావక్‌కు ఇచ్చి, తన తుది శ్వాస వరకు జాగ్రత్తగా దాచుకోమని చెప్పారు.

ఇది జరిగాక, ఇంకా మిగిలిపోయిన ఉత్తరాలు చూడసాగారు. కొన్ని ఉత్తరాలను ఎరుచ్ చదువగా బాబా తన ప్రేమికులకు జవాబులు ప్రవచించారు. మరుసటి రోజు అక్టోబరు 8 నుండి తనకు ఎటువంటి ఉత్తరాలు చదివి వినిపించ వద్దని, మరెంత మాత్రం జవాబులు ఉండవని బాబా సూచించారు. కొద్ది సేపట్లోనే దానిని మళ్లీ మారుస్తూ, ఆ ఉత్తరాల్లోని విషయాన్ని వింటానే తప్ప, సమాధానాలివ్వ నని చెప్పారు., తాను ఎటువంటి పరిస్థితులలోను అక్షర ఫలకాన్ని ఉపయోగించనని మళ్లీ పునరుద్ఘాటించారు. నాలుగు గంటలు కాగానే బాబా రోజ్‌ఉడ్ నుంచి బయలు దేరుతూ 5-30కు మళ్లీ వస్తానని మండలికి తెలియజేశారు.

నిర్ధేశించిన సమయం కంటే ముందే బాబా రోజ్‌ఉడ్‌కు చేరుకున్నారు. ఆయన రాగానే కొత్వాల్‌ని పిలిచి, అతనికిచ్చిన ఫలకపు చిన్న ముక్కను ఎక్కడ పెట్టావని అడిగారు. తన ట్రంకులో భధ్రంగా దాచిపెట్టానని సావక్ బదులిచ్చాడు. అందుకు బాబా ప్రతి స్పందిస్తూ తానే కనుక కొత్వాల్ స్థానంలో ఉండి ఉంటే, తన స్వంత కండను కోసి ఆ గాటిలో దానిని జొనిపి దాచుకొనే వాడినని ప్రకటించారు. "నీకు నిజంగా అది కావాలా ?" అని బాబా అతడ్ని నొక్కి ప్రశ్నించారు. అసలు దానిని తనతో ఉంచుకోవలసిన అవసరమేమిటో దాని విశిష్టతేమిటో, ప్రాముఖ్యత ఏమిటో తాను తెలుసుకోదలచినట్లు సావక్ బదులిచ్చాడు.

అది విన్న బాబా, "దానిని ఉంచుకోవటం వల్ల అది గొప్ప ఉపద్రవాన్ని సృష్టిస్తుంది!" అన్నారు. "అలా అయితే, దాని అర్థం అది నా దగ్గర ఉంచుకుంటే

ప్రమాదకరమన్న మాట." అని సావక్ చెపుతూ, ఆ చిన్న అట్ట ముక్కను తిరిగి ఇచ్చి వేయాలన్న అభిలాషను వ్యక్తం చేయబోతున్న తరుణంలో బాబా కల్పించుకొని, "అటువంటి ప్రశ్నను నన్ను అడిగేందుకు నీవు ఒక మూర్ఖుడవు" అంటూ సావక్‌ను వెంటనే వెళ్లి తన ట్రంకులో ఉంచిన ఆ అట్టముక్కను తెమ్మని ఆదేశించారు. పిమ్మట దానిని ఎరుచ్‌కి వప్పగించి, దీనిని కూడా పాద్రీకే అక్షర ఫలకంతో పాటు ఇవ్వమని ఆదేశించారు.

అక్కడ హాజరైన వారందరిని కాళ్లు చేతులు ముఖం కడుక్కొని రమ్మన్నారు. మండలి వారు హాలు నుంచి బయటకు వెళ్లబోతుండగా బాబా ఆ బంగళా నాలుగు వైపులా సేవకులను కార్యకర్తలను కాపలా దారులుగా నియమించమని పెండూ, ఎరుచ్‌లను ఆదేశించారు. బాబా ఆదేశాలమేర, ఎవరినీ లోనికి రానీయకుండవా వారు కచ్చితంగా ఉండాలని కూడా చెప్పారు. బాబా సమక్షంలో అందరూ తిరిగి హాజరు కాగానే, తలుపులన్నీ మూసి వేయడినవి. ప్రత్యేక సమావేశాల సమయంలో ఆ ఘట్టం మొదలైందన్న సూచనగా బాబా తలుపులు, కిటికీలు మూసివేయించటం తరచుగా చేస్తూ ఉంటారు. బాబా కాక మరో ఇరవైమంది పురుషులు హాజరయ్యారు. వారు గుస్తాద్‌జీ, కైకోబాదు, బైదిలు, పెండూ, ఎరుచ్, కుమార్, సావక్, నీలూ, విష్ణు, భావు, మెహెర్జీ, క్రిష్ణనాయర్, ఆలోబా, కోహియార్, ధాకే, ఆదీదుబాష్, శాంకేరావాలా, మరో ముగ్గురు ఇతర మండలి.

బాబా సోదరుడు జాల్ ఆ ఉదయం వచ్చాడు. ఆ ప్రత్యేక కార్యక్రమానికి హాజరయ్యే అవకాశాన్ని బాబా అతనికి ఇచ్చారు. కానీ జాల్ ఆ రోజు ఉదయాన్నే రోజ్‌ఉడ్‌ను వదిలి వెళ్లి పోవాలనుకున్నాడు. అతడి గైరుహాజరును గమనించిన బాబా యీ ముఖ్యమైన సమావేశంలో పాల్గొనే అదృష్టం జాల్‌కు వ్రాసిపెట్టి లేదు అని వ్యాఖ్యానించారు. దానికి బదులుగా మరో ఇద్దరు అనుకోకుండా పాల్గొన్నారు. ఆదీదుబాష్ మరియు శాం కేరావాలాలు ఈ సందర్భంలో హాజరయ్యారు. ఈ సమావేశం గురించి యీ ఇద్దరికీ తెలియదు. వారి అదృష్టం వల్ల వారు బాబాను రోజ్‌ఉడ్‌లో అక్టోబరు 6న బాబాను కలిశారు. ఆయన వారిని ఎంతో ఆప్యాయతతో యీ సమావేశానికి హాజరు కమ్మనమని ఆహ్వానించారు. అనుకున్న వారికి అసాధ్యమైంది ! అనుకోని వారికి సాధ్యపడింది ! అవతారుడి చర్యలు అగమ్య గోచరంగా ఉంటాయి.

మీటింగు ప్రారంభమయ్యే మొదట్లో, బాబా తన పంచ సద్గురువులకు, అక్కడ హాజరైన ప్రతివారికి పాదాభివందనం చేయటం ద్వారా తన భక్తి ప్రపత్తులందించాలను కున్నారు. ప్రతి వ్యక్తి ముందుకు వచ్చి, తన పాదాన్ని ఒక చిన్న బల్లపై ఉంచాలి. అప్పుడు బాబా అతని పాదముపై తన శిరమును ఉంచి, నమస్కరిస్తుండగా ఆ వ్యక్తి బాబా అయిదుగురు గురువుల నామాల్ని స్మరించాలి. ఆ నామాల్ని ప్రత్యేకమైన వరుసలో స్మరించాలి. ఓ సాయి బాబా, ఉపాశినీ మహరాజ్, బాబా జాన్, తాజుద్దీన్ బాబా, నారాయణ మహారాజ్ !

వరుసలో గుస్తాద్‌జీ మొదటివాడు కైకోబాదు ఆఖరివాడు. బాబా చేసే సంకేతం ప్రకారం, ఒక్కొక్కరు ముందుకు వచ్చి తమ పాదాన్నొక దానిని అక్కడ ఉంచిన స్టూలుపై ఉంచాలి. దానిపై తెల్లని గుడ్డను పరిచారు. బాబా గురువుల పేర్ల వరసలో పై క్రమానికి భిన్నంగా ఎటువంటి మార్పు ఉండరాదని గట్టిగా ఆదేశించారు. ఎవరైన పొరపాటున వరుస తప్పితే అతడు మళ్లీ సరిగా రెండవసారి ఆ నామాల్ని వరుస క్రమంలో చదవాలి. ఈ విషయంలో క్రిష్ణ నాయరు కొంత తడబాటు పడ్డాడు. భక్తి పూర్వకమైన భయం వల్ల అతని జ్ఞాపక శక్తి అతడ్ని తప్పులు చెప్పేట్లు చేసింది. ఫలితంగా బాబా అతడి పాదముపై అత్యంత ఆకర్షణాశక్తితో రెండు కంటే ఎక్కువ సార్లే తన శిరమును వుంచి నమస్కరించాల్సి వచ్చింది.

ఆఖర్లో ఆయన తన నుదుటిని ఖాళీ స్టూలుపై అనించి. పురుషులంతా కలిసి సహగానం చేస్తూ తాను తన వ్రేలిని ఎత్తి చూపగానే ప్రతి గురువు యొక్క నామాన్ని స్మరించమని ఆదేశించారు. ఇదీ రెండుసార్లు చేయాల్సి వచ్చింది. మొదటిసారి ఆనామాన్ని సమస్కృతిలో ఉచ్ఛరించకపోవటం వల్ల లేదా సరియైన క్రమంలో లేక పోవటం వల్లరెండవసారి అవసరమైంది. హాల్లో వాతావరణమంతా గంభీరంగా ఉన్నది. బాబా దైవత్వంతో నిండిపోయి ఉంది. బాబా తన చేతులు కడుక్కొని గుస్తాద్ జీని, కైకోబాదును తన రెండు వైపులా నిలబడమన్నారు. ఆయన తన రెండు చేతుల్ని వాళ్లను పట్టుకో మన్నారు. వారలా బాబా చేతులను తమ చేతులతో పెన వేయగా బాబా ఏదో ప్రార్థనకు ఉపక్రమిస్తున్నట్లు తన రెండు అరచేతులను నమస్కరిస్తూన్నట్లు జోడించారు. ఇప్పుడు సమయం 6-45 నిమిషాలైంది. బాబా అంతకు ముందే ఆదేశించినట్లు, బాబా ప్రవచించిన యీ క్రింది ప్రార్థనను ఎరుచ్ బిగ్గరగా చదివాడు. తక్కిన పురుషులంతా మౌనంగా నిలబడ్డారు.

ప్రియతమ బాబాకు బదులుగా ఎరుచ్ చదివాడు :

ఓ సాయి బాబా, ఉపాశినీ మహరాజ్, బాబా జాన్ తాజుద్దీన్ బాబా, మరియు నారాయణ మహరాజ్, మీ అయిదుగురు ఏకైకుడిలోను ఆ ఏకైకుడు మీ అయిదుగురిలోను ఉన్న దివ్య వ్యక్తులు. సర్వాధికారము గల ఏకైకునికి బదులుగా ప్రాతినిధ్యము వహిస్తున్నారు. మీకు నేను వంగి పరిపూర్ణ వందన సమర్పణ చేస్తున్నాను. మీ అయిదుగురి మానవ దైవ కారణంగా నేను ఏదైయున్నానో ఆ పురాణ పురుషునిగా, శాశ్వతమైన నిత్యునిగా ఉన్నాను.

ఏ ప్రియతమ దైవం కోసం మీ అయిదుగురు ఒకటయ్యారో, మీ అయిదుగురు ఎవరి కోసం విశ్వవ్యాప్తంగా పని చేస్తున్నారో, ఆ ప్రియతమ దైవము నాకు, మీ నామముల ద్వారా, శక్తిని, అధికారాన్ని, జ్ఞానాన్ని, నేనీ రూపాన్ని తీసుకున్న కారణాన్ని పూర్తిగా నిర్వర్తించుటకుగాను ఇచ్చుగాక! అలాగే నేను మెహెరాబాదులో జరిగిన గత మీటింగులో ప్రకటించినవన్నీ దిగ్విజయంగా జరిగిపోయేట్లు చేయుగాక !

ఇప్పుడు నేనీ అక్షర ఫలకము వాడటాన్ని వదిలేస్తున్నాను. ఇది దైవమందు త్వరలో నేను మౌన విరమణ చేస్తున్నట్లు వివరించే నా సంకేతం అగుగాక !"

ఆ ప్రార్థన చదువుతున్నంత సేపూ బాబా తీవ్రంగా వెలిగిపోతూ కనిపించారు. మధ్య మధ్య బాబా తన ముకుళిత హస్తాల్ని తన పంచ సద్గురువుల ద్వారా సర్వాంతర్యామి యైన దైవాన్ని ఉద్దేశించి వేడుకుంటున్నట్లు కదిలించ సాగారు. ఆ ప్రార్థన తొలిసారి చదవగానే ఆయన సంతృప్తి చెందినట్లు కనిపించినా, ఆయన మళ్లీ రెండవసారి చదవమని ఎరుచ్‌ని అడిగారు. ఆ తర్వాత ప్రతివారిని బిగ్గరగా "పరబ్రహ్మ", "పరమాత్మ", "యాయజదాన్", "అహురమజదా", "అల్లాహ్ ఓ - అక్బర్" లేదా "గాడ్ ఆల్ మైటీ" అంటూ ఆయామతా వలంబకులను తమ మత ప్రకారం ఉచ్చరించ మన్నారు. భగవంతుడిని వేడుకొనటం పూర్తికాగానే, బాబా తన అక్షర ఫలకాన్ని ఆ చిన్న స్టూలు మీద ఉంచారు. అప్పుడు సమయం సరిగ్గా రాత్రి 7 గంటలైంది. ఆ క్షణం నుంచి తాను శాశ్వతంగా ఆ ఫలకాన్ని ఉపయోగించటం వదిలేశానని, మరల దానిని ఉపయోగించనని సౌంజ్ఞలతో ప్రకటించారు.

ఆ సమావేశం చివర్లో బాబా ఎంతో సంతృప్తి చెందినట్లు కనిపించారు. తన సౌంజ్ఞల ద్వారా, చెప్పే సంభాషణను మండలి అంతకు ముందే మాటల్లో

చెప్పటంలో తర్ఫీదయ్యారు. బాబా సౌంజ్ఞలతో "ఇప్పుడు అంతా బాగా జరిగిపోయింది. అలాగే ప్రతి విషయం కూడా బాగానే జరిగింది" అని వివరించారు. ఆ రోజున బాబా తనతో సుదీర్ఘ కాలం గడిపిన సహచరునికి అంతిమ వీడ్కోలు చెప్పిన సుదినము. బాబా ఆ ఫలకాన్ని ఉపయోగించటాన్ని కృష్ణుడు తన వేణునాదాన్ని చేయటంతో కొందరు పోల్చారు.

బాబా గతంలో ఇచ్చిన ఆదేశాల ప్రకారం, తనకు ఇష్టమైన ఘజల్సు ఉన్న గ్రామ ఫోను రికార్డులు ఇప్పుడు మోగించబడినవి. ఆ పాటల్లోని కొన్ని పంక్తుల గురించి బాబా సౌంజ్ఞలతో వివరించే ప్రయత్నం చేశారు. అయితే అలా చేసిన సౌంజ్ఞల్ని అర్థ ంచేసుకొనుటకు ఆయనకు, ఇతరులకు కూడా కొంచం కష్టమనిపించింది. అప్పుడప్పుడు అక్కడున్న వారిలో ఎవరో ఒకరిని తనకు ఏదన్నా హాశ్యాన్ని చెప్పమనేవారు. రాత్రి 10-00లకు కొద్దిశేపు విరామాన్నిచ్చి, మరల గ్రామఫోను రికార్డులు మోగించసాగాయి. అర్థరాత్రి బాబా రోజ్‌ఉడ్ నుంచి బయలుదేరి గ్రాఫ్టన్ చేరుకున్నారు. ఆ మర్నాడు బాబా రోజ్‌ఉడ్ రాగానే ఆయనకు అలవాటైన అక్షరఫలకం ఆయన పక్కన కనిపంచలేదు.

## ఆద్యంత రహితుడైన బాబాతో అంతరంగ బంధం

అక్టోబరు 7న జరిగిన ఘట్టాల యీ వర్ణనంతా, అప్పుడు జరిగిన మరో సంఘటనను నేను చెప్పకుండా వదిలేస్తే అసంపూర్తిగా మిగిలిపోతుంది. ఇది సతారాలో జరుగలేదు. ప్రపంచానికి మరో వైపున అమెరికాలో జరిగింది. బాబా ప్రేమికుడైన మాల్కోం స్లాస్. అకస్మాత్తుగా ఆశువులు బాయటం జరిగింది. ఇతను 1931లో బాబాను కలుసుకున్న తొలి అమెరికన్ బృందానికి చెందిన వాడు న్యూయార్కు నగరానికి నలభై మైళ్ల దూరంలో ఉన్న హార్మన్ ఆన్ ది హడ్సన్‌లోని వేసవి విడిది గృహంలో బాబా మాల్కోం ఆయన భార్య జీన్ ఏడ్రియల్‌కు అతిథిగా ఉండి వారి ఆతిధ్యాన్ని స్వీకరించారు.

1954 సెప్టెంబరులో కొంతమంది అమెరికన్ ఇంగ్లీషు, ఆస్ట్రేలియన్ బాబా ప్రేమికులతో పాటు మెహెరాబాదు కొండపైన గడిపాడు. ఈ అవధి (సమయం) మొదట్లో బాబా చార్లెస్ పర్డమ్‌ను మాల్కోంను రోజూ వాళ్లను దర్శించేందుకు బాబా చేసే నిత్య దినచర్యను అంతిమ ప్రకటన సమావేశపు

వివరాలతో సహా డైరీ వ్రాయమని ఆదేశించారు. పర్దుం ఒక ప్రఖ్యాత బ్రిటిష్ కవికాగా మాల్కోం గుప్తమైన కవి. వీరిరువురూ బాబా ఆదేశాన్ని శ్రద్ధగా పాటించారు. మాల్కోం అమెరికా పశ్చిమ తీరంలో తన నివాసానికి తిరిగి వెళుతూ, దారిలో ఫ్రాన్సులో ఉన్న చార్లెస్ పర్దుమ్‌ను కలిసి తను వ్రాసిన డైరీకి అంతిమ సవరింపులు చేసి సరిదిద్దేందుకు ఆగాడు.

యూరోపు నుండి కాలిఫోర్నియా వెళుతూ, మాల్కోం న్యూయార్కులోని పశ్చిమ తీరంలో అదనంగా ఆగాడు. అక్కడే అక్టోబరు 7న తన స్నేహితుడి తాలూకు కాళీగా ఉన్న ఒక అపార్టుమెంటులో ఉంటూ కాలుజారి క్రిందపడి మరణించాడు. అతడి మరణ వార్తను న్యూయార్కు గ్రూపువారు సతారాలో ఉన్న బాబాకు తెలియపరచారు. వెంటనే ఆయన మెహెర్‌జీతో ఈ క్రింది తంతిని పంపమని ఆదేశించారు.

"చాలా అదృష్ట వంతుడైన మాల్కోం మిమ్ముల నందరినీ వదిలి, అత్యంత ప్రాముఖ్యమైన రోజగు అక్టోబరు 7న అద్వితీయమైన పరిస్థితులలో బాబాను ఆలింగనం చేసుకొని బాబా పనిని పూర్తి చేసి పరమ పదించాడు అని సంబంధించిన వారందరికి తెలియజేయండి"

మెహెర్ బాబా అనుమతితో..... మెహెర్జీ

మెహెర్ బాబా యొక్క అమెరికన్ శిష్యుల్లో ఒకరైన ఐ.వి. డ్యూన్, అతను మరణించ బోయే ముందు ఆ సాయంత్రం మాల్కోం స్లాస్‌తో తాను గడిపిన ఆఖరి సమావేశం గురించి వివరించింది. వెంటనే న్యూయార్కు వెళ్లాలన్న అంతరంగ ప్రేరణ ఆమెకు బలంగా ప్రోత్సహించింది. ఆ ప్రేరణ బాబా తనలో మేల్కొలుపుతున్నట్లామెకు అనిపించింది. వెంటనే వాషింగ్టన్ డి.సి.లోని విమానాశ్రయానికి పరుగు పెట్టింది. ఆ రోజుల్లో ఆమె అక్కడే కాపురం ఉండేది. విమానంలో న్యూయార్కులో దిగి అక్కడున్న ఫ్రెడ్ మరియు ఎల్లావిన్టర్ ఫెల్ట్‌లను కలిసి ఏమైనా బాబా వార్తలున్నాయెమోనని తెలుసుకున్నది. వారు అప్పుడే మాల్కోం స్లాస్‌ను కలుసుకునేందుకు విమానాశ్రయానికి బయలు దేరబోతున్నారు. మాల్కోం ఫ్రాన్సులో చార్లెస్ పర్దుమ్ దగ్గర ఉన్నాడని "మరువలేని మూడు వారాలు" గురించిన డైరీకి తుది మెరుగులు దిద్దుకొని వస్తున్నాడని, ఆమెతో చెప్పారు. ఒక స్నేహితుని ఖాళీ ఇంటిలో ఉంటాడని కూడా ఆమెకు చెప్పారు.

ఆ విషయం విన్న మిసెస్, డ్యూన్‌కు మాల్కోంను కలవాలని, ఏదోరకంగా

అతడిని కలవాలన్న తపనతో టెలిఫోనుపై చాలాసేపు ప్రయత్నించి చివరకు కలుసుకోగలిగింది. ఆమె అతడిని తన ఇంటికి భోజనానికి ఆహ్వానించి తనతో తన కూతురు చార్మైనుతో కలిసి ఆతిథ్యం స్వీకరించమని కోరింది. అప్పట్లో ఆమె కూతురు న్యూయార్కులో ఉంటోంది. వారు కలుసుకున్నప్పుడు, అతను వారితో "మీరు ఇక్కడ ఉండటం వింతగా ఉన్నది. దీని వల్ల నేను వాషింగ్టన్ వెళ్లకుండా తప్పింది. బాబా నాకు చెప్పిన ఆఖరి విషయం, తప్పకుండా ఐ.వి. డ్యూస్‌ని కలిసి, ఆమెకు, ఆమె కూతురు చార్మైన్‌కు చెరొక సందేశాన్నిచ్చి అందిచమన్నారు' ' అని చెప్పాడు. భోజన సమయంలో బాబా ఇచ్చిన రెండు వ్యక్తిగత సందేశాలను వారి కందించి తన అపార్టుమెంటుకు తిరిగి వెళ్లాడు. శ్రీమతి డ్యూస్ మర్నాడు వాషింగ్టన్‌కు తిరిగి వెళ్లిపోయింది. ఆ రోజు సాయంత్రం మాల్కోంతన స్నేహితుని అపార్టుమెంటులో మరణించి ఉన్నట్లు విన్‌టర్ ఫెల్ప్స్ నుంచి టెలిఫోను రాగా విని ఆశ్చర్యపోయింది. న్యూయార్కు వెళ్లమని తన అంతరాత్మ ఎందుకు ప్రభోదించిందో అర్థం కాక దుఃఖపడింది. తాను తన కూతురు చార్మెయిన్‌లు బాబా సందేశాలు తీసుకోవాల్సి ఉన్నందున మరియు అదే సమయంలో మాల్కోం తనకు బాబా ఇచ్చిన ఆదేశాలు పాటించాల్సి ఉన్నందున అలాంటి ప్రేరణ కలిగిందనుకున్నది బాబా తన దైన విధానంలో తన ఇచ్ఛను నిర్వర్తించేట్లు వారందరికి సహాయమందించారు.

ఐ.వి. డ్యూస్ వెళ్లిపోగానే, మాల్కోం ఫిలిస్ ఫ్రెడరిక్ అవేకనర్ ఎడిటరును కలిశాడు. ఆ సమయంలో మెహెర్‌బాబాతో గడిపిన అద్భుతమైన మూడు వారాల వ్రాత ప్రతిని ఆమెకు అందించాడు. హృదయానందకరమైన యీ నిగూఢ సమాచారాన్ని అవేకనర్ ప్రత్యేక సంచికగా ప్రచురించారు. (వాల్యూం నెం. 3)

బాబా సతారా తిరిగి వచ్చిన తర్వాత ఆయన కోసం పెద్ద ఉత్తరాల కట్ట ఎదురు చూస్తోంది. చాలామంది ప్రేమికులు బాబా అంతిమ ప్రకటనపైన తన శరీరాన్ని పరిత్యజించుట గురించి ఎక్కువగా ప్రస్తావించారు. వ్యక్తిగతంగా ఎవరికీ ఈ విషయంపై బాబా జవాబులు ఇవ్వలేదు. కానీ హమీర్‌పూర్ ప్రాంతంలో ఉన్న తన ప్రేమికులందరికీ అక్టోబరు 8న హిందీలో ఒక సర్క్యులరు పంపాలని నిశ్చయించారు. ఆ ఉత్తరాన్ని భావూ కల్చూరీ ద్వారా పంపారు. అతడిని ఇండియాలో హిందీ తెలిసిన అన్ని ప్రాంతాల్లో ఉన్న బాబా ప్రేమికులకు ఆ జాబును పంపమని ఆదేశించారు.

దీని నకలు ఒక దానిని డా॥ సి.డి. దేశ్‌ముఖ్‌కు కూడా పంపి ఇంగ్లీషులోకి అనువాదం చేయమన్నారు. ఆ ఆంగ్ల అనువాదాన్ని బాబాకు చదివి వినిపించగా బాబా ఆమోదించి, అదీ కె ఇరానీకి ఇచ్చి, ఆంధ్రాతో పాటు హిందీ మాట్లాడని ఇతర ప్రాంతాలకు పోష్టు చేయమని ఆదేశించారు 1969లో అవతారుడు - అనంత చైతన్యము అయిన మనందరకు మెహెర్ బాబాగా తెలిసిన చురుకైన దివ్య చైతన్యము తన భౌతిక శరీరాన్ని పరిత్యజించినప్పుడు, ప్రత్యేకమైన యీ జాబు యొక్క ప్రాశస్త్యము ముఖ్యంగా భావ గర్భితమై, ప్రాణప్రదమైన విశిష్టత ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తన ప్రేమికులకు విదితమైంది.

ఈ జాబు మెహెర్ బాబా చేత తన ప్రేమికులందరినీ ఉద్దేశించి వ్రాయబడింది. దీనికి సంబంధించిన సమాచారాన్ని యీ క్రింద పొందు పరుస్తున్నాను.

ప్రియమైన ప్రేమికులారా.......

మీరంతా బాధపడేందుకు ఎటువంటి కారణము ఎంత మాత్రం లేదు. బాబా ఉండెను. బాబా ఉన్నాడు. మరియు బాబా నిరంతరం ఉంటాడు. బాహ్య బంధాల్ని తెగతెంపులు చేసుకొనుట మంటే అంతర్ సంబంధాల్ని తెంచుకోవటం కాదు. బాహ్య సంబంధాలు ఇప్పటి వరకూ పోషించబడినవి. అంతర్ బంధాల గొలుసులో కట్టుబడి ఉండే సమయం ఇప్పుడు అసన్నమైంది. కనుక బాహ్య సంబందం మరెంత మాత్రం అవసరం లేదు. బాబా ఆదేశాల్ని పాటించటం ద్వారా అంతర్ బంధాన్ని స్థాపించుకొనుటకు సాధ్యపడుతుంది. మీ అందరికి యీ అంతర్ బంధాలు బలపడేందుకు నా ఆశీస్సులందిస్తున్నాను.

నేనెప్పుడూ మీతోనే ఉన్నాను. నేను మీ నుండి దూరంగా లేను. నేను నిరంతరం మీతోటే ఉంటిని, ఉన్నాను, ముందు కూడా ఉంటాను. ఈ వాస్తవాన్ని మీరు గుర్తించేందుకే నేను బాహ్య సంబంధాన్ని తెగతెంపులు చేశాను. సర్వమానవులు ఈ అంతర్ బంధాల వల్ల పరస్పరం బద్ధులై ఉండటం ద్వారా సత్యాన్ని తెలుసుకొనేందుకిది దోహదపడుతుంది.

ఓ నా ప్రేమికులారా ! నేను మిమ్ములనందరినీ ప్రేమిస్తున్నాను. సృష్టి యందున్న నా ప్రేమ వల్ల మాత్రమే, నేనీ పుడమి పైకి దిగి వచ్చాను. నా శరీర పరిత్యాగం గురించిన నా ప్రకటన గురించి ప్రత్యేకంగా మీరెవరూ బాధపడి హృదయాలు బద్దలు కొట్టుకోకండి ! అందుకు భిన్నంగా నా దివ్యేచ్ఛను

సంతోషంగా అంగీకరించండి. మీరెన్నటికీ నా నుండి తప్పించుకోలేరు. ఒక వేళ మీరలా నా నుండి తప్పించుకొనుటకు ప్రయత్నించినా, నన్ను వదిలించుకోవటం సులభం కాదు. కనుక ధైర్యంగా ఉండి సాహసంతో ఎదుర్కోండి.

ఇలా మీరు హృదయాన్ని భగ్నపరిస్తే నేను మీకు వప్పగించబోయే గొప్ప కార్యాన్ని నిర్వర్తించటం ఎలా సాధ్యపడుతుంది ? నా దివ్యేచ్ఛను నెరవేర్చేందుకు ధైర్యంగా ఉండి నా ప్రేమ సందేశాన్ని దశ దిశలా నలుమూలలా వ్యాపింప చేయండి. "బాబా - బాబా" అన్న పదములు ప్రపంచం నలుమూలలా మార్మోగేట్లు, ప్రతి పశి నోటి నుండి వెలువడేట్లు చేయండి. వారి అజ్ఞానాన్ని నా ప్రేమాగ్నిలో భస్మీపటలమయ్యేట్లు చేయండి. మీ సంకల్పాన్ని, సత్యము, ప్రేమ, నిజాయితీలపై నిలిపి, నా కార్యములో పాల్గొనే అర్హతను పొంది నా దివ్యేచ్ఛను నెరవేర్చుటలో సమైక్యం కండి. నేను మీ అందరికీ నా ప్రేమ సందేశాన్ని వ్యాప్తి చేయుటకై నా ఆశీస్సులందిస్తున్నాను.

- మెహెర్ బాబా

బాబా శాశ్వతంగా తన అక్షర ఫలకాన్ని విసర్జించుట గురించి సవిస్తరంగా వివరించే రిపోర్టేదీ లేదు. దీనికి ప్రత్యామ్నాయంగా బాబా ఆదేశాల ప్రకారం, తన అనుచరుల సమాచారం నిమిత్తం ఈ క్రింద తెలిపిన క్లుప్తమైన సమాచారాన్ని ఆదీ ప్రింటు చేయించి, పోస్టు చేశాడు.

"1954 అక్టోబరు 7న, ఆ రోజు నుండి ఎవరూ బాబాతో ఉత్తర ప్రత్యుత్తరాలు చేయరాదు. ఆ రోజు నుండి బాబా దర్శనం కానీ పరస్పర సమావేశం కానీ, అడిగి నా ఎవరికీ బాబా అనుమతించరు"

ఈ విధంగా అక్టోబరు 8 నుండి బాబా బాహ్యాచర్యల్లో అంతర్గత ఆధ్యాత్మిక పనిగా ఒక కొత్త ఘట్టం మొదలైంది. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు, తన ప్రేమికుల నుద్దేశించి వ్రాసిన లేఖలో మెహెర్ బాబా తన ప్రేమికులెవరైనా సరే శాశ్వతుడైన అవతారునితో సాధారణ జీవితాన్ని గడుపుతూ ఆలోచనలు, మాటలు, చేతలు అన్నీ ఆయనకే అర్పించుకొనుట ద్వారా అంతర్ బంధాన్ని స్థాపించుకోవచ్చునని సూచించారు.

## మెహెర్ బాబాకు గాడ్గే మహరాజు ఆహ్వానము

మరాఠీలో గాడ్గే అంటే ఒక రకమైన కుండ. గాడ్గే మహరాజు మహారాష్ట్రలో ప్రశిద్ధి చెందిన ఒక యోగి. పగిలిన సగం కుండ పెంకును ఆయన తన తలపై శిరస్త్రాణముగా ధరించేవాడు. అందుకే ఆయనకా పేరు వచ్చింది. ఆయన భోజనం చేయబోయే ముందు ఈ టోపీ వంటి పెంకును తీసి, దానిలో మజ్జిగలో జొన్న రొట్టె ముక్కలు కలిపేవాడు. వృద్ధుడై నందున నమలటం కష్టం కనుక, ఆ రొట్టె ముక్కలు నానే వరకు కాశేపు ఆగి, తర్వాత చప్పరించేవాడు. ఆయన భోజనం చేయటం కాగానే ఆ పాత్రను స్వయంగా చేతులతో శుభ్రంగా కడిగి మళ్లీ నెత్తిమీద ధరించేవాడు. రోడ్డు మీద దొరికే పాత గుడ్డ పీలికల్ని పోగుచేసి, వాటన్నిటినీ కలిపి ఒక బట్టగా కుట్టి ఆ ముతక బట్టనే దుస్తులుగా ధరించేవాడు.

గాడ్గే మహరాజుకళ్లు చింత నిప్పుల్లా ఉండి ముఖం దేదీప్యమానంగా వెలిగి పోతూ ఉండేది. రెండు చెవులకు రెండు చెవి పోగులు ధరించేవాడు. ఒక రింగు అతి తక్కువ విలువ గల రాగి నాణెంతో చేయగా రెండవది గవ్వతో చేసింది. ఒకసారి నా స్నేహితుడొకరు వాటి ప్రాముఖ్యత ఏమిటని ఆయన్నే అడిగాడు. చెవికున్న నాణాన్ని తాకుతూ, చాలా తీవ్ర స్వరంతో "ఈ ప్రపంచమంతా దీనితోనే నడుస్తోంది" అన్నారు. అంటే ప్రాపంచిక సంపదలన్న మాట. తర్వాత రెండవ చెవిరింగును పట్టుకొని "అయితే అంతటి ప్రాపంచిక సంపదలన్నీ ఒక చిల్లి గవ్వ కంటే కూడా అత్యల్పమైనవి" అని ఆయన వ్యక్తం చేశారు. ఒక పశిపిల్లలా అమాయకత్వంగా ఆయన ఆ పిమ్మట హృదయపూర్వకంగా నవ్వుకున్నారు.

గాడ్గే మహరాజు జీవిత విధానము, నాకు కొంత వరకు అసిస్సీలోని సెయింటు ఫ్రాన్సిస్ అనే లేపనం లేని యోగిని, గుర్తు చేసింది. గాడ్గే పేద గ్రామీణుల్ని ప్రేమించే వాడు. వారితో కలిసి భగవంతుడ్ని కీర్తిస్తూ ఆయన నాట్యం చేసేవాడు. ఒక ఊళ్లో కీర్తనలు ఆలపించే కార్యక్రమంలో పాల్గొనేందుకు వెళ్లినప్పుడు ఆయన చేసే మొదటి పని, తన భక్తుల సహాయంతో ఆయన సమావేశ స్థలినంతటి దైవ నామాన్ని మౌనంగా స్మరిస్తూ శుభ్రంగా ఊడ్చేవాడు. ఆయన కీర్తనా గానం చేసే ఊళ్లో భోజనం చేసేవాడు కాడు. తన యెడల వారికున్న భక్తిని పురస్కరించుకొని, ఎవర్నీ తన పాదాలను తాకనిచ్చే వాడు కాదు.

ఒక వేళ ఎవరైనా అందుకు భిన్నంగా ప్రవర్తిస్తే తనతో ఉంచుకున్న కర్రతో వారిని ఎదుర్కొనేవాడు. గాడ్గే మహరాజు భక్తులు. ఆయన పేరుతో, దైవ ప్రేమ గురించిన ఆయన సందేశాన్ని నిస్వార్థ సేవతో పరిశుద్ధ జీవితం గడుపుతూ ప్రచారం చేసేందుకు ఒక సంస్థను స్థాపించారు. నాశిక్‌లోను, పండరి పురంలోను యాత్రీకుల సౌకర్యార్థం పెద్ద పెద్ద భవనాల్ని వారు నిర్మించారు. మహారాష్ట్రలో గాడ్గే మహరాజు పూజనీయులైన యోగుల్లో ఒకరు.

1954 సెప్టెంబరు 12న బాబా దివ్య దర్శనం జరుగుతుండగా, గాడ్గే ఆయన పాదాల చెంత కూర్చొని, వాడియా పార్కులో హాజరైన వేలాది మందికి ప్రసాదం పంచటంలో బాబాకు సహాయపడ్డాడు. ఆ మర్నాడు సెప్టెంబరు 13న గాడ్గే మహరాజు మెహెరాజాదు స్వంత పని మీద వచ్చి బాబాను కలిశాడు. బాబా ఆయన కోసం ఆనందంతో ఒక చక్కని రీతిలో కొలువు తీరారు. "బాబా, నీ వైభవం అనన్యమైంది ! నీవు దేదీప్య మానంగా వెలిగే సూర్య భగవానుడవు. కాగా నేనొక మిణుకు మిణుకు మనే చిన్న దీపం బుడ్డిని.' అని ప్రకటించాడు. అంతకు ముందు బాబా తన శిష్యులకు గాడ్గే మహరాజు ఒక యధార్థ యోగి అని బహిర్గత పరచారు. అందువల్ల అతడు అవతారుని ముందు ప్రదర్శించిన అణకువ రంజింప చేసింది". బాబా! నేనిప్పుడు వృద్ధుడనయ్యాను. నేను బాగా అలసిపోయాను. నేను నీతో ఉండేందుకు దయచేసి నన్ననుమతించు. నీవు నాకు ఎటువంటి ఇంటి పని వప్పగించినా సరే చేస్తాను. నా అవసరాలు బహు తక్కువ నేను నీకేమంత భారం కాబోను. నేను తినే ఆహారం ఒక చిన్న జొన్నరొట్టె, కాస్త పప్పు లేదా మజ్జిగ" అంటూ విన్నవించుకున్నాడు.

బాబా ముఖంలో ఇతని విన్నపం నవ్వు తెప్పించింది. నేత్రాలు గాఢమైన చేతనత్వముతో వెలిగిపోయాయి. ఆయన చాలా ఎక్కువగా వినోదిస్తున్నట్లు కనిపించారు. గాడ్గే ప్రతిపాదనతో సంతుష్టులయ్యారు కూడా అయితే బాబా గాడ్గేని తన కీర్తనల ద్వారా ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసే కార్యక్రమాన్ని కొనసాగించమన్నారు. దానికి ప్రతిగా ఆయోగి మరో విజ్ఞాపనను ప్రతిపాదిస్తూ బాబాను పండరి పురం సందర్శించమని అక్కడ ప్రతి సంవత్సరం ఏడాదికి రెండు సార్లు వేలాది మంది యాత్రీకులు విఠోబా రూపంలో ఉన్న (విఠల్ లేదా పాండురంగడు) శ్రీ కృష్ణ ప్రభువు దర్శనానికి సమావేశమవుతారని చెప్పాడు. బాబా ఈ కోరికను మన్నించి అంగీకరిస్తూ, సందర్శనా తేదీని తరువాత నిర్ణయిస్తానని చెప్పారు.

నేను ఇక్కడ అనంత చైతన్యాత్మక అవతారుడికి - అంతటా దైవ సమక్షాన్ని అనుభవించే ఒక యోగికి మధ్య జరిగిన సంభాషణ యొక్క బాహ్య దశను మాత్రమే పొందుపరచాను. ఈ కలయిక వెనుక ఉన్న ఆధ్యాత్మిక ప్రాముఖ్యత బాబాకు మాత్రమే తెలియాలి. బాబా ఎప్పుడూ గాడ్గే యెడల ఒక ప్రత్యేక శ్రద్ధను వ్యక్తం చేసేవారు. 1912లో ఆయన దక్కన్ కాలేజీలో విధ్యార్ధిగా చదువు కుంటుండగా, బాబా గాడ్గే కీర్తనలకు హాజరై ఆయనకు దైవ మందున్న ప్రేమకు, ఆయన భాష యొక్క సౌమ్యతకు ముగ్దులై గాఢంగా హత్తుకు పోయేవారట.

1954 సెప్టెంబరు 13న బాబా మెహెరాబాదు సందర్శించలేదు. పాశ్చాత్యుల సహవాస్ 14 నుంచి మొదలైంది. సెప్టెంబరు నెలాఖరుకి అంతిమ ప్రకటన సమావేశం ముగిసింది. అక్టోబరు మొదటి వారంలో బాబా మెహెరాజాదు నుండి సతారాకు వెళ్లారు. 1954 జూన్ నుండి అది తమ ముఖ్య స్థావరంగా ఉన్నది. రెండు వారాల తర్వాత 16 అక్టోబరు బాబా మస్తుటూరు కోసం ఆదీ ఆయన వద్ద వుంచిన చెవర్ లెట్టు కారులో బయలు దేరారు. ఆయన వెంట ముగ్గురు శిష్యులు ఉండగా ఎరుచ్ డ్రైవరుగా కారు నడిపాడు.

మొదటి మజలీగా బెల్గాం అనే కర్నాటక రాష్ట్రంలోని పట్టణంలో ఆగారు. నవ జీవన కాలంలో బాబా 1949 అక్టోబరులో బాబా అక్కడ ఉన్నారు. అక్కడ నుంచి ఆయన మహారాష్ట్రలోని కోల్హాపూరు వెళ్లారు. అక్కడ నుంచి అక్టోబరు 22న తిరిగి సతారాకు వచ్చారు. ఆ ప్రయాణంలో బాబా కలుసుకున్న ఉన్నతంగా పరిణతి చెందిన మస్తులలో భగవంతుని యందు వారికున్న అవధులు లేని నమ్మకంతో పాటు భౌతిక విషయాలపై వారి నిరాశక్తి మరువలేనిది. ఒకసారి బాబా ప్రవచించిన సందేశం నాకు గుర్తొస్తోంది. "వారు-అమస్తులు నాకు ప్రియ మైన బిడ్డలు. నేను వారికి ఆకర్షితుడనయ్యాను. భగవంతుని వైపు వారు చేస్తున్న ఆధ్యాత్మిక ప్రయాణంలో నేను వారికి సహాయపడతాను. ఇటువంటి కలయికలు, నా విశ్వాత్మక ఆధ్యాత్మిక కార్యక్రమంలో నాకెంతో సహాయపడతాయి."

బాబా సతారాలో ఉండగా ఆయన శిష్యులిరువురు ఆదీ మరియు సరోష్‌లు గాడ్గే మహరాజు దేశ సంచార యాత్రలో ఉండగా కలవటం జరిగింది. నవంబరున ఆయన్ని బొంబాయిలో కలిసేందుకు వెళ్లారు. హిందువులకు కార్తీక మాసంలో 11వ రోజు కార్తీక ఏకాదశి మహాపుణ్య దినం. నవంబరు 6 కార్తీక ఏకాదశి సాయంత్రం మరల 7వ తేదీ ఉదయం పూట పండరీపురంలో బాబా

దర్శన కార్యక్రమంగా నిర్ణయిస్తూ బాబాను గాడ్గే సంతోషంగా ఆహ్వానించాడు. ఆదీ తక్షణం దీనిని గురించి బాబాకు కబురు చేశాడు. ఆదీ అహ్మదు నగరు తిరిగి వెళ్లేసరికి, ఆదే తేదీలను అంగీకరిస్తూ బాబా కొన్ని ఆదేశాలు అందించారు.

ఇతర రాష్ట్రాల్లో ఉన్న బాబా ప్రేమికులకు బాబా పండరిపురం దర్శనం గురించి తెలియచేసే సమయం లేకపోయింది. నిజానికి బాబా ఈ పండరిపురం దర్శనం, భజనలు కీర్తనలు చేసుకుంటూ విటోబాను సందర్శించ వచ్చే యాత్రికులకు మాత్రమే నిర్దేశించాలను కున్నారు. అయితే బాబా సాధారణ ఆదేశాల ప్రకారం ఆదీ నాకొక టెలిగ్రాం పంపుతూ బాబా పండరి పుర దర్శనంలో తనతో పాటు నన్నూ ఆయన సహవాస్‌లో ఉండేందుకు అనుమతించినట్లు తెలిపాడు. మా ఊరికి పండరిపురం 30 మైళ్ల దూరము మాత్రమే. ఈ అనుమతి బాబా నుండి ఆకశ్మికంగా కురిసిన బాబా యొక్క ప్రేమాన్విత కృపా రసధార. అది నా హృదయాన్ని తడిపివేసింది. ఆయనతో ఉండట మంటే చేతలలో దైవ ప్రేమను వీక్షించటమన్న మాట.

నవంబరు 6వ తేదీ ఉదయం బాబాను సరోష్ తన కారులో సతారా నుండి పండరిపూరుకు తీసుకు వెళ్లాడు. గుస్తాద్‌జీ, ఎరుచ్, పెండూ, భావూ, మెహెర్జీ, నారిమన్‌లు మరో రెండు కారుల్లో బాబాతో పాటు వెళ్లారు. రంగోలీ, ఎల్.బి.తాడే, భాగీరాథ్ మరి కొందరు బాబా ప్రేమికులు బాబాతో ఉండే యీ అవకాశాన్ని జారవిడుచుకోరాదన్న తలంపుతో ఒక జీపు మాట్లాడుకొని అహమ్మదు నగర్ నుండి పండరిపూర్ వెళ్లారు. సాయంత్రం 3-30లకు బాబా పండరిపూర్ చేరుకుని పట్టణ పొలిమేరలో ఉన్న ఆరాధ్య పాటిల్ బంగళాలో కొద్దిసేపు ఆగారు. ఇక్కడే అహమ్మదు నగరు నుండి వచ్చిన బృందం తమ హృదయనాథుడైన బాబాను కలసి, శుభాకాంక్షలందించుకున్నారు.

బాబా మంచి అద్భుతమైన మూడ్‌లో ఉన్నట్లు కనిపించారు. వారిలోని ప్రతివారు తనను ఆలింగనం చేసుకొనుటకు అనుమతించారు. కానీ తాడే దగ్గరకు రాగానే అతని వైపు సౌంజ్ఞలు చేస్తూ "నీ వెందుకు వచ్చావు ? ఉద్యోగంలో శలవుపెట్ట వచ్చావా ?" అని అడిగారు. ఈ ప్రశ్నలకు తాడే జవాబు చెప్పే స్థితిలో లేడు.

"నీవిలా రావటం వల్ల నాకు ఇబ్బంది కలిగింది" అని బాబా అనే సరికి ఆ బృందం వారికి దాని భావం అర్థం కాలేదు. బాబా మాటల్ని తాడే మాత్రమే

అర్థం చేసుకున్నాడు. అతడికి ఏడుపు ఒక్కటే మిగిలింది. అంతకు ముందు ఒకటి రెండు సంవత్సరాల క్రితం మాటల సందర్భంలో యాధృచ్ఛికంగా ఉద్యోగానికి శలవు పెట్టకుండా తన దర్శనానికి రావద్దని బాబా తాడేని ఆదేశించారు. ఇప్పుడు తాడే అహ్మదు నగరులో సాంఘిక సంక్షేమ శాకాధికారిగా పనిచేస్తున్నాడు. ఈ రోజున ప్రత్యేకంగా అత్యుత్సాహంగా తక్కిన బృందంతో కలిసి ఉద్యోగానికి శలవు పెట్టి మంజూరు చేయించుకో కుండానే అహమ్మదు నగరు వదిలి వచ్చాడు. ఇది బాబా ఆదేశానికి విరుద్ధం. అవతారుడిగా బాబాకు సంబంధించిన విషయాల్లో చిన్న ఆదేశాలు, పెద్ద ఆదేశాలకు మధ్య ఎటువంటి తారతమ్యత ఉండదు. ఒక చిన్న ఆదేశము ఆయా వ్యక్తుల మంచికే ఉద్దేశించబడి, అత్యంత పెద్ద ఆదేశానికంటె కూడా అధికంగా ఆ అనంతుని ఇచ్ఛను వ్యక్త చేస్తుంది.

విచారంతో ఖిన్నుడైన తాడేను చూచిన బాబా ముఖంలో కరుణా పూరిత దృక్కులు పెల్లుబికి "విచారించకు. జరిగిన దానిని మరచిపో. నేను నిన్ను క్షమించాను. ఇటువంటి పనిని మరెన్నడూ చేయకు" అని సౌంజ్ఞలు చేశారు. ఏం జరుగుతున్నదో ఎవరికీ అర్థం కాలేదు. ఆ తర్వాత తాడే చెపితే తెలిసింది. అతను అహమ్మదు నగరు తిరిగివెళ్లగానే తన బల్లపైన వెంటనే చర్య తీసుకోవలసిన అతి ముఖ్యమైన జాబు ఒకటి తన కోసం ఎదురు చూస్తోంది. అది నాశిక్‌లోని తమ ప్రాంతీయ ప్రధాన కార్యాలయం నుంచి వచ్చింది. నవంబరు 6న సహాయ సంచాలకులు అహమ్మదునగరు టూరువస్తున్నందున, తాడేను తన కార్యాలయంలోనే ఉండమని ఆదేశించిన ఉత్తరమది. చివరకు ఏదో కారణంపైన ఆ టూరు రద్దయి ఆయన రాలేదు.

ఈ విషయం తెలుసుకున్నప్పుడు "నీవు రావటం నాకు ఇబ్బంది కలిగింది' 'అన్న బాబా మాటలకు అర్థమేమిటో తాడేకు తెలిసింది. బాబాను ఒక పరిపూర్ణ సద్గురువుగా అంగీకరించిన తర్వాత కూడా ఆయన ప్రేమికులు, తమకు తెలియకుండానే ఆయనకు అవిధేయులైనప్పటికీ, వాటి వల్ల ఎదురయ్యే ప్రమాదకర ఫలితాన్ని వాటివల్ల కలిగే బాధల్ని బాబాయే తనపైన ఆపాదించుకుంటారు. దీనినే ఆయన "అదనపు శ్రమ" గా అభివర్ణించారు. ఈ సంఘటన తాడే జీవితంలో శాశ్వతంగా గుర్తుంచుకొనే గుణపాఠంగా మిగిలిపోయింది. అది జరిగాక తాడే ఏ ఒక్క బాబా దర్శనానికి గాని, సహవాస్‌కు గాని తన పై అధికారుల అనుమతి తీసుకోకుండా రాలేదు.

ఈ సందర్భంలో ఎరుచ్ చెప్పిన విషయాన్ని తెలుసుకుందాం.

అంతట బాబా గాడ్గే మహరాజుకు కబురు పంపారు. విఠోభా స్వయంగా పండరిపూర్ చేరాడని, అక్కడ ఉండే 24 గంటలూ పూర్తిగా ఆయన తన ఆధీనంలో ఉంటాడని మహరాజు ఏం చేయమని కోరితే దానిని విఠోభా ఒక్క షరుతుపై పాటిస్తాడని, ఎటువంటి పరిస్థితుల్లోనూ మహరాజ్ ఆయన్ని మౌన విరమణ చేయమని కానీ తన అక్షర ఫలకాన్ని ఉపయోగించమని కాని అడగకూడదని ఎందుకంటే ఆయన 1954 అక్టోబరు 7న దానిని వాడటం మానివేశారని, తెలిపారు. మరోక విషయం కూడా తెలిపారు. తనను భోజనము చేయమని కాని, ఆ రాత్రికి నిద్రపొమ్మని గాని అడుగరాదని, ఏలననగా ఆరోజు వచ్చే యాత్రీకులందరిని, నిద్రాహారాలు మాని కలుసుకోవాలని తాను నిశ్చయించినట్లు తెలిపారు.

బాబా వచ్చారని తెలియగానే, గాడ్గే మహరాజు తక్షణం తన స్వంత ధర్మశాలలో ఆయనకు స్వాగతం చెప్పేందుకు తయారయ్యారు. పండరిపూరు సందర్శించే వేలాది మంది యాత్రీకులకు వసతి సౌకర్యాలకై నిర్మించిన అతి పెద్ద భవనమే ఈ ధర్మశాల.

## పండరిపురంలో సజీవ విఠోభా మెహెర్ బాబా

బాబాకు ఆయన మండలికి, అహమ్మదు నగరు నుండి వచ్చిన ఆయన భక్తులకు రైల్వేస్టేషను సమీపంలో ఉన్న మిలటరీలో పనిచేసే ఉద్యోగుల పిల్లలకై నిర్మించిన హాస్టలులో భోజన వసతి ఏర్పాట్లు చేయబడినవి. కార్తీక మాసపు తిరునాళ్ల సందర్భంగా పాఠశాలలన్నిటికి రెండు వారాలపాటు శలవులిచ్చారు. అందువల్ల కొన్ని గదులు బాబాకు ఆయన బృందానికి ఖాళీగా లభ్యమయ్యాయి.

దర్శనపు ఏర్పాట్లకు సహాయపడే కార్యకర్తలంతా మధ్యాహ్నానికి పండరిపురం చేరుకున్నారు. మేము గాడ్గే మహరాజు ధర్మశాల చుట్టూ తిరుగు తుండగా, బాబా గాడ్గే మహరాజుకు పంపిన ప్రత్యేక సందేశం గురించి నగరంలోకి ఆయన ప్రవేశించ బోతున్న సమయం గురించి తెలసింది. మహరాష్ట్రలోని భిన్న ప్రాంతాలనుండి వేలాది మంది యాత్రీకులు అప్పటికే చేరుకోవటంతో నగరంలోని రోడ్లన్నీ ముక్కోణాకారపు కాషాయరంగు జెండాలు చేతధరించిన యాత్రికులతో నిండి పోయి కోలాహలంగా ఉంది. మూడంతస్తుల గాడ్గే మహరాజు ధర్మశాల

కూలి పోతుందేమోనన్నంతగా కిటకిటలాడిపోతోంది. సాయంత్రం 5-00లకు బాబా రాగానే గాడ్గే మహరాజు ఘన స్వాగతం పలికారు. గాడ్గే మహరాజు బాబాను సగౌరవంగా ఎదురుగా ఉన్న విశాల ఆటస్థళంలోకి తోడ్కొని వెళ్లాడు. ఆ స్థళంలో ఒక పక్క లోపలగా ఉన్న వరండాలో చిన్న లార్డు విఠోభా విగ్రహ మొకటి నెలకొల్పబడి ఉన్నది. దానికి ఎదురుగా బాబాకై ఒక కుర్చీని గాడ్గే మహరాజు ఏర్పాటు చేశారు. బాబాకు ప్రణామాలాచరిస్తూ గాడ్గే బాబాను ఆ ఆసనము పై సుఖీశీసులను కమ్మనముని ప్రార్థించాడు. బాబా ఆశీనులు కాగానే, విఠోబా విగ్రహం కనుమరుగై పోయింది. ఆయనకు ఎదురుగా కూర్చున్న యాత్రీకులకు బాబా మాత్రమే కనిపిస్తున్నారు. ఆయనవెనక ఉన్న విగ్రహం అగపడలేదు. దీనిని బట్టి వారి మధ్య సజీవ విఠోబాయే ఉన్నాడన్న దివ్య సంకేతాన్ని పరోక్షంగా అందించినట్లయింది.

గాడ్గే మహరాజు యాత్రీకులనుద్దేశించి ప్రసంగిస్తూ, మెహెర్‌బాబా జగత్ గురువు అని ఆయన సకల ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా సేవిస్తున్నారని చెప్పారు. "ప్రజలు మెహెర్‌బాబా దర్శనానికై వేలాదిమైళ్లు ప్రయాణం చేసి వస్తారు. కానీ మీరు నిజంగా ఎంతో అదృష్టవంతులు. ఆయనే స్వయంగా తన ధర్శన భాగ్యాన్ని మీకందించేందుకు సతారా నుండి ఇక్కడకు వచ్చారు. మీకు అందించిన ఈ అద్భుత అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకొని హృదయపూర్వకంగా ఆయన్ని దర్శించుకోండి" అని అంటూ "మెహెర్ బాబాకి జై" అన్న నినాదంతో తన ప్రసంగాన్ని ముగించాడు. పిమ్మట గాడ్గే మహరాజుకు ఇష్టమైన పాట "గోపాల, గోపాల దేవకి నందన గోపాల" అనే దైవ నామ సంకీర్తన గానాలాపనతో మర్మోగి పోయింది. యాత్రీకులంతా ఆయనతో స్వరం కలిపి పాడసాగారు. ఆ తర్వాత ఒక గంట సేపు దర్శనం కొనసాగింది. బాబా మానవ స్థాయిలో ఆనందంగాను దైవ స్థాయిలో తేజస్సుతోను వెలిగిపోతూ కనిపించారు. కార్యక్రమం ఆసాంతం గాడ్గే మహరాజు బాబా పక్కనే నిలబడి ఉన్నాడు. ప్రజలతో, తోసుకోవద్దని జగత్ గురువుకు తమ భక్తి ప్రపత్తులను హృదయపూర్వకంగా సమర్పించుకోమని చెప్పారు.

ధర్మశాల నుండి బయటకు వస్తూ బాబా తదుపరి కార్యక్రమము ఏమిటని గాడ్గే మహరాజును అడిగారు. "నీ ఇష్టం బాబా" అని గాడ్గే బదులిచ్చాడు. "నీవు నా సందేశాన్ని అందుకోలేదా ? పండరిపురంలో ఉన్నంత సేపు నేను నీ ఆధీనంలో ఉంటాను. నీ యిష్టం వచ్చిన చోటుకు నన్ను తీసుకువెళ్లు" అని బాబా ఆశ్చర్యాన్ని వ్యక్త పరుస్తూ సౌంజ్ఞలు చేశారు. "బాబా!

అదంతా నీ ఇచ్ఛ ప్రకారమే జరిగి తీరాలి'' అని గాడ్గే పునరుద్ఘాటించాడు. అందుకు బాబా నవ్వుతూ ''అయితే, నేనీ అర్ధరాత్రికి పండరిపురం వదిలి సతారావెళ్లి పోవాలను కుంటున్నాను'' అనే సరికి ఆ యోగి వణికిపోతూ, ''వద్దు వద్దు ! రాత్రి 10-00లకు మనం చంద్రభాగానది ఇసుక తిన్నెలపైకి వెళదాం. అక్కడే విఠోభా భక్తులైన వేలాది మంది యాత్రికులను ఆశీర్వదించమని నేను నిన్ను అర్థించ దలచాను. మర్నాడు, నేను నిన్ను హరిజనుల ధర్మశాలకు ఆ తర్వాత నీవు అమితంగా ప్రేమించే కుష్టు రోగుల వాడను దర్శించేందుకు తీసుకు వెళతాను'' అని విన్నవించుకున్నాడు. బాబా చాలా ఆనందించి ''చాలా బాగున్నది, మంజూరు చేశాను'' అంటూ ఎంతో ప్రేమతో ఆప్యాయంగా గాడ్గే మహరాజు ముఖాన్ని చుంబించారు.

బాబా తన బృందంతో మిలటరీ హాస్టలకు బయలు దేరేటప్పటికి సాయంత్రం 6-00 అయింది. అక్కడకు చేరగానే, ఆరుబయట జెండా స్థంభం క్రింద ఆశీనులైన పూనా భజన బృందాన్ని సంకీర్తన చేయమన్నారు. మధుసూధన్‌కు ప్రేరణ కలిగి మరాఠీలో ''ఆహో ఆలా పేహాదేవ్ ఆలా అవతార్ ఆలా'' అనే ఒక కొత్త పాటను కట్టిపాడాడు. తెలుగులో దాని అర్థం ''అదిగో చూడండి, భగవంతుడు అవతారుడిగా మానవ రూపంలో ఇక్కడకు అరుదెంచాడు. ఆయన్ని దర్శించేందుకు త్వరపడదాం'' ఈ పాటకు చేసిన స్వరకల్పన, సంగీతం, దాని భావం అక్కడ పాల్గొన్న వారందరి హృదయాల్లో గాఢంగా నాటుకుపోయింది. బాబా కూడా దాని రచనను మెచ్చుకొని ''ఈ పాటలో పేర్కొనబడిందంతా యధార్థం'' అని వ్యాఖ్యానించారు. ఈ పాట ఒక ఇష్టమైన పాటగా ప్రఖ్యాతి చెందింది. బాబా మధుసూధన్‌ను ఇతర సంధర్భాల్లో ఈ పాటను అడిగి పాడించుకొనేవారు. అయితే ఆనాటి సాయంత్రం స్పష్టంగా వ్యక్తమైన లోపం బాబా యొక్క దీర్ఘకాల జోడీ అయిన అక్షరఫలకం లేకపోవటం. మేమంతా దానిని పోగొట్టుకున్నాం. ఆనాడు బాబా ప్రజలతో వర్ణనా రూపకమైన తన చేతి సౌంజ్ఞలు మరియు అందమైన హావ భావాల ద్వారా సంభాషించారు.

35 ఏళ్ల క్రితం నేను వ్రాసుకున్న నోట్సు నుండి యీ క్రింది వివరాలను అందిస్తున్నాను. ఇక్కడ పేర్కొన్న సంభాషణలన్నీ అధికంగా మరాఠీ, గుజరాతీలోను అప్పుడప్పుడు ఇంగ్లీషులోను కూడా జరిగాయి. అప్పుడూ, ఇప్పుడూ కూడా మూలము నోట చెప్పింది కాదు కనుక నా స్వీయ అవగాహనను మాత్రమే ప్రతిబింబిస్తుంది. దేదీప్యమానమైన బాబా యొక్క కళాత్మక సౌంజ్ఞలు నా హృదయ ఫలకంపై చెక్కబడినవి. గత కాలపు జ్ఞాపకాలలో ఎగిరేందుకు అవి

నాకు రెక్కలయ్యాయి. సందర్భవశాన ఇది నాకు రెండవసారి జరిగింది. మొదటిసారి ఆంధ్రలో కాకినాడలో జరిగింది, ఇప్పుడు నేను ఒక రాత్రంతా బాబాతో గడపటం జరిగింది.

అది నవంబరు నెల అవటం వల్ల, రాత్రి చాలా వేగంగా చలిపెరుగుతోంది. బాబా లోపల ఉన్న ఒక పెద్ద గదిలోకి వెళ్లారు. అక్కడ తెల్లని దుప్పటి పరిచిన పరుపుపై ఆయన కూర్చున్నారు. ఆయన ప్రేమికులు కూడా ఆయనతో పాటే లోనికి వెళ్లారు. ఒకాయన యాదృచ్ఛికంగా సంభాషణను ప్రారంభిస్తూ "బాబా ! నీవిప్పటి నుండి దర్శనం ఇవ్వటం ఆపివేశావు. కనుక నీవీనాడు దయచేసిమేమెలా ఆధ్యాత్మిక జీవనాన్ని గడపాలో ఉపదేశిస్తావా ?" అనడిగాడు. అందుకు బాబా సౌంజ్ఞలతో బదులిస్తూ "చాలా సులభము. నిన్ను నీవు మరిచిపో. నన్ను బాగా గుర్తుంచుకో, నన్ను ప్రేమించు, ఇది నీకు మాత్రమే సహాయపడటం కాక, ఆధ్యాత్మిక జీవనాన్ని గడిపేందుకు ఎవరికైనా సహాయపడుతుంది" అన్నారు. ఆ బృందంలోని మరొకరు మాట్లాడుతూ "బాబా మేము అలా చేయుటకు ప్రయత్నించాము. కానీ మా ప్రయత్నాల్లో మేము తరచూ అపజయం పాలయ్యాము" అన్నాడు. అప్పుడు బాబా ఎరుచ్‌తో, గతంలో హమిర్‌పూర్‌లో ఉండగా ఎవరో ఇదేవిధమైన ప్రశ్నవేసినప్పుడు తాను ఇచ్చిన జవాబును వివరించమన్నారు. దాని సారాంశం ఇది : "నేను ప్రేమ మహాసాగరుడను కనుక, నేను మిమ్ములను నన్ను ప్రేమించమని చెపుతాను. నేను అంతటా ఉన్నాను. ప్రతి బిందువులోనున్నాను. కనుకనే నా దివ్య క్రీడలో పాల్గొనే అవకాశాన్ని ప్రతిబిందువుకు ఇవ్వబడి నన్ను ప్రేమించే మార్గాన్ని కనుగొనే అవకాశాన్నిచ్చాను. నిజాయితీ, హృదయపూర్వక కృషి నన్ను చేరే మార్గాన్ని మీరు కనుగొనుటకు సహాయపడతాయి."

మరోవ్యక్తి తన హృదయాన్ని విప్పి "బాబా, నీవందించిన విషయాన్ని బుద్ధిబలంతో మేం అర్థం చేసుకుంటాం. కానీ మా భవ బంధాలు నిర్భంధించటం వల్ల, మేము ప్రాపంచిక విషయాల్లో అతుక్కుపోతున్నాం" అన్నాడు.

అతడ్ని బాబా ఓదారుస్తూ "నా యొక్క ప్రేమాన్విత జ్ఞాపకము క్రమంగా మీలో వివేకాన్ని మేల్కొలిపి మీకవసరమైన శక్తినిస్తుంది. మీరిప్పటివరకు ఎన్నిసార్లు ఆడా, మగగా పుట్టారో, మీకెంత మంది పిల్లలు పుట్టారో, దానికని దీనికని మీరెంత వ్యధ చెందారో, కాసేపు మిరాలోచించండి. అంతా స్వయం కల్పితం. మీరు బద్ధుడనయ్యాను అనుకుంటే బద్ధులవుతారు. నాయందు

విశ్వాసంతో, మీరు స్వేచ్ఛతో నిశ్చింతగా ఉన్నారనుకుంటే నిశ్చింతగానే ఉంటారు. హృదయాన్ని పోగొట్టుకోకండి. నన్ను గుర్తుంచుకోండి. నన్ను అధికాధికముగా ప్రేమించండి'' అని వివరిస్తూ, ''కానీ నన్ను ప్రేమించటమంటే లడ్డూలు తిన్నంత సులభం కాదు సుమా !'' అన్నారు.

మరికొన్ని ప్రశ్నలకు జవాబులు చెప్పిన తర్వాత ''అక్టోబరు 7న నేను అక్షర ఫలకాన్ని విసర్జించినప్పుడు నేను ఎటువంటి ఆధ్యాత్మిక ప్రవచనములను కానీ, వివరణలు కానీ అందిచనని నేను ప్రకటించి యున్నాను. అందువల్ల, ఇప్పుడు నేను మీకందించిన వివరణాత్మక ప్రకటన దీనికి విరుద్ధము. కనుక నేనిప్పుడు గుస్తాద్‌జీని వచ్చి నా రెండు చెంపలపైన అరచేతితో కొట్టమని ఆదేశిస్తున్నాను !' ' అన్నారు. బాబా చెప్పినట్లు గుస్తాద్‌జీ నడుచుకొని ఆయన ఆదేశాన్ని విధేయతతో పాటించాడు. అది చూచి కొందరు విస్మయంతో భీతి చెందారు. మరికొందరు ఉలిక్కిపడి బెదిరిపోయారు కానీ బాబా ''ఇప్పుడు నేను ఆనందిస్తున్నాను'' అని సౌంజ్ఞ చేశారు. ఆ సమయంలో ప్రతివారు భోజనానికి లెమ్మనమని ఆదేశించారు.

భోజనాలయ్యాక, వారు తిరిగి రాగానే అందరికీ టీ ఇచ్చారు. ఆరాత్రంతా మేలుకొని ఉండమన్న బాబా ఆదేశాల్ని ప్రతివారికి తెలియపరచారు. 'నిద్రపోరాదు!' కనుక మళ్ళీ అంతా బాబా గదిలో సమావేశం కాగానే సంకీర్తన కొనసాగించమని బాబా కోరారు. రాత్రి 10-00లు కాబోతుండగా చంద్ర భాగా నదిలోని ఇసుక తిన్నెలపై పరివేష్టించిన గొప్ప యాత్రీక సమూహాన్ని సందర్శించబోయే ముందు దారిలో ధర్మశాల వద్దకు రమ్మనమని బాబాను కోరుతూ గాడ్గే మహరాజు ఒక సందేశాన్ని పంపారు.

బాబా కారు ధర్మశాలకు చేరుకోగానే గాడ్గే మహరాజు ఆ కారులోకి ఎక్కి ఎంతో భక్తి పూర్వకంగా బాబా పక్కనే కూర్చున్నాడు. నది ఒడ్డుకు బాబా చేరుకోనే సమయానికి దాదాపు 50 వేల మందికి పైగా యాత్రీకులు కీర్తనలు వింటూ ఆయన రాకకై ఎదురు చూస్తున్నారు. ఏకాదశి చంద్రుని వెన్నెల వెలుతురులో ఆ రాత్రి సమయాన గాడ్గే మహరాజు బాబాను అప్పటి కప్పుడు నిర్మించిన వేదిక వద్దకు తీసుకొని వెళ్లాడు. అంతమంది జనం ఉన్నా గంభీరమైన నిశ్శబ్దం అలుముకున్నది. బాబా పక్కనే గాడ్గే మహరాజు నిలబడి మైక్రోఫోను ద్వారా యాత్రీకులను ఉద్దేశించి ప్రసంగిస్తూ ''ఈ క్షణంలో మీరు జగద్గురువు సమక్షంలో ఉన్నందున ఎంత అదృష్టవంతులో మీకు తెలియదు. మెహెర్ బాబా బ్రతికి

ఉన్న విఠోభా..... ఇంకా నా చెంత మెహెర్ బాబా ఉన్నందున నేను ఎంత ఆనందంగా ఉన్నానో కూడా మీరు ఊహించలేరు" అంటూ వివరించాడు.

బాబా తన రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ ఆయన ముందు కూర్చుని వేలాది మందిలో ఉన్న తన స్వీయ ఆత్మకు వందన సమర్పణ చేశారు. ఇది ఒక అద్భుత దర్శనము. బాబా జనం వైపు చూడగా వారంతా మౌనంగా ఆయనవైపు రెప్పలార్పకుండా చూస్తున్నారు. బాబాను స్పృశించేందుకు ఎవరినీ అనుమతించలేదు. బాబా శిష్యులిరువురు అవతార్ మెహెర్ బాబా జీవితం పైనా ఆయన కార్యక్రమం పైనా క్లుప్తంగా ప్రసంగించారు. ఆ తర్వాత గాడ్గే శిష్యులు కీర్తనలను ఆలపించారు. అర్ధరాత్రి దాటాక, గాడ్గే ఆ జనం మధ్య నుంచి బాబాను జాగ్రత్తగా కారు వద్దకు తోడ్కొని వెళ్లాడు. బాబా ఆహ్వానంపై ఆయనతో పాటు తానూ ఆ కారులో ఎక్కాడు. అప్పుడు ఏమి జరిగిందో ఎరుచ్ వ్రాసుకున్న నోట్సులో ఇలా వివరించాడు.

ధర్మశాలవైపు కారు పోతుండగా, గాడ్గే బాబా వైపు తిరిగి మాట్లాడుతూ, తానిప్పుడు బాగా వృద్ధుడైనందున ఏ పనీ చేయలేక పోతున్నట్లు, బాబా కనుక తను ఆయనతో ఉండనిస్తే తాను ఆయనకు ఏ మాత్రం భారం కాబోనని, ఒక రొట్టె ముక్క, ఒక గుడ్డ ముక్క మాత్రం తనకు చాలని, వినయంతో విన్నవించు కున్నాడు. దానిని విన్న బాబా, ఉల్లాసంతో ఉప్పొంగిపోయారు. ఎంతో ఆప్యాయంగా నవ్వుతూ గాడ్గే మహరాజును మనఃపూర్వకంగా ఆలింగనం చేసుకున్నారు. పిమ్మట బాబా తన మండలితో మాట్లాడుతూ గాడ్గే మహరాజు మాటల యధార్థ భావాన్ని బాబా తప్ప వేరెవరూ అర్థం చేసుకోలేరని చెప్పారు. గాడ్గే మహరాజును సరైన మాటలో చెప్పాలంటే ఒక పరిపూర్ణ యోగి అని బాబా చెప్పారు.

ధర్మశాల వద్ద సింహద్వారం ముందు గాడ్గే మహరాజు కారు దిగగా, సరోష్ ఇరాని బాబాను హాస్టలుకు తీసుకువెళ్లాడు. అక్కడకు చేరగానే బాబా మళ్లీ ప్రతివారిని ఒక కప్పు టీ త్రాగమన్నారు. ఆయన మాత్రం ఒక్క గుక్క చప్పరించారు. ఆయన సంకల్పించినట్లుగా ఆ పెద్ద గదిలో మళ్లీ అంతా వచ్చి కూర్చున్నారు. బాబా ఏదో చెప్పాలన్న ప్రశాంత స్థితిలో ఉన్నారు. అటువంటి సందర్భాల్లో, ఆయన తేజస్సు ఆయన్నుంచి దడాలున బద్దలవుతుందన్నట్లు కనిపిస్తుంది. అక్కడున్న ప్రతివారు ఆయనకు అతి చేరువగా ఉన్నట్లు భావిస్తారు. ఇప్పుడు బాబా వివరిస్తున్నారు. "నేను గాడ్గే మహరాజును ప్రీతితో చూస్తాను.

ఈరోజున నేను చాలా ఆనందంగా ఉన్నాను!'' అని అంటూనే, గాడ్గే త్వరలోనే శరీరాన్ని పరిత్యజించి శాశ్వతానందాన్ని అనుభవించేందుకు తన వద్దకు వస్తాడని యాదృచ్ఛికంగా వ్యక్తపరిచారు. నిజానికి ఆయన 1956లో పరమపదించాడు.

తెల్లవారు ఝామున 2 గంటల సమయమైంది. ఆ బృందమంతా బాబా ఆదేశాలపై ఆరాత్రంతా జాగరణ చేస్తూ మేలుకొనే ఉన్నారు. హజరత్ బాబాజాన్‌ను తాను కలుసుకున్నప్పుడు తనకు కలిగిన అనుభవం గురించి బాబా వివరించేందుకు ఉద్యుక్తులయ్యారు. బాబా తన సౌంజ్ఞల ద్వారా జ్ఞాపకం చేసుకుంటూ, బాబాజాన్‌ను తొలిసారిగా ఆలింగనం చేసుకున్న పిదప, నఖశిఖ పర్యంతం తన శరీరమంతా విద్యుత్ ప్రవాహము వంటి శక్తి ప్రసరించినట్లనిపించిందని చెప్పారు. తొమ్మిది నెలల అనంతానందపు వఱ్ఱు జలదరించే పులకరింపులను, తాను అనుభవించారట. అప్పుడు ఒక రోజున, బాబాజాన్ తన కళ్ళల్లోకి సూటిగా, గంభీరంగా చూస్తూ ఆయన భృగు మధ్యంలో నొసట ముద్దు పెట్టుకున్నదట. ఆ స్పర్శ బాబాను మేల్కొలిపి, తన దివ్య సనాతన స్థితిని భగవంతునిగా తన అనంత చైతన్యపు ఎరుకను తెలుసుకొనేట్లు చేసిందని ఆయనకు తాను తప్ప మరేదీ లేదనిపించిందని చెప్పారు.

అయితే యుగావతారుడిగా తన పని కోసం, ఆయన తన సాధారణ మానవ చైతన్యాన్ని తిరిగి పొందాల్సి వచ్చింది. అనగా దైవము దైవీ మానవునిగా నిర్వర్తించాల్సి ఉన్నది. అలా అనంతమైన నరక భాధల్ని మరో తొమ్మిది నెలల పాటు భరిస్తూ క్రిందికి తోయబడ్డారు. అనగా క్రిందికి దిగివచ్చే విధానం మొదలైందన్న మాట. ఈ సమయం నుండి ఆయన తన తలను తన గదిలో పరిచిన రాతి నేలపై గట్టిగా మోదుకోవటం ప్రారంభించారు. దాని వల్ల రక్తం చిమ్మేది. ఐనప్పటికీ, ఏ కొంత ఉపశమనము లభించేది కాదు. క్రిందికి దిగి రావటం అనే ఈ బాధాకరమైన విదానము, ఉపాశినీ మహరాజు పూర్తి సాధారణ చైతన్యాన్ని ఆయనలో ప్రతిష్టించే వరకూ షుమారు ఏడేళ్లపాటు కొనసాగింది.

ఈ సమయంలోనే బాబా ఒకసారి తన నుండి అనేక ప్రపంచాలు బహిర్గత మవుతున్నట్లు, జగత్తులలో జగత్తులున్నట్లు ప్రత్యక్షంగా చూచారు. ఇలాంటి అనేక దిగ్భ్రాంతి పరిచే అనుభవాల్ని పొందినట్లు చెప్పారు. దీని ముగింపుగా బాబా చెపుతూ "మంచిది. అక్టోబరు 7 తర్వాత ఆధ్యాత్మిక స్థితుల గురించి నేను ఏమీ చెప్పాలనుకోలేదు. అయినా, నేనిలా దీనిని మీకు అందించాను'' అన్నారు. ఒక చిరునవ్వుతో ఆయన సౌంజ్ఞలు చేస్తూ, "దీనిని మీరు బాబా తనలో తాను మాట్లాడుకున్నట్లుగా తీసుకోండి అంతే కాని నేను మీతో ఏమీ చెప్పలేదు'' అన్నారు.

బాబా ఏదో ఇంకా చెప్పాలన్న స్థితిలో కనిపించారు. "ప్రతి వ్యక్తికి నా చెంతకు చేరటం తప్ప వేరే మార్గమేదీ లేదు. ఒకసారి మీరు దైవాన్ని గుర్తిస్తే, మీరు ఆయన్ని శాశ్వత ఉనికిగా అనుభవిస్తారు. అక్కడ కాలమనేది ఉండదు. ఆ క్షణం వచ్చే వరకు మీరు బద్ధులై ఉన్నట్లు భావిస్తారు. అటువంటి బంధాలన్నిటి నుండి విముక్తులగుటకు నా యొక్క కృపాదృక్కు ఒకటి చాలు. అయితే అటువంటి సత్వర దృష్టిని అతి అరుదుగా ప్రసరింప చేసే దురలవాటు నాకున్నది. ఒకసారి నీవు ఆత్మ సాక్షాత్కారాన్ని అనుభవిస్తే, అది శాశ్వతంగా ఉండిపోతుంది. ప్రథమంగా ఆనందము ఆ తర్వాత జ్ఞానము మరియు శక్తి అనుసరిస్తాయి. ఆనందము, జ్ఞానము, శక్తి ఈ మూడూ ప్రతివారిలో ఉంటాయి.

ఇప్పుడు బాబా విషయాన్ని మార్చి తాను తన ప్రేమికులకు, ఈ ప్రపంచానికి ఏమి చెప్పాలన్నా, అదంతా అంతిమ ప్రకటనలోనే వివరించ బడిందని తెలియచేశారు. అక్కడ హాజరైన వారిలో కొందరిని ఉద్దేశించి తాను ప్రకటించిన దానిని వారు నమ్ముతున్నారా ? అని ప్రశ్నించారు. కొందరు ఆ సందేశాన్ని శబ్దార్థ ప్రకారము విశ్వశించటం కష్టమని నిర్మొహమాటంగా చెప్పారు. వినాశము గురించి కొందరు ప్రస్తావించి, వార్తా పత్రికల్లో ప్రచురిత మవుతున్న వరదలు, భూకంపాలు దాని కిందకు వస్తాయా అని' అడిగారు. అంతట బాబా అతి నిగూఢంగాను మరియు యాధృచ్ఛికంగాను వ్యాఖ్యానిస్తూ "స్వభావంలో మరియు రీతిలో పోలిక ఉండదు" అన్నారు. తన అనుచరులు తాము నిజాయితీగా ఏమని భావిస్తే దానినే ఇతరులకు చెప్పమని తన అనుచరుల్ని హెచ్చరించారు.

ఆ రాత్రంతా బాబా ఎంతో హుషారుగా కనిపించారు. తెల్లవారు ఝామున ఆయన రుస్తుం కాకాను మధుసూధన్‌ను, దత్తును పిలిచి భజన చేయమన్నారు. కొద్దిసేపట్లోనే ఆ గది అంతా శ్రవణానందకరమైన భక్తి గీతాల పారవశ్యంలో మధుర సంగీతం మర్మోగిపోయింది. ఆదీ కొన్ని ఘజల్సును స్వయంగా హార్మోనియం వాయిస్తూ పాడాడు. వీటిల్లో ఒక ఘజలులో కవి ప్రేమికుడిని ఇలా హెచ్చరిస్తాడు "ఓ ప్రేమికా ! ప్రియతమునితో సమైక్యమయ్యే ముందు నీవు అగ్నికీలలతో నిండిన సాగరములో ఈ దాలి జాగ్రత్త సుమా !"

ఉదయం 5-00లకు బాబా విరామాన్ని ప్రకటించి, కాలకృత్యాలు తీర్చుకొని ముఖాలు కడుగుకొనుటకు విశ్రాంతినిచ్చారు. అయితే బాబా మాత్రం తన గదిని వదిలి వెళ్లలేదు. ఎరుచ్ పక్కనే ఉండి జాగ్రత్తగా బాబా తలను దువ్వాడు. అలా దువ్వుతూ జడ అల్లాడు. ఆ పిమ్మట ఎరుచ్ బాబా ముఖ ప్రక్షాళన చేయుటలో సహాయపడ్డాడు. ఈ విరామ సమయంలో బాబాకు చేస్తున్న సేవా దృశ్యాన్ని,

బాబా అనుగ్రహ పూర్వక మధురక్షణాల్ని గమనిస్తూ నేను గుమ్మం బయట నిలబడ్డాను. నాకు మాత్రం బాబా దేదీప్యమానంగా వెలుగొందుతూ కనిపించారు. ఆయన నుదురు యొక్క ప్రకాశము ఎప్పుడూ నా లక్ష్యంలో ముఖ్య కేంద్రస్థానంగా తళ తళ లాడుతుంది. ఆయన కళ్లు మిలమిల మెరుస్తాయి. ఆయన వాటిని ఎప్పుడు మూసినా ఆయన యీ ప్రపంచం నుండే ఉపసంహరించి నట్లనిపిస్తుంది. బాబా తన దువ్విన తలను తన చేతులతో ఒక్కసారి నిమిరి చూచుకొని సంతృప్తి చెందినట్లు కనిపించారు. బాబా భౌతిక సమక్షంలో పెల్లుబికే ఆనంద భావము, ఆయన చుట్టూ ప్రసరిస్తున్న ప్రశాంత తలను చాలినంతగా వర్ణించనలవి కాదు. అవతారుడు ఎప్పుడు భౌతిక శరీరాన్ని దాల్చినా అందానికి తానే మూలమైన తన దివ్య సౌందర్యము ప్రతిఫలించే అందంతో వెలుగొందుతాడు.

సరిగా ఆరు గంటలకు అందరికీ తేనీరు సరఫరా చేశారు. ప్రతివారు సేదతీరినట్లు కనిపించారు. ఉదయ కార్యక్రమానికి మేమంతా సిద్ధమయ్యాము. 7-00 గంటల సమయంలో బాబా తెల్ల సద్రాపై గులాబి రంగు కోటు ధరించి సరోష్‌తో పాటు కారులో వెళ్లిపోయారు. స్టేషను రోడ్డులో గాడ్గే ఆయన్ని కలుసుకొని అదే కారులో హరిజన ధర్మశాలకు తీసుకు వెళ్లాడు. ఈ ధర్మశాలలో తక్కువ జాతి దీన జనులకు ఉచిత వసతి ఏర్పాటు చేయబడింది. మహారాష్ట్రలోని యోగులు, కుల వ్యవస్థను తుడిచి వేయుటకు, 16వ శతాబ్దం నుంచే ప్రజలకు ఉద్బోధించారు. ఈ సాంప్రదాయాన్ని గాడ్గే మహరాజు కూడా కొనసాగించాడు. భగవంతుని దృష్టిలో అంతా సమానమేనని గాడ్గే ప్రబోధించేవాడు. హరిజనుల యెడల ఆయనకున్న ప్రత్యేక ప్రేమవల్ల వారు పండరిపురం యాత్రకి వచ్చినప్పుడు తగు వసతి కల్పించుటలో గొప్ప శ్రద్ధ తీసుకొనేవాడు.

ధర్మశాలకు చేరుకోగానే బాబా ఖాళీ జాగా మధ్యలో కూర్చున్నారు. ఒక పిట్ట గోడను ఆయన ఆనుకొని కూర్చోగా ఎవరో ఒక కాషాయి రంగు జండాను తెచ్చి బాబా పక్కన నిలబెట్టాడు. యాత్రా సమయంలో విఠోభా భక్తులు ఈ జెండాను మోస్తారు. దానిని బాబా పక్కన నిలబెట్టే సరికి ఆ జెండా కర్ర బాబా భుజం పై ఆనింది. అప్పుడు బాబా పరిపూర్ణ విఠోభా భక్తునిలా కనిపించారు. సాక్షాత్తు విఠోభాయే ఆయన రూపంలో ఉన్నట్లనిపించాడు. తనను ఇక్కడకు తీసుకు వచ్చినందుకు తన కెంతో ఆనందంగా ఉన్నదన్నట్లు, బాబా గాడ్గే వైపు చూచారు. సమయం తక్కువగా ఉన్నందున గాడ్గే, యాత్రీకులందరిని దూరంగానే ఉండి బాబాకు శుభాకాంక్షలు తెలుపమని కోరాడు. వారందరిని బాబా తన చేతులను జోడించి ఆశీర్వదించారు.

కుష్టురోగుల కాలనీకి వెళుతూ మార్గ మధ్యంలో బాబా కారు నుండి దిగి చంద్ర భాగా నదిలో స్నానాలు చేస్తున్న వందలాది మంది భక్తుల్ని చూస్తూ కాసేపు నిలబడ్డారు. ఈ చంద్ర భాగా నదిని భీమనది అని కూడా పిలుస్తారు. వారికి తెలియకుండానే, అవతారుడి నజరు వల్ల ఆశీర్వదించబడి, స్నానం చేయటం ద్వారా పవిత్ర వంతులయ్యారు. వారి కారులు పిదప కుష్టురోగుల కాలనీ చేరగానే, అక్కడ ఎవరూ లేనందున ఎడారిలా కనిపించింది. కుష్టు రోగులంతా యాత్రీకులను యాచిస్తూ భిక్షాటన చేసుకుంటూ నగరంలో అనేక ప్రాంతాలకు వెళ్లిపోయారు. అయినప్పటికీ ఒక కుష్టు రోగి చాలా అనారోగ్యంతో కదిలే ఓపిక లేక, ఉండిపోవటంతో వెళ్లిపోయిన వారందరి కంటే అదృష్టవంతుడయ్యాడు. ఆనాడు అవతారుడి చేత స్నానం చేయబడే అదృష్టం అతనికి కలిగింది. అతడిని స్నానం చేయించటం పూర్తి కాగానే బాబా అతని వళ్లు తుడిచి, కొత్తబట్టలు ఇచ్చి కట్టుకోమన్నారు. కుష్టు రోగులను సేవించటమంటే బాబా కెంతో ఇష్టం. అసలు పండరి పురం సందర్శించేందుకు ఇది ఒక షరతు కూడా. ఆనాడు, ఒక అంద వికారమైన పంజరంలో ఒక అందమైన పక్షి తన దైవం వైపు చేసేప్రయాణంలో ఆకాశంలో ఎత్తుగా ఎగురుటకు కొత్త రెక్కల్ని పొందింది.

దీనితో బాబా కార్యక్రమం పూర్తయింది. చివరకు ఆయన సతారా తిరిగి వెళుతూ, గాడ్గే మహరాజు శిష్యుల రెండు ఆశ్రమాల్ని దర్శించేందుకు అంగీకరించారు. కారులోనే బాబా గాడ్గేతో తాను అతి త్వరలోనే యీ ప్రపంచానికి తన యదార్థ దర్శనాన్ని ఇవ్వబోతున్నాని, అయితే ఈ యోగిని మాత్రం మరెన్నడూ తనను చూచే ప్రయత్నం చేయవద్దని చెప్పారు. ఆయన కోసం బాబా అనుచర బృందం ఒకటి ఎదురుచూస్తూ స్టేషను రోడ్డులోని హాస్టలు వద్ద ఉన్నారు. వారందరికి బాబా వీడ్కోలు చెపుతూ "సుఖంగా ఉండండి. నేను మీతోటే ఉన్నాను" అంటూ అనునయంగా భుజాలను స్పృశించారు. ఆయన సౌంజ్ఞకు బదులుగా కారు వేగం పుంజుకొని సతారావైపు పరుగు తీసింది.

మధ్యాహ్నానికి నేను మావూరు చేరుకున్నాను. ఇది జరిగి అప్పుడే నాలుగు దశాబ్దాలు గడిచిపోయాయి. కానీ బాబా యొక్క కదలికలు, హావభావాల సొగసును నేను ఎప్పుడు గుర్తుచేసుకున్నా నా జ్ఞాపకాలలో పదిలంగా నిలిచిపోయాయి. నవంబరు 7 ఉదయాన ఆయన్ని చూచేందుకు బాబా నన్ను అనుమతించటం, ఎరుచ్ ఆయన్ని సేవించటం, ఇంకా నాలో వికశిస్తూనే ఉన్నాయి. సజీవ విఠోభా యొక్క ఈ మధుర క్షణాలు బాబా నాకిచ్చిన మాసిపోని పండరిపురం బహుమతులు.

# విశదీకరణ మరియు దృఢీకరణ
# 1954 - 20వ భాగము
# 1955 - 1వ భాగము

## ప్రకటన విశదీకరణ

నవంబరు 7 సాయంత్రానికి బాబా సతారా చేరుకున్నారు. మర్నాడు ఉదయం ఆయన రోజ్‌ఉడ్ సందర్శించారు. అది పురుష మండలి నివాసము. మామూలు సంభాషణలో పండరిపురం దర్శనవిషయం ప్రస్తావనకు వచ్చింది. తనయందు గాడ్గే కున్న ప్రేమను గొప్పగా మెచ్చుకున్నారు. పిమ్మట మరో విషయంపై మరల్చి, తన ప్రేమికులు తన ప్రకటనను సరిగా అర్థం చేసుకోలేక పోతున్నట్లు బహిరంగంగా వ్యక్తం చేసిన విషయాన్ని ప్రస్తావించారు. ఆ ప్రకటన చివరలో పేర్కొన్న అనూహ్య సంఘటనల విషయంలో కొందరు విస్మయంతో అదిరిపోయారు. మరికొందరు తాను వివరించినట్లు అవన్నీ సకాలంలో కచ్చితంగా జరగకపోతే ప్రజలు తనదైవత్వాన్నే అనుమానించే పరిస్థితి ఏర్పడుతుందని బాబా సంక్షిప్తంగా వివరించారు.

అంత క్రితం రాత్రి బాబా పండరిపురంలో నాకు గుర్తున్నంత వరకూ ఇలావివరించారు. " ప్రజలు నన్ను విమర్శించినా, లేదా నన్ను అనుమానించినా లేదా అవతారుడిగా నా స్థాయిని అనుమానించినా విచారించకండి. నేను అందరిలోనూ, అన్నిటా ఉన్నట్లు వాటికి అతీతంగా ఉన్నట్లు స్వీయానుభవాన్ని పొందుతున్నాను. నేనేదై యున్నానో అదే అయి ఉన్నాను. కనుక ఇతరులను మరచిపోండి. నన్ను నా మాటలను అంగీకరించటం ద్వారా మీరు నిలబడిన చోటే వుండి మిమ్మల్ని మీరు కనుగొనాలని నేను వాంఛిస్తున్నాను. " బాబాయొక్క యీ మాటలు, ఆయన అప్పుడప్పుడు జరిగే చిన్న సమావేశాల్లో ప్రస్తావించే ఒక ఉర్దూ ద్విపద నాకు గుర్తొస్తోంది. " గురువు చెపుతాడు, నా తేజస్సు ఈ సృష్టిలోని ప్రతి ఒక్క బిందువు నుండి నా యదార్థ నివాసము వైపు ప్రసరిస్తుంది. తృప్తిని, అతి గర్వాన్ని జయించి, నా దివ్యాగ్నికి చేరువగా వచ్చేందుకు సాహసించే వారిని నేను క్షుణ్ణంగా పరికిస్తాను".

నవంబరు 8 ఉదయం మండలిని కలిసిన సందర్భంలో తన ప్రకటన లో

వ్యక్తం చేసిన కొన్ని అంశాల్ని వివరించేందుకు బాబా తన చేతి సొంజ్ఞల్ని ఉపయోగించారు. తన ప్రేమికుల ఉపయోగార్థం ఈ వివరణను 'విశదీకరణ' అనే శీర్షికతో వారికి తదుపరి పంపడం జరిగింది. అందలి అధిక భాగాన్ని ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

నిజానికి నేను చెప్పే దానిని నమ్మి అర్థం చేసుకొనుటకు ఎవరికైనా చాల కష్టం. ఎందుకంటే, నా మాటలోని అంతర్భావాన్ని ఎవరూ గ్రహించలేరు. నా అంతిమ ప్రకటనను అఖరికి నా సన్నిహిత మండలిసైతం అర్థం చేసుకోలేక పోవడం సహజం. కానీ మెహెరాబాదులో జరిగిన మీటింగులో నేను చెప్పిన ప్రతి విషయాన్ని చాలా తీవ్రంగా తీసుకోవాలని నేను మిమ్ములను కోరుతున్నాను. ఎందుకంటే నేను చెప్పినదంతా సత్యము. అవన్నీ దేవుడిమాటలు. అప్పుడు చెప్పిన విషయాలన్నీ నేను చెప్పిన విధంగానే తప్పక కార్యరూపం ధరించి జరిగి తీరుతాయి. మెహెరాబాదులో నేను ప్రపంచంలో మూడు వంతులు వినాశనం జరుగుతుందని, నా శరీరానికి వింత వ్యాధి అంకురిస్తుందని, నేను అవమానమును అనుభవిస్తానని, నేను నా మౌన విరమణను గావించి, పదములకే పదమైన ఏకైక ఆదిపదమును పలుకుతానని, నా ఘనవైభవం కీర్తించబడుతుందని నేను వెన్నుపోటు పొడవబడినప్పుడు నేను నా శరీర పరిత్యాగము చేస్తానని, ప్రకటించినప్పుడు, నా ప్రేమికులు, తదితరులు, అనవసరంగా కలవరపడి ఎవరికి వారు తమ ఇష్టము వచ్చిన రీతిలో వేరు వేరు రకాలుగా అర్థం చెప్పుకొనే ప్రయత్నం చేస్తున్నారు.

తమ ఇష్టం వచ్చినట్లు నా మాటలకు అర్థాన్ని చెప్పుకొనే స్వేచ్ఛ ప్రతివారికి ఉన్నది. కానీ నేనే ఒక విషయం మీకు చెపుతాను. నేను ఎప్పుడైనా ఒక విషయాన్ని చెప్పానంటే, సహజంగా నేను నా స్వంత భాషను ఉపయోగిస్తాను. నా వలన ఏమి చెప్పబడినా అది సత్యము. అయితే నా భాషను ఏ ఒక్కరూ అర్థం చేసుకోలేరు. నేను చెప్పిన దానిలో అంతర్లీనమైయున్న భావాన్ని కనీసం గ్రహించలేరు. కనుక నేను ఒక విషయాన్ని చెప్పాలనుకున్నప్పుడు, నేను ఏకకాలమందు మీ బాషను కూడా ఉపయోగిస్తాను. నా భాషను మాత్రమే ఉపయోగిస్తే మీరు ఏమీ అర్థం చేసుకోలేరని నాకు తెలుసును కనుకనే మీ భాషను కూడా వాడుతాను.

నా అంతిమ ప్రకటనను మీరంతా సరిగా అవగాహన చేసుకొనుటలో సహాయపడేందుకు, మీరు పడే కలవరపాటును , వ్యధను రూపుమాపేందుకు, మీరంతా నేను నా అక్షరఫలకంపై ప్రవచిస్తున్నప్పుడు మెహెరాబాదు సమావేశంలో చూచి విని ఉన్నందున దానిని మీరు క్షుణ్ణంగా తెలుసుకోవాలని నేను కోరుకుంటున్నాను.

1. ఒక వింత వ్యాధి నా దేహానికి అంకురిస్తుంది :- ఇది మీ భాషలో చెప్పబడింది.
2. నేను అనుభవించే అవమానము :- ఇది మీ భాషలోనే చెప్పబడింది.
3. నా మౌన విరమణ మరియు పదములకు పదమైన ఏకైక పదమును నేను ఉచ్చరించుట :- ఇది నా స్వంత భాషలో చెప్పబడింది. మరియు అదే సమయంలో మీ భాషలోనూ చెప్పబడింది. ఎందుకంటే నేనా పదమును ఉచ్ఛరించినప్పుడు, అది మీకు వినిపించే పదము కనుక.
4. నా ఘనవైభవము :- ఇది ఏకకాలములో నా భాషలోనూ మీ భాషలోనూ చెప్పబడింది.
5. ముప్పాతిక ప్రపంచము వినాశనమవుతుంది :- ఇది నా స్వంత భాషలో మాత్రమే చెప్పబడింది.
6. నేను వెన్నుపోటుకు గురికావటం :- ఇది నా స్వంతం భాషలో మాత్రమే చెప్పబడింది.
7. నా శరీర పరిత్యాగము :- ఇది నా స్వంత భాషలోను అదే సమయంలో మీ భాషలోనూ చెప్పబడింది.

కాబట్టి మీ భాషలో నేను ఏమి చెప్పినా దానిని మీరు అర్థం చేసుకోగలుగుతారు. కానీ నా స్వంత భాషలో చెప్పిన దానిని మీరు అర్థం చేసుకోవటం అసాధ్యం. అయినప్పటికీ మీరంతా అర్థం చెప్పుకొనుటకు, ఆమాటల వెనుక దాగిఉన్న అర్థాన్ని గ్రహించుటకు ప్రయత్నించవచ్చును. కేవలం ఆయా సంఘటలను కాల క్రమంలో నెరవేరితే, నా స్వంత భాషలో నేనేమి చెప్పానో దాని అర్థము మీకు విశదమవుతుంది.

పై విశదీకరణలోని 5 మరియు 6 అంశములు మూడు వంతులు ప్రపంచం నాశనమవుతుందని, వెన్ను పోటు జరగుతుందన్న విషయాలకు సంబంధించినవి. ఇక్కడ మనం జాగ్రత్తగా గమనించాలి. బాబా ఈ అంశాల్ని తన స్వంత భాషలో వివరించానని స్పష్టంగా ప్రకటించారు - ఆ భాష విశ్వాత్మక మనస్సుది. కనక, ఇక్కడ పరిమిత అర్థమిచ్చే భావాన్ని గ్రహించే పరిమిత బుద్ధి కుశలతకు అవకాశము లేదు. అందువల్ల వాటిలోని భావగర్భితమైన అర్థాన్ని ఊహించుకొనుటకు ప్రయత్నించినందువల్ల ఉపయోగమేమీ ఉండదు.

3,4,7 అంశాల్లో - బాబా మౌన విరమణ, ఘనవైభవము, మరియు ఆయన శరీర పరిత్యాగము - వీటిని ఏకకాలములో బాబా భాషలోనూ, మన

భాషలోనూ చెప్పారు. అందువల్ల, ప్రతివారు తమ స్వంత అర్థాన్ని చెప్పకొనే అవకాశము ఉన్నది. అటువంటి భావార్థం వివరణలు వ్యక్తిగత విలువను మాత్రమే కలిగిఉండి వాటి అసలు భావన అవతారుడికి మాత్రమే తెలుసు కనుక నిజమైన అర్థంతో పోల్చుకోవటం అనుభవంలో ఉపేక్షించతగినది.

1,2 అంశాలు వింతవ్యాధిని అవతారుడి అవమానానికి సంబంధించినవి. అవి మన భాషలో వ్యక్తపరచబడినవి. అనగా సాధారణ మాటల్లో అవి అర్థమవుతాయి. కానీ ఒకేరకమైన విచిత్రరీతిలో బహుశః భావించవచ్చును. అసాధారణమైన బాబా యొక్క శారీరక వ్యధను గురించి తెలిసిన వారు ప్రత్యేకంగా ఆఖరిరోజుల్లో ఆయన పడిన బాధను చూస్తే నిజంగా అది ఒక వింత వ్యాధే. రోగ నిర్ణయంకాని వ్యాధితో ఆయన బాధపడ్డారు. బాబా ఒక పర్యాయం తన సమీపంలో ఉన్న వారితో ఇలా చెప్పారు "తన అవస్థనుండి ఉపశమనము కలుగచేయుటకై వారు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నా తనకు మాత్రమే ఆ వ్యాధికి నిజమైన కారణము తెలుసును" అని ఒకసారి బాబా వారికి వ్యక్తం చేశారు - అది తన విశ్వాత్మక వ్యధవల్ల కలిగింది. దాని వల్ల తన కృప యొక్క అల విడుదలవుతుంది. జీసస్ కప్పునిండా బాధను త్రాగి "ఇప్పుడు మానవ కుమారుడు స్తుతించబడ్డాడు" అని చెప్పలేదా ?

అవమానము అనేది, అనంత చైతన్యము పరిమిత మానవ రూపాన్ని ధరించేందుకు చెల్లించవలసిన పన్ను. అవతారుడిగా మానవుల మధ్య జీవించినప్పటికీ, షరతులులేని తన ప్రేమను, కరుణను మానవాళిపై కురిపించినప్పటికీ, ఆయన ఉండవలసిన మార్గాన్ని ఎన్నడూ అంగీకరించడు. అదే ఆయన అవమానము. విద్వాంసులు. దైవ నిజాయితీతో ఆయన చేసిన ప్రకటనలపై తీర్పు చెప్పేందుకు కూర్చొంటారు. ప్రజలు తమ పరిమిత అభిప్రాయాలతో ఆలోచించి ఒక అవగాహనకు వచ్చి ఆయన్ని విమర్శిచటం, అపహాశ్యం చేయటం జరుగుతుంది. అయినా ఆయన కరుణను పురస్కరించుకొని బాబా తన దైన విధానంలో తన స్వీయ సమయంలో ప్రజలను ఆకర్షించుటకు ఆయన ఇటువంటి బలమైన ప్రతి క్రియలను అందరికొరకు అవలంభిస్తారు.

నాకు మాత్రం ' భాష ' అనేది ఇక్కడ బాబాప్రకటనలను అర్థం చేసుకొనుటకు నిజానికి ఒక సమస్య కానేకాదు. చివరకు, భాషలంటే ఏమిటి? నోటితో పలకని ఆలోచలను భావాల్ని నోటితో వచించే సమాచారమే భాష అవుతుంది. సమాచారాన్నందించే సమర్థత భాషకు లేదు. అని చెప్పేందుకు చాల ఉన్నది. దైవీ - మానవునికి ఆయన ప్రేమికులకు మధ్య మనస్సు విప్పి

ధారాళం గా మాట్లాడుట గురించి ఇది కటిక నిజం. ఒక ప్రశిద్ధ శాస్త్రవేత్తను ఉపమానంగా తీసుకుంటే ఒక మనిషిగా ఆయన తన ఇష్టా ఇష్టాల గురించి చాలా విషయాలు తెలుసుకోవచ్చును. ఒక మానవుడిగా ఆయన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవచ్చును. అయితే ఆయన తాను జరిపిన పరిశోధనా సిద్ధాంత వాదములు గురించి వివరించటం మొదలు పెడితే అదంతా మన బుర్రల్లోకి పాతాల్లా వెళతాయి.

మరి అటువంటప్పుడు దైవీమానవ జీవితంలో ఇది ఎంతో అపరిమితమైన నిజమవుతుంది.

ఈ సందర్భంలో బాబాకు అమిత ఇష్టమైన హాఫీజ్ ద్విపద ఒకటి గుర్తొస్తోంది. అతడంటాడు:

నీ గురువునుండి నీవు ఏమి విన్నా అది తప్పు అని ఎన్నడూ అనకు. నా ప్రియా, ఆయనను అర్థం చేసుకోలేని లోపము నీ స్వీయ అసమర్థతలోనే ఉన్నది.

దైవీ మానవుని మాటలను అర్థం చేసుకొనుటకు మనస్సు ద్వారా మాత్రమే ప్రయత్నించటం టెలిస్కోపులో ని రెండవ చివర నుండి చూచుటకు ప్రయత్నించటం వంటిది. జీసను యొక్క సాధువులైన ప్రేమికుల గురించి ఒక గొప్ప క్రిష్టియన్ గూఢమతవాది ఒకప్పుడిలా చెప్పాడు. 'వారు ఆయన మాటలను అర్థం చేసుకోలేరు కానీ వారాయనను తమ రక్షకునిగా అవగాహన చేసుకుంటారు'

మెహెర్ బాబా యొక్క నిస్వార్థమైన బంధరహిత ప్రేమను తమ హృదయాల్లో అనుభవించిన ఆయన ప్రేమికులు ఆయన ప్రకటనను విన్నతరువాత, నిజాయితీతో అవతారునిగా ఆయనయందున్న నమ్మకాన్ని అతి గాఢంగా పునఃప్రారంభంచేయుటకు ఒక సవాలుగా ఎదుర్కోవాలి.

## ఒక చలన చిత్ర యోచన మరియు ఒక కవ్వాలి కార్యక్రమము

నవంబరు నెలంతా మెహెర్ బాబా తన నివాసాన్ని సతారాలో కొనసాగించారు. బాబా అక్కడ ఉండటం పైకి ఏమీ లేనట్లు కనిపించినా, బాబా ఎప్పుడూ మాదిరే, అన్యత్రా ఆదేశాలిస్తూ, అత్యంత చురుకుగా నడిపిం చారు. ఇటువంటి పనికి ఒక ఉదాహరణగా, ఆదీ కె ఇరానీ అహమ్మదునగరులో బాబా ఆదేశములపై బాల్‌ధావ్‌లేకు బాబా పై తీసే చలన చిత్రపనిలో సహాయపడటాన్ని తీసుకోవచ్చును.

బాబా తొలి చలన చిత్ర ము 1932 లో లండన్ లో పారమౌంటు వారిచే న్యూస్‌రీలుగా చిత్రీకించబడింది. తర్వాత 1937 లో నాశిక్ లో బాబా 43 వ జన్మదినోత్సవ వేడుకల్లో ఒక భారతీయ న్యూస్ రీలుగా చిత్రీకరణ జరిగింది. 1948 లో తీసిన ఒక సంక్షిప్త చలనచిత్రం తప్ప 1940 దశకంలో తీసిన బాబా చలన చిత్రము ఏదీ మిగిలి ఉన్న దాఖలాలు లేవు. అయితే 50వ దశకం హఠాత్తుగా కావలసినన్ని చలన చిత్రాల్ని ప్రవేశపెట్టింది. అనేకం 1953లో బాబా సుదీర్ఘ కాలం డెహెరాడూన్‌లో ఉన్నప్పుడు చిత్రీకరించబడినవి. 1954 లో బాబా ఆంధ్రాటూరులో ఉండగా బాబా జన్మదిన వేడుకలను గాబ్రియల్ ఫాస్కల్ చిత్రీకరించాల్సి ఉన్నది, ఆఖరి క్షణంలో ఫాస్కల్ అనారోగ్యం వల్ల తన ప్రయాణాన్ని రద్దు చేసుకోవాల్సి వచ్చింది. తన తదుపరి భారతదేశ పర్యటనను 1954 ఆగష్టులో ఫాస్కల్ ఏర్పాటు చేసుకున్నా మరల అతను రాలేకపోయాడు. అయితే బాబా సెప్టెంబరులో ఒక భారతీయ చలన చిత్రసంఘానికి మూడు ప్రత్యేక సమావేశాల దృశ్యాలను చిత్రీకరించుటకు అనుమతించారు. ఆ సంఘానికి బాల్‌ధావ్‌లే ఆధిపత్యం వహిస్తున్నాడు. వారు చిత్రీకంరించవలసిన సన్నివేశాలు 1, సెప్టెంబరు 12న వాడియా పార్కులో జరిగే ప్రజాదర్శన, (2) ఖుస్రూ క్వార్టర్సులో సెప్టెంబరు 25 న జరిగే స్వల్ప దర్శనము (3) 29 న జరిగే మెహెరాబాదు మీటింగు. మరువలేని మూడు వారాలు గడిపేందుకు పాశ్చాత్యదేశాల నుండి వచ్చిన తన ప్రేమికుల్లో ఒకడైన లడ్ డింఫిల్ ఒక చలన చిత్ర కెమెరాను తనతో పాటు తెచ్చుకొని చాలినంతగా చిత్రీకరించాడు.

అక్టోబరు మొదట్లో బాబాపై చలన చిత్రం తీయుట పూర్తి చేయుట గురించి బాల్‌ధావ్‌లేను కలిసేందుకు అంగీకరించారు. ఇటీవల తీసిన చిత్రీకరణను మాత్రమే ఆ చిత్రంలో కలపటం కాక, సకోరి వెళ్లి ఫిలిం చిత్రీకరించమని అలాగే మెహెరాబాదు, మెహెరాజాదులో బాబాతో సంబంధం ఉన్న అన్ని తావులను చిత్రీకరించమని చెప్పారు. అక్టోబరు 8న బాల్‌కు అత్యంత ఆప్త మిత్రుడైన డా॥ నీలూ ఆదీకి ఒక ఉత్తరం వ్రాస్తూ 11వ తేదీన బాల్ బాబాను చూచేందుకు రావాలని తెలియ పరచమన్నాడు. "బాబా నిన్ను బాల్‌తో కలిసి, బాబాపై చిత్రీకరించవలసిన చలన చిత్రమునకు సంబంధించిన అన్ని విషయాల్నికూలంకషంగా చర్చించమని చెప్పారు. అంతేకాకుండా మరో విషయం కూడా తెలపమన్నారు. బాబాను అంతకు మునుపు స్వయంగా చూడని జనం బాబాను చలన చిత్రంలో చూస్తే వారికి ఆ చిత్రం ఆధ్యాత్మికంగా ఎంతో సహాయపడుతుందని చెప్పమన్నారు. బాబా సౌంజ్ఞల ద్వారా అతను సేకరించిన

మరో విషయం "వారు మాయా బంధాల నుండి తమంత తాము విముక్తి పొందే విధానంలో అది ఎంతో సహాయపడుతుంది" అని బాబా వివరించారు.

ఆదీ అక్టోబరు నెలలో అధిక భాగం బాబా పండరిపురం సందర్శన గురించి ఏర్పాటు చేయుటలోనే గడిపాడు. పోతే నవంబరులో సాధారణ ఉత్తర ప్రత్యుత్తరాల భారంతో పాటు అదనంగా, ఆయన పాద్రీతో కలిసి మెహెరాబాదు మెహెరాజాదులలో చలన చిత్ర చిత్రీకరణలో బాల్‌కు సహాయ పడవలసి వచ్చింది. అహమ్మదునగరు లోని సరోష్ సినిమాహాల్లో చిత్రీకరణ జరుగు తున్నప్పుడు కొన్ని దృశ్యాల చిత్రీకరణలో పాల్గొనుటకు ఆదీ కూడా వెళ్లాడు. తరువాత సంవత్సరాల్లో ఆ చిత్రభాగం ఏమైందో నాకు వ్యక్తిగతంగా తెలియదు.

బాబా ప్రోత్సాహంతో ఈ చిత్రీకరణ కార్యక్రమం తరువాత కొన్ని నెలల పాటు సాగింది. అయితే బాబా అంత శ్రద్ధ తీసుకున్నప్పటికీ, ఆ చిత్రం పూర్తి చేసుకొని ఎన్నటికీ విడుదల కాలేదు. 1930 దశకంలో కూడా బాబా ఆరంభించి ప్రోత్సహించిన చిత్ర నిర్మాణాల విషయంలో కూడా ఇలాగే జరిగింది. బహుశః బాబా ఒక నిర్ణీత చలన చిత్రాన్ని తయారు చేయటం కంటే, ఆ చిత్రంలో ప్రమేయం కల్పించుకొనుట ద్వారా తాను నిర్వహిస్తున్న అంతరంగిక కార్యక్రమానికే ఆయన అధిక ప్రాధాన్యత నిచ్చినట్లు కనిపిస్తుంది. ఈ అంతరంగ కార్యక్రమము ఒకవేళ, తన ప్రేమికుల హృదయాల్లో చేరుటకు ఒక మరుగుపరచిన మార్గముగా సహాయ పడవచ్చును.

తన అవతార రూపాన్ని చలన చిత్రాల్లో చూడటం వల్ల ఆయన తన భౌతిక శరీరాన్ని పరిత్యజించిన తరువాత ఆయన పరిధిలోకి వచ్చే వారు ఆధ్యాత్మిక భారాన్ని మోసే అనుభవంలో సహాయం పొందుతారు. ఇది ఒక అప్రస్తుత ప్రసంగమే అయినా, ఇటువంటి మరికొన్ని సంఘటనలు చెప్పకుండా నేను ఊరుకోలేను. ఎందుకంటే 1954లో డా॥ నీలూతో బాబా ఏం వ్రాయించారో వీటిల్లో తెలుస్తుంది.

అమెరికాలో ఒకాయన మెహెర్ బాబా గురించి వినటమే కాక, బాబా సమావేశానికి హాజరవ్వమని ఆహ్వానించబడ్డాడు. అయిష్టంగానే అతను హాజరయ్యాడు. అయితే, అతడ్ని అక్కడున్న ఇతరులు మరో సమయంలో రమ్మనమని చెప్పటంతో వెళ్లిపోవుటకు సిద్ధమయ్యాడు. వెళ్లేందుకు లేచిన ప్రతిసారి ఏదో ఒకటి జరగటం వల్ల మరి కొంత సేపు ఉండి పోవాల్సి వచ్చింది. దానిని అతను గుర్తు చేసుకుంటూ ఇలా వివరించాడు :

చివరిగా వారు 1954లో మెహెర్ బాబా ఆంధ్రాలో పర్యటించినప్పుడు

తీసిన చలన చిత్రాన్ని ప్రదర్శించారు. అప్పుడే నేను బాబా యందు ఉత్సాహాన్ని చూపించటం మొదలైంది. ఎందుకంటే నేను ఆయన నడవటాన్ని చూచాను. వేలాదిమంది ఆయన చుట్టూ అనుసరిస్తూ కనిపించారు. నాలో నేను అనుకున్నాను. "ఈ మెహెర్ బాబా తప్పకుండా చాలా చాలా ప్రత్యేక వ్యక్తి అయి ఉండాలి. లేకపోతే ఇంతమంది జనం ఈ విధంగా ఆయన చుట్టూ అనుసరించరు. దాదాపు ఆయన క్రీస్తులాగానే ఉన్నారు" అనుకున్నాను. ఈ ఆలోచనతో నేను నిజంగా ఆ చలన చిత్రంపై ఆసక్తి చూపటం మొదలు పెట్టాను.

బాబా దర్శనం ఇస్తూ ఒక ఆసనం పై కూర్చున్నారు. అకస్మాత్తుగా ఆ చలన చిత్రంలో ఆయన ముఖం బయటకు వచ్చి నా వైపు చూచింది. ఆయన నాపై ఒక పెద్ద ప్రేమ కిరణాన్ని గుమ్మరించారు..... అంతర్గతంగా "భగవంతుడు అంటే అది !" అని బిగ్గరగా అరిచేశాను. తక్షణమే దాన్ని నేను తెలుసుకున్నాను. బాబా భగవంతుడు అని నేను తెలుసుకున్న మరుక్షణంలోనే ఆయన నాకు ఆ కడకంటి చూపును ప్రసాదించారు." అంటూ తన అనుభవాన్ని వ్యక్త పరిచాడు.

కొద్దిగా నవ్వు పుట్టించేరీతిలో ప్రస్తుతం మెహెరాబాదులో కాపురం ఉంటున్న ఒక యువతి ఒకసారి తన అనుభవాన్ని నాతో చెపుతూ, మొదటిసారిగా తాను మెహెరాబాదులో తీసిన బాబా చలన చిత్రాన్ని మొదటిసారిగా చూచానని, అలా చూస్తుండగా "బాబా ! ఏదో ఒకరోజున నేను ఇక్కడ ఉండబోతున్నానని నీకు తెలుసా ?" అన్న ఆలోచన తనకు వచ్చినట్లు చెప్పింది. ఆమెకు అటువంటి ఆలోచన రాగానే, బాబా అదే క్షణంలో, ఆ చలన చిత్రంలో వెనకకు నడిచి, ఇప్పుడు ఆమె ఉంటున్న గదిలోకి తొంగి చూచి మరల కెమెరా వైపు తిరిగి చిరునవ్వు నవ్వారు. పైకి మాట్లాడని ఆమె ఆలోచనకు బాబా ప్రతి స్పందిస్తూ ఆయన శారీరకంగా ఆమె సమక్షంలో ఉన్నట్లే స్పష్టంగా ప్రత్యుత్తర మిచ్చారు.

చివరగా ఇటీవల 1951లో ఒక బాబా చలన చిత్రాన్ని అర్జంటైనాలో ప్రదర్శించటం జరిగింది. ఆ చిత్రాన్ని చూపించిన ఆయన ఇలా జాబు వ్రాశాడు ".... ఆ చిత్రాన్ని చూచినవారు అందులోని బాబా ప్రతిమను చూచి చలించిపోయారు. ఎందుకంటే, ఎవరికీ ఇంగ్లీషు అర్థం కాదు. అయినా పర్వాలేదు. బాబా ప్రతివారి హృదయాల్లో స్వయంగా మాట్లాడారు. హాలంతా నిశ్శబ్దంగా ఉన్నది. చీమ నడిచినా దాని నడక శబ్దం వినవచ్చును. వచ్చీరాని నా ఇంగ్లీషు భాషను క్షమించమని కోరుతున్నాను. నేను మంచి కవిని కూడా కాదు" అంటూ వ్రాశాడు.

1954 నవంబరు నెలాఖరులో సతారాలో ఉన్న బాబాను దర్శించే అవకాశంతో నాకు మంచి అదృష్టం దొరికింది. డిశంబరు 1 నుండి బాబా

మొదలు పెట్టాలనుకున్న నలభై రోజుల ఏకాంత వాస ప్రత్యేక కార్యక్రమానికి ముందుగా ఇది జరిగింది. నవంబరు 7న పండరిపురం నుండి మా ఊరు తిరిగి రాగానే, బాబా దర్శనానికి సంబంధించిన దినచర్యను వ్రాసి, ఆయనకు పోష్టు చేశాను. బహుశః అది కొంత వరకు దానికి సంబందించినదో లేదా వేరేదాని గురించో నాకు జ్ఞాపకం లేదు. నన్ను పిలవటం వెనుక ఏదేని లోపమునకు సమాధానమై యుండవచ్చును. నేను వెంటనే బయలు దేరేందుకు ఏ మాత్రం జాగు చేయలేదు. నేను అక్కడకు చేరగానే బాబా పండరిపురం దర్శించిన దినచర్యను ఎరుచ్ తయారు చేసినట్లు తెలిసింది. ఆ తర్వాత అదంతా అవేకనర్ పత్రికలో ప్రచురితమైంది.

రోజ్‌ఉడ్‌లో నేనున్న స్వల్పకాలంలో బాబా ఒక రాత్రంతా తెల్లవార్లూ కవ్వాలి కార్యక్రామాన్ని ఏర్పాటు చేశారు. రాఘునాధ జాదవ్ అనే కవ్వాలి గాయకుడిని బొంబాయి నించి పిలిపించారు. "ఈ వినోద కార్యక్రమానికి ఖర్చు పెట్టేందుకు నా వద్ద పైకం లేదు" అని బాబా చెప్పటం వల్ల ఇతనికయ్యే ఖర్చును బాబా భక్తుల్లో ఒకాయన భరించాడు. ఆదీని ఆనాటి కార్యక్రమంలో పాల్గొంటున్న 18 మందికి అహమ్మదు నగరులో స్పెషల్ బిర్యాని వంటకాన్ని తయారు చేయించి, అవసరమైన ప్లేట్లు, గ్లాసులు, మగ్గులు అద్దెకు తీసుకొని రమ్మని బాబా ఆదేశించారు. బహుశః బాబా తన మండలికి ఒక అసాధారణమైన విందు ఇస్తున్నట్లున్నది. ఎందుకంటే, ఆ కార్యక్రమం పూర్తి అయినప్పటి నుంచి నలభై రోజులు పాటు రోజుకు ఒక పూటే సాధారణ భోజనం చేసి జీవించాలని ఆయనకు తెలుసు. అంతేకాకుండా తాము తయారు చేసిన భోజనాన్ని దైవీ మానవునికి, ఆయన సన్నిహిత శిష్యులకు పరోక్షంగా వడ్డించబడే అవకాశం పొందిన వారెంతో అదృష్టవంతులు.

పాద్రీని, సిద్ధూ, ఆది జూనియర్ మరి కొందరి పేర్లను బాబా స్పష్టంగా పేర్కొని, వాళ్లను తీసుకు రమ్మనమని ఆదీకి కబురంపారు. అయితే ఆదీని ప్రత్యేకంగా హెచ్చరిస్తూ ఒక వేళ తాను పేర్కొన్న వారిని తప్ప వేరెవరినైనా ఆదీ తీసుకువస్తే నయము కాని పగుళ్లు వచ్చే రోగం రూపంలో తీవ్ర బాధను ఆదీ అనువించాల్సి వస్తుందని హెచ్చరించారు. బాబా నుండి వచ్చిన జాబులో ఇచ్చిన బాబా ఆదేశాలను పాటించకపోతే కలిగే పర్యవసానాలను అనుభవించాలని తెలియచెప్పే ఇటువంటి ఘోరమైన హెచ్చరికలు, ఆయన చెప్పినట్లు విదేయతతో చేయమని గుర్తు చేయుటకే.

శాంకేరావాలా, మరియు మేర్వాన్ జస్సావాలాలు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొనుటకు పూనా నుండి వచ్చారు. ఆ సమావేశం బాబా రాత్రుళ్లు గడిపే గ్రాఫ్టన్‌లో జరుగవలసి ఉన్నది. నేను గ్రాఫ్టన్‌ను దర్శించటం ఇదే మొదటిసారి. ఇదే ఆఖరిసారి కూడా. అది నాకు ఒక మరువలేని అనుభవం. బాబా హాల్లోకి రాగానే, ఒక అపురూపమైన ఆనందంలో మునిగిపోయాను. ఆ వెను వెంటనే నా ధ్యాస, ఆయన యొక్క రాజసమైన సమక్షం వల్ల దాసుడ్ని చేసింది.

బాబా టీ తయారు చేయించి, తానే స్వయంగా అక్కడ హాజరైన వారందరికి ఇవ్వబోయారు. అయితే కొంతమంది నివాసముంటున్న మండలి వారికి అలోబా రోజ్ ఉడ్‌లో అప్పుడే టీ ఇవ్వగా త్రాగారని బాబా క్షణంలో తెలుసుకున్నారు. బాబా కలత పడి, ఇది తన ఆదేశాలకు భంగం కలిగించటమేనని అందువల్ల ఈ కార్యక్రమాన్నంతటినీ రద్దు చేసి అంతా తమ ఇళ్లకు తిరిగి వెళ్లాలని ప్రకటించారు. ఎప్పుడూ తరచుగా చేసే విధంగా ఎరుచ్ ఒక అడుగు ముందుకు వేసి, ఆలోబాతో మాట్లాడేందుకు ప్రయత్నించాడు. ఆయన ఏ వాదనలు చేశాడో నాకు బాగా జ్ఞాపకం లేదు. అయితే చివరకు బాబా కనికరంతో అలోబాను క్షమించి, కార్యక్రమాన్ని యధావిధిగా నిర్వహించుటకు అంగీకరించారు.

అప్పుడు బాబా మా అందరికి టీ అందించారు. మేము మేల్కొని ఉండేట్లు సహాయపడేందుకు టీ తో పాటు ఒక మాత్రకూడా ఇచ్చారు. ఆనాటి రాత్రి ఒకరకమైన జ్ఞాపక చిహ్నంగా ఈనాటికి ఒక ద్విపద నాకు బాగా గుర్తుండిపోయింది. కవ్వాలి గాయకుడు తను పాడే పాట పూర్తి చేయగానే బాబా అతడిని ఆపి, అందులోని పంక్తులను మెల్లగా మళ్లీ పాడమన్నారు. అవి ఉరుదూలో ఉన్నాయి. విడిగా అనువాదం చేస్తే దాని భావం ఇది :

నేను పూర్తిగా లౌకిక విషయాల వలయంలో చుట్టుకుపోయినట్లు నన్ను నేను ఎప్పుడు తెలుసుకున్నా.

నేను నాలోనే ఉన్న జీవితపు యధార్ధ వలయాన్ని కనుగొనుటకు అంతర్ముఖంగా తిరిగేట్లు నేను బలవంతం చేయబడతాను.

ఈ విధంగా అతని జీవితంలో ఏర్పడ్డ ఒక సంధిగ్ధ స్థితి అతని ఉత్తరాపేక్షలో ప్రాధమిక మార్పును తెస్తే అది ఒక ఆశీర్వచనంగా మారుతుంది.

అటువంటి సందర్భాల్లో బాబా చుట్టూ అలుముకున్న ప్రేమ పూర్వక అన్యోన్యత యొక్క వాతావరణాన్ని చాలినంతగా ఎవరూ వ్యక్త పరచలేదు. ఈ రాత్రి గురించి అదీ, అహమ్మదునగరుకు తిరిగి వెళ్లగానే ఆస్ట్రేలియాలోని

ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌కు ఒక లేఖ వ్రాశాడు. అందులోని ఒక భాగాన్ని ఈ క్రింద తెలుపుతున్నాను.

7 అక్టోబరు నుండి బాబా అక్షర ఫలకాన్ని ఉపయోగించటం మానివేశారు. డిశంబరు 1 నుండి తన భావాల్ని వ్యక్తపరచేందుకు చేతివేళ్లను ఉపయోగించటాన్ని విడిచి పెట్టారు. రెండవది చేయుటకు ముందు, నవంబరు 30న కొంత మంది మండలి వారిని సతారాకు పిలిపించి, ఆ రాత్రంతా తనతో పాటు వారందరిని మేలుకొని వుండేట్లు జాగరణ చేయించారు. ఒక...... బొంబాయి ప్రేమికుని సౌజన్యంతో ఒక ..... కవ్వాలి గాయకుడు సతారాకు పంపబడ్డాడు. అతడు మాకా రాత్రంతా సూఫీ సంబంధమైన మరియు వేదాంత సంబంధమైన మరియు గురువులకు సంబంధించిన మధురమైన పాటల్ని పాడి మండలి వారిని ముచ్చట పరచి సంతోషంగా మేల్కొని ఉండేట్లు చేశాడు. అతని పాటలతో బాబా కూడా చాలా ఆనందించారు.

ఆ రాత్రి బాబా రెండుసార్లు ఆపాటలను మధ్యలో ఆపించారు. బహుశః ఆ గాయకుడికి, అలసట తీర్చుకొని, తన గొంతును ఉపశమనము చేసుకొనే అవకాశము ఇచ్చి ఉంటారు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు, ఆ కార్యక్రమం సమాప్తమైంది. అంతకు ముందు బాబా ఒక ప్రకటన చేస్తూ వెళ్లి పోయే సమయంలో ఎవరూ తన ఆలింగనము కోసం లేదా వీడ్కోలు పలికేందుకు తన వద్దకు రావద్దని, తెలియచేశారు.

శాం కేరావాలా ఓడపై రేడియో ఆఫీసరుగా తన విధులను చేపట్టేందుకు త్వరగా వెళ్లే సమయ మాసన్నమైంది. అందువల్ల ఆయన బాబా యొక్క చివరి ఆలింగన భాగ్యాన్ని పోగొట్టుకున్నానని ముఖ్యంగా బాధపడ్డాడు. రాబోయే అనేక నెలల పాటు తాను సముద్రంపైనే గడపవలసి వుందని ఆయనకు తెలుసు కనుకే అలా బాదపడ్డాడు. ఆ మర్నాడు అతను పూనాకు తిరిగివెళ్లే సరికి బాబా దగ్గర నుంచి అతనికి ఒక జాబు వచ్చేసరికి ఆశ్చర్యపోయాడు. ఆ ఉత్తరంలో బాబా అతడిని ఉద్దేశిస్తూ, విచారించవద్దని, అతను అంతకు చాలాముందుగా వీడ్కోలు ఆలింగనమును పొంది వున్నందున, తాను దానిని తనతో పాటు ఓడ ప్రయాణంలో ఎక్కడకు వెళ్లినా తీసుకు వెళ్లమని బాబా వీడ్కోలు ఆలింగనాన్ని తీసుకున్నానన్న విషయాన్ని గుర్తుంచుకోమని వ్రాశారు. కనుక బాబా ఈ విధంగా తన ప్రేమికులను బాహ్యంగా విడిచిపెడుతున్నట్లు కనిపించినా, అంతర్గతంగా మాత్రం, ఆయన వారితో ఎడతెగని నిరంతర స్పర్శను కలిగి ఉంటానని పునర భయమిచ్చుటకే ఇది జరిగింది.

## యథార్థ ప్రేమ ప్రియతముని ఆజ్ఞాపాలనను సూచిస్తుంది

నేను రోజ్ ఉడ్‌లో ఉండగా డిశంబరు 1 నుండి నలబై రోజులుపాటు బాబా జరిపే ఏకాంత వాస సమయంలో మండలి వారు అనుసరించవలసిన ఆదేశాల జాబితా కాపీని వ్రాసుకున్నాను. బాబా ఈ ఆదేశాలను ఎరుచ్‌కి అందించారు. అప్పుడు ఎరుచ్ ఆదీకి ఒక కాపీ వ్రాసి ఇవ్వమని నాకు వప్పగించాడు. బాబా ఇచ్చిన ఆదేశాలను డిశంబరు 1 నుండి జనవరి 9 వరకు కచ్చితంగా పాటించవలసి ఉన్నది.

మండలిలోని వేర్వేరు సభ్యులకు 24 గంటలు దైవనామ జపములో పాలు పంచుకొనుటకు వీలుగా నిర్ణీత గంటలను తెలుపుతూ వైనంగా వివరించారు. దీనితో పాటు, మండలిలోని ప్రతివారికి కొన్ని నిర్దేశిత విధులను కూడా విధించారు. అప్పుడప్పుడు అవి అలవాటైన రీతిలో ఉండేవే. రోజ్‌ఉడ్‌లో కుటుంబ బాద్యతలు చూచే జనరల్ మేనేజరుగా అలోబాను నియమించారు. అతను గ్రాఫ్టన్ అవసరాలను కూడా తీర్చేందుకు హాజరు కావాలి. ఇంకా, ఒక ఆవరణ నుండి మరో ఆవరణకు బాబా నడచి వెళుతున్నప్పుడు ఆయనకు ఇతను రక్షణగా అనుసరించాలి. భావూ చాకలి పనితోపాటు, సైకిళ్లు తుడవడం డా॥ నీలూతో పాటు బయట పనిలో సహాయపడాలి. సావక్ కొత్వాల్ సాయంత్రం 7 నుండి తెల్లవారు ఝామున 2 వరకు బాబాతో రాత్రి కాపలా కాయాలి. ఆ తర్వాత కృష్ణ నాయర్ వచ్చి చార్జి తీసుకొని ఉదయం 5 గంటల వరకు డ్యూటీ చేయాలి. ఇటువంటి విధులతో పాటు, మండలి వారంతా తమ దుస్తులను తామే ఉతుక్కోవాలి. తమ గదులను తామే శుభ్రం చేసుకోవాలి. తమ భోజన పాత్రలను తామే కడుక్కోవాలి.

అదే సమయంలో, చాలా కచ్చితమైన ఆహారాన్ని వారందరికి బాబా నిర్దేశించారు. రోజుకు ఒక పర్యాయమే వారు సాయంత్రం 4 గంటలకు భోజనం చేయాలి. ఈ భోజనంలో అన్నం, పప్పు లేదా అన్నంతో పాటు బంగాళ దుంపలు, పండ్ల రసాలు, వంకాయలతో తయారు చేసిన ధన్సక్‌ను తినాలి. ఈ ధన్సక్‌లో టమాటోలు కూడా వాడవచ్చును కాని వాటిని విడిగా తినుటకు ఉపయోగించ రాదు. ఒకపూట భోజనంతో ఆవకాయ తినవచ్చును. ఉర్లగడ్డలు ప్రస్తుత సరుకు ఉన్నంతవరకే ఉపయోగించాలి. అయితే పచ్చిమిరప కాయలు, ఉల్లిపాయలు, పచ్చళ్లు వాడుటకు ఎటువంటి నిర్భంధము లేదు. ఉపాహారంలో

రెండు చపాతీలకు మించకుండా తిని టీ త్రాగాలి. మధ్యాహ్నం చపాతీలు లేకుండా టీ మాత్రమే త్రాగాలి. బైదిలు మాత్రం అర్ధరాత్రి నుండి ఉదయం 5 గంటల వరకు నామ జపం చేయవలసి ఉన్నందున రాత్రిళ్లు అతనికి సహాయపడేందుకు మరో కప్పు టీ అదనంగా త్రాగేందుకు అనుమతించారు. డా॥ నీలూకు కొద్దిగా పాలు ఎక్కువగా త్రాగేందుకు అనుమతించారు. ఇవన్నీ కేవలం మినహాయింపులు మాత్రమే. వైద్య సంబంధమైన కారణాలపై డా॥ డాన్‌కిన్ నిర్దేశిస్తే తప్ప, డా॥ నీలూకు అదనంగా పాలు ఇవ్వరాదు. ఎవరైనా తమకు నిర్దేశించిన పనిని అతిక్రమిస్తే వారు ఇతరులు ఇచ్చే టీని, కిళ్లీని కూడా తీసుకొనుటకు వీలులేకుండా నిషేధింపబడతారు. ఈ ఆదేశాలు, నామ జపానికి నిర్దేశించిన సమయాలు, రోజ్‌ఉడ్‌లో ఒక చిన్న బోర్డు మీద కాపురాలున్న వారి సమాచారము నిమిత్తం ప్రదర్శించారు.

నేనీ ఆదేశాలను పాఠకులకు బాబా తన మండలి కిచ్చే విధుల గురించి ఎంత వివరంగా ఉంటారో ఒక అవగాహన కలిగించేందుకు ఇంత సవిస్తరంగా వ్రాసిపెట్టాను. ఆయన ఇచ్చే ఆదేశాలు ఎంత వివరణాత్మకంగా ఉంటాయో తెలిస్తే, ఆయన ఏకాంతంలో ఉండే 40 రోజుల్లో ఎటువంటి గందరగోళము లేదా ప్రశ్నలు ఉదయించదనే సవిరంగా వ్రాశాను. బాబాయే స్వయంగా కచ్చితమైన క్రమపరిపాలకునిగా వాటిని ఆచరించారు.

ఈ నలభై రోజుల ఏకాంతం పూర్తికాగానే స్త్రీ శిష్యరాండ్రలో ఒకామె సతారా నుండి యీ క్రింది జాబు వ్రాసింది :

బాబా మరియు కొందరు సన్నిహిత శిష్యులు, డిశంబరు 1న ప్రత్యేక ఘట్టపు కార్యక్రమము ప్రారంభము కాబోయే ముందు రాత్రి అంతా కవ్వాలి గాయకుడి గానాన్ని వింటూ జాగరణ చేశారు.

మొదటి పది రోజులు బాబా రోజుకు ఒక పూటే భోజనం చేసి ఉపవశించారు. తదుపరి పది రోజులు ద్రవ పధార్థాలపైనే గడిపారు. మిగిలిన ఇరవైరోజులు, కాఫీ, పళ్లరసాలు రోజూ రెండుసార్లు మాత్రమే తీసుకొని గడిపారు. ఈ ఆఖరి నిరాహార ఘట్టం గురించి మేమంతా చాలా ఆందోళన చెందాము. ఎందుకంటే ప్రియతమ బాబా పండ్లను ఎంత మాత్రం ఏ రూపంలోనూ తీసుకొనుటకు ఇష్టపడక పోయేసరికి దానిని బలవంతంగా తినిపించాల్సి వచ్చేది.

గతంలో బాబా సుదీర్ఘమై కఠోర నిరాహార ఉపవాసములు చేపట్టినా

ప్రస్తుతం ఇటీవల ఆయన శరీరము అదే విధంగా నిర్లక్ష్యం చేస్తే తట్టుకొనేట్లు లేదని మేము గమనించాము. మేము ఎంతగా ఆతురత చెందినప్పటికీ, ఆయన నిరాహారదీక్ష స్థిరంగా నిలబడింది. ఆఖరి కొద్ది రోజులు ఆయన పాలిపోయనట్లు, అలిసినట్లు కనిపించారు. అయితే అది తాను చేస్తున్న కార్యక్రమపు తీవ్రత వల్లే కానీ, నిరాహార దీక్ష వల్ల కాదని బాబా చెప్పారు. మామూలుగా బాబా తనపైన అధిక భారాన్ని మోపుకుని మండలి వారిని, మమ్ములను బహు కొద్దిగా పాలు పంచుకొనేట్లు అనుమతించారు..... ఆ నలభై రోజులు మండలివారు రాత్రింబగళ్లు విడువకుండా, విరామము లేకుండా దైవనామాన్ని స్మరిస్తూ, నామ జపం చేశారు.

బాబా ఆదేశాల ప్రకారం 9వ తేదీన 56 మంది పేదవారికి, అన్నదానం చేశారు (ఉచిత భోజనం) ఇక్కడ ఉన్న చిన్న పిల్లల అనాథ ఆశ్రమపు బాలికలందరు, కొత్త బట్టలు పుచ్చుకున్నారు. నలభైపై చిలుకు కుష్టు రోగులకు ఇక్కడకు సమీపంలో ఉన్న కుష్టు ఆసుపత్రిలో ఒక్కొక్కరికి ఒక కొత్త దుస్తును అందించారు. ఈ దయాపూర్వక బాహ్య చర్యల ద్వారా ఆయన అంతర్గతంగా ఇచ్చిన సంపదను మనము చూడగలమా !

9 తేదీ అర్థరాత్రి 12 గంటలు కొట్టగానే బాబా చప్పట్లు కొట్టినప్పుడు మేమంతా బిగ్గరగా దైవనామాన్ని ఉచ్చైశ్వరంతో ఉచ్చరించాము. ఆ కొద్దిపాటి క్షణాలు, ఆతురతతో బాబా చప్పట్ల కొరకు ఎదురుచూస్తూ నిలబడిన క్షణాలు మాలో అద్భుతంగా బిఱ్ఱబిగిశాయి. పదవతేదీన బాబా తన ఉపవాసదీక్షను విరమించి క్లుప్తంగా భోజనం చేశారు.....

బాబా ఏకాంతవాసంలో ఉండగా ఆయన చేయదలచుకున్న కార్యక్రమపు స్వభావాన్ని బహిర్గత పరచలేదు. ఆ తర్వాత ఆయన చేసిన వ్యాఖ్యానాలను బట్టి, అది తన అంతిమ ప్రకటనతో ఏదో విధంగా సంబంధం ఉన్నట్లు కనిపిస్తుంది. నాకు సంబంధించినంత వరకు ఇది కేవలం నా ఊహ మాత్రమే. కాని, మండలికి ప్రమేయం లేదు. వారు నిర్వహించే నిత్య దినచర్యలో కేవలం బాబా అభీష్టాలకు అనుగుణ్యంగా నడుచుకోవటము వారి విధి. వారి భాహ్య విధులు, మరియు చర్యలు, బాబా చేసే కార్యక్రమపు ఘట్టాన్ని బట్టి, రకరకాలుగా అతి భయంకరంగా ఉంటాయి. వారి నిత్యతేజః కేంద్రము అదే ఆయన ఇచ్చుకు అధికాధికముగా విడిచిపెట్టి ముందుకు సాగిపోయే విధానము. మరి ఇది అంత సులభం కాదు. ఈ నలభై రోజుల ఏకాంత వాసమునకై ఇచ్చిన ఆదేశాలు బాహ్యంగా చాలా

స్వల్పమైనవిగా కనిపించవచ్చును. కాని అందుకు విరుద్ధంగా తరచూ ఇది హృదయపూర్వకంగా పాటించుటకు ఒక చిన్న బాహ్య కార్యక్రమాన్ని చేయుటకు పూనుకున్నప్పుడు, విస్తారమైన పనిని ఒప్పగించినప్పటి కంటే లేదా ఆ చేసే పని ఒక "ఆధ్యాత్మిక సవాలు"ను ప్రదర్శించవలసి వచ్చినప్పుడు ఆజ్ఞలను మన్నించి నడుచుకొనుట మరింత కష్టము.

బాబా ఆదేశాలు ఎప్పుడూ అర్థవంతమైనవై ఉన్నా, అవి ఆయన అంతర్గత ఆధ్యాత్మిక కార్యక్రమానికి సంబంధించినప్పుడు అనగా యీ ఏకాంత వాసపు సమయం ఇచ్చినటువంటి వాటికి చాలా గాఢమైన భావార్థము ఉంటుందని నా ఉద్దేశ్యము. అటువంటి సమయాల్లో మండలికి బాబా ఇచ్చే ఆదేశాలు పాటించుట అంటే ఆధ్యాత్మిక శక్తిని విడుదల చేసేందుకు ఆయన తన ప్రసారయంత్రాన్ని దివ్యంగా స్వాధీక్యము చేస్తున్నారన్నట్లు నేను భావిస్తాను. ఈ దివ్య మేళనమునకు వారు యంత్రకారులై యంత్ర పరిజ్ఞానము కలిగి ఉండక్కరలేదు. ఎందుకంటే బాబాను విదేయులై ఆయన్ని సంతోషపెట్టడమే వారి ఏకైక కోరిక. బహుశః ఇందుకే బాబాకు అత్యంత సన్నిహిత శిష్యుడు మరియు కార్యదర్శి అయిన చాన్జీ బాబా యొక్క నివాస మండలిని ఆయన "ఆధ్యాత్మిక సరంజామా"గా పేర్కొనేవాడు.

బాబా ఆదేశాల్ని విధేయతతో ఆచరించక పోతే, ఆయన కలవర పడిపోయేవారు. ఇటువంటి అవిధేయత ఆయన కార్యక్రమాన్ని మరింత జటిలం చేసినా, బాబా ఆవ్యక్తికి సంభవించబోయే దాని గురించే ఎక్కువగా పట్టించుకొనేవారు. ఎందుకంటే, ఆధ్యాత్మిక చట్టపు సహజ ఫలితము ఆయన భౌతిక సమక్షంలో యాంత్రికంగా పని చేస్తుంది.

బహుశః ఇందుకేనేమో బాబా తానిచ్చిన ఆదేశాలు సక్రమంగా విదేయతతో పాటించబడుతూన్నయో లేదోనని చాలా నిశితంగా పరిశీలిస్తారు. అందుకే ఒక పొరపాటు సంభవిస్తే ఆ తప్పును శీఘ్రంగా వేలెత్తి చూపిస్తారు. అయినప్పటికీ, తన అపార కరుణలో బాబా తప్పకుండా ఆ తప్పు చేసిన వ్యక్తిని క్షమిస్తారు. ఆ విధంగా అతడు లేక ఆమెను చెడు నుండి రక్షిస్తారు. ఐనప్పటికీ, తన స్వంత చట్టమునకు లొంగిపోయి ఆ వ్యక్తి అవిధేయతకు ఫలితాన్ని బాబా తనకు తానే అనుభవించాల్సి ఉన్నది.

అటువంటి ఏకాంతవాస సమయాల్లో ఇందుకే బాబా బహుశః సందర్శకులను అనుమతించేవారు కారు. బాబా చేసే అంతరంగిక కార్యక్రమము

అందరి లబ్ధి కోసం ఉద్దేశించబడింది. కానీ వ్యక్తులు అటువంటి సమయాల్లో ఆయన అనుమతి లేకుండా దర్శించుట వల్ల, ప్రతికూలంగా బాధపడతారు. ఇక్కడ ఈ విషయాన్ని వివదపరచుటకు సతారాలో బాబా ఏకాంత వాసం గడుపుతున్న సమయంలో జరిగిన ఒక సంఘటన నాకు గుర్తొచ్చింది. ఒకి రోజున బాబాను తన ఏకాంత వాస ప్రదేశంలో వదిలి, ఆలోబా రోజ్‌ఉడ్‌కు తిరిగి వస్తున్నాడు. దారిలో రోడ్డుపైన డెహరాడూన్ నుంచి వచ్చిన ఒక ప్రేమికుడ్ని చూచి అలోబా ఆశ్చర్యపోయాడు. అంతక్రితం సంవత్సరం బాబా డెహరాడూన్‌లో ఉన్నప్పుడు బాబాకు అత్యంత సన్నిహితుడుగా మెలిగిన వ్యక్తి అతడు. ఆ వ్యక్తి కుటుంబంలో బాబా ప్రత్యేక శ్రద్ధ తీసుకొని, ఒకసారి అతని ఇంటికి కూడా వెళ్లారు. బాబా సమక్షపు సాన్నిహిత్యము, ఈ వ్యక్తిని ఉత్సాహపరచి, బాబాను తమ మార్గ దర్శకుడిగా తీసుకొనేట్లు చేయటమే కాక, ఏ సమయంలోనైనా అతడు బాబా దగ్గరకు వచ్చేవాడు. అంత సన్నిహితంగా బాబాకు తెలిసినప్పటికీ, అతను బాబా వాంఛితాలను గమనించటం, మరియు విధేయత ద్వారా ఆయన్ని సంతోషపెట్టే ప్రయత్నం చేయటం, బాహ్యంగా వ్యక్త పరిచే ప్రేమకంటే కూడా ఎక్కువ ముఖ్యమని అతడు సరిగా అర్థం చేసుకోలేదు.

ఈ విధంగా బాబా ఏకాంత వాసంలో ఉన్నారని, ఆయన తన ప్రేమికులెవరినీ చూడ నిచ్చగించరని తెలిసి కూడా, అతడు తనకు అకస్మాత్తుగా ఎదురైన సమశ్యల వల్ల బాబాను ఎలాగైనా సరే సందర్శించాలనుకున్నాడు. ఈ విషయాన్ని అతడు ఆలోబాకు చెప్పకుండా, కేవలం బాబా యందు తనకున్న ప్రేమ తనను ఇక్కడకు తీసుకువచ్చిందని మాత్రమే చెప్పాడు. బాబా ఏకాంత వాసంలో ఉన్నారని అందువల్ల తక్షణం ఇక్కడ నుండి వెళ్లిపొమ్మని ఆలోబా అతనితో చెప్పాడు. ఎలాగైనా సరే బాబా యొక్క క్షణ దర్శనాన్ని చూడనిమ్మనమని ఆలోబాను ప్రాదేయపడ్డాడు. బాబా దర్శనం కావాలని తన హృదయం ఘోషిస్తున్నదని చెప్పాడు. చివరకు ఆ వ్యక్తి యొక్క బ్రతిమలాడటం ఆలోబా హృదయంలో సున్నితంగా నాటుకున్నది. ప్రేమ పొంగి పొర్లే ఏ వ్యక్తిని చూచినా ఆలోబా మెత్తబడి కనికరిస్తాడు. అందుకని అలోబా ఆ వ్యక్తిలో, ఆ మర్నాడు ఉదయం బాబా నడచివచ్చే సమయంలో ఫలనా సమయంలో ఫలానా చోట రోడ్డుపైన బాబా క్షణకాల దర్శనం చేసుకొనుటకు ఎదురుచూస్తూ నిలబడమని చెప్పాడు. అందుకా వ్యక్తి సంతోషించాడు. మర్నాడు ఉదయం, నిర్దేశించన సమయానికి, ఉద్దేశించిన స్థళంలో అతను వచ్చి నిలబడ్డాడు.

బాబా, ఆలోబాతో కలిసి నడుచుకుంటూ రోడ్డుమీదికి రాగానే, దూరంగా నిలబడిన యీ వ్యక్తిని గమనించిన బాబా, అతను ఎవరు, ఎందుకు అక్కడ నిలబడ్డాడు అని అలోబాను అడిగారు. అతడ్ని తానే అక్కడ నిలబడమని చెప్పి ఉన్నందున తన తప్పును ఒప్పుకుంటూ ఆ వ్యక్తి యొక్క ప్రేమ చాలా గొప్పగా ఉండటంతో తానే ఆపుకోలేక తన ప్రియతముని క్షణదర్శనాన్ని దూరంలో నిలబడి చేసుకొనుటకు తానే అనుమతించినట్లు చెప్పాడు.

అతడ్ని దగ్గరకు రమ్మనిపిలవమని బాబా, అలోభాని ఆదేశించారు. అతడు దగ్గరకు రాగానే, "నీకు నా సర్క్యులరు అందలేదా ? నేను ఏకాంత వాస కార్యక్రమంలో తలమునకలై యున్నానని ఎవరినీ చూడదలుచుకోలేదని నీకు తెలియదా ?" అని సౌంజ్ఞలు చేశారు. తనకు ఈ విషయం తెలుసునని అతడు అంగీకరిస్తూనే తన రాకను సమర్థించుకుంటూ ఇలా బదులిచ్చాడు. "బాబా! నీ ప్రేమేనన్నిక్కడకు ఈడ్చుకు వచ్చింది. నీ దివ్య మంగళ రూపము ఒక క్షణకాల దర్శనాన్ని మాత్రమే నేను కోరుకుంటున్నాను" అని విన్నవించుకున్నాడు. "సరే మంచిది. నీవు నన్ను దర్శించావు కదా. ఇప్పుడు వెంటనే డెహ్రాడూన్ తిరిగి వెళ్లిపో" అన్నారు.

కానీ ఆ వ్యక్తి వెళ్లలేదు. వెళ్లకపోగా, ఆలోబాను ఆశ్చర్యచకితుడ్ని చేస్తూ బాబాతో అతడు తన సమస్యల గోడును ఏకరువు పెట్టటం మొదలు పెట్టాడు. "గొప్ప దురదృష్టం నాపై పడింది. నాపై చాలా కోర్టు కేసులు దాఖలయ్యాయి. నా భార్య తీవ్ర అస్వస్థతకు గురైంది. నా కూతురుకు అనువైన సంబంధాన్ని కుదర్చలేక పోతున్నాను" అంటూ ఒక్కొక్క బాధను చెప్పసాగాడు.

అలా అతను ఒక సమస్య తర్వాత మరో సమస్య చెపుతుంటే, బాబా యీ వ్యక్తి యొక్క ఉద్దేశ్యాన్ని తప్పుడు అంచనా వేసి, సరిగా అర్థం చేసుకోలేక పోయావన్నట్లుగా అలోబా వైపు చూచారు. అదే విషయాన్ని అలోబాకు ఎత్తి చూపించారు. ఆ వ్యక్తి కేవలం ప్రేమ కోసమే వచ్చాడని ఆలోబా నమ్మాడు. కానీ అతడు నిజంగా వచ్చింది తన దురవస్థల నుండి ఉపశమనం కలిగేందుకు ఆశీర్వదించమని అడిగేందుకు వచ్చాడు. ఇటువంటిది జరిగితే బాబాకు తన అంతరంగ ఆధ్యాత్మిక కార్యక్రమంలో నిశ్చలత చెడిపోతుందని అలోబాకు తెలుసు కనుక, తత్తరపడి అతడిని చీదరించుకున్నాడు.

ఆ వ్యక్తి తన గోడంతా వెళ్లగక్కడం పూర్తి కాగానే బాబా "విచారపడబోకు నీ సమశ్యలు, కష్టాల గురించి బాధపడకు. మొదలైన దానికి చివర కూడా ఉంటుంది. నేను నీతో ఉన్నాను. నీవు నా ప్రేమను కలిగి ఉన్నావు. అది ముఖ్యమైన విషయం. నీవు ఇప్పుడు నాప్రేమను తీసుకొని తిరిగి వెళ్లిపో" అని తన అభయాన్నందించారు. అయినా ఈ హామీ అతడిని సంతృప్తి పరచలేదు. "బాబా ! దయచేసి నన్ను ఆశీర్వదించు. అలా చేస్తే నేను నా కష్టాలన్నిటి నుండి విముక్తుడనవుతాను" అని విన్నవించుకున్నాడు.

"నా ఆశీర్వచనము కంటే, నాప్రేమతో నీ కష్టాల్ని ఎదుర్కోవటమే మంచిది"

'కాదు బాబా ! దయచేసి నన్నాశీర్వదించు. నాకు నీ ఆశీస్సులే కావాలి.'

"ఇప్పుడు నీవు నా ఆశీస్సులే కావాలని పట్టుబడితే, నీవు నన్ను మరచిపోతావు. నన్ను పోగొట్టుకొనుటకు నీవు ముగింపు పలుకుతావు" అంటూ బాబా అతడ్ని హెచ్చరించారు. అందుకాతడు వాదిస్తూ "అదెలా జరుగుతుంది ? నాకు ఎంతో ప్రియమైన నా బాబాను నేను ఎలా మరచిపోతాను ? నేనెన్నటికీ నిన్ను మరువను. కానీ నాకు నీ ఆశీస్సులు కావాలి" అన్నాడు.

ఆ వ్యక్తిని కేవలం తన ప్రేమతో సాగనంపాలన్న ఉద్దేశ్యంతో బాబా అతడిని సమ్మతింప చేయుటకు ప్రయత్నించసాగారు. ఎంత చెప్పినా అతడ్ని ఒప్పించలేక పోయేసరికి బాబా గంభీరంగా మారిపోయారు. నడిరోడ్డు మీద బాబా అతని పాదాలపై తన శిరము నుంచి సాష్టాంగ దండ ప్రణామాన్నర్పిస్తూ, దయచేసి, ఈ ఏకాంత వాస ఘట్ట సమయంలో తన ఆశీస్సులు కోరవద్దని బ్రతిమాలుకున్నారు. అవతారుడు తన ప్రేమికులతో తన ప్రేమ సంబంధాన్ని ఒకసారి స్థాపించుకుంటే, దానిని పదిలపరచేందుకు ఎంత దూరం వెళ్లేందుకు ప్రయత్నిస్తారో చూస్తే నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. తన అవిధేయులైన ప్రేమికుల యెడల ఎటువంటి మనస్సును తట్టే నమ్రతను, ఎటువంటి అణకువ గల దయను బాబా కలిగి ఉన్నారో గదా !

బాబా అతని పాదాలపై వాలి నమస్కరించినా ఆ వ్యక్తి మొండిగా ఉండిపోయి తనను ఆశీర్వదించమని బాబాను వత్తిడి చేశాడు. చివరకు బాబా సౌంజ్ఞలు చేస్తూ "అయితే సరే నేను నీకు నా ఆశీస్సులందిస్తున్నాను" అని చెప్పి బాబా అక్కడ నుంచి కదిలి వెళ్లిపోయారు.

అందుకా వ్యక్తి ఆనందభరితుడై తాను కోరుకున్న అదృష్టం లభించిందన్న భావాన్ని పూర్తి భిన్నమైన రీతిలో మనస్సులో నిలుపుకొని డెహ్రాడూన్ తిరిగివెళ్లిపోయాడు. నిస్సంశయంగా త్వరలోనే అతని కష్టాలన్నీ తీరుతూ మొత్తం పరిస్థితే మారటం ఆరంభమైంది. కోర్టు కేసులు ఒక్కొక్కటీ తనకు అనుకూలంగా పరిష్కార మవుతున్నాయి. అతని భార్య తన ఆరోగ్యాన్ని తిరిగి పొందింది. అతని కూతురుకు సంతోషంగా వివాహం జరిగింది. తాను కూడా చక్కని వ్యాపారాన్ని మొదలు పెట్టి వృద్ధి చెందాడు. అయినా అదే సమయంలో అతడు బాబాను పోగొట్టుకోసాగాడు. ఆ ప్రేమ పూర్వక జ్ఞాపకము క్షీణించ సాగింది. కాలం గడిచే కొద్దీ అతను బాబా పరిధి నుండి నెమ్మదిగా జారిపోతున్నట్లు కనిపించాడు. మరెన్నడూ ఆయన్ని దర్శించేందుకు రాలేదు. ఒక్కసారి కూడా రాలేదు. తాను కోరుకున్న దానిని పొందాడు. కానీ అవతారుడు తనకేమి ఇవ్వదలచారో దానిని పోగొట్టుకున్నాడు. ఆయన తన అమూల్యమైన జ్ఞాపక మనే నిజమైన సంపదను ఇద్దామనుకున్నారు.

జరిగిన దానిని గురించి ఆలోచిస్తే బహుశః ఇందుకేనేమో గతంలో ఆయన డెహ్రాడూన్‌లో గడిపినప్పుడు, ఆ వ్యక్తికి బాబా హిందీలో "పోగొట్టుకొనువాడు" అనే అర్థం వచ్చే మారుపేరుపెట్టారు. ఆ వ్యక్తి ఈ జీవిత కాలములో నిజంగా పోగొట్టుకున్నాడు. అయినప్పటికీ అవతారుడితో ఒక్కక్షణమైనా సంబంధం ఏర్పడితే అది ఎన్నటికీ వృదాగా పోదు. ఈ అనుభవం వల్ల అవతారుడికి విధేయుడు కావాలన్న యీ వ్యక్తి యొక్క నిశ్చయం అతడి తదుపరి జన్మలో ఎంతబలంగా ఉంటుందో ఎవరికి తెలుసు ?

# ప్రకటన ధృవపరచబడింది

1955 జనవరి 10వ తేదీన బాబా నలబై రోజుల ఏకాంత వాసము పూర్తయింది. అంతకు ముందు సెప్టెంబరులో బాబా తన అక్షర ఫలకాన్ని అక్టోబరు 7న ఉపయోగించటం ఆపివేస్తానని, అప్పటి నుండి ఆయనతో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు అనుమతించబడవని ప్రకటించారు. బాబా తన మండలిలో ఒకరైన భావూతో హమీర్‌పూర్‌లోని తన ప్రేమికులతో హిందీలో ఒక ఉత్తరం వ్రాయమని ఆదేశించారు. తనతో ఆంతరంగిక బంధాల గొలుసులో అనుసంధింపబడి ఉండే సమయం ఇప్పుడు ఆసన్నమైనదని ఆ ఉత్తరంలో వివరించారు. ఇంకా వివరిస్తూ తన ప్రేమికులు, తన ప్రకటన వల్ల తాను త్వరలోనే తన భౌతిక శరీరాన్ని పరిత్యజించనున్నానన్న విచారంతో ప్రత్యేకంగా తమ గుండెలను పేలికలు చేసుకోవద్దని, అయితే అందుకు బదులుగా యీ ప్రకటన తన దైవేచ్ఛగా భావించి ఆనందంగా పరి గ్రహించమని వ్రాయించారు.

ఇటువంటి అభిమానాన్నందించినా బాబా ప్రేమికులు తన శరీరాన్ని బాబా వదిలివేస్తున్నారన్న భావంతో కలవర పడటం సాగిస్తూనే ఉన్నారు. బాబా ప్రకటన సభకు హాజరైన పాశ్చాత్య ప్రేమికుడైన లడ్ డిమ్‌పుల్, అమెరికా తిరిగి వెళ్లగానే, మెహెర్‌బాద్ సమావేశంలో జరిగిన విషయాలన్నీ అక్కడి వారికి చెప్పే ప్రయత్నంలో దుఃఖం ఆపుకోలేక భోరున ఏడ్చేశాడు.

అదే విధంగా, భారతదేశంలో కూడా బాబా ప్రకటనలు గాఢంగా భోదించే మార్పు తెచ్చాయి. చాలా మంది ఏంచేయాలో చెప్పమని మార్గదర్శకం కోరుతూ ఆదీకి జాబులు వ్రాశారు. బాబా తన ఏకాంత వాసము నుండి బయటకు రాగానే, ఆదీ తన వద్ద ఉన్న ఉత్తరాల సారాంశాన్ని బాబాకు విన్నవించాడు. అందలి ఒక జాబులో హమీర్‌పూర్ ప్రాంతంలో సాహస వంతుడైన బాబా ప్రేమికుడు కేశవ నారాయణ నిగమ్ బాబా తన అంతిమ ప్రకటనలో చేసిన వివరణల గురించి చాలామంది హృదయాల్లో గందరగోళము రేకెత్తటం వల్ల ఆయన విశదీకరణ ఇవ్వబోతున్నప్పటికీ సంక్షోభం నెలకొన్నదని వ్రాశాడు. బాబా గత సంవత్సరం అదే రోజున నవరంగా సందర్శించిన జ్ఞాపక చిహ్నంగా ఫిబ్రవరి 5వ తేదీన అదే చోటులో దేవాలయం నిర్మించాలని సంకల్పించినందున, శంఖుస్థాపన చేయుటకై ఆ రోజుకు ఎవరైనా ఒక మండలి సభ్యుని పంపించమని కూడా అభ్యర్థించాడు. బాబా తన కరుణలో భావూను పిలిచి తన ప్రతినిధిగా హమీర్‌పూర్ వెళ్లమని

చెప్పారు. అలా భావూ కేవలం శంకుస్థాపన చేయుటకు నవరంగా మాత్రమే కాక, రెండు వారాల ముందే జనవరి 17న బయలుదేరి, హమీర్‌పూర్ జిల్లాలోని అనేక పట్టణాల్లో పర్యటించేట్లు ఏర్పాటు జరిగాయి. భావూ అంగీకరించాడే కాని, ఆ ప్రేమికుల నిరాశ చెందిన హృదయాల్ని ఊరడించటం తన వల్ల కాదని అశక్తతను వ్యక్తపరిచాడు. జనం సహజంగా బాబా ప్రకటన గురించి ప్రశ్నిస్తారు కనుక వారు వేసే భిన్న ప్రశ్నలకు జవాబు చెప్పే అర్హత తనకు లేదని వాపోయాడు.

ఏమీ విచారించవద్దని బాబా అతడిని వారించి, తన ప్రేమికులకు అందించాల్సిన ఒక సందేశాన్ని ఇచ్చారు. ఆ సందేశంలో కేవలం అయిదే అయిదు పదాలున్నాయి. "సత్ - చిత్ - ఆనంద్, పరమానంద, మెహెర్ బాబా, విజ్ఞానంద" తన ప్రేమికులు విన్నవించుకున్నట్లు, బాబా తన పాదుకలను భావూకు ఇచ్చి, నవర్గంగా దేవాలయంలో ఉంచేందుకు ఇవ్వమని ఇచ్చి పంపారు. ఈ దేవాలయాన్ని మొదట్లో మెహెర్ మందిరం అని పిలిచేవారు. ఆ తరువాత అది మెహెర్ ధామ్ అనగా మెహెర్ ఆరామంగా పునః నామ కరణం చేశారు.

నిర్దేశించిన ప్రకారం భావూ 17న తేదీన హమీర్‌పూర్ బయలు దేరాడు. బాబా ప్రకటీకరణ గురించి మాట్లాడేందుకు చాలినంత సమాచారం లేనందున, ప్రశ్నించే మానవ మనస్సును, బాబా అందించిన యీ సంక్షిప్త సందేశం ఎలా ఉపశమింప చేస్తుందని భావూ ఆశ్చర్యపోయాడు. ఆయన ఇఘౌరా చేరగానే బాబా చెప్పిన సందేశపు మాటలను ఆర్.ఎస్. సింగ్ బఘేల్ అనే స్థానిక బాబా ప్రేమికునితో చెప్పగానే అతను ఆ పదములకు సంగీతం సమకూర్చి ఒక గీతంగా మలచాలన్న ప్రేరణ కలిగింది. అలా అతను సమకూర్చిన స్వరాల్ని తొలి బహిరంగ సమావేశంలో కొద్దిమంది బాబా ప్రేమికులు నామగానం చేయగా అతి కొద్ది సేపట్లోనే జన సమూహమంతా అదే రాగంలో కలిపి గానం చేశారు. ఈ అవతార మంత్రాన్ని తాళబద్ధంగా పునఃస్మరణ చేయటం వల్ల, బాబా సమక్షం ప్రజ్వరిల్ల చేయబడి, ఆయన ప్రేమతో వాతావరణమంతా నిండిపోయింది. ఇక్కడ నేను మీకో విషయం చెప్పాలి. బాబా 1969 జనవరి 31న తన భౌతిక శరీర పరిత్యాగం చేసిన తరువత ఈ పదములు ఆయన ప్రధాన స్త్రీ శిష్యురాండ్రు మెహెరాబాదు బాబా దివ్య సమాధిని ఎప్పుడు దర్శించ వచ్చినా వారిచే పాడబడేవి. ఈ బాబా మంత్రాన్ని పునస్మరణ చేస్తే, దివ్య శక్తి విడుదలై, అటువంటి

సమయంలో అక్కడ హాజరైన వారి హృదయాల్లో ప్రేరణను కలిగించుట కొనసాగుతుందని నా అభిప్రాయం.

భావూ మొదల్లో రాబోవు కీడును గురించి భయపడిన తన తొలి అవగాహనకు భిన్నంగా, ఆయన యాత్ర చాలా బాగా దిగ్విజయమైంది. ఫిబ్రవరి 5న నౌరంగాలో ఆయన మెహెర్‌ధామ్‌కు శంఖుస్థాపన చేశాడు. మూడు రోజుల తర్వాత, ఆయన సతారా వెళ్లిపోయాడు. భావూ జనవరి 17న హమీర్‌పూర్ వెళ్లగానే బాబా కొద్దిమంది మండలిని వెంట బెట్టుకొని కుల్దాబాద్ దర్శించాలనుకున్నారు. అక్కడ తగు ఏర్పాట్లు చేసేందుకు బైదిలు సామానులతో ముందుగానే పంపబడ్డాడు. అహమ్మదు నగరంలో ఉంటున్న చగ్గన్‌ను ప్రత్యేకంగా వచ్చి వీరి బృందంతో కలవమని కబురంపారు. అతడు వస్తే బాబాకు తక్కిన మండలి వంటచేసి పెడతాడు. డెహ్రాడూన్‌లో ఉన్న కుమార్‌ని కూడా రమ్మనమని కబురంపారు. బాబాకు ఇష్టమైన మస్తు రుషీకేష్‌లో ఉండే నీలకంఠ వాలాను తీసుకు రాగలిగితేనే రమ్మన్నారు. అతను ఎంత ప్రయత్నించినా కుమార్ అమస్తును తీసుకు వచ్చేందుకు ఒప్పించలేక పోయాడు. అందువల్ల కుమార్ ఈ సారికి తన ప్రియతమ బాబాతో గడిపే అవకాశాన్ని పోగొట్టుకున్నాడు.

జనవరి 20న ఎరుచ్, బాబాను పెండు మరియు గుస్తాద్‌జీలను అహమ్మదు నగరుకు 80 మైళ్ల దూరంలో ఉన్న కుల్దాబాద్‌కు కారులో తీసుకువెళ్లాడు. ప్రశిద్ధి చెందిన ఎల్లోరా గుహలకు సమీపంగా కుల్దాబాదు ఉన్నది. అయితే అది అంత పెద్ద పట్టణం కాదు. హిందువుల ఆచారం ప్రకారం, పురాతన కాలంలో అది గొప్ప ఋషీశ్వరులుండే కేంద్రంగా అలరారింది. అక్కడ కొన్ని శతాబ్దాల క్రితం వల్లీలు (దైవ మిత్రులు) స్వర్గ సంబంధ పల్లకీలలో వచ్చి దిగారని మహమ్మదీయులు విశ్వశిస్తారు. చరిత్ర ఏమి చెప్పినప్పటికి అక్కడ మాత్రం శతాబ్ధాలకు ముందు కొందరు యోగులు మరియు కొద్దిమంది సద్గురువులు అక్కడున్నారన్నది మాత్రం కటిక నిజం. ఏ మాత్రం అనుమానము లేదు. ఆ వూరికి చుట్టు పక్కల ఈనాటికీ అనేక గొప్ప సమాధులు చెల్లా చెదురుగా కనిపిస్తాయి. వాటిల్లో అత్యంత ప్రశిద్ధి చెందిన దర్గా జర్‌జరీ జర్భక్షి (సంపదల కెల్ల సంపదను ప్రసాదించువాడు). ఈయన 13వ శతాబ్దాంలో ఒక సద్గురువుగా ప్రశిద్ధి కాంచాడు. ఆయన గౌరవార్ధం ప్రతి సంవత్సరం పెద్ద ఉత్సవం జరుగుతుంది. ఈ దర్గాకు దగ్గర్లోనే ఒక మశీదు ఉన్నది. ఆ మశీదుకు అడుగున ఒక గది నిర్మితమైనది. ఈ గదిలోనే బాబా తన మండలితో ఎప్పుడు అక్కడకు వచ్చినా అందులో ఉండేవారు.

ఈ సందర్భంగా ఆయన అక్కడున్న అయిదు రోజులు ఉన్న తరువాత అది ఏదైనప్పటికీ తన ఆంతరంగిక కార్యక్రమము పూర్తి అయింది. అని ప్రకటించారు. అందువల్ల 25వ తేదీన, సతారా తిరిగి వెళ్లాలని నిర్ణయించారు. దారిలో అహమ్మదు నగరులో ఒక పెట్రోలు బంకు వద్ద కారును కొద్ది సేపు ఆపారు. ఇక్కడ, ఆదీని కొద్ది నిమిషాలు బాబాను చూచేందుకు అనుమతించారు. ఆదీ చూస్తున్న చలన చిత్రం పని ఎంత వరకు వచ్చిందని బాబా అడిగారు. కడపటి పరిణామము గురించి ఆదీ వివరించాడు. జనవరి 3న ఉపాశినీ నగరులో చిత్రీకరించిన చిత్రాన్ని తీసుకొనుటకు జనవరి 3న సకోరి వస్తున్నట్లు కూడా తెలిపాడు. ఈ సంభాషణా సమయంలో బాబా మెహెరాబాదులో ఉంటున్న పాద్రీని కలిసి 1937లో నాశిక్‌లో బాబా జన్మ దినోత్సవ సందర్భంగా తీసిన చలన చిత్రాన్ని వెతికి తీయమని చెప్పమని ఆదీకి చెప్పారు. ఇంకా మాట్లాడుతూ తన ఆధ్యాత్మిక మాతృమూర్తి గుల్మాయి ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూడమని ఆదీని ఆదేశిస్తూ, మరికొన్ని ముఖ్యమైన విషయాలు చర్చించేందుకు నెలాఖరుకు సతారా రమ్మన్నారు.

బహుశః కుమార్ నీలకంఠవాలా మస్తును ఖుల్దాబాదు తీసుకురాలేక పోయినందుకు కాబోలు, బాబా సతారాకు తిరిగి రాగానే, కొల్హాపూరు నుంచి తీసుకురాబడిన ఒక మస్తును కలిశారు. ఈ మస్తు గురించి బాబా సోదరి మణి పాశ్చాత్యులకు వ్రాసిన ఒక ఉత్తరంలో చాలా మనోజ్ఞంగా వర్ణించింది :

బాబా ఖుల్దాబాదులో ఒక వారం గడిపి తిరిగి రాగానే, ఒకటి రెండు రోజులు బాబాతో గడిపేందుకు కొల్హాపూరు నుండి ఒక మస్తు తీసుకు రాబడ్డాడు. బాబా అతడ్ని చూచి చాలామంచి మూడ్‌లో ఉన్నారు. ఒక మంచి మస్తుతో పని చేస్తున్నప్పుడు ఆయనెప్పుడూ అలా ఉల్లాసంగానే ఉంటారు. ఆ మస్తు ఎంతగా పురోభివృద్ధి చెందాడో తన శరీరాన్ని గురించి పట్టించుకో కుండా దాని స్థితిని మరిచిపోయి సంవత్సరాల తరబడి స్నానమనేది చేయకపోయినా అది ఎంత ఆరోగ్యంగా ఉండి మధురమైన సువాసనలను గుబాళిస్తున్నదో మాకు వివరంగా విశదపరచారు. భగవంతుడి కొరకు సర్వాన్ని హరించే ప్రేమ వారికున్నందు వల్ల వారిని ఆ ప్రేమే భరిస్తోందని బాబా చెప్పారు.....

కొల్హాపూర్‌లో ఉండే యీ మస్తు చాలా పొడుగ్గా ఉంటాడు. అతడికి అలవాటైన నివాసము ఒక చిన్నరాతి గూడు. అందులో చాలీ చాలని విధంగా ముడుచుకొని ఇరుక్కుని గడిపేవాడు. వేసవి కాలంలో, ఆ రాయి ముట్టుకుంటే

వెచ్చగా మాడిపోయే స్థితిలో ఉన్నప్పుడు కూడా అతడు ఎలాంటి అసౌకర్యాన్ని భావించకుండా హాయిగా అందులోనే ఇరుక్కుని పడుకొనేవాడు. అనేక మంది మస్తుల స్వభావాలు మాదిరిగానే ఇతడు కూడా తనతో ఒక మూటను ఉంచుకొని, అతనికి ఎవరు ఏది పెట్టినా అందులోనే ఉంచుకొనేవాడు.

మొదటిసారిగా బాబా అతడిని అతని స్వగ్రామంలోనే కలిశారు. తన మండలి వారిని ఒకిరిని పంపి, అతని గూడు నుండి బయటకు రమ్మని పిలవమన్నారు. కానీ ఆ మస్తు ఏ మాత్రం కదలలేదు. అంతట మండలికి చెందిన బైదిలు బుర్ర వేగంగా పనిచేసి, అతని దగ్గరకు వెళ్లి, అతని పక్కనున్న మూటను బయటకు తీసి వేగంగా బాబా దగ్గరకు నడిచాడు. దానితో ఆ మస్తు బయటకు వచ్చి ఆ మూట వెంబడి అనుసరించాడు. అలా తొలి స్పర్శ జరిగిన తరువాత, అప్పటి నుండి బాబా దగ్గరకు ఎప్పుడు రావాలన్నా చాలా హుషారుగా ఎంతో ఇష్టంతో వచ్చేవాడు.

ఆదీ చూడాల్సిన మరో ముఖ్యవిషయం గురించి బాబా ఆదీతో చెపుతూ 23వ జీవిత సర్క్యులరును పంపమన్నారు. జనవరి నెలలో బాబా తన అంతిమ ప్రకటనలో వివరించిన కొన్ని వివరణలను ఎరుచ్, ఆదీకి పంపుతాడని చెప్పారు. ఇవన్నీ సంకలన పరచి, ముద్రించి, 1955 ఫిబ్రవరి 3వ తేదీన పోష్టు చేయుటకు సిద్ధం చేయబడినవి. ఈ సర్క్యులరులో ప్రధాన భాగమును "ధృవీకరణము" అనే శీర్షికతో ఈ క్రింద వివరిస్తున్నాను. దీనిని సంబంధించిన వారంతా తెలుసుకోవాలని బాబా ఆకాంక్షిస్తున్నారు :

నాచే తెలియపరచబడి, ప్రకటించబడి, విశదీకరించబడిన అన్ని విషయాలు స్థిర పరచబడి నిర్దేశించబడిన సత్యములు. ప్రతిదీ జరిగేట్లు, తనచే ముందుగా నిర్దేశించబడిన విధి జరిగేట్లు భగవంతుడే చూస్తాడు.

ఇదంతా జరుగవలయునని నిర్దేశించబడినందున, అనివార్యము అయినప్పటికీ, చివరకు సిద్ధించే ప్రయోజనములను, తత్సంబంధిత పరిస్థితులను బట్టి రెండు విధాలుగా మార్చవచ్చును. నిర్దేశిత ప్రణాళిక యొక్క ఫలితాలను తారుమారు చేయటము ఒక విధంగా జరిగే సంఘటనల పరంపర యొక్క తీవ్రత, ఆశయము, ఆకారము, పరిమాణములను బట్టి నెఱవేరవచ్చును. లేదా మరో విదంగా కాలక్రమములో చాలినంత మార్పును తేవచ్చును.

ఈ రెండు విధానాల్లోనూ ఫలితములను నాకు సంబంధించినంత వరకు కావలసినంతగా సవరించవచ్చును. అవి ప్రపంచానికంటే నాతో ఎక్కువ సంబంధం కలిగి ఉండేవై యుండాలి. ఉదాహరణకు, ఏకకాలములో ఆధ్యాత్మిక

కుదుపును, భౌతిక కుదుపునూ పూర్తిగా యీ ప్రపంచం తనలోనికి అయా సంఘటనల పరిమాణము, గుణములను బట్టి లేదా కాలక్రమములో చాలినంత మార్పును బట్టి తనలోనికి ఆకర్షిస్తుంది.

మెహెరాబాదులో జరిగన మీటింగులో ప్రకటించిన కాలపరిమితి ఏప్రియల్ 1955లో ఎటువంటి మార్పులేకుండా ఉండిపోతుంది. ఆ పిమ్మట, ఈ ప్రపంచం కుదుపులకే కుదుపును పూర్తిగా తనలో ఇంకించుకొనుటకు వీలుగా వరుసగా జరుగవలసిన సంఘటనలు పరిమాణములోను మరియు రీతిలోను, సవరించవలసి ఉంటుంది. అయితే, కాలపరిమితి గనుక తగినంతగా మారితే, ఆ సంఘటనలు ఎటువంటి సవరింపులు లేకుండానే సంభవిస్తాయి. ఈ విషయంలో అతి ప్రాముఖ్యమైనిది మరియు భావగర్భితమైన విషయము ఏమిటంటే, కచ్చితంగా, మనస్సుకు హత్తుకునేట్లు నా భౌతిక శరీరానికి, ఇప్పటి వరకు నేను నిర్వర్తించిన బాహ్య కార్యక్రమాలకు మధ్య ఉన్న సంబంధం 1955 ఏప్రియల్ నాటికి విడిచిపెట్టబడుతుంది. అప్పుడు నాకూ, నాతో సన్నిహిత సంబంధం పెట్టుకున్న వారికి మధ్య ఉన్న బాహ్య సంబంధములలో కొలవ శక్యంకాని గణనీయమైన మార్పు చోటు చేసుకుంటుంది. దీనివల్ల నేను నా భౌతిక శరీరాన్ని విసర్జించకపోతే నన్ను "మృత ప్రాయుడు" గానే చెప్పుకోవచ్చును. ఎందుకంటే, అప్పుడు నేను కాలానుగుణ్యమైన సవరించిన సమయము పూర్తయ్యే వరకు ప్రపంచ దృష్టిలో నిజంగా మరణించిన వాడిగా మారతాను.

అనిర్ధిష్టితమైన యీ సవరించిన కాలములో నేను పూర్తిగా నా బాహ్య కార్యక్రమాలన్నిటిని నేను ఇప్పటి వరకు గడిపిన భౌతిక జీవితంలో చేపట్టిన అనేక కార్యక్రమాలతోపాటు, ప్రస్తుతం నాతో శాశ్వతంగా జీవిస్తున్న వారి మధ్య నేను గడుపుతున్న ఏకాంత జీవితమును నేను ఆపివేస్తాను.

1. అప్పుడు నేను యీ యావత్తు సవరించిన కాలమంతా ఒక సామాన్య మానవునిగా జీవించేందుకు నాకు అవసరమైన ప్రకృతి అవసరాలను ఎటువంటి అడ్డంకులు లేకుండా నిరాఘాటంగా నిర్వహించేందుకు అవసరమైన కొద్దిమందితో తప్ప నేను ఎవ్వరితోనూ, దేనితోనూ సంబంధం లేకుండా సంపూర్ణ భౌతిక బంధ రహిత జీవితాన్ని గడుపుతాను.
2. ఫిబ్రవరి 12వ తేదీ శనివారం రాత్రి 8-00 గం॥ల నుండి ఫిబ్రవరి 13 ఆదివారం రాత్రి 8-00 గం॥ల వరకు 24 గంటల పాటు ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లు మంచినీరు మాత్రం త్రాగుతూ పూర్తి ఉపవాసము పాటించాలని నేను నా ప్రేమికులందరినీ కోరుతున్నాను. ఆ 24 గంటల

కాలములో ఉపయుక్తమైన సమయమంతటినీ, తమకు ఇష్టమైన విధంగా దైవప్రార్థనతో గడుపుతూ భగవంతుడ్ని ధ్యానించాలి.

3. దైవత్వానికి నిజాయితీ ముఖ్య గుర్తు. భగవంతుడిని ఎవరైతే నిజాయితీగా ప్రేమిస్తారో వారు తమను తామే భగవంతునిలో పోగొట్టుకొని, తానే భగవంతుడిగా తెలుసుకుంటాడు.

మన భాషలోకంటే బాబా బాషలోనే యీ ధృవీకరణ ఎక్కువగా ఇవ్వబడిందని నేను వ్యక్తిగతంగా విశ్వసిస్తున్నాను. ఆఖర్లో అందించిన రెండు అంశాలను మాత్రమే నేను పాటించ కలిగాను. 24 గంటలు ఉపవశించాను మరియు, హృదయపూర్వకంగా నాతో, ఇతరులతో, అందరి హృదయాల్లో నివశించే భగవంతునితో నిజాయితీగా ఉండేందుకు ప్రయత్నించాను.

నా విషయంలో నేను అంతిమ ప్రకటనలో స్పష్ట పరిచిన బాబా యొక్క అవమానము, ఘనవైభవము, ఆయన శరీర పరిత్యాగము, దాని ఫలితంగా జరిగే మౌన విరమణల గురించిన అర్థాన్ని అర్థం చేసుకొనే శక్తినాలో పూర్తిగా తక్కువ కనుక అప్పుడప్పుడూ నన్ను నేను ప్రశ్నించుకుంటాను. "ఏది ముఖ్యమైనది ? ఏది అత్యంత అవశ్యకమైనది : ప్రకటించటమా, లేక అలా ప్రకటీకరణ చేసిన వారా ? ధ్రువపరచటమా లేక ధృవీకరించిన వారా ?" అని ప్రశ్నించుకునే వాడిని. వెంటనే నా హృదయం సహజంగానే దానిని ప్రకటించిన వారిని, దానిని ధృవీకరించిన వారేనని బదులు పలికేది. మరి యీ ఏకైకుడే అవతార్ మెహెర్‌బాబా - చురుకుగా పని చేసే అనంత చైతన్యము ఒక మానవ రూపాన్ని ధరించింది. ఆయన తన అనంతకృప వల్ల, తన రూపాన్ని మనల్ని మాటలకు అతీతులుగా తీసుకు వెళ్లేందుకు ఉపయోగించారు. ఒక సామాన్య వక్తిగా నా విషయంలో సహజంగా ఆయన ప్రకటనలు కొన్ని కలవర పెట్టి, ఆఖరికి గాఢంగా గందరగోళ పెట్టాయి. అయితే ఆయన చెప్పింది విశ్వసించి నమ్మే బహుమానము నన్ను ఈ సమాజంలో రక్తమాంసాదులచే తయారు చేయబడిన నన్ను ఇతరులు చేసే కుతంత్రాలు, మోహింప చేసే గూఢార్థాల నుండి ఉద్ధరించింది. బాబా నన్ను ప్రేమిస్తున్నారన్న భావము నా హృదయానికి నిజమైన బలాన్నిచ్చింది. అదే సమయంలో ఏక కాలంలో నాలో నేను గాఢంగా అనుకొనేదేమంటే, నాలోని తితీక్ష ఎప్పుడు నిష్కాపట్యంగా ఉంటుందో ఆధ్యాత్మిక అవుసరము అత్యవసరం అవుతుందో అప్పుడు బాబాయే నా పరిమిత భాషలో తన మాటల వెనుక ఉన్న రహశ్యాన్ని బహిర్గత పరుస్తారని విశ్వశించాను. దానివల్ల ఆయన వైపు నేను చేసే ప్రయాణము వేగవంత మవుతుందను కునేవాడిని.

# నిర్ణయం : పాచిక విశిరారు
# 1955 - 2వ భాగము

## జన్మదినోత్సవములు మరియు ఒక విరామ కాలము

ఫిబ్రవరి నెలంతా అర్ధ ఏకాంతంలో మెహెర్‌బాబా సతారాలో గడిపారు. ఆయన్ని కలిసేందుకు ఎవరినీ అనుమతించలేదు. ఆయన తన ప్రేమికులతో అన్ని బాహ్య సంబంధాల్ని తెగ త్రెంపులు చేసుకున్నారు. సెప్టెంబరు 30న జరిగిన సమావేశంలో తాను ఎలా నడుచుకుంటానని చెప్పారో అలాగే నడుచుకున్నారు. ఈ సమయంలో ఆయన విరామ కాలపు ఏకాంత జీవితాన్ని గడుపుతున్నా. అయితే ఈ జీవితం ఫిబ్రవరి 25న ఆయన జన్మదినోత్సవాన్ని వైభవంగా నిర్వహించేందుకు తన ప్రేమికులను ఏ విధంగానూ ఆటంక పరచలేదు.

అంతక్రితం రెండు సంవత్సరాలపాటు ఉత్తరప్రదేశ్‌లోనిహమిర్‌పూర్ జిల్లాలోను,ఆంధ్రప్రదేశ్‌లోను పర్యటించారు. ఈరెండు ప్రాంతాల్లో బాబా ప్రేమ జ్ఞాపకాలింకా మార్మోగుతున్నాయి. ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లోని అనేక పట్టణాల్లోను భారతదేశంలోని తక్కిన ప్రాంతాల్లోని ప్రముఖనగరాలైన, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసు, బిలాస్‌పూర్, నాశిక్, షోలాపూర్, తదితర ప్రాంతాల్లో కూడా ఈ ఉత్స వాలు జరిగాయి. సహజంగానే, ఈ ఉత్సవాలు ఊరికి, ఊరికి మధ్య మారుతూ జరిగాయి. కానీ చాలాచోట్ల ఒకే రకంగా జరిగాయి. ఈ శుభ సమయాన బాబా ప్రేమికులు పెందలకడనే లేచి, తమ తమ గ్రామ పట్టణ నగర వీధుల్లో నగర సంకీర్తన చేసుకుంటూ మెహెర్ బాబా పవిత్రనామాన్ని గానం చేశారు. పిమ్మట బాబా జీవిత సందేశాలపై ప్రసంగాలు, భజన సంకీర్తనలతో కార్యక్రమాలు నిర్వహించాయి. చాలచోట్ల, పేదలకు రోగులకు అన్నదానాలు నిర్వహించారు. బాబా సాహిత్యాన్ని బాబా ఫోటోలను పంచిపెట్టారు. ఈ ఉత్సవాలు బాబా ప్రేమికుల్ని సమన్వయపరిచి, తమ కాలాన్ని బాబాతో గడిపేందుకు, ఆయన కరుణ ప్రేమతో గడిపిన జీవితాన్ని కీర్తించేందుకు చక్కగా ఉపకరించాయి.

ఈలోగా బాబా జన్మదినోత్సవం ఫిబ్రవరి 11వ తేదీనాడే జోరాష్ట్రియన్ కాలెండరు ప్రకారం బాబా జన్మదినము కావటంవల్ల స్త్రీ మండలి సతారాలో క్లుప్తంగా పండుగలా చేసుకున్నారు. ప్రతివారు ప్రొద్దుటే నిద్రలేచి, సరిగ్గా అయిదు గంటలకు అవతార్ మెహెర్‌బాబాకిజై అని నినదించారు. ఏడు

టపాకాయలు కాల్చి గ్రామఫోనుపై "హాపీబర్తుడే" పాటను ఆలాపింపచేశారు. బాబా లేత గులాబీ రంగు కోటు, ఆకుపచ్చ, బంగారు రంగుల్లో తలపాగా, ధరించారు. వీటిని బాబా కోసం మెహెరా తయారు చేసింది. పూలతోగది అంతా స్త్రీ మండలి చక్కగా అలంకరించారు. ముంగిట నేలంతా రంగుల్లో ముగ్గులు సింగారించారు. మణి కమ్మని కేకును తయారు చేయగా నజా రవ్వ కేసరి వండింది. ఇది అంతా ఇష్టపడే తీపి వంటకం. ఆనాటి సాయంత్రం ఒక వినోదాత్మకనాటకాన్ని ప్రదర్శించారు. ప్రతి వారికి ఒక అద్భుత మైన సమయం చిక్కింది. ముఖ్యంగా బాబా తన కార్యక్రమంలో ఎదుర్కొంటున్న ప్రయాస నుండి కాస్తంత విశ్రాంతి ననుభవించి నట్లు కనిపించారు. వారికి యీ విధంగా హృదయ పూర్వకంగా సహజమార్గంలో బాబాకు తమ ప్రేమను వ్యక్తపరచే అవకాశం లభించింది.

ఫిబ్రవరి నెలాఖరులో ఆదీ బాల్ధావ్‌లేని కలిసి, చలన చిత్రపు పని ఎంతవరకు వచ్చిందోతెలుసుకొనుటకు పూనా వెళ్లాడు. అంతకు ముందు రోజున ఆదీ మరియు సరోష్‌లు బాబాను సతారాలో దర్శించారు. అయితే వారి సంభాషణ మధ్యలో అది పైకి స్వల్ప విషయంగా కనిపించినా, బాబా మాత్రం సరోష్‌కు వప్పగించిన పనిని అతడు చేస్తున్న తీరు గురించి తన సంతృప్తితో కూడిన బాధను వ్యక్తం చేశారు. దానిని గురించి వివరించేందుకు సరోష్ ఏ మాత్రం ప్రయత్నించలేదు. ఎందుకంటే, గతంలో ఒకానొక పనిగురించి అతను బాబాకు తెలిపినది యధార్థం కాదు, అని తనకు తెలుసు అందుకే అతను తనను సమర్థించు కొనేందుకు ప్రయత్నించలేదు. అతడు బాబా ముందు కిమ్మనకుండా కూర్చొని, బాబా వ్యాఖ్యానాల్ని దిగమింగాడు. ఈ విధంగా వినయంతో లొంగిపోయే లక్షణం బాబాను సంతోషపెట్టింది. తక్కిన మండలి వారంతా బాబా యొక్క గుణ గ్రహణ మెప్పును ప్రత్యక్షంగా చూచారు. కొద్ది తడవైన పిదప, సరోష్ తాను బాబాకు కోపం తెప్పించానన్న ఆలోచన వచ్చేసరికి దుఃఖాన్ని ఆపుకోలేక భోరున ఏడ్చేశాడు.

సరోష్‌ను గురించి తెలిసినవారంతా, ఆ దృశ్యాన్ని చూచి ఆశ్చర్యపోయారు. అతను చాలా బలిష్ఠుడు. మరియు గంభీరమైన నాయకత్వ లక్షణాలున్న వ్యక్తి. అతని ఎత్తైన ఆజాను బాహు శరీరము వల్ల అతను ఎక్కడ ఎంత మంది మధ్యలో నిలబడినా, కొట్టవచ్చినట్లు అతని శరీరం కనిపిస్తుంది. బాబా కోసం అతను నిర్భయంగా సర్వార్పణ గావించుకున్న అంకిత భావము చాలా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. బాబా పనిని చేయటంలో కడు సాహస వంతుడు. బాబాను సంతోషపెట్టడంలో అతడు ఎన్నడూ తన ధృఢ సంకల్పంలో సాహసించేందుకు

వెనుకంజవేయడు. అయినప్పటికీ, ఇప్పుడు అజాగ్రత్త వల్ల కొద్ది క్షణాలు బాబాకు కలిగించిన అసంతృప్తి అతన్ని చిన్నపిల్లాడిలా ఏడ్చేటట్లు చేసింది.

బాబా భౌతిక సముఖం, తీవ్రంగా ముంచివేస్తుంది. ఆలోచనలు, భావాలు వ్యక్తి చైతన్యంలో బాగా లోతుగా నాటుకుపోయి, ఒక్కోసారి పైకి తేబడతాయి. మండలికి ఇది బాధాకరమైన విధానమే అయినా, తమ హృదయాలు, మనస్సులు నేర్చిన దానిని మరవటం. మోసేభారాన్ని దించేందుకు ఇది వారికి ఒక చక్కని అవకాశాన్నిచ్చి బాబా దైవేచ్ఛకు పూర్తిగా అర్పణయ్యేందుకు దోహదపడుతుంది. బాబా ఇటువంటి సంఘటనలను తన ఆధ్యాత్మిక కార్యక్రమము కోసం, చైతన్యపు అంతర్ భూమికలలో ఉపయోగించేవారు.

పశ్చాత్తాపంతో పూర్తిగా నిండిపోయిన సరోష్‌ను చూచి, బాబా మూడ్ మారి పోయింది. ఆయన ఎంతో ప్రేమగా అతడిని అనునయించారు. అతని విధేయత బాబా ను ఎంతగా సంతోషపెట్టిందో వివరించారు. క్రమంగా ఆ సంభాషణ ఇతర విషయాలపై మరలింది. బాబాతో తమ పని గురించి వివరంగా చర్చింతర్వాత, ఆదీ, సరోష్‌లు ఆనందంగా సతారా నుండి బయలుదేరారు.

మార్చి నెలంతా బాబా అర్థ ఏకాంతవాసాన్ని కొనసాగించారు. ఈ కాలము పైకి ఏమీ కనిపించని బాహ్య డ్రామా అయినప్పటికీ, అంతర్గతంగా ఇది బాబాతో ఉండే వారికి సంబంధించింది కాదు. బాబా తన శిష్యులు విసుగుతో చికాకుపడుటకు ఇష్టపడేవారుకాదు. ఆయన తన వద్ద ఉండేవారు ఉత్తేజంతో సర్వదా ఉల్లాసంగా ఉండాలని అభిలషించేవారు. అలా చేస్తే బహుశః అది వారు ఆయన ఇచ్ఛకు అంకితమయ్యారన్న సూచన కావచ్చును. బాబాకు అత్యంత సన్నిహితంగా భౌతిక సామీప్యంలో ఉన్నందువల్ల, ఆయా వ్యక్తుల విషయంలో ఎడతెగని సర్దుబాట్లు తప్పనిసరిగా కావాల్సివస్తుంది. వారికి తగిన తర్ఫీదు ఇవ్వటంలో బాబా పాటించే ప్రధాన విధానాల్లో ఇది ఒకటి. ఇప్పుడు చిన్న చిన్న తప్పులు, బలహీనతలు సాధారణంగా పట్టించుకోకుండా వదిలేయటం లేదా తేలిగ్గా బాబా చేసే మామూలు కార్యక్రమాల గందరగోళపు కదిలింపులోఅణిచి వేయుటకు వీలయ్యే వన్నీ అతి సన్నిహితంగా ఉండేవారితో అధికంగా ప్రకటితమవుతాయి. వారు అధిక సమయం ఇంటికే పరిమితమై, రోజులో ఒక నిర్ణీత సమయానికి మాత్రమే ఇల్లు వదిలి బయటకు వెళ్లెందుకు అనుమతించబడతారు. అది కేవలం వ్యాయామం కొరకు కొంత దూరం నడచి వెళ్లెందుకే వీలవుతుంది.



18.

బాబా సమక్షంలో ఒకసారి సరదాగా మాట్లాడుకుంటున్నప్పుడు, ఫలానా మండలి సభ్యుడు బాబా ఆదేశాన్ని జవదాటాడన్న విషయం చర్చకు వచ్చింది. అయినా బాబా ఏమీ అనలేదు. కానీ ఇతరులు దీనిపై చేసిన వ్యాఖ్యాలు అసక్తిని ఎక్కువ గాయపరిచేసరికి అతను కుంగిపోయి కొన్ని రోజులు పాటు వ్యథాపూరిత మనస్కుడై ఉండి పోయాడు. దీనిని గమనించిన బాబా ఈ మండలి సభ్యుడు తన శక్తుల్ని తిరిగి కూడకట్టుకొనుటకు తన సన్నిహిత సముఖం నుండి కొన్నాళ్లు దూరంగా ఉంటే బాగుంటుందని సలహా చెప్పారు. ఆ వ్యక్తితో మరొకరెవరైనా కలసివెళ్లమని బాబా కోరారు. సరిగ్గా అదే సమయానికి ఎరుచ్ కూడా కొంత విరామం దొరికితే బాంగుండునని భావిస్తున్నాడు. చాలా ఏళ్ల నుండి ఎరుచ్ బాబా వద్ద ఉంటూ క్షణం తీరిక లేకుండా ఆయన సేవలో గడుపుతున్నందున కనీసం ఒక్కరోజన్నా విరామం దొరికితే మండలికి బాబాకు దూరంగా ఉండవచ్చని తలపోశాడు. కనుక అతను తన సంసిద్ధతను తక్షణం వ్యక్తం చేశాడు. దీనిని బట్టి అతడు బాబా యొక్కవ్యక్తిగత శ్రద్ధలో పూర్తిగా మునిగిపోయినందున, కొంత కాలముపాటు ఆయన పిలుపుకు దూరంగా ఉండాలన్న తపన చరమస్థాయి దశకు చేరినట్లు కనిపించింది. వెంటనే బాబా సరేనని అంగీకరించారు.

వీరిద్దరూ కలిసి సతారాకు ముప్పై అయిదు మైళ్లదూరంలో ఉన్న మహబలేశ్వరం బస్సుపై వెళదామనుకున్నారు. తీరా బస్సు స్టాండుకు వెళ్లేసరికి, అక్కడ టిక్కెట్టు కౌంటరులోని టికెట్టు గుమాస్తా "అదేమిటండి. మీరు వెళ్ళిపోతున్నారా ? అంటే మెహెర్ బాబా కూడా మహాబలేశ్వర్ వెళుతున్నారా ? ఏమిటి ?" అని ఆశ్చర్యంగా అడిగాడు. అతనితో ఎరుచ్ బదులిస్తూ, "అదేం లేదు. మేమిద్దరం కేవలం అలా వాహ్యాళిగా బయలుదేరాం" అన్నాడు. బస్సు ఎక్కిన తర్వాత, మళ్లీ ఇదే దృశ్యం ప్రత్యక్షమైంది. తోటి ప్రయాణీకులు ఎరుచ్‌ని మెహెర్ బాబా గురించి ప్రశ్నించసాగారు. అయితే సతారా ఒక చిన్న పట్టణమైనందున అక్కడున్న ప్రతివారూ బాబాను గురించి ఎరుగుదురు. అందువల్ల సహజంగా వారు ఎరుచ్‌ని కూడా ఎరుగుదురు.

మహాబలేశ్వర్‌లో ఎరుచ్ ఆయన మిత్రుడు ఇరువురు కలిసి ఒక అతిథి గృహంలో ఉండాలనుకున్నారు. అయితే బస్సులో జరిగిన ఈ అనుభవంవల్ల ఎరుచ్ తామిరువురూ కలిసి అందరితో పాటు కూర్చొని భోజనం చేస్తే ప్రశాంత సమయం దొరకదని గుర్తించారు. అందువల్ల, ఆయనతోపాటున్న మరో మండలి సభ్యునికి, తనకు తాము ఉండే గదిలోకే భోజనం పంపమంటే అక్కడ ఏకాంతత లభిస్తుందనుకున్నాడు. కానీ ఆ గెస్టుహౌస్ యజమాని బాబాను ఎరిగి ఉన్నందువల్ల, బాబా యందాయనకు అమిత భక్తి ఉన్నందున, మళ్ళీ

సమశ్య ఎదురైంది. అతను బాబా గురించిన కడపటి సమాచారాన్నంతా తెలుసుకోదలచినందున, వారు భోజనం చేస్తున్న సమయంలో వారి పక్కనే ఆయజమాని మాట్లాడుతూ కూర్చున్నాడు.

ఆ మర్నాడు ఇక్కడ ఉంటే ఏకాంతం చిక్కదని భోజనం కట్టించుకొని దూరంగా అడవుల్లోకి ఒక పిక్నిక్కులాగా వెళ్లేందుకు నిర్ణయించుకున్నారు. వారు తమకనువైన చక్కని చోటు దొరికే వరకూ రోడ్డువెంట చాలా దూరం నడిచారు. బారులు తీరిన చెట్లతో చూడముచ్చట గొలుపుతున్న ఆ పర్వత సానువుల పరిసర ప్రాంతపు అందమైన సుందర దృశ్యాన్ని చూచి ఆనందిస్తూ ఒక చోట కూర్చోబోయారు. అంతలోనే వాళ్లను ఆశ్చర్యపరుస్తూ ఒక చిన్నకారు అల్లంత దూరంలో రోడ్డుమీద వచ్చి ఆగింది. దానిలోనించి కొందరువ్యక్తులు దిగుతూ, వాళ్లని ఆగమంటూ పిలిచారు. వాళ్లకు మెహెర్ బాబా తెలుసు. వారిలో ఒకరు ఎరుచ్‌ని గుర్తించాడు కూడా

"ఏమిటి ? మెహెర్ బాబా మహాబలేశ్వర్‌లో ఉన్నారా ? మేమాయనను కలుసుకోవచ్చునా" అని వారడుగుతుంటే ఎరుచ్ వినిపించుకోనట్లు నటించాడు. అయితే ఆ వ్యక్తులు వదిలి పెట్టకుండా వీరున్నవైపు నడుస్తూ రాసాగారు. దీనితో ఎరుచ్, వారికి బదులు చెప్పడం తప్పని సరి అని గుర్తించాడు. గత్యంతరం లేక, బాబా తమతో ఇక్కడలేరని, తాముకేవలం ఒక ప్రశాంత ఆటవిడుపు గడిపేందుకు మాత్రమే వచ్చామనిచెప్పాడు. బాబా గురించిన కచ్చితమైన సరికొత్త సమాచారాన్ని సేకరించేందుకు వారు వదిలిపెట్టకుండా ఎరుచ్‌ని నిలదీసే ప్రయత్నం చేశారు. అందువల్ల ఎరుచ్ చాలా కటువుగా, వారి ప్రశ్నలన్నిటికీ క్లుప్తమైన జవాబులు చెప్పాడు. చివరకు వాళ్లు వెళ్లిపోయారు. ఎరుచ్ తన మిత్రుడివైపుచూస్తూ, ప్రస్తుతం అలుముకున్న పరిస్థితులను బట్టి తాము సతారాకు తిరిగి వెళ్లి పోవటమే మంచిదని సలహా చెప్పాడు. బాబా తాము ఎక్కడకు వెళితే అక్కడకు తమతో పాటే అనుసరిస్తున్నారని వారికి అర్థమైంది. ఆయన్నుంచి తప్పించుకొనే అవకాశం లేదనిపించింది. అందువల్ల భోజనాలయ్యాక వారు, బాబా లేకుండా విశ్రాంతి తీసుకొనే ఆశను వదులకొని మహాబలేశ్వరు నుంచి వెనుకకు మరలారు.

## మాయలోనికి సత్యావతరణ

మహాబలేశ్వర్ నుంచి ఎరుచ్ రోజ్‌వుడ్‌కు తిరిగి వచ్చిన కొద్దిసేపటికి కుల్దాబాదుకు మరలవెళ్ళి మూడు వారాలపాటు ఏకాంత వాసములో గడపాలన్న తన అభిలాషను బాబా వ్యక్తపరచారు. మార్చి 21వ తేదీన ఎరుచ్ నడుపుతున్న కారులో మరో ముగ్గురు మండలి సభ్యులతో కలిసి కుల్దాబాదు బయలు

దేరారు. వారు అహమ్మదు నగరులో ఆగలేదు. ధృవీకరణ పేరుతో వెలువడిన జీవిత సర్క్యులరులో తన ప్రకటీకరణకు సంబంధించిన సవరణయొక్క ప్రయోజనాల్ని గురించి బాబా ప్రస్తావిస్తూ అవి కాల క్రమంలో గాని లేదా భవిష్యత్తులో సంభవించే సంఘటనల తీవ్రతలో కాని ప్రస్ఫుటమవుతాయన్నారు. కుల్దాబాదుకు బయలు దేరబోయే ముందు ఆయన తన శిష్యులకు తానిప్పుడు యీ ఏకాంత వాస సమయంలో నిర్వహించేపని, భవిష్యత్తులో జరుగవలసిన సంఘటనల మార్గాన్ని నిర్ణయిస్తుందన్న సూచనను అందించారు. ఒక వారం పైగా గడిపాక, తన కార్యక్రమం పరిసమాప్తమైనదని బాబా తెలియపరిచారు. మార్చి 28వ తేదీన, ఆయన ఆయనమండలి మరల సతారాకు తిరిగివచ్చారు.

ఏప్రియల్ 2వ వారంలో ప్రకటీకరణ యొక్క అత్యున్నత స్థానానికి చెందిన భాగంగా అవతారుడు లేదా సద్గురువులు గడిపే జీవితం గురించిన కొన్ని ప్రాథమికమైన ఆధ్యాత్మిక సత్యాల్ని బాబా తెలియపరచారు. ఈ వివరణకు "నిర్ణయం" అని పేరు పెట్టారు. దీనిని అచ్చు వేయించి, భారతదేశంలోను, ఇతరదేశాల్లోను ఉన్న మెహెర్ బాబా ప్రేమికులందరికి పోస్టు చేయమని ఆదీకి చెప్పారు. దీనిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

ఈ జగత్తంతా భగవంతుడి నుంచి ఉద్భవించింది. భగవంతుడు జగత్తు నుండి రాలేదు. మాయ సత్యము నుండి బయల్వెడలింది. సత్యము మాయ నుంచి బయటపడలేదు. భగవంతుడు మాత్రమే సత్యము, జగత్తు దానికదే మిధ్య.

మాయలో అవతారుడిగా, సద్గురువులుగా జీవించబడే దివ్య జీవితం మాయాపూరితమైనది కాదు. అయితే ఈ సృష్టిలో జీవ నిర్జీవాలుగా జీవించబడే దైవజీవనం, సత్యము మరియు మాయాన్వితమూ రెండూ అవుతోంది. మాయ, మాయాన్విత జీవనము మరియు మాయలో దైవజీవనము ఈ మూడు ఒకటి కాదు, కాబోదు. మాయకు జీవము లేదు, జీవము ఉండే అవకాశంలేదు. మాయ మాయే. దాని కది శూన్యము. మాయాపూరిత జీవితము అంటే అర్థం, మాయలో జీవితం. మాయతో మాయవల్ల ఆవరించబడి ఉండటం. మరి సృష్టిలో ఒక ఆత్మ అనుభవించే జీవితము అనగా అది మాయాపూరిత జీవితమన్నమాట. అయితే మాయలో జీవించే దైవజీవనము మాయాపూరితం కాదు. ఎందుకంటే, మాయాన్విత జీవితాన్ని గడుపుతున్నప్పటికీ, భగవంతుడు తన స్వీయ సత్యము యొక్క చైతన్యాన్ని నిలుపుకొని ఉంటాడు.

భగవంతుడు ఎటువంటి మినహాయింపులులేని సర్వస్వతంత్రుడు. ఈ

సకల జగత్తు భగవంతునిపై పూర్తిగా ఆధారపడిఉన్నది. అయినప్పటికీ, సద్గురువులు ఈ పుడమిపైకి అవతారుడిగా దైవాన్ని అవతరింప చేసినప్పుడు వారు సత్యమును మాయను పరస్పరం అన్యోన్యాశ్రయమయ్యేట్లు చేస్తారు. మరి ఈ విధంగా ఆయన అనంత కరుణ మరియు అవధులు లేని అపార ప్రేమ మాయలో మునిగిపోయిన వారివల్ల ఈ అన్యోన్య సమన్వయం శాశ్వతంగా ఆకర్షింపడుతోంది.

భగవంతుడికి జగత్తుకు మధ్య అనంత కరుణ మరియు అవధులు లేని ఆపార ప్రేమ ఒక ప్రముఖమైన బంధంగా పనిచేసి, సద్గురువులు లేక కుతుబ్‌లుగా మారిన వారివల్ల మానవుడిగా అవతరించిన భగవంతుని వల్ల (అవతారుడు, క్రీస్తులేకరసూల్) అనాదిగా ఉపయోగించబడుతోంది. అందువల్ల ఈ జగత్తు భగవంతునికి ఒక శాశ్వత చెలికానిగా మారుతోంది. ఈ ప్రాముఖ్యతగల బంధం ద్వారా అవతారుడు తన దైవ క్రీడలో జీవాన్ని ప్రతిష్టించడము మాత్రమేకాకుండా, మాయలో చట్టాన్ని కూడా ప్రతిష్టిస్తాడు. మరియీ చట్టము దైవీ మానవుడు లేదా అవతారుడిచే ప్రతిష్టించబడుట వల్ల ఇది చట్టానికతీతమైన అనంతత్వానికే చట్టమవుతోంది. మరి అది ఒకే సమయంలో శాశ్వత సత్యముగాను భ్రమాన్వితమైన మాయగాను అవుతోంది. ఈ చట్టమే, జగత్తంతటిని నడిపిస్తూ దాని నిర్మాణము, మరియు నిర్మూలన మనే ఎగుడు దిగుడులన్నీ యీ చట్టము వల్లే నడిపించబడుతున్నాయి.

ఆ యుగంలో దైవము యొక్క సర్వ స్వతంత్ర సంపూర్ణాధికారము దైవీ మానవుని వల్ల దైవేచ్ఛగా ఆ చట్టముపై పని చేయవలసి వున్నది. అంటే దాని భావం, అవతారుడు ఏం చేయాలనుకున్నా అది దైవంచే నిర్దేశించ బడుతుందన్నమాట. దాని ఫలితంగానే, ఇంతకుముందు నేను ప్రకటించిన నా అంతిమ ప్రకటన, విశదీకరణలలో ప్రస్తావించిన వివరాలన్నీ దైవంచే నిర్దేశించ బడినవి. అవి తప్పక జరిగి తీరతాయి.

మార్చి 22నుంచి నేను దాదాపు ఒక వారంరోజుల పాటు కుల్దాబాదులో ఉన్నాను. అక్కడ రాత్రిం పగళ్లు, నేను నా కార్యక్రమాన్ని చాలా తీవ్రంగా చేశాను. నా ఆధ్యాత్మిక కార్యక్రమము యొక్క తీవ్రత, నా భౌతిక శరీరంపైన మనస్సుపైన అధిక భారాన్ని కలిగించింది. నేను నా అంతిమ ప్రకటనలో ప్రకటించినవన్నీ కచ్చితంగా అందులో పొందుపరచిన క్రమంలో అదే తీవ్రతర ప్రయోజనంతో జరిగి తీరాలని, అయితే కాలము విషయంలో సవరణ ఉండవచ్చునని నిశ్చయించుకున్నాను. అందువల్ల కాల పరిమితిలో కొంత మార్పుతో ఆ సంఘటనల గొలుసు తీవ్రత, అవకాశము, ఆకారము, పరిమాణములు నిర్ణీత ప్రణాళికను అమలు పరచుటకు ఎటువంటి మినహాయింపులకు ఆస్కారము ఇవ్వకుండా జరిగితీరును.

ఈలోగా మానవాళి, ఇది నా అంతిమ నిశ్చయం ప్రకారం జరుగనున్నందున, దైవ నిర్ణయం ప్రకారం జరుగబోయే దానికంతటికీ సాక్షీభూతులు కావాలి.

ఇప్పుడు మానవుడు దైవాన్ని అధికాధికముగా ప్రేమించి తీరాల్సిన సమయ మాసన్నమైంది. అతడిని దైవం కొరకు బ్రతకనివ్వండి. దైవం కొరకే మరణించ నివ్వండి. అతని అన్ని ఆలోచనల్లో, అన్ని మాటల్లో, అతని అన్ని చేతల్లో భగవంతుడ్ని ప్రేమించాలన్న తపన మాత్రమే ఉండాలి !

ఈ పై సందేశం నాకు మాత్రం, ఇది ఒక రకమైన ఒడంబడికగా అనిపించింది. కాలక్రమంలో తాను అవతరించటం ద్వారా మాయను భరించే దైవీ మానవుడికి అంకిత మివ్వబడిన చిన్న భగవద్వచనము లాగా కనిపించింది. ఈ ప్రకటన యొక్క భావం గట్టిగా అదిమి పెట్టటం వల్ల దాని అసలు అర్థాన్ని రమారమిగా అవగాహన చేసుకోవటం అసాధ్యమే కాక, తెలివి తేటలతో దానిని అనుసరించటం మరింత కష్టం. అయినా నేను దాని నుండి సేకరించిన దానిని గురించి ఇక్కడ మీతో చెప్పి పంచుకోవాలని పురికొల్పబడ్డాను.

భగవంతుడిగా భగవంతుడు మాత్రమే సత్యము. మరి ఆయనది అంతం లేని అపార సత్య జీవితము. భగవంతుడి నుండి కనిపించే ఛాయగా వ్యక్తమయ్యే మాయ పూర్తిగా అసత్యము మరియు భ్రాంతి జనకము. మాయ అనేది సంస్కృత పదము. దీని శబ్ద లక్షణము దాని అర్థము యొక్కలోతును అతి సూక్ష్మతను ఒకటిగా చేయుటను సూచిస్తుంది. సంస్కృతంలో "మా" అంటే "కానిది" అని అర్థం. "య" అంటే "ఏది" అని అర్థం. అందువల్ల భారతీయ సద్గురువు ఒకరు తన వ్యాఖ్యానాల్లో, ఈ మాయకు 'కానిది ఏదో అది మాయ' అని వివరించారు. దీని భావము నిజంగా ఉండనిది ఏదో అది మాయ అన్నమాట. మెహెర్ బాబా మాయను, అజ్ఞానపు మూలము లేక మూలకారణముగా అభివర్ణించారు. ఈ అజ్ఞానమే, మాయను యధార్థంగా కనిపించేట్లు చేస్తుంది.

ఈ సకల సృష్టి మాయ నుండి పుట్టింది. సర్వ సంపూర్ణ సత్యమునందు దానికి స్థానము లేదు. ఈ భావంలో, సృష్టిలోని ప్రతి ఆత్మ యొక్క జీవితం అసత్యము మరియు భ్రాంతి జనకము. ఈ సృష్టిలోని జీవితమందు యధార్థము మరియు మాయ" యొక్క సూక్ష్మ వ్యత్యాసమును సత్యముతో భేద నిరూపణను చేస్తూ డా॥ హారీకెన్‌మూర్‌కు బాబా ఒకసారి బాబా తన పొందికైన ఒక చిన్న ప్రకటనలో ఇలా వివరించారు. "మాయలోని సర్వమూ ఒక వాస్తవము కానీ అందులోనిదేదీ నిజం కాదు".

మాయలోని సృష్టి యొక్క అవసరం ఏమంటే, ప్రతి ఆత్మ భగవంతునితో దాని సమైక్యతను తప్పని సరిగా గుర్తించాలి. భగవంతుడు మానవ రూపంలో

అవతరించటం ద్వారా మాత్రమే ఇది సాధ్యపడేట్లు చేయబడింది. భగవంతుడు, ఆ పురాణ పురుషుడు మాయ మధ్యలోకి దిగిరాగానే, ఆయన అవతారుడిగా ఈ సృష్టిలో దైవకార్యక్రమపు చురుకైన కేంద్ర బిందువుగా మారుతాడు. భగవంతుని సత్యత్వం యధార్థ జీవితపు మాయ మధ్య ప్రతిష్టతమవుతుంది. అవతారుడి ద్వారా భగవంతుడు అంతా తన చెంతకు రండన్న ఒక పిలుపును అందిస్తాడు. ఈ విధంగా లెక్కలేనన్ని మాయాత్మలు అవతారుడి యధార్థ జీవితపు ప్రయోజనాన్ని పొందటం వల్ల అసత్యమైన దానిని దేనిని పట్టుకున్నా వారిని కుదిపివేస్తుంది. ఒకసారి బాబా తన దివ్యాధికారముతో తనకు ప్రీతి పాత్రుడైన ఒకరితో ఇలా సూచించారు. "అది సంభవించే మాదిరి ఏదీ జరుగదు. ఎందుకంటే, నేను మాత్రమే యధార్థమైన ఏకైక తేజస్సును" అందువల్ల సృష్టిలో జరిగే అన్ని సంఘటనలు, జరిగినట్లు కనిపించినా అవన్నీ మాయలో కనిపించే ఛాయలు మాత్రమే తప్పమరేమీ కావు.

భగవంతుడే ప్రేమ. భగవంతుడికి, మాయకు మధ్య బంధము యీ ప్రేమే. భగవంతుడు తన అపార దయవల్ల కాలానుగుణ్యంగా అరుదెంచి ఈ సృష్టిలో మానవుడిగా జీవిస్తాడు. ఆయన్ని గుర్తుంచుకొని ఆయన్ని పూజించుట మరియు, ఆయన్ని ప్రేమించుట వల్ల ఆత్మకు అంటుకున్న అసత్యం తుడిచి వేయబడుతుంది. ఈ విధంగా అవతారుని అవతరణ సృష్టిలోని ప్రతి ఆత్మ యొక్క జీవితమును వేగ వంతం చేస్తుంది. ఆ అవతారుడ్ని మానవ రూపంలో భగవంతుడిగా అంగీకరించిన ఆత్మలు ఆయన ప్రేమను సూటిగా గ్రహిస్తే ఇతరులు మాత్రం పరోక్షంగా సంగ్రహించును.

అవతారుని అవతరణ సమయంలో, జగత్తు యొక్క చట్టము, ఆయనలో మూర్తీ భవించిన ఆకారంగా రూపుదిద్దుకొని, ఆయన ద్వారా దైవేచ్ఛగా ప్రేరేపిత మవుతుంది. కనుక ఈ యుగంలో అవతార్ మెహెర్ బాబా ఏం చెప్పినా, ఏం చేసిన అదంతా ఈ సృష్టిలో దైవేచ్ఛ యొక్క స్పష్టమైన ప్రత్యక్షీకరణ అవుతుంది. ఆత్మలన్నిటి పురోగమించే జీవనము, అవి భగవంతుని వైపు కదులుతుంటే, సత్యము (ప్రతి ఆత్మలో ఉండే కేంద్రము) ఈ చట్టము వల్ల నడిపించబడుతుంది. అంతేకాకుండా ఆయన సముఖం వల్ల అది పునఃప్రారంభం చేయబడుతుంది.

1956లో మెహెర్ బాబా అమెరికా సందర్శించిన సమయంలో ఆయన అందించిన ఒక సందేశంలో భగవంతుడు, అవతారుడిగా శాశ్వత సద్గురువుగా మాయలో జరిగే దైవావతరణ యొక్క అందాన్ని అర్థాన్ని ఆయన బహు చక్కగా వివరించారు.

ఒక సద్గురువు లేదా అవతారుని చర్య, మళ్లీ మళ్లీ జరిగే పునఃచర్య కాదు.

అది పూర్తిగా నవీనమైన ఒక సృష్టి. సత్యము అసత్యములోనికి దిగివచ్చే అవతరణ. ఒక సద్గురువు (లేదా అవతారుడు) యొక్క ముక్తిని కలిగించే చర్య కఠినంగా నిర్ధారణ చేయబడిన కారణ రీత్యా తప్ప మరేదీ కాని వాటి మధ్య ఈ శాశ్వతత్వము ఒక మెరుపు లాంటిది. ఇది సద్గురువు (లేక అవతారుడు) వల్ల అనుగ్రహించబడే దైవకృప యొక్క రహశ్యం.

## హోమీని తన సన్నిధికి బాబా రమ్మనుట

మెహెర్‌బాబా 1954 సెప్టెంబరులో జరిగిన పెద్ద, అతిముఖ్యమైన మెహెరాబాదు సమావేశంలో 1955 ఏప్రియల్ నాటికి, తాను తన పాంచభౌతిక శరీరాన్ని పరిత్యజించే అవకాశమున్నదని తెలియపరచారు. ఆయన ప్రేమికుల మధ్య అనూహ్యంగా బహిర్గత పరచబడిన యీ రహశ్యంపై గాఢంగా వ్యాకుల పడిన సందర్భంగా బాబా "అంతరిక బంధాల" గురించిన ప్రత్యేక సందేశాన్ని ఒక దానినందించారు. దానిలో ఆయన, తన భౌతిక సముఖము తనకు సన్నిహితంగా ఉన్నవారికి తన ప్రేమలో పెరిగేందుకు ఎంత మాత్రంన అవసరంలేదు అని పేర్కొన్నారు. హమీర్‌పూర్ ప్రజలు, తమకున్న ప్రేమ విశ్వాసపు తీవ్రతలో తమ ప్రియతమ ప్రభువు యొక్క జ్ఞాపకంలో గాఢంగా ఆయన ఇంకా తమ మధ్య ఉండగానే పూర్తిగా మునిగిపోయారు. తమ తపనలో వారు ఒక పథకం గురించి చర్చించి బాబా నామాన్ని 1955 ఏప్రియల్ వరకు విడవకుండా రోజూ 24 గంటలూ స్మరణ చేయాలని నిర్ణయం చేశారు.

ధృడమైన బాబా ప్రేమికులలో ఒకరు మరియు జిల్లా గ్రూపుకు నాయకుడైన కేశవ నారాయణ నిగమ్ తన పథకాన్ని వివరిస్తూ బాబా దానిని ఆమోదించేట్లు చూడమని జాబు వ్రాశాడు. ఇది 1954 సంవత్సరాంతానికి సంబంధించింది. ఆ ఉత్తరంలో విషయాల్ని ఆదీ బాబాకు చదివి వినిపించాడు. బాబా ఆ పథకానికి మెచ్చుకున్నారు. అయితే తన నామానికి బదులు తమకు ఇష్టమైన దైవనామాన్ని స్మరించమని ఆయన అభిళాషించారు. (ఏమతంలో పుట్టినవారు ఆ మతమునకు చెందిన దైవనామాన్ని) ఆదీ ద్వారా ఈ వివరణ వారికి తెలియపరచబడింది. అవిచ్ఛన్నంగా నామ జపాన్ని ఎడతెగకుండా కొనసాగించుటకు బాబా బలపరచినందుకు హమీర్‌పూర్ ప్రజల ఆనందానికి అవధులు లేక పోయాయి. ఒక కార్యక్రమ నిర్వహణా పట్టికను తయారు చేసుకొని జిల్లాలోని అన్ని బాబా సెంటర్లవారు, రోజంతా ప్రతి నిమిషం విడవకుండా నామ జపం జరిపేందుకు సమయాన్ని కేటాయించారు.

ఫిబ్రవరిలో జరిగే బాబా జన్మదిన రోజుకు హమీర్‌పూర్‌లో జరుగుతున్న నామ జపవార్త బాబా పత్రికల ద్వారా ఇండియాలోని అనేక ప్రాంతాలకు పాకింది. మధ్యప్రదేశ్ తదితర కొన్ని రాష్ట్రాల్లో బాబా ప్రేమికులు ఆసక్తిగా నామజపాన్ని చేపట్టారు. ఆ తర్వాత బాబా ఏప్రియల్ 30 అర్ధరాత్రికి ఈ నామజపాన్ని ఆపమని దేశం అన్ని ప్రాంతాలలో ఉన్న బాబా ప్రేమికులందరినీ కొరారు.

కరాచీలో ఈనామజప సమయంలో ఒక బాధాకరమైన సంఘటన జరిగింది. జీవితంలో ప్రతివారూ తమ నిగ్రహానికి అతీతముగా నడుచుకో వలసిన పరిస్థితులు ఎదురయ్యే సమయాల్ని గడపాల్సివస్తుంది. అవి అత్యంత హింసకు బాధకు గురిచేయవచ్చును. అనుకోని ఉపద్రవం ముంచుకు రావచ్చును. లేదా ఆత్మీయులొకరు మరణించ వచ్చును. ఒకసారి మెహెర్ బాబా ఇలా వివరించారు "ప్రజలు తామనుభవించే భౌతిక మానశిక బాధల్ని భగవంతుడు ఇచ్చే బహుమానాలుగా పరిగణించాలి..... సరైన మూలకారణంతో వాటిని అవగాహనతో అనుగ్రహంగా అంగీకరించినప్పుడు, అది ఆ ఆత్మను పరిశుద్ధ పరచి సత్యము యొక్క శాశ్వత ఆనందమునకు పరిచయం చేయును".

ఈ ఉత్సాహ కార్యక్రమం ఇండియాలో వైభవంగా కొనసాగుతుండగా మండలి సభ్యుడొకరు బాబా ఆ దేశాలపై కరాచీలో ఉన్న మినూఖరాస్‌కు ఒక జాబు వ్రాస్తూ వీలైతే అక్కడ కూడా ఇటువంటి దైవ నామ జపాన్ని ఏర్పాటు చేయమని తెలియపరిచాడు. జూలై నెలాఖరు వరకు అది కొనసాగించబడ వలసి ఉన్నది. ఈ రకమైన సమయ పొడిగింపు బహుశః సతారాలో మే నెల నుండి జూలై వరకు రోజ్‌ఉడ్‌కు చేరువలోని ఒక బంగళాలో ఏకాంత వాసము గడుపుటకు నిర్దేశించిన బాబా పథకానికి సంబంధించి ఉండవచ్చునని నేను అనుకుంటాను. నేను సేకరించిన దాని ప్రకారం దీని వెనక ఉన్న చిన్న వివరణ ఏమంటే, ఇండియా పాకిస్తాన్‌లోని బాబా ప్రేమికులు ఎంతో ఉత్సాహంతో దైవ నామ జపస్మరణను బాబా అంతిమ ప్రకటన అనంతరం చేపట్టారని తెలిసింది. అని వివరించారు. మరో సందర్భంలో తన ప్రేమిక బృందం వారికి ఇలా సందేశము నిచ్చారు. "నేను ఏమి చెపితే అది తప్పనిసరిగా జరిగితీరు తుంది. నా మాటలు ఎప్పటికీ వృధా కావు" అని చెప్పారు. నేను వివరించపోయే ఈ సంఘటన, యాధృచ్ఛికంగా చేసిన బాబా వ్యాఖ్య ఎలా జరిగిపోయిందో సూచిస్తుంది. అయితే అది ఆయనదైన స్వంత మార్గంలో, తనదైన కాలములో సంభవించింది. కరాచీ వాస్తవ్యురాలు రోడా, దుబాష్ వచ్చి బాబాను 1954 ఆగష్టులో సతారాలో కలిసింది. బాబా ఆమె కుటుంబం గురించిన క్షేమ

సమాచారాలను ఆరాతీసి, "నేను నీ కొడుకులలో ఒకడ్ని నాకిమ్మని అడిగితే వాడిని నీవు నీ ఇష్టపూర్వకంగా సమర్పిస్తావా ?" అని అడిగారు. అందుకు రోడా మహదానందపడింది. బాబా తన కుమారులలో ఒకరిని అడుగుటలో దాని వెనుక వున్న భావము వాడు పెరిగి పెద్దయ్యాక తన మండలిలో ఒకడిగా తనతో ఉంచుకొనుటకే అడిగారని అనుకున్నది. ఆ మరుక్షణంలోనే అప్రయత్నంగా "అవును బాబా ! తప్పకుండా ఇస్తాను" అన్నది.

1955 ఫిబ్రవరి లేదా మార్చి నెలలో బాబా వాంఛించిన విధంగా కరాచీలోని ఆయన ప్రేమికులు దైవం పేరు మీద 24 గంటల నామ జప కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఈ నామజపమునకై నిర్ణీత కాల వ్యవధి పట్టికను తయారు చేసుకొని వంతులవారీగా భిన్న గృహాల్లో కొనసాగుతోంది. రోడా యొక్క భర్త ఆదీ వంతు సాయంత్రం 4-30 నుండి 5-00 వరకు నిర్దేశించబడింది. ఆ తదుపరి అర్ధగంట ఆమె చేయాల్సి ఉన్నది. కరాచీలో ఈ నామ జపం జరుగుతున్నప్పుడు అనూహ్యంగా ఒక విషాదాంత సంఘటన జరిగింది. 1955 ఏప్రియల్ 16న ఇది సంభవించింది. షుమారు సాయంత్రం 3-00ల సమయంలో ఆదీ రోడాల 4 1/2 ఏళ్ళ చిన్న కుమారుడు హోమీ వారింటి రెండవ అంతస్థు కిటికీ నుండి జారి క్రిందపడ్డాడు. తక్షణం అతడ్ని హాస్పటలులో చేర్చారు. కానీ ఒక అరగంట సమయంలో ఆ పిల్లవాడు తుది శ్వాస విడిచాడు.

ఆ పిల్లవాడు చనిపోయాడని డాక్టరు ఉచ్ఛరించిన క్షణంలో రోడా మనస్సుకు బాబా మాటలు గుర్తుకు వచ్చాయి. "నేను నీ కుమారుడ్ని ఇవ్వమని అడిగితే...." బాబా యొక్క ఈ మాటలకు అర్థాన్ని ఆమె ఇప్పుడు అర్థం చేసుకున్నది. ఆ తర్వాత ఆమె ఒకసారిలా చెప్పింది. "హోమీ యొక్క మరణవార్తను డాక్టరు చెప్పిన తరువాత నేను పూర్తిగా మ్రాన్పడి పోయాను. లేకపోతే బాబాకు సంబంధించినంత వరకూ నేను నా సమతూకాన్ని కోల్పోయి ఉండేదాన్ని" అన్నది. హాస్పిటలు నుండి ఆదీ, రోడాలు ఇంటికి తిరిగి వచ్చే సరికి, నాలుగు గంటలు కావస్తోంది. హోమీ మరణ వార్త వ్యాపించి, వాళ్ళచుట్టాలు, స్నేహితులు వారింటికి వచ్చిపడుతున్నారు. దాదాపు 4-30ల సమయం కావచ్చింది. బాబా వాంఛితం ప్రకారం మేడమీద ఉన్న చిన్న బాబా గదిలో తన వంతు అర్థగంట తాను జపం పూర్తి చేసి వచ్చేవరకు హోమీ శరీరానికి ఎవరూ ఏ పరిచర్యలను చేయకుండా చూడమని భార్య రోడాతో చెప్పి వెళ్ళాడు. 5-00 కావస్తుండగా భర్తను విడుదల చేయుటకు రోడా మేడపైకి వెళ్లింది. కరాచీలోని బాబాప్రేమికులలోని ఒక సాహస ప్రేమికుడైన మినూకరాస్ వారింటికి రాగానే

భార్యా భర్తలు కనిపించపోయేసరికి, మేడ మీదకు వెళ్ళగా రోడా నామజపానికి ఉపక్రమించబోతుంటే, ఆమెకు బదులుగా తనను ఆ కేటాయించిన సమయంలో నామజపం చేయనీయమని రోడాను అడిగాడు. అందుకామె తానులోనికి వెళ్ళి ఒక అయిదు నిమిషాలపాటు నామజపం చేస్తానని మొదలు పెట్టింది. బాబా పటానికి ఆమె ప్రణమిల్లగా ఆమె కళ్లనుండి కన్నీళ్లు వరదలై పారాయి. "నీ ఇచ్ఛ నెఱవేరింది" అన్న మాటలు ఆమె పెదాల నుండి అప్రయత్నంగా వచ్చాయి. ఆ మరుక్షణంలోనే ఆమె అపరిమితమైన ఉపశమనాన్ని పొందింది.

వారి మతాచారం ప్రకారం హోమీ శరీరాన్ని ఆనాటి సాయంత్రం అంతిమ సంస్కారం నిమిత్తం పార్శీ వారి స్మశానవు మౌన గోపురానికి తీసుకువెళ్ళలేకపోయారు. అందువల్ల రోడా ఆ రాత్రంగా హోమీ శరీరం పక్కనే కూర్చొని జాగరణ చేసింది. మౌనంగా అతడ్ని వేడుకుంటూ " హోమీ, మన ప్రియతమ బాబా వద్దకు వెళ్ళరా బాబూ ఇప్పుడాయన సతారాలో ఉన్నారు. హోమీ నీమార్గాన్ని అక్కడ తెలుసుకో. మన ప్రియతముని చెంతకు చేరే మార్గాన్ని తెలుసుకొని "నేను నీ వద్దకు వచ్చాను' అని ఆయనతో చెప్పుము" అన్నది. మరునాటి ఉదయం, హోమీ యొక్క ఉత్తరక్రియల సమయం సమీపిస్తుండగా అతని ముఖంపై తాండవిస్తున్న చిరునవ్వు ఆమె కళ్లకు మిరుమిట్లు గొలిపింది. హోమీ తన సృష్టి కర్త ప్రియతమ బాబాను కలిశాడని ఆమెకు తెసును. కొద్ది రోజులకు సతారా నుండి ఆమెకు డా॥ గోహెర్ వ్రాసిన ఉత్తరం అందింది. "పశివాడైన హోమీ తన వద్దకు వచ్చాడని తనతో ఉన్నాడని బాబా చెప్పారు" అని ఆమె వ్రాసింది. ఆ తర్వాత ఆదీ ఇలా చెప్పాడు అంత్యక్రియలకు బంధుజనంతో వెళుతున్నప్పుడు, అంత దూరం తాను బాబాను జ్ఞాపకం చేసుకున్నాని, ఆ మౌన గోపురపు గేటు తెరవగానే తానప్పటి వరకూ హోమీకి తన వేలితో సూచిస్తూ దారి చూపుతున్నట్లు అనిపించింది. గేటు తెరవగానే అక్కడ అతడ్ని బాబాకు వప్పగించినట్లు ఆదీకి అనుభవమైంది.

అంత్యక్రియల అనంతరం దుఃఖంలో ఉన్నా సంపూర్ణ ప్రేమకు కట్టుబడిన వారై బాబాకు ఒక జాబు వ్రాశారు. "మేము హోమీని ప్రేమించాము. కానీ అతడు తనను గాఢంగా ప్రేమించే, మా కంటే అత్యంత అధికంగా ప్రేమించే, లేదా మేము ఎప్పుడూ ప్రేమించలేనంతగా ప్రేమించే తన తండ్రి వద్దకు తిరిగివెళ్లాడు. అతడు ఒక దేవత అయితే ఇప్పుడు వాడు "అదేవతల రాజు" వద్ద ఉన్నాడు ! ప్రియతమ బాబా ! వాడిని "నీలోకి తీసుకో" దాని వల్ల వాడూ తన జీవితాన్ని, తన సర్వస్వాన్ని శాశ్వతత్వము ద్వారా నీకు సమర్పించుకొనుగాక !

మాది కాక నీ ఇచ్ఛే జరుగుతుంది, బాబా.... ఈ విషాదం మాకు ఎదురైనప్పుడు, అది నీపనేనని మేము పూర్తిగా తెలుసుకున్నప్పటికీ, ఇంకా దానిని తెలుసుకొనుటకు సిద్ధం కాలేకపోతున్నాం. మమ్మల్ని క్షమించు, ప్రియతమ బాబా మా బలహీనతలను క్షమించు. మమ్ములను నీ చెంతకు పిలువు. నీ శిష్యులెందరికో తర్ఫీదు ఇచ్చినట్లు మాకు తర్ఫీదు ఇవ్వు. దీనివల్ల మేము కూడా నిన్ను సేవించుటకు ప్రేమించుటకు అర్హులమవుతాం....."

ఎప్పటి మాదిరిగానే దయగల తండ్రిగా బాబా వీరి హృదయ ప్రార్థనలను విన్నాడు. బాబా వీరి జాబును అందుకున్నప్పుడు, ఆ జాబుతో పాటు హోమీ ఫోటో కూడా జత చేయబడింది. దీనికి జవాబుగా ఎరుచ్ "బాబా ఎంతో ప్రేమగా హోమిని తన మహనీయమైన చేతులలోకి తీసుకున్నారు" అని వ్రాశాడు. పిమ్మట బాబా టార్చిలైటు తెప్పించి, హోమీ ముఖంపై వెలిగించి కొద్ది క్షణాలు అతనివైపు తదేకంగా చూచి, పిమ్మట ఆ ఫోటోను ఎరుచ్‌కి ఇచ్చి ఈ క్రింది ఆదేశంతో పాటు, ఆదీ రోడాలకు జాబు పంపమని చెప్పారు :

1. బాబా తన స్వహస్తాలతో హోమీని స్పృశించారు.
2. మీరిరువురూ ఇందుతో పంపుతున్న ఫోటోకు ప్రేముకట్టించుకొని మీ దగ్గర ఉంచుకోండి.
3. హోమీ బాబా వద్దకు వచ్చాడు అని మీరు చెప్పినప్పుడు, మీరురువురు తప్పని సరిగా గొప్ప ఉపశమనం పొందుతారు. ఈ ఎరుకతో బాబా మీ ఇరువురని సుఖంగా ఉండమని కోరుతున్నారు.

ఆ ఉత్తరంలో బాబా, ఆదీ రోడాలకు అంతటి నష్టం వాటిల్లినా, వారికి వప్పగించిన నామ జపమును కొనసాగించుటకు వెనుకాడని వారి వినయం తనకు ఎంతో సంతోషం కలిగించిందని కూడా వ్రాయించారు.

ఈనాటికీ ఆదీ రోడాలు తమ ప్రియపుత్రుడు హోమీతో కలిసి ఉన్నప్పుడు పొందిన ఆనందాన్ని గుర్తు చేసుకొని, నాలుగున్నర ఏళ్లపాటు, తమ కుమారుడు హోమీకి బాబా తరపున సంరక్షకులుగా ఉండే అత్యద్భుత బహుమానాన్ని అనుగ్రహించిన బాబాకు తమ హృదయాంతరాళాల నుండి కృతజ్ఞతలు చెప్తూ ఉంటారు. జీవితంలో ఆదిలోనే వారికి బాబా ఒక పాఠం నేర్పారు, సర్వము - తల్లి, తండ్రి భర్త భార్య, పిల్లలు ఇవన్నీ ఒక గతించే ఘట్టము. మరి ఏకైక సత్యము బాబా మాత్రమే. ఆయనే ఇవ్వాలి. ఆయనే పుచ్చుకోవాలి. కృపతో ఆయన ఇచ్ఛను అంగీకరించటమే మనవంతు. ఆయన కరుణలో ఆయన

మనకు ఇటువంటి ప్రాపంచిక దుఃఖాల్ని, ఆపదలను ఎదుర్కొనుటకు తగు శక్తిని బలాన్ని ప్రసాదిస్తారు.

మనలోని ప్రతివారు ఏదో ఒక విధమైన బాధల్ని శారీరకంగా మానశికంగా అనుభవించేట్లు దైవ నిర్దేశిత కర్మచట్టం ప్రకారం గత జన్మల సంస్కారానుభవంలో కనికరంతో ఆయన దారి చూపిస్తాడు. అయినప్పటికీ, అర్థం లేకుండా ఏ బాధ కలుగదు. బాధ, వేదన అవసరం, మన జీవితంలోని కొన్ని నిర్ణీత రూపాలతో కూడిన ఎరుకలేని గుర్తింపు నుండి మనలను మేల్కొలుపుటకు తప్పనిసరి అవుతుంది. అయినప్పటికీ, అవతార్ మెహెర్ బాబా ప్రేమ పరిధిలోనికి వచ్చే అదృష్టవంతుల బాధ వారికి సాధ్యమైనంత ఆధ్యాత్మిక ఫలితాన్ని తెచ్చిపెడుతుంది. ఆయన దయ కూడా ఇటువంటి జటిలమైన సమయాలను ఎదుర్కొని అధిగమించుటకు మనకెంతో సహాయపడుతుంది. ప్రేమతో అవతారుడిని గుర్తుంచుకోవటం వల్ల, దుఃఖము యొక్క ఆపదలనుండి అదుకోవటమే కాక, ఆయనయందు మనకున్న నమ్మకాన్ని బలపరిచి స్థిరంగా ఉంచుతుంది.

ఇది మానవ సహజం. అప్పుడప్పుడు, మన దుఃఖాల మధ్య బాధల మధ్య, బాబాకు మొరపెట్టుకొని "ఎందుకయ్యా నాకిలా జరిగేట్లు చేశావు ? ఈ విషాదం నుండి నన్నెందుకు నీవు నిరోధించ లేదు ?" అంటూ విలపిస్తాము. ఇక్కడ నాకు ఒకప్పుడు చెప్పిన అవిలా లోని సెయింటు తెరీసాకథ నాకు జ్ఞాపకం వచ్చింది. ఒకప్పుడు తెరీసా ఒకబండి మీద తన సహచర తపస్వినులతో కలిసి వేరే కాన్వెంటుకు వెళుతోంది. దారిలో తీవ్రమైన తుఫాను మొదలైంది. కుంభవర్షం కురుస్తుంటే, వారి బండి మట్టి రోడ్డు మీద బురదలో కూరుకుపోయింది. చలి విపరీతంగా ఉన్నది. ఇప్పుడు తపస్వినులంతా పూర్తిగా వానలో తడిసిపోయి గజగజ వణికిపోతున్నారు. ఎటువంటి సహాయం అందలేదు. చివరకు తెరిసా కొద్ది దూరం వెళ్లి తన హృదయాంతరాళాల్లో జీసస్‌ను ప్రార్థించింది, ప్రభూ, ఎందుకయ్యా మాకీ బాధను కలిగించావు ? ఈ ప్రయాణంలో బయలుదేరింది నీ సేవలో అంకితమై నిన్ను సేవించేందుకే గదా ! అయినప్పటికీ మేము ఇటువంటి అసౌకర్యానికి బాధకు గురికావల్సి వచ్చింది !" అంటూ మొరపెట్టుకున్నది. అందుకు జీసస్ బదులిస్తూ "నేను నా మిత్రులను ఆదరించుటకు అవలంభించే విధానములో ఇది ఒక మార్గము" అన్నాడు. కేవలం మానవ సహజంగా తెరీసా "ఇదేమంత ఆశ్చర్యపడవలసిన విషయం కాదు. అటువంటి వాళ్లు కొందరు నీకున్నారు" అనుకున్నది.

# సతారలోని రోజ్‌ఉడ్‌లో సమావేశం

బాబా సతారాలో ఉంటూ ఉండగానే, నేను కురుద్వాడిలో ఉపాధ్యాయుడిగా పని చేస్తున్నాను. మా పాఠశాలలో సాంవత్సరిక పరీక్షలు ఏప్రియల్ ఆఖరి వారంలో పూర్తవుతాయి. అప్పటి నుండి ఆరు వారలపాటు బడిని మూసివేసి వేసవి శలవులు ఇస్తారు. సహజంగా ఆశలవు కాలంలో బాబాను చూచే అవకాశం లభిస్తే బాగుంటుందన్న ఆలోచన నాకు వచ్చింది. బాబా సతారాలో అన్నీ విరమించుకొని ఏకాంత జీవితాన్ని గడుపుతున్నారు. అయితే నేను ఎరుచ్‌కి ఉత్తరాలు వ్రాయుటకు అనుమతి పొందాను. బాబాకు నా హృదయ తపన తెలుసునని నాకు మరోసారి అనుభవమైంది. అంతలోనే ఎరుచ్ నుండి నాకు ఒక జాబు అందింది. అందులో "బాబా నీకు ఏ విధమైన అభ్యంతరకర అడ్డంకులు లేకుండా అనుకూలమైతే ఏప్రియల్ 23న సతారా రమ్మనమంటున్నారు. అందునా సులభంగా శలవు పొందకలిగేట్లయితేనే రమ్మన్నారు" అని వ్రాశాడు.

ఈ పిలుపుకు నేను ఆనందపరవశుడినై పోయాను. అయితే ఇక్కడ ఒక చిన్న లింకె పెట్టారు. ఇందులో తాను ఉపయోగించిన "అయితే" అన్న పదం క్రింద గీత గీశాడు ఎరుచ్. మరి నేను 23వ తేదీ సాయంత్రానికి సతారా చేరాలంటే నేనా రోజు పొద్దుటే మా ఇంటి వద్ద బయలుదేరాలి. ఆ రోజు ఆ ఏటికి మా స్కూలు ఆఖరి పని దినము. పాఠశాల నియమాల ప్రకారం, ఎవరైనా ఆఖరి పనిదినము రోజున పాఠశాలకు గైరుహాజరైతే శలవు దినాల వేతనాన్ని నష్టపడాల్సి వస్తుంది. ఆరువారాల జీతం రాదు. నేను బాబాను దర్శించాలని ఎంతగా అభిళషించినా, ఆరు వారాల జీతం పోగొట్టుకోవాలన్న స్వల్ప ఆలోచన నా మనస్సుపై భారంగా తూగింది. అల్పమైన నా ఆదాయ పరిస్థితిలో అంత మొత్తాన్ని వదులుకొనుట పూర్తిగా సమర్థనీయమా ? అనిపించింది. నేను సహజంగానే నా అంతరంగంలో బాబా వైపు తిరిగి సరైన నిర్ణయం తీసుకొనేట్లు సహాయపడమని ప్రార్థించాను. అయితే మా ఒడంబడికలో ఎటువంటి ధన నష్టం లేకుండా పరిస్థితుల్ని చక్కదిద్ది నేనాయనను దర్శించేట్లు చేస్తారని నేను ఎన్నడూ ఊహించలేదు.

ఏమైనా సరే 23వ తేదీన వెళ్లితీరాల్సిందేనని నిశ్చయించుకొని ఉన్న

పరిస్థితిని వివరించేందుకు నేను వెళ్లి మా ప్రిన్సిపాలు గారిని కలిశాను. అత్యంత ఆశ్చర్యకరంగా ఆయన జిల్లాలోని కొన్ని పాఠశాలలు ఒక ప్రత్యేక షెడ్యూలు ప్రకారం పని చేయాల్సి వచ్చిందని చెప్పారు. మా స్కూలులో పనిచేస్తున్న సిబ్బందిని, నిర్దిష్టమైన సమాచారాన్ని సేకరించేందుకు ప్రభుత్వం నియమించినట్లు చెప్పారు. దాని ఫలితంగా మా స్కూలు శలవు కాలము ఒక వారంపాటు వాయిదాపడింది. అందువల్ల 23వ తేదీ ఎంతమాత్రం ఆఖరి పనిదినం కాలేదు. అందువల్ల మా ప్రిన్సిపాలు నాకు 23వ తేదీన శలవు మంజూరు చేయటంతో పాటు, ప్రభుత్వం నిర్దేశించిన పథకంలో పని చేయవలసిన పనిలేకుండా ఎంతో ఉదారంగా నన్ను వదిలివేశాడు. అప్పుడప్పుడు బాబా సహాయాన్నందిస్తారనుటకు ఇది నిదర్శనం కాదా ! ఆయన తన రెండు చేతులతో ఇస్తారు.

ఎరుచ్ తన జాబులో బాబా తన నిర్ణయం గురించి, 24వ తేదీన ఒక సమావేశం ఏర్పాటు చేయబోతున్నట్లు తెలియపరిచాడు. "బాబా నిన్ను వంటరిగా నీవు మాత్రమే రావాలని, నీతోపాటు గనుక నీవు మరెవరినైనా తీసుకువస్తే బాబా సన్నిధి నుండి మీ ఇద్దరూ పంపి వేయబడతారని కూడా వ్రాశాడు. ఈ హాశ్యపూరిత హెచ్చరిక నాకు నవ్వుపుట్టించింది. ఎందుకంటే, అది నాయందు బాబాకున్న సన్నిహితమైన ప్రేమ పూర్వక అన్యోన్యతను తెలియపరిచి మరో పర్యాయం ఆయన సన్నిధిలో గడిపే సమయం కోసం, రోజులు త్వరగా గడవాలన్న తపనతో ఎదురుతెన్నులు చూచేట్లు చేసింది. ఇంకా ఎరుచ్ వ్రాస్తూ నేను బాబాతో నా వ్యక్తిగత విషయాల్ని మాట్లాడకూడదని, ఈ సమావేశం గురించి ఇతరులెవరకు తెలుపరాదని కూడా తెలిపాడు. చివరకు ఆ ఉత్తరాన్ని ముగిస్తూ నేను వస్తున్నదీ లేనిదీ ధృవపరచాలని వ్రాశాడు. వెంటనే, నేను వస్తున్నట్లు, ప్రియతమ బాబాకు నా ప్రత్యేక ప్రణామములు తెలుపుకుంటూ జవాబు వ్రాసిపోష్టు చేశాను.

23 సాయంత్రానికి నేను సతారా చేరుకొని మా వసతికై ఏర్పాటు చేసిన రహదారి బంగళాకు వెళ్లాను. డా॥ దేశ్‌ముఖ్, కేశవనిగమ్, కిషన్‌సింగ్‌లు కూడా చేరుకున్నారు. స్నానం చేసి, మేమంతా రోజ్‌ఉడ్‌కు వెళ్లాము. అక్కడ బాబా తన మండలితో ఉన్నారు. బాబా మమ్మల్ని పలకరించి కుశల ప్రశ్నలు వేసిన అనంతరం తనముందు మమ్మల్ని వరుసగా కూర్చోమన్నారు. ఆయన రాజసంతో వెలిగిపోతూ కనిపించారు. అలవాటు ప్రకారం ఆయన మా క్షేమ సమాచారాన్ని గురించి కావలసిన ప్రశ్నలు వేశారు. మా సతారా ట్రిప్పులు గురించి అడిగి, తన

కలవాటైన యాధృచ్ఛిక విధానంలో "ఏదైనా విషయం మిమ్మల్ని బాధపెడుతోందా ?" అని ప్రశ్నించారు.

తక్కిన వారు ఏం చెప్పారో లేదా వారికి బాబా ఏమి తెలిపారో నాకు గుర్తులేదు. కానీ, నేను జవాబు చెప్పాల్సిన వంతు నాకు వచ్చినప్పుడు, నేను సంకోచించాను. దానితో బాబా సౌంజ్ఞలు చేస్తూ "మాట్లాడు" అన్నారు. అంతట నేను ధైర్యము చేసి " చిట్ట చివరి వరకు నేను నీ కొంగును జార విడువకుండా పట్టుకొని ఉండకలుగుతానా అన్న ఒకే ఒక్క బాధ నన్ను పీడిస్తోంది" అని మెల్లిగా సణిగాను బాబా ఆశ్చర్యంగా నా వైపు చూస్తూ " ఎందుకని" అన్నట్లు సౌంజ్ఞలు చేశారు " బాబా నీవు చాలా అపరిమితుడవు, నీవు కొలవ శక్యంకాని వాడవు అగాధ సాగరుడవు మరి అత్యంత పరిమితమైన నావంటి సామాన్య మనస్సు ఇన్ని బలహీనతలతో అనంతుని కొంగును ఎలా పట్టుకోకలగుతుంది?" అని బదులిచ్చాను.

ఆయన్ని ఈ ప్రపంచంలో ఇంతవరకు ఎవరూ ఇటువంటి తెలివితక్కువ ప్రశ్నను అడుగలేదన్నట్లు బాబా తన ముఖ కవళికల ద్వారా సూచిస్తూ ఇదే మొదటి సారన్నట్లు నా వైపు చూచారు. నాకు జవాబు చెప్పకుండానే, వేరే వారివైపు చూస్తూ వాళ్ళకేమైనా ఇబ్బందులన్నాయేమోనని విచారించారు. ఇదే ప్రశ్నలకు అందరినీ అడుగుట పూర్తియైన పిదప బాబా మళ్ళీ నావైపు తిరిగి నా బాదేమిటో మళ్ళీ చెప్పమన్నారు. అలా చెప్పేందుకు నేను కొంత సిగ్గుపడినప్పటికీ, బాబా ముఖం ఎంతో కరుణతో వెలిగిపోతున్నందున, నేను నా బాధను తిరిగి చెప్పేందుకు ప్రయత్నించాను. అంత బాబా విస్తరించిన సౌంజ్ఞలు చేస్తూ " అవును, నేను అనంతుడను, నేను కొలవశక్యంకాని వాడిని" అని సూచిస్తూ " నేను సర్వోన్నతుడను, నేను గొప్పవారికంటే గొప్పవాడిని" అని జోడించారు.

బాబా నా వైపు తదేకంగా చూస్తూ " అయితే , నీవు ఒక విషయాన్ని వదిలావు. నేను ఏకకాలములో అధములలో అధముడను, చిన్నవాళ్ళల్లో చిన్నవాడిని" అంటూ వివరించసాగారు. ఇలా వ్యక్త పరుస్తున్నప్పుడు పైకి వినిపించేట్లు తన చేతి వేళ్ల చిటికలు వేస్తూ కటుక్కుమనే శబ్దం చేశారు. టిక్కు మనిపించిన ఈ శబ్దం , అత్యంత సూక్ష్మమైన చిన్నదిగా తెలియచేసినా, అదే సమయంలో తాను ఎంత అపరిమితమైన గొప్ప వాడినోనని తెలుపుతుంది. పిమ్మట మళ్లీ కొనసాగిస్తూ "నా కోసం నీలో ఏమాత్రం స్వల్ప ప్రేమ ఉన్నా నీవు

దానిని హృదయపూర్వకంగా, నిజాయితీతో పట్టుకుంటే, నీవు సహజంగా గొప్పవారికి గొప్పవాడైన, సర్వోన్నుతుడైన వాని కొంగును పట్టుకొన్న వాడి వవుతావు'' అని బాబా వివరించారు. బాబా యొక్క యీ జవాబు ఎంతో నమ్మించేట్టు నాకు పూర్తి సంతృప్తినిచ్చింది. దాని ప్రభావంనాలో ఈ నాటి వరకు చెక్కు చెదరకుండా స్థిరంగా ఉండిపోయింది.

సాయంకాలం సూర్యాస్తమానమునకు ముందు, బాబా గ్రాఫ్టను నుండి బయలు దేరగా మేము నలుగురం మా రహదారి బంగళా కు తిరిగి వెళ్లాం. మా హృదయాలు, మా ఆలోచనలన్నీ, బాబా సామ్రాజ్య పరిధిలో ప్రియతముని చుట్టూ అప్రయత్నంగానే పరివర్తించసాగాయి.

మర్నాడు ఉదయం 7-30 లకు ఈ సమావేశానికి రావలసిన మొత్తం 36 మంది పురుషులు రోజ్‌ఉడ్ వద్ద హాజరయ్యారు. మాలో కొంతమందిమి ముందుగదిలో మాతో కబుర్లాడుతున్న బాబా ముందు కూర్చున్నాం. ఆయన తమ్ముడు బెహ్రం పూనా నుండి వస్తూ, బాబా ఆడిన క్రికెట్టు ఫోటో తెచ్చాడు మేర్వాను గా చిన్నప్పటి బాబా ఫోటో అది, పెద్దదిగా చేసి దానిని క్రికెటు టీముతో కలిపి తీశారు. బాబా తన స్కూలు యూనిఫారం డ్రస్సులో ఒక మెడల్ ధరించి నేలపై కూర్చున్న ఫోటో అది. బెహ్రందానిని బాబాకు బహూకరించే సరికి ఆయన చాలా సంతోషించారు. తన కళ్ళల్లో హాశ్యాన్ని చిందులాడిస్తూ,బాబా మావైపు తిరిగి "నేను ఇంతకాలంగా ఒక పరిపూర్ణుడైన బాలుడి కొరకు అన్వేషిస్తున్నాను. మరి ఈ రోజున అతడ్ని నేను కనుగొన్నాను'' అని వ్యాఖ్యానించారు. బాబా చేసిన యీ హాశ్యంలో తెలుసుకున్నానన్న నవ్వు మిళితమైంది. అటువంటి అత్యంత ఉపయుక్తమైన ఉల్లాసకరస్థితిలో ఒకరులేచి "దీని అర్ధం, ఇప్పుడు మీరు అటువంటి పరిపూర్ణ బాలుడ్ని వెదకటం మానేస్తారన్నమాట !'' అంటూ సణిగాడు. ఆవెనువెంటనే బాబా బదులిస్తూ 'ఇది కేవలం ఒక చిత్రము మాత్రమే అన్నారు. ఆఫోటోను బాబా మళ్ళీ బెహ్రంకు తిరిగి ఇచ్చేశారు. ఆనాటి సాయంత్రం ఆ ఫోటో ఒకనాటకీయ ప్రాముఖ్యతను సంతరించుకుంటుందని నేను అనుకోలేదు.

కొన్ని ప్రారంభ రూపక కుశల ప్రశ్నలు, పలకరింపులు పూర్తయ్యాక, దానికి ఆనుకొని ఉన్న పెద్దహాలులోకి బాబా వెళ్ళగా ఆయన కూర్చున్న ఆసనముచుట్టూ ఈ బృందమంతా సుఖాశీనులయ్యారు. అంతా వచ్చారా అని

బాబా, పెండూను అడుగగా "ఆ వచ్చారు బాబా" అని బదులిచ్చేసరికి ఆయన సంతోషించినట్లు కనిపించారు. ఆయన సన్నిధిలో ఉండటమే మా అందరికి గొప్ప ఆనందం కలిగించింది. బాబా ఎంతో ఆప్యాయంగా కలిసి సంభాషించాలన్న ఉత్సాహంలో ఉన్నారు. ఆయన తన అక్షర ఫలకాన్ని విసర్జించినప్పటికీ, తన ప్రేమికులతో వ్యక్తి గతంగా సంభాషించుటకు పరిమితి ఉన్నట్లు కనిపించలేదు. ఆ పిమ్మట గంభీరమైన ఆధ్యాత్మికవిషయాలపై ఆయన చర్చిస్తున్నప్పుడు కూడా ఏ పరిమితి వ్యక్తం కాలేదు. ఆయన ముఖకవళికలు, చేతిసౌంజ్ఞలు ఎంతో వాక్పటుత్వం కలిగి స్పష్టంగా మాట్లాడుతున్నట్లుగా కనిపించాయి.

ముందుగా బాబా, ఇండియాలోని అనేక ప్రాంతాల్లో కొనసాగుతున్న ఎడతెగని నామజపం తో తాను సంతుష్టుడనయ్యానని వ్యక్త పరచారు. పాకిస్తాన్ గురించి ప్రస్తావిస్తూ, ఆయన ఎరుచ్‌ని, బుజ్జిహోమీకి జరిగిన ఆకస్మిక మరణ సంఘటన గురించి చెప్పమన్నారు. యుగావతారుడిగా ఆదీ మరియురోడా దుబాష్ తనపై కలిగియున్న ధృడమైన విస్వాసాన్ని మెచ్చుకుంటూ తన సంతోషాన్ని వ్యక్తపరిచారు. ఆనామ జపము యొక్క ప్రాముఖ్యతను గురించికూడా ఆయన అందరిదృష్టికీ తెచ్చారు. మండలి సభ్యులు చాలామందికి బాబా నామాన్ని అంతర్గతంగా స్మరించుట, వారి జీవితాల్లో ఒక అంతరంగ భాగంగా మారిపోయింది. కొన్ని సందర్భాల్లో, వారు తన ఆధ్యాత్మిక కార్యక్రమంలో పాల్గొనుటకై తన ప్రేమికులకు అవకాశమిస్తే వారిని నిర్ణీత సమయంలో కొన్ని దైవనామాల్ని స్మరించమని బాబా అడిగేవారు. ఎందుకంటే భగవంతుని ఏదో ఒక దైవ నామాన్ని ఇలా వారు బిగ్గరగా లేక మౌనంగా స్మరించినప్పటికీ, ఆ స్మరణ శ్రవణానంద కరంగా మారి నిలువెల్ల మార్మోగుతూ, ఆలోచనలను, భావాల్ని పరిశుద్ధ పరుస్తుంది అది తరుచూ ఒక స్ప్రింగు బోర్డువలె మారి దాని నుండి అంతర్గతంలో ఉన్నదైవ సమక్షపు అగాధ స్థాయికి దూసుకుపోతుంది. ఆనామపు లయ, ప్రకృతి సిద్ధమైన హృదయ లయతో మేళవించి ప్రతిధ్వనించుట మొదలవుతుంది. చివరకు ప్రాణాధారమైన ఊపిరిగా తయారవుతుంది. పురాణ పురుషుని నామము హృదయంలో శ్రుతులను తట్టి, దాని సహజ నాదముతో లయపరిచి ప్రతిధ్వనించేట్లు జతపరుస్తుంది. మెహెర్ బాబా ప్రేమికులకు సంబంధించినంతవరకు, ఆయన నామము ఒక దీపపు స్థంభంలాంటిది. అది ప్రజ్వలింపచేసే వెలుతురులో మాయయొక్క అనంతమైన కాల రహిత మహాసాగరమందు అవధులు లేని తమ పరమాత్మ - బాబా అవతారుని సన్నిధికి

చేరుటకు దాటుకుంటూ చేసే నావ ప్రయాణంలో మార్గదర్శకమై సహాయపడుతుంది.

ఒక దశలో ఆ సమావేశం మొదట్లో, అక్కడ హాజరైన వారి వైపు బాబా క్రీగంటచూస్తూ " వ్యక్తిగత మరియు కుటుంబ విషయాల్లో బాధలు ఎప్పుడూ ఉంటాయి. కానీ ఈ రోజున మాత్రం అటువంటి బాధలు మిమ్మల్ని బాధపెట్టనీయకండి..... చాలా ఆనందంగా ఏకాగ్రతతో ఉండండి..... ఆవులించకండి. నిద్రమత్తు వచ్చినట్లు కనిపించిన వారు హాలునుండి బయటకు పంపబడతారు" అని వివరిస్తూ బాబా పకాలున నవ్వారు.

ఈ సమావేశం ఉదయం ఎనిమిది నుండి 11-00 వరకు మరల సాయంత్రం 3 నుండి 5-00 ల వరకు జరగాలని మొదట్లో నిర్ణయించి నప్పటికీ, అది ఉదయం నుంచి మొదలై తిన్నగా సాయంత్రం 3-30 వరకు కొనసాగింది. మొదటి గంట సమయంలో బాబా సంక్షిప్తంగా ఇటీవల తాను చేసిన ప్రకటీకరణ నుండి నిర్ధారణల వరకూ సంబంధించిన సందేశాల గురించి ప్రస్తావించారు. అందులో ప్రస్తావించిన తీవ్రమైన విషయాలకు సంబంధించి, బాబా తన అనుచరులు, తాము తనను అనుసరించాలో లేదా ఆయన్ని వదలిపెట్టాలో ఎంచుకొనే అవకాశాన్నివ్వాలను కున్నారు. అయనకు తన అనుచరులు ఉదాశీనంగా కూర్చొనుట ఇష్టంలేదు. వారు తమ ఒప్పందంలో హృదయపూర్వకంగా వ్యవహరించాలని వాంఛించారు.

"ప్రతివారు నన్ను గురించి ఆలోచించుటకు తన ఇష్టం వచ్చిన రీతిలో నా పనిని గురించి అర్థం చెప్పుకొనుటకు లేదా ఉత్తమ రీతిలో అవగాహన చేసుకొనుటకు స్వేచ్ఛ కలిగి ఉన్నారు. నామాటలను ఉన్నవి ఉన్నట్లు వ్యక్తపరచి తీరటం కానీ లేదా ఒకవేళ నీ వల్ల వివరించబడటం కానీ జరిగితే , అవి నీ స్వంత వివరణలని చెప్పటం ఎన్నడూ మరువకు ...... నేను పరిపూర్ణుడుగా ఉండుటను, అవతారుడిగా ఉండుటను ఎన్నడూ కాదనను. అయితే మీరు దానిని ఇంకా ఎరుగరు. నేను అద్వితీయమైన ఏకైకుడనని, నేను మాత్రమే ఉన్నానని అసమానమైన వాడినని ఎరుగుదును. నేనెవరైయున్నానని మీరు విశ్వసిస్తున్నారో ఆ విషయాన్ని మీరు స్థిరంగా నొక్కి ప్రకటించే హక్కు మీకున్నది - నన్ను గురించి నాయందు మీకున్న యదార్థ నమ్మకం గురించిన మీ విశ్వాసాన్ని స్వంతం చేసుకొనుటకు ఎన్నడూ వెనుకాడకండి. నిజంగా మీకు లేని దానిని గురించి తెలుసుకోవాలని కోరుకోకండి.

కొద్ది సేపు గడిచాక, బాబా, జీవితం లో నిత్యమైన విలువ దేనికి ఉంటుందన్న అతి ముఖ్యమైన సందేశాన్నందించారు. ఆయన మా కిలా వివరించారు.

మార్గంపై చాలా కాలం నిలిచి ఉండే విలువకల విషయాలు 1. దివ్యప్రేమ 2. సద్గురువుయెడల విధేయత 3. పరమ నిశ్చయమైన నిష్కపటము మరియు హృదయపూర్వకంగా ఇతరులకు చేసే సేవ. 4. భౌతిక విషయంలో యదార్థమైన పరిత్యాగము. ఏకైక సత్యమైన భగవంతుని గురించి తప్ప అన్యచింతనలకు ఆలోచనలకు చోటు లేకుండా చేయుట.

దివ్యప్రేమ, భగవంతుడు మానవునకు ఇచ్చే నిర్మలమైన ఒక బహుమానము...... ఒక సద్గురువుతో జరిగే స్పర్శ ఎన్నడూ అందరికీ అన్ని వేళలా సమంగా అందుబాటుకాదు.... నిస్వార్థసేవ, యదార్థ పరిత్యాగములు రెండూ అందరికి బాహాటంగా అందుబాటులో ఉంటాయి. అయితే మానవుల్లోని నిజమైన వీరులకే అవి పొందే అవకాశం ఉంటుంది.

మండలికి, (బాబా ప్రేమికులకు సైతం) వారు నాకు విధేయులై చివరివరకూ నా విధేయులుగా గడపటమే మంచిది.... అది ఎంత కష్టమో నాకు తెలుసు.... అయినా మీలో ఏ కొద్ది మందైనప్పటికీ, మీ బాబాకు నిజంగా విదేయులవటంలో విజయం సాధిస్తే , అప్పుడు మీరు నిజంగా ఆయన్ని యదార్థమైన గొప్పవాడిని చేసినట్లే.

ఈ సమయంలో ఆయన తరచూ చేసేటట్లు, అత్యంత ప్రకృతి సహజంగా తన స్థితియొక్క సత్యాన్ని అవతారుడిగా తన అర్హతను గురించి నిస్సంశయంగా ఇలా వివరించారు.

నేనేదైయున్నానో అదే అయితే నేను వివరించదలచుకున్నదంతా మీరు అర్థం చేసుకోలేకపోవటం కూడా అంతే అత్యంత సహజము. మరి నేను చెప్పేదంతా ఎందుకు చెపుతున్నాను అంటే,..... ఈ విధంగా వేలాది వేల సంవత్సరాలనుండి సాగుతూనే ఉన్నది. నేను సర్వోన్నతుడనైతే, జీసను ఎందుకు శిలువ వేయబడ్డాడో, మహమ్మదు ఎందుకు రాళ్ళతో కొట్టబడ్డాడో నేను బాగుగా ఎరుగుదును. వారిని గురించిన ఇలా పిలువబడే మంచి - చెడు విషయాలన్నీ మంచి - చెడు అని పిలువబడే ప్రపంచం వల్ల ప్రజలు క్రీస్తు మహమ్మదులగురించి, రాముడు, కృష్ణుడు, జోరాష్టరు బుద్ధుడు గురించి, వారు చెప్పి నిర్వహించిన అన్ని విషయాలగురించి అర్థం చేసుకోగలగింది శూన్యము, ఏమీ లేదు

నాలో నమ్మకాన్ని ఉంచికూడా నామాటలను చేతలను ప్రశ్నించాలనుకున్న వారు నాయందు తమకున్న నమ్మకంలో, విశ్వాసములో బలహీనులన్న మాట .... నన్ను అంటిపెట్టుకొని ఉండటమంటే అర్థం, మీ సౌఖ్యాల్ని, సంతోషాల్ని పణంగా పెట్టైనా సరే నన్ను సంతోషపరచాలి. అనగా మీ ఆరోగ్యం బాగా ఉన్నా, చెడిపోయినా డబ్బు సంపాదించినా, లేక పోగొట్టుకున్నా, పేరు ప్రఖ్యాతులు సంపాదించినా, లేదా ఇతరుల మధ్య నగుబాటు పాలైనా ఏమి జరిగినా సర్వము నా ఇచ్ఛకు విడిచిపెట్టాలి."

ఈ ప్రకటనను బాబా పూర్తిచేయగానే , అక్కడున్న వారంతా బాబా నుండిపుట్టుకు వస్తున్న దేదీప్యమానమైన దివ్యతేజస్సు యొక్క శక్తిని ప్రత్యక్షంగా అనుభవించారు. మధ్యాహ్నంకాగానే, బాబా తన శిష్యులకు, అనుచరులకు అందించిన సాధారణ మార్గదర్శక ఉపదేశాలు, ఆదేశాలను చదవమని ఎరుచ్‌ని ఆదేశించారు. ముందుగా తయారు చేసుకున్న " సతారాసందేశము" అనే పేరుతో ఉన్న సందేశంలో బాబా చాలా సంగ్రహంగా తన తొలినాలుగు సందేశాల్ని సంక్షిప్తంగా చెప్పారు. దీనిని ఎరుచ్ చదవబోతుండగా పైనున్న రేకుల కప్పుమీద పడే వర్షపు చినుకులు టపటప శబ్దం చేశాయి. ఆ శబ్దం విన్న బాబా 'ఇప్పుడు మీరు వింటున్న దంతా తిన్నగా నా హృదయంనుండి వచ్చిందన్న సత్యానికిది సంకేతము" అని సౌంజ్ఞలు చేశారు. అతరవాత ఆ సందేశాన్నిలా చదివారు.

నా అంతిమ నిర్ణయం ప్రకారము కాలమునకు సంబంధించిన విషయంలో తప్ప, తక్కినవన్నీ సవిస్తరంగా నేను ప్రకటించినట్లు, విశదీకరించినట్లు, మరియునాచే ధృవపరచబడిన విధంగా ప్రతిదీ వరుసక్రమంలో సంభవించును.

కాలానికి సంబంధించి, ఇప్పుడు ఎటువంటి పరిమితిలేదు. కాలము విషయంలో ఒక నెలతరువాత జరగవచ్చును. లేదా మూడు నెలల తర్వాత జరగవచ్చును. మూడేళ్ళ తర్వాతో లేక ఇరవై ఏళ్ల తర్వాత కూడా జరుగవచ్చును. క్లుప్తంగా చెప్పాలంటే, నేను రేపే మాట్లాడవచ్చును. లేదా పదేళ్ళతర్వాత నా మౌన విరమణ జరగవచ్చును. వాగ్దానాలు బాధ్యతలు, ప్రయత్నారంభాలు, ఏర్పాట్లు వీటన్నిటినుండి నేను సర్వస్వతంత్రుడను అందువల్ల, నానుండి ఎవరూ ఎటువంటి భౌతిక ఆధ్యాత్మిక సంబంధ విషయాల్ని ఏసమయంలోను, ఏ విధంగానూ కోరకూడదు. అందరికీ ఏదిమంచిదని నేను భావిస్తానో, ఎప్పుడు అది అర్థమవుతుందని నేను అనుకుంటానో అప్పుడు నేను అనుకున్నది చేస్తాను.

ఈపైన పేర్కొన్న దాని ఆధారంగా మాత్రమే, ఇప్పుడు సంబంధించిన వారంతా నా కొంగును పట్టుకోవాలో లేక వదిలిపెట్టాలో నాలో నమ్మకం ఉంచేందుకు, నన్ను పూజించేందుకు, నాయందు భక్తితో ఉండిపోయి, నా ఆదేశాల్ని, నా ఆజ్ఞల్ని పాటించాలో వద్దో తెల్చుకోవాలి.

1955 మే 1 నుండి జూలై 31 వరకు జరిగిన మూడు నెలల కాలము, నాకు ఒక సంకటసమయము. నేను మూడు కారణాల మీద ఏకాంతవాసమునకు పోవలసివచ్చింది., ఒకటి నా కొరకు, రెండు నన్ను ప్రేమించేవారికొరకు, మూడు అందరికొరకు.

సతారాలోని జాల్‌విల్లి లో నేను ఉంటున్న సమయంలో ఆబంగళాలోని మధ్యగదుల్లోనుంచి, నేను బయటకు అడుగుపెట్టలేదు. ఆసందిగ్ధస్థితి ఉండే కాలాన్ని బట్టి నేను రోజూ భోజనం చేయటం, నిద్రపోవటం చేస్తే చేసేవాడిని లేకపోతే లేదు. నా ఏకాంత వాసము మొదటి నెలగడిచిన తరువాత లేదా ఆ సమయంలో నేనేదో ఒక ప్రదేశానికి బద్ధుడ్ని కాలేదు ఏ క్షణంలో నైనా నేను నా పథకాల్ని మార్చవచ్చును. లేదా ఇంతకంటే గొప్పదైన ఏకాంత స్థలమునకు వెళ్లవచ్చును.

ఏ ఒక్కరు ఎటువంటి పరిస్థితులలో కూడా నన్ను చూచుటకు రాకూడదు, లేదా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో 1955 జూలై మాసాంతం వరకు, ఏరకమైన కారణం పైనా, నాతో సంబంధం పెట్టుకోకూడదు.

నాతో సన్నిహితసంబంధం వున్నవారంతా, ఎవరైతే నన్ను ప్రేమిస్తున్నారో వారంతా, మరియు నా ఆదేశాల్ని పాటించదలచిన వారంతా కచ్చితంగా నీతిమంతులై ఉండాలి. తప్పని సరిగా లైంగిక చర్యలకు దూరంగా ఉండాలి. మరియు నా సత్యప్రేమసందేశాన్ని 1955 మే 1 నుండి జూలై 31 వరకు జరిగే మూడు నెలలసంధిగ్ధకాలములో సాధ్యమైనంత సుదూరతీరాల్లో వ్యాప్తి చేయుటకు ప్రయత్నించాలి.

టీ త్రాగేందుకు కొద్దిసేపు విరామం ఇచ్చి, బాబా తొలుత చేపట్టిన మరికొన్ని విషయాలపై వివరించేందుకు ఉద్యుక్తులయ్యారు. ఈ సందేశాల్ని ఒక ప్రత్యేకపుస్తకం రూపంలో "పీచాక దాధారీరు" అనే శీర్షికతో అచ్చువేయబడింది. బాబా ఈ వివరణను ఈ క్రింది మాటలతో పూర్తిచేశారు.

నేను ఏమి చెప్పినా, మరియు ఏమి చెపుతున్నా అదంతా భగవంతుడివల్ల నే చెప్పబడుతోంది. నేను ఒక విషయాన్ని చెప్పినప్పుడు, భగవంతుడే నన్నలా చెప్పేట్లు చేస్తున్నాడు. ఇప్పుడు నేను చెప్పదలచిన దేమంటే, నేను ప్రకటించి నదంతా మరియు స్థిరీకరించినదంతా చెప్పింది చెప్పినట్లు అన్ని విషయాలు క్రమప్రకారం జరిగితీరునని నేనిప్పుడు మీకు చెప్పదలచాను.

సాయంత్రం 3-00 లకు, ఆ నాటి సమావేశంలో ముఖ్యభాగం పూర్తి కావచ్చింది.

## హాస్యంతో సర్వజ్ఞత్వపు గుభాళింపు

ఈ సమావేశానంతరం బాబా మండలికి వప్పగించిన విధులు, అందించిన ఆదేశాలు వంటి ఇతర విషయాలపైకి మరలారు. ఈ సమావేశంలో చదవబడిన అసాధారణ సతారా సందేశాన్ని ముద్రించి భారతదేశంలోని అన్ని బాబా కేంద్రాలకు పోష్టు చేయమని ఆదీకి చెప్పారు. ఆ రోజు రమ్మని ప్రత్యేకంగా ఆహ్వానించ బడినవారిని, తాము ఆరోజున విన్నదానిని, చూచిన దానిని తమప్రాంతాల్లోని బాబా ప్రేమికులకు తెలియచెప్పటంలో పాలుపంచుకోమని చెప్పారు.

సంభాషణ మధ్యలో బాబా తన సన్నిధిమండలిని తమ మరణానంతరం వారి శరీరాన్ని మెహెరాబాదులో ఖననం చేయాలో అగ్ని సంస్కారం చేయాలో నిర్ణయించుకోమని అడిగారు. ఖనన సమయమునకు నిర్దేశింపబడిన ప్రదేశము క్రింది మెహెరాబాదులో కేటాయించబడుతుందన్నారు. ఈ అవకాశం, (కొన్ని మినహాయింపులతో) బాబాతో కలిసి జీవిస్తున్నవారికి మాత్రమే వర్తిస్తుంది.

అదే సమావేశానికి హాజరైన బాబాకు అత్యంత సన్నిహితుడైన ప్రేమికుడు ఒకరు లేచి, ఈ సదవకాశము తనకుకూడా మంజూరు చేయమని వేడుకున్నాడు. అది విన్నబాబా ఆశ్చర్యపడి క్రింది మెహెరాబాదులో స్మశానానికై కేటాయించబడిన జాగా మెహెర్జీ ( బాబా శిష్యుడు కార్కారియా) కి చెందిన స్వంతం. కనుక దీని గురించి నీవు ఆయనతో సంప్రతించవలసి యున్నది", అని సౌంజ్ఞలు చేశారు. ఈ విషయంలో బాబా వాంఛితమేమిటో బాగా తెలిసిన మెహెర్జీ తనచాతుర్యాన్ని ప్రయోగించి, ఇక్కడ సమాధి చేయబడే అదృష్టం పొందాలంటే చాలా ఖర్చుఅవుతుందని బదులిచ్చాడు. ఈ జవాబు అవతలి వ్యక్తిని మౌనపరచింది. బాబా పరిధిలోని వారందరికి ఇతను మహాపండితుడే కాక, బహు పిసినారి అని కూడా బాగా తెలుసు. వెంటనే అతను ప్రతిస్పందిస్తూ "అయతే సరే బాబా !

మెహెర్జీని నేనెంతమాత్రం ఇబ్బంది పెట్ట తలుచుకోలేదు. అందుకని నేను ఇష్టపూర్వకంగా నా ప్రతిపాదనను విరమించుకుంటున్నాను" అని బదులిచ్చాడు. బాబా వినోదించినట్లు కనిపించి, తన చేతి సౌంజ్ఞలతో "ఇప్పుడు నేను ఏమి చేయగలను?" అనే అర్థం వచ్చేసంకేతాన్నందించారు. దానితో అనేకమంది ముఖాల్లో నవ్వులు స్పష్టంగా కనిపించాయి.

ఈ చిన్న సంఘటన వల్ల నాకేమో బాబా మళ్లీ ఒకసారి ఎవరూ ఎటువంటి వ్యక్తిగత ప్రశ్నలువేయవద్దని సభాసదులకు గుర్తుచేశారు. అటువంటి సమయంలో నాకెందుకో, నా మిత్రుడు మౌని బువా గుర్తొచ్చాడు. నేను మా ఊరు నుండి బయలుదేరి రాబోయే ముందే ఆయన్ని కలిశాను. ఈ మౌని 1947లో బాబాను మొదటిసారిగా సతారాలో కలిశాడు. అప్పటి నుంచి ఆయన చాలాసార్లు బాబాను కలవటం తాను చెప్పినట్లు నడుచుకోమని బాబా కొన్ని ఆదేశాలివ్వడం జరిగింది. అందువల్ల నేనీ సమావేశంలో పాల్గొనుటకు రాబోయే ముందు ఆయన, బాబాకు తన ప్రణామాలందించమని నన్ను అభ్యర్థించాడు. ఇంకా మరేమైనా తదుపరి ఆదేశాన్ని పాటించాలేమోకూడా కనుక్కోమని కోరాడు. మౌని యొక్క ఈ కోర్కెను బాబాకు చెప్పటం స్వంత వ్యక్తిగత విషయం క్రింద రాదని నేను భావించాను. ఇప్పుడా సమావేశపు ప్రధానాంశము పూర్తయిందికనుక, ఈ మౌని కోరికను యాధృచ్ఛికంగా బాబా ముందుకు తేవాలనుకున్నాను.

అందువలన, బాబా దృష్టిని ఆకర్షించేందుకు నేను నాచేతిని పైకెత్తాను. అలా చేయి పైకెత్తడం ద్వారా నేను ఏదో చెప్పాలను కుంటున్నానని సూచించాలను కున్నాను. బాబా కుర్చీ చెంత సపర్యలు చేస్తూ నిలబడిన కాకా బారియా నా సంకేతానికి చాలా కలతచెందాడు. బాబా ప్రియశిష్యులో కాకా ఒకడు. 30 దశకంలో బాబా పాశ్చాత్య దేశాల పర్యటనల్లో ఆయన వ్యక్తిగత సేవకుడుగా కాకా బాబాతో కలిసి ప్రయాణం చేశాడు. బాబా తరచు తన పాశ్చాత్య ప్రేమికులలో తన యందు కాకాకు ఉన్న ఆదర్శవంతమైన విధేయత గురించి వివరించేవారు. కాకాకున్న హృదయం దయాపూర్వకము, ప్రేమాన్వితమైనది. ఆయన నిష్కపటంగా మాట్లాడే వ్యక్తి. ఆయనతో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. కానీ మండలిలో ఆయన ఒక సీనియర్ సభ్యుడని ఆయనంటే గొప్ప గౌరవం ఉందని మాత్రం తెలుసు. అయితే ఇప్పుడా యన అందరి ఎదుట నావైపు కోపంగా చూస్తూ భృకుటి ముడిచి, మందలించటంతో నేనూ ఉద్రేకపడ్డాను. కోపంతో ఆయనేదో అంటూ ఉద్రేక పడుతున్నాడు. ఆయన మాటలు సగం

ఇంగ్లీషులో, సగం గుజరాతీలో ఉన్నాయి. ఇది నన్ను అన్నిటికంటే ఎక్కువగా కలవరపెట్టింది. ఆయన మాట్లాడిన ఆమాటల్లో నేను సేకరించిన వివరమేమంటే బాల్ తానే తెలివిగలవాడనని భావిస్తున్నాడు. నిజానికి, అతను ఆధ్యాత్మికత గురించి తెలుసుకున్నది అతిస్వల్పము. గురువు నందు ఉంచవలసిన విధేయత గురించి తెలుసుకున్నది మరింత తక్కువ అని అంటూ కాకా కొన్ని క్షణాలపాటు ఆగిపోయాడు. ఆ సమయంలో నా భావాన్ని వివరించాలను కున్నాను. అయితే కాకా మళ్లీ మాట్లాడటం మొదలు పెట్టి, బ్బాబా మనోభావాన్ని చెడగొట్టినందుకు నన్ను నిందించసాగాడు. చివరకు, నేను తెలుసుకున్న దేమంటే, ఏ విషయమైనా బాబాకు అసౌకర్యాన్ని అసంతృప్తిని కలిగిస్తే, ఆయన కాకా తన ఓర్పును కోల్పోయేట్లు చేస్తారని గ్రహించాను. మరి ఆనాడు, నా విషయంలో కాకా పొరపాటు పడ్డాడు. అందువల్ల నేను నాడు ఏమి చెప్పదలచుకున్నానో దానిని చెప్పే అవకాశం ఇవ్వకుండా, అడ్డుకొని అన్యాయంగా నన్ను చిన్నబుచ్చటం జరిగిందని నేను భావించసాగాను. నిజంగా నాకు, బాబాను నా వ్యక్తిగత విషయాలపై ప్రశ్నించాలన్న ఉద్దేశ్యం లేదు. దాని కంటే ముఖ్యంగా బాబా తిన్నగా నావైపు చూస్తూ "కాకా చెప్పిందంతా సక్రమమే. నీవు నీ చేతిని ఎత్తి ఉండాల్సింది కాదు." అని సూచించారు. సర్వజ్ఞుడైన బాబానుంచి యీ మాటల్ని విని నేను ఆశ్చర్య పోయాను ! ఆమరుక్షణం నుంచి, నమ్మలేని అనుమానం నా మనస్సులో అల్లుకుంది." నా మనస్సులో ఏమున్నదో ఆయనకు నిజంగా తెలుసా ?" అనిపించింది.

నేనాయనకు అవిధేయుడనయ్యానని బాబా చెప్పుకుపోతున్నారు. అందువల్ల దానికి ప్రాయశ్చిత్తము తప్పని సరి అని తెలిపారు. నన్ను మారు మాట్లాడనీయకుండా ఆయన కొనసాగిస్తూ "ఈ ఉదయం బెహ్రాం, నా క్రికెట్ చిత్రం" ఫోటోలు చాలా తెచ్చాడని నీకు తెలుసు. అతడి నుంచి వాటిల్లో నీవు ఒక నంద కాపీలు కొనాలని నేను అభిలషిస్తున్నాను" అన్నారు. ఒక్కొక్క ఫోటో ఖరీదు 2 రూపాయలు. ఆ రోజుల్లో నా జీతం చాలా స్వల్పం. ఈ కొనుగోలుకు రెండు వందలరూపాయలు ఖర్చు పెట్టడమంటే ఆర్థికంగా చాలా కష్టమే. అదృష్టవశాత్తు, ఆ మరుక్షణంలోనే, నాకో ఆలోచన వచ్చింది" ఒకవేళ ఈ కొనుగోలు బాబాను సంతుష్టిపరిస్తే గనుక నేను ఏమాత్రం వెనుకాడకుండా ఇష్టపూర్వకంగా కొనితీరాల్సిందే" అనుకున్నాను. మెల్లగా సన్నగొంతుతో "సరేబాబా' ' అని బదులిచ్చాను. అయితే బాబా నా మాటను పట్టించుకోలేదు. ఆయన

మరోవిషయాన్ని జోడిస్తూ "ఈ కాపీలను నీవు కొనటమే కాకుండా వాటన్నిటినీ మళ్లీ నీవు ఇతరులకు అమ్మాలి" అన్నారు.

ఇప్పుడు నిజంగా నా శక్తులన్నీ అణిగిపోయాయి. "ఆయన ప్రేమికుల వద్ద ఎన్నెన్నో అందమైన బాబా ఫోటోలున్నాయి. ఈ ఫోటోను కొనుటకు ఎవరు ముందుకు వస్తారు ? ఈ ఆదేశాన్ని పాటించటం నాకు నిజంగా దుర్లభమే అవుతుంది" అని ఆలోచనలో పడ్డాను. ఇలా పరధ్యానంగా ఉన్ననేను ఆ సమావేశంలో చర్చిస్తున్న ఇతర విషయాలపై, శ్రద్ధ చూపలేక పోయాను. నేను నా దురవస్థలో పూర్తిగా మునిగిపోయాను. మా ఊళ్లో బాబా ప్రేమికులు బహు కొద్ది మందే ఉన్నారు. నా కథంతా విన్నాక మహా అయితే అయిదుగురు ఫోటోలు కొనవచ్చును. ఈ ఊహలతో నేను అక్కడ కూర్చొని, నా కళ్లు మూసుకొని గాఢంగా ఆలోచనల్లో పడ్డాను. హఠాత్తుగా బాబా తన చేతి వేళ్లతో చిటికెలు వేస్తూ నా ఆలోచనల నుండి బయటపడేట్లు చేశారు.

నేనాయనవైపు చూచేసరికి, ఆయన ఏదో కొంత వితరణగా వెసులుబాటు కల్పిస్తున్నట్లు సౌంజ్ఞలు చేస్తూ "అయితే సరే ! నీవు కేవలం 50 మాత్రమే కొని అమ్ముకో" అన్నారు. ఈ వితరణ నా సమస్యకు కొద్దిగా వెసులు బాటు కలిగించినా, నేనింకా వ్యధపడుతూనే ఉన్నాను. ఎందుకంటే, నేను అనవసరంగా నిందిచబడ్డాననే అనుకుంటున్నాను. నా భావాన్ని వివరించేందుకు అవకాశం ఇవ్వకుండా, ఇతరుల ఎదుట నేను అవమానింపబడ్డాను. తదుపరి కొద్ది క్షణాల అనంతరం, నాలో ఎదుర్కోలేని ధృఢమైన అనేక ఆలోచనలు, భావాలు చెలరేగాయి. ఆ సమయానికి, నేను బాబా ముందు మౌని కోర్కెను వెల్లడిచేయకూడదని అప్పటికే నిశ్చయించుకున్నాను. సరిగ్గా అదే సమయంలో బాబా తన చేతి వేళ్లతో మళ్లీ చిటికెలు వేయటం విన్నాను.

ఆయన ముఖంపై చిరునవ్వు తాండవిస్తుంటే తన పదిచేతివేళ్లను చూపిస్తూ "పోనీ ! పది ఫోటోలు మాత్రమే కొను. సంతోషమేనా?" అన్నారు. ఇది నిజంగా నాకు ఆనందాన్నిచ్చింది. మరి అప్పుడు నేను బాబా సమక్షంలో జరుగుతున్న వాటిపైనా దృష్టిని కేంద్రీకరించకలిగాను.

అంతలో, ఆగురువులకే గురువు నుండి దివ్యనైపుణ్యం వ్యక్తమైంది ! ఆయన నావైపు చూస్తూ, బాబా తన కుడిచేతి అయిదు వేళ్లను ఎత్తి చూపి, నవ్వుతూ, "అయిదు మాత్రమే కొను" అన్నారు. ఆమరుక్షణంలోనే, ఆయన

సరోష్ వైపు చూస్తూ "సరోష్, నేనిప్పుడు బాల్‌ను నా క్రికెట్ చిత్రం ఫోటోలను బెహ్రాంనుంచి అయిదింటిని కొనమన్నాను. మరి నేను ఆ అయిదింటిని అతడి నుండి నిన్ను కొనమని ఆదేశిస్తున్నాను" అన్నారు. ఏమి సమయోచితమైన హాశ్యపూర్వక కరుణ !

నేను ఆనందపరవశత్వంతో పూర్తి స్వాస్థ్యాన్ని పొందాను. సంతోషంగా ఇకిలిస్తూ, పది రూపాయల నోటు తీసుకొనిబెహ్రాం దగ్గరకు వెళ్లి అతడి వద్ద బాబా ఫోటోలు అయిదింటికిని కొన్నాను, వాటిని సరోష్ వద్దకు తీసుకు వెళ్లి అమ్మగా వచ్చిన పదిరూపాయలు తీసుకొని భద్రంగా నా జేబులో పెట్టుకున్నాను. నేనేమి ఖర్చుపెట్టాల్సిన అవసరం రాలేదు. అయితే యీ బేరం నాకు ఎంతటి అపారమైన లబ్ధిని తెచ్చిపెట్టింది ! చివరకు నేను బాబాను సంతుష్టుడ్ని చేశాను.

నేను అప్పుడు బాబా నిజంగా సర్వజ్ఞుడని తెలుసుకున్నాను. అయినా ఇదంతా ఆయన గురించి నాలో ఉన్న చిన్న అనుమానం వల్ల ఇంతటి మానశిక సంక్షోభం నాలో కలిగి క్రీడా స్ఫూర్తి కూడా కొరవడింది. అయినా అవతారుడిది ఎటు వంటి అద్భుతమైన హాశ్య ధోరణి ! అసామాన్యమైనది ! ఈ మొత్తం అనుభవం ద్వారా, బాబా సుముఖము, నాలో గాఢంగా నాటుకొని, సర్వజ్ఞుడిగా ఆయన ముందున్న నా నమ్మకాన్ని తిరిగి పొందకలిగేట్లు చేసింది.

ఆ క్రికెట్టు చిత్రం యినాటికీ నా వద్ద లేకపోవడం విచిత్రంగానే ఉంది. ఏమైనప్పటికీ ఆనాడు బాబా నాకిచ్చిన అనుభవము ఆయనకు సర్వము తెలుసునన్న భావము ఇప్పటికీ నాకు ద్యోతకమవటం కొనసాగుతూనే ఉన్నది. అప్పటి నుండి ఆ గుణపాఠం నన్ను వదలలేదు. అందువల్ల, నేనింకా దాని నిజానిజాల్ని ఎన్ని అపజయాలు పొందినా చాలాసార్లు, నవ్వు పుట్టించే బాబా నిట్టూర్పులతోను, మరికొన్ని సార్లు, తన సున్నితమైన చీవాట్లతోను పరిశోధిస్తూనే ఉన్నాను.

ఆ రాత్రికి నేను రహదారి బంగళాలో పడుకున్నాను. మర్నాడు ప్రొద్దుటే, అదృష్టవశాత్తు, (దానిని నేను బాబా లీల అని పిలుస్తాను) పూనావరకు నాకు మెహెర్జీ కారులో వెళ్లే అపకాశం లభించింది. అక్కడ నుంచి రైల్లో మా ఊరు వెళ్లాను. ఒకసారి గతంలోకి చూస్తే బాబాతో జరిగిన ప్రతి సమావేశంలో బాబా నాకు ఒక నిధిని అందించేవారు. అంతేకాదు ప్రతిసారి అది భిన్నమైన వ్యత్యాసముతో జరిగేది. ప్రతి సమావేశమునకు ఆయనతో మరింత సన్నిహితంగా

ఉన్నట్లు భావించేందుకు కూడా సహాయమందించేవారు. కాలం గడిచిపోతున్న కొద్దీ ఈ "మెహెర్ క్షణాలు" మరింత తేజోవంతంగా మారి, రమ్యమైన కాంతి ప్రజ్వరిల్లింది. ప్రతిఘట్టం వెనుక ఆధ్యాత్మిక భావము, నా గ్రహణ శక్తికతీతంగా ఉన్నప్పటికీ హృదయం మాత్రం, తక్షణం దాని సూటియైన, ప్రేరేపించే ప్రయోజనాలు బాబాతో నాకున్న సంబందంపై ధృఢపరిచేది. అది నా ఆలోచనల యొక్క కేవలం ఒక కల్పన కాదు. మెహెర్ క్షణాలు అతి తరుచుగా ఇటువంటి మహత్తులను మౌనంగా చేసేవి. అయినప్పటికీ, ఈ నా ప్రస్తుత సందర్శన సమయంలో ఈ ఆటను అసాంతము నేను పూర్తిగా ఆనందిచలేక పోయాను. బాబా అన్ని సమయాల్లోను, తెర వెనుక ఉండి నవ్వుతున్నారన్న ఎరుక, చాలా కాలం తర్వాత కాని తెలియలేదు. అయితే అది కూడా ఒక పరిహాసమే.

## అన్ని వాగ్దానాలకు అపరాధీనుడను

1955 మే 1 న మెహెర్ బాబా మూడు నెలలపాటు తన అంతరింగిక ఆధ్యాత్మిక కార్యక్రమం కొరకు జాల్ విల్లాలో ఏకాంతవాసంలో ఉండిపోయారు. జూలై నెలాఖరు వరకు ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు ఆగిపోయాయి. అయినా గతంలో వలెనే, నేను అదీకి ఎరుచ్‌కి వ్రాయటాన్ని అవసరమైనప్పుడు కొనసాగించాను. పిమ్మట, అదేదో కారణం వల్ల (ఇప్పుడు దానిని నేను మరచి పోయాను) కొన్ని గంటలు గడిపేందుకు సతారా వెళ్లాను. బాబా నన్ను జాల్ విల్లాలో తనను దర్శించేందుకు ఎంతో అనుగ్రహంతో అనుమతించారు. కేవలం దర్శించేందుకేకానీ ప్రశ్నలు వేయుటకు కాదు. ఆయన వంటరిగా కూర్చొని, 6×8 అడుగుల చిన్న గదిలో తేజోవంతంగా వెలిగిపోతూ కనిపించారు. తన ఏకాంత కార్యక్రమం కోసం ఆ బంగళాలో ఆయన ఎంచుకున్న స్థలమిది. నేను ఒక పూలదండ తీసుకొని ఆయన గదిలోకి ప్రవేశించాను. బాబా నన్ను చూచి నవ్వి ఆయన సీటుకు ఎదురుగా గోడపై వ్రేలాడుతున్న ఒక చిన్న బాబా ఫోటో వైపు చూపిస్తూ, నా చేతిలోని పూలదండను తనకు బదులుగా దానికి అలంకరించమని సూచించారు. అదివిన్న నాకు ఆశ్చర్యం వేసింది. కానీ ఎందుకు అని ఆయన్ని అడుగలేకపోయాను. ఆ దండను నేను ఆ ఫోటో ఫ్రేము చుట్టూ అలంకరిస్తూండగా ఆ ఫోటోపై ముద్రించిన ఒక సందేశాన్ని కొంత చదివే అవకాశం దొరికింది. "నేను అన్ని వాగ్దానాలనుండి అపరాధీనుడను..." ఆ మొత్తం విషయాన్ని చదివే ప్రయత్నం లేదా బాబా మరేమైనా వివరించరేమో చదివే ప్రయత్నం అప్పట్లో చేయలేదు.

ఆయన కొద్దిసేపు కూర్చొనే అవకాశాన్నిచ్చి నాతో ఆయనకు ఉన్నసాన్నిహిత్యాన్ని తెలిపే మర్యాద పూర్వక ప్రశ్నలనేకం అడిగారు. చివరకు, ఆయన తన కుడి చేతిని ఎత్తి, అరచేతిని నావైపు చూపుతూ, "విచారించకు, సూఖంగా వెళ్లు" అనే అర్థం వచ్చే సౌంజ్ఞలు చేశారు. పిమ్మట ఒక నవ్వు నవ్వారు. ఆ తర్వాత అరుదైన ఆనందం నా గుండెల్లోంచి పొంగి పొరలుతుండగా నేను జాల్‌విల్లా నుండి బయలుదేరాను.

ఇటీవల వరకు ఈ చిన్న సమావేశం బాబాతో జరిగిన విషయాన్ని గురించి నేను పూర్తిగా మరచిపోయాను. అయితే అనుకోని విధంగా ఈ మొత్తం దృశ్యం స్పష్టంగా ఈ మధ్యనే జ్ఞాపకం వచ్చింది. ఈ భాగం వ్రాయటం పూర్తి చేసే సమయానికి నేను మెహెరాబాదు వెళ్లటం సంభవించింది. అక్కడ ఉండగా సహవాస్‌ల సమయాల్లో బాబా తన మండలిని శిష్యుల్ని, ప్రేమికుల్ని కలిసే క్రింది మెహెరాబాదులోని పెద్ద మండలి హాలును నేను సందర్శించాను. నేను బాబాతో గడిపిన నా జీవితంలో జరిగిన అనేక జ్ఞాపకాలకు ఈ స్థలంతో సంబంధం ఉంది. అప్పట్లో బాబా ఉపయోగించిన కుర్చీ ఒకటి ఇంకా ఇక్కడ ఉన్నది. ఎంతో భక్తితో నేను ఆ కుర్చీ ముందు కళ్లు మూసుకొని నిలబడ్డాను. పిమ్మట, ఆయన తల్లిదండ్రుల తాలూకు రెండు చిన్న ఫోటోల మధ్య మరుసలో వ్రేలాడుతున్న బాబా యొక్క రంగుల ఫోటో వైపు తదేకంగా చూచాను. ఆహాలు ప్రారంభమైనప్పటి నుండి ఈ మూడు ఫోటోలు అక్కడే ఉన్నాయి. మొట్ట మొదటిసారిగా నేను, బాబా కుర్చీకి పైగా వ్రేలాడుతున్న ఒక ఫ్రేము కట్టిన చిన్న సందేశాన్ని నేను గమనించాను. ఆ విషయం ఆఖర్లో బాబా పేరు స్పష్టంగా కనిపించింది. ఉత్సాహం కొద్దీ నేను దాని దగ్గరకు వెళ్లి కాలిబొటన వేళ్లపై నిలబడి, ఆ ఫ్రేమును మేకు నుంచి బయటకు తీశాను. ఆ సందేశం ఇలా ఉంది. "నేను అన్ని వాగ్దానాలు, బంధనాలు, పూనుకొనుటలు, ఏర్పాట్లు వంటి వాటికి అపరాధీనుడను. అందువలన ఎవరూ, భౌతిక మరియు ఆధ్యాత్మిక విషయాలు వేటినీ నా నుండి, ఏ సమయంలోను లేదా, ఏ సందర్భంలోను నన్ను అడుగవద్దు. ప్రతి వారికొరకు నేను ఏది మంచిదని అనుకుంటే దానిని, అది ఎప్పుడు సరిపోతుందని నేను భావిస్తే అప్పుడు చేస్తాను." - మెహెర్ బాబా

నేనీ సందేశాన్ని చదవగానే, నాకు అకస్మాత్తుగా 1955 ఏప్రియల్ 24న మెహెర్ బాబా రోజ్‌ఉడ్ లో జరిగిన సమావేశంలో అందించిన సందేశం నుండి , ఎత్తి తీసిన ఒక భాగమని నాకు స్ఫురించింది. ఆనాడది చదువుతుండగా, వాన

చినుకులు ఇంటి కప్పురేకుల పై చిటపటలాడుతూ పడిన ఘట్టం నాకు జ్ఞాపకం వచ్చింది. పదునైన అమాయకత్వంతో బాబా "చూడు, ఈ మాటలు నా హృదయం నుండి పెల్లుబికాయనుటకు ఇది ఒక సంకేతం" అన్నారు.

ఆ ఫ్రేమును, అందున్న అక్షరాల శైలిని దగ్గరగా గమనించగా, అది ఆనాడు చిన్న గదిలోని గోడకు వేలాడతీయబడివున్న ఫోటోకు నేను తెచ్చిన పూలమాలను అలంకరించమన్న ఫ్రేమేనని నాకు నిశ్చయమైంది. అద్భుతమైన ఆ సందేశాన్ని వ్రేలాడదీసి ప్రదర్శించిన ఫ్రేము ఇదీ ఒక్కటే. ఆ తర్వాత అది అచ్చువేసింది కాదని చేవ్రాతతో ఉన్నదని గ్రహించాను. అప్పుడు ఇది కచ్చితంగా ఆనాటి ఫ్రేమేనన్న నా భావనను ఖాయపరిచింది.

ఆ ఫ్రేము వెనుక కొంత భాగం చెదపురుగులు తిన్నట్లు కూడా నేను పరిశీలనగా గమనించాను. దానిని బట్టి చాలా కాలంగా ఆ ఫ్రేము అక్కడ వ్రేలాడుతోందనిపించింది (దరిమిలా అది బాగు చేయబడింది). నిజానికి ఫ్రేము కట్టిన ఆ సందేశము 50 వ దశకం ఆఖరి నుండి ఇక్కడ మెహెరాబాదు మండలి హాలులో ఉంచబడి, ఆయన్ని చిన్న పెద్ద సమావేశాల్లో వచ్చి కలిసే వారందరికి బాబా సందేశాన్ని మౌనంగా అందిస్తోంది. 1955లోతన ఏకాంతవాస సమయంలో చేసిన కార్యక్రమంద్వారా ఈ ప్రకటనలోని సత్యాన్ని తన ప్రేమికుల హృదయాల్లోకి సరైన సమయంలో విడుదల చేయుటకు పనిచేశారా ? అవతారుడితో మనకు ఉండవలసిన సంబంధము యొక్క యధార్థ స్వభావాన్ని ఎటువంటి ఫలితాన్ని ఆశించకుండా కేవలం సంతోషంగా ఉండి ఇచ్ఛాపూర్వకంగా ఆయన దివ్యేచ్ఛకు విడిచిపెట్టటాన్ని స్పష్టంగా సూచించుట లేదా ?

ఈ విధంగా ఆసాధారణమైన కొయ్య ఫ్రేము, అంత పెద్ద హాల్లో గోడపై ఎత్తుగా వ్రేలాడదీయబడి వున్నప్పటికి ఇన్నేళ్లుగా నేను దానిని గమనించలేక పోయాను. అయితే 1991లో అత్యంత ఉపయుక్త తరుణానికి, బాబాయే దీనిని నా దృష్టిలోపడేట్లు చేశారు. బాబా జీవితంలో కాలానుగుణ్యంగా దాని స్థానాన్ని తెలుసుకొని, ఆయన జీవితంలో ఏ భాగపు క్షణ దర్శనంలో వ్రాస్తున్నానో ఆయనకు తెలుసు కనుక, సమయానికి దీనిని ఆయనే నాకు సూచించారని భావించాను. ఈ స్వల్ప సందేశం ఆనాటి సతారా సమావేశపు జ్ఞాపకాల్ని నాలో మళ్లీ గుర్తు చేసింది.

ఒక పర్యాయం రోజ్‌ఉడ్‌లో ఉండగా నేను బాబా ముందు నా బలహీనతను అంగీకరిస్తూ, నా పరిమిత మనస్సు లెక్కలేనన్ని బలహీనతలతో

అనంత చైతన్యము మూర్తీభవించిన అవతారుడి కొంగును పట్టుకొనటం ఎలా సాధ్యమని వ్యాకుల పడుతున్నాని ఒప్పుకున్నాను. మరి ఇప్పుడు నేను బాబా కుర్చీ ముందు నిలబడి చాలా సంవత్సరాల తర్వాత యీ ఫ్రేమును చూస్తుంటే, బాబా అత్యంత లోతైన అర్థంలో, వేరే తనదైన విధానంలో నా ప్రశ్నకు జవాబు నింపినట్లు నాకనిపించింది. బాబా కొంగును పట్టుకోవటం అంటే, ఆయన మనలోని ప్రతి వారిని తన బంద రహిత స్వేచ్ఛతో ఎంత సన్నిహితంగా పట్టుకుంటున్నారన్న అవగాహన ధ్వనిస్తుంది. ఎందుకంటే తన అనుచరులకు ఏది అవసరమో ఆయనకు తెలుసు.

తన నజరానాను పొందేట్లు హృదయాల్ని మేల్కొలిపే బాబా విధానాలు చాలా సుందరంగా ఉంటాయి. 1955లో కేవలం యీ ఫ్రేమును బాబానాకు చూపారు. అందులో ఉన్న విషయాన్ని 35 ఏళ్ల తర్వాత నా దృష్టికి వచ్చేట్లు చేశారు. దీనిని ఒక రూపకాలంకారంగా చెప్పాలంటే, ఆయన నాకో గవ్వను ఇచ్చారు. తనకున్న ప్రగాఢ కరుణలో ఆగవ్వనుతానే తన సన్నిధానపు మహాసాగరంలోనికి తీసుకువెళ్లారు. దశాబ్దాల అనంతరం, మరల ఆయన నాకు ఒక అమూల్యమైన ప్రకాశమానము అయిన ముత్యమును అందులో ఉంచి తిరిగి ఇచ్చారు. దీనిని బట్టి నేను పూర్తిగా ఆయనపై ఆధారపడి అందరి మంచికోసం ఆయన ఇచ్ఛ నిరంతరం పని చేస్తుందన్న ఆయన సందేశాన్ని నమ్మి తీరాలన్న సంకేతాన్ని, హామీని కూడా ఇచ్చినట్లయింది. ఆయన అనుగ్రహచర్య యొక్క అనుపమాన గౌరవానికి నేను ఘనంగా కృతజ్ఞతలు చెప్పుకొనే శక్తిని నాకు బాబా ప్రసాదించుగాక ! ఈ నిధిని నా హృదయంలో శాశ్వతంగా తగురీతిలో పదిలపరచుకోగలిగే సహాయాన్ని బాబా అందించుగాక ! అవతారుడు ఎట్టి షరతులు లేని అనంతుడు పూర్తి సర్వ స్వతంత్రుడు అయినప్పటికీ, తనకరుణవల్ల ప్రతివారికొరకు పూర్తిగా బద్ధుడవుతున్నాడు. అవధులులేని అవతారుని స్వేచ్ఛ అద్భుతమైనది। ఆయన స్వేచ్ఛగా తన కృపను పంచిఇచ్చే అధికారము ఇందులో విశ్రాంతి పొందుతున్నది.

బాబా సమక్షంలో గానం చేయబడిన ఒక ఘజల్‌ను గుర్తు చేసుకొని నేనీ భాగాన్ని ముగించాలనుకుంటున్నాను. నేను వ్రాసే ప్రతిసారి దీనిని జ్ఞాపకం చేసుకుంటాను. ఈ ఘజల్‌లో ఒక దైవ ప్రేమికుడు దైవ సముఖము గురించిన తన అనుభవాన్ని గురించి వివరిస్తాడు. "పరిశుద్ధ హృదయంలో విధేయత కలిగి సమర్పించే వందనము యొక్క సమర్థత, వర్ణనాతీతము. నమ్మలేని ఆశ్చర్యకరము ! ఎందుకంటే, నేను ఎప్పుడు నా శిరమును నేలపై ఉంచి ప్రణమిల్లినా, నన్ను

ఆశ్చర్యంలో ముంచుతూ కాబా యొక్క పవిత్ర శిల నా నుదిటి క్రింద నుండి జారిపోయేది !"

నిజంగా, నాకు ఈ ద్విపదలో సూచించినట్లు దైవంపై ఉంచవలసిన విశ్వాసము యొక్క పరిశుద్ధత కాని, తీవ్రతకాని నాలో లేవని అనుకుంటున్నాను. కానీ అవతారుడు, మానవరూపంలో ఉన్న భగవంతుడు అత్యంత కరుణామయుడు ఆయన తన ప్రేమాన్వితము, ఔదార్యము గల ఇచ్ఛలో, తన అనుచరులందరి స్థాయికి దిగివచ్చాడు. కనుక, అవతార్ మెహెర్ బాబా తన పై అద్భుతమైన మార్గాల్లో తన అనంత జీవితపు కొన్ని అపూర్వ దర్శనములను పాఠకులముందు ఉంచే ప్రయత్నంలో నాకు దారి చూపారు. నేనీ కార్యక్రమాన్ని చేపట్టిన నాటి నుండి నాకు ఉత్సాహపూరితమైన అనుకోని సహజ ఘటనలెన్నో సంభవించాయి. చాలాసార్లు, నాకు కావాలని ఎదురుచూసే సమాచారం నా ముందు ప్రత్యక్షమయ్యేది. నేను వ్రాస్తున్న ఘట్టాలకు సంబందించిన వ్యక్తులు అనుకోకుండా తారసపడే వారు ఆది మధ్యాంత రహితుడైన అవతారుని సహవాసంలో మన హృదయం కాలరహితమైన క్షణాలతో నిండిపోతుంది. ఈ క్షణాలెంతో ఉత్తమమైనవి !

ఇప్పుడు నేను హృదయపూర్వకంగా బాబాను ప్రార్థిస్తూ, ఆయన ఇదే క్రీడను ఈ పేజీల ద్వారా కూడపెట్టుకుంటున్న పాఠకులతో ఆడుకోవటం కొనసాగించమని వేడుకుంటున్నాను - ప్రతి దృశ్యం, ప్రతి కథ, ఆయన ప్రేమ పూర్వక సముఖంతో వారి హృదయాల్ని నింపి ఉత్సాహపరుచుగాక !

ఒకసారి అవతార్ మెహెర్‌బాబా, తన అద్వితీయ సౌంజ్ఞల ద్వారా ఇలా తెలియ చేశారు.

నేను ప్రేమ మహాసాగరుడను
నేను ఇచ్చేందుకు ప్రేమ మాత్రం కలిగి ఉన్నాను
మరినేను కోరేది ప్రేమను మాత్రమే

ప్రేమకు తెలిసింది సర్వశ్రేష్టం మరి
మెహెర్ బాబా అదే అయి ఉన్నారు.

ప్రతి యుగములో ధర్మ జ్యోతి కొడిగట్టినప్పుడు అవతారుడు వచ్చి మరోసారి ప్రేమ మరియు సత్యముల దివిటీని పునఃప్రజ్వలన చేస్తాడు. యుగయుగాలుగా భంగపాట్లు, యుద్ధములు, భయము మరియు గందరగోళ పరిస్థితుల పెడబొబ్బల మధ్య, 'అందరూ నా చెంతకు రండు' అనే అవతారుడి పిలుపు మార్మోగుతుంది. - మెహెర్ బాబా



బాలనాటు గారి దైవీ మానవుడు అవతార్ మెహెర్ బాబా అపూర్వ దర్శనము 6వ భాగము మెహెర్ బాబా జీవితంలో మార్చి 1954 నుండి ఏప్రియల్ 1955 వరకు జరిగిన కార్యక్రమాలతో పాటు 1954 సెప్టెంబరులో జరిగిన "అద్భుతమైన మూడు వారాలు"గా ప్రసిద్ధి చెందిన గొప్ప సమావేశంతో సహా కేంద్రీకరించబడింది. ఈ సమావేశం చివర్లోనే మెహెర్ బాబా తన అంతిమ ప్రకటనను అందించారు. మరి కొద్ది సేపటికి అక్షరఫలకాన్ని ఉపయోగించటం ఆపి, చేతి వేళ్ళ కదలికలతో తన భావాల్ని సౌంజ్ఞలు చేస్తూ వ్యక్తపరిచే ఒక అద్భుత విధానాన్ని మొదలు పెట్టారు.

మెహెర్ బాబా జీవితంలో సంభవించిన ఈ చారిత్రక ఘట్టాల గురించిన తన వివరణలు ఆసాంతం, బాలనాటుగారి ఈ అపూర్వ దర్శనము పరంపర ఎందుకింత ప్రత్యేకత సంతరించుకున్నదో తెలుసుకొనుటకు అనువుగా హృదయాల్ని కరిగించే వ్యక్తిగత కథల్ని చిలకరించి జన సందోహం మధ్య ఆయా ముఖాలు ప్రతిబింబించేట్లు చేశారు.

306

అవతార్ మెహెర్ బాబా అపూర్వ దర్శనం : అనువాదం : మెహెర్ చంద్ర

